శ్రీరామ నృసింహ గ్రంథ రత్నమాల

# శ్రీమదాంధ్ర భాగవతము

## పంచమ సంపుటము

[ ఏకాదశ, ద్వాదశ స్కంధములు ]

( పద్యకావ్యము )




రచయితలు:

శతావధానులు, ఉభయభాషా ప్రవీణులు

శ్రీ రామ నృసింహ మూర్తి కవులు

అను

గంధం శ్రీరామమూర్తి

ఇట్టేంకి నరసింహమూర్తులు

(గద్వాల సంస్థానాస్థాన కవులు)





ప్రకాశకులు:

శ్రీరామ నృసింహ గ్రంథరత్నమాల

ఉప్పులూరు.

1955



శ్రీమహితాత్మతత్త్వము నశేషమనీష నెఱుంగఁగోరి ని
స్సీమరతిన్ వివిక్తమును జేరిన యుద్ధవునిన్ నివృత్తిగి
తామలబోధరూపకసుధన్ దమిఁ గ్రోలఁగఁజేసినట్టి మా
యామనుజుండు కృష్ణపరమాత్మ సతంబుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

# సుభాషితము.

కావ్యము లిరుతెరంగులు. ఖండకావ్యములు; మహాకావ్యములు. చిన్న కావ్యముల చెలువము పెద్దవానికి లేదు. పెద్దకావ్యముల గాంభీర్యము చిన్నవానికి రాదు. చిన్నలకు ముద్దులు. పెద్దలకు నమస్కారములు. ఇది లోకమర్యాద.

బృహత్కావ్యనిర్మాణమునకు నిరుపమానదీక్షయు, నిరంతర పరిశ్రమయు, నోపికయు నవసరములు. కావ్యరచనమునకు తపోనిష్ఠ ఆవశ్యకము. అందునను భాగవతము వంటి మహాకావ్యనిర్మాణము అంతింతల కొనసాగునదికాదు. ఆధునిక యుగమువారి అభిరుచి ఖండకావ్యములకేగాని మహాకావ్యరచన కనుకూలమయి నదికాదు. ఇట్టివేళలో నీ జంటకవు లిమ్మహాకావ్యము వ్రాయబూనుట సాహసమే. అయినను పరమభాగవతులకు సాధ్యముకాని కార్యమేది? మహాకావ్య వినిర్మాణమున వీరు విజయశీలురుగావుట అస్మదాదుల కానందదాయకము.

గ్రంథకర్తలిర్వురు నేకోదరులు కారు గాని కవిసోదరులు. ఏకవంశీయులు కారు గాని ఏకకులజులు, బంధువులు, మీదుమిక్కిలి మేలిమిత్రులు. నెయ్యమునకు వియ్యమునకు సమత వలయుననుట వీరియెడ సార్థకమైనది.

గద్వాలసంస్థానాస్థాన విద్వత్కవుల పాండిత్యకవితాప్రతిభలగూర్చి ప్రసంగించుట అనవసరమేకాదు, అధికప్రసంగము.

వీరిరువురు సరసకవితాసంపన్నులు, శతావధానులు, ఉభయభాషాప్రవీణులు, ఉపాధ్యాయశేఖరులు, ఉత్సాహపూరితులు. వీరి భాగవతమహాకావ్య మిక్కాలమున ప్రచురించుట విశ్వశ్రేయమును గోరిగాని అన్యాపేక్ష వలనకాదు. బమ్మెరవారి కమ్మనికావ్యము కలదుకదా! ఇదియేలనని కొందరనవచ్చును. కాని పోతనామాత్యుని భాగవతము మూలమును మన్నింపమి లోకమెరిగినదేకదా! ముఖ్యముగ మూలానుసారిగావుట వీరి కావ్యవైశిష్ట్యము.

సరసము, మధురము నగు వీరి మహాకావ్యము చిరప్రసిద్ధిని వీరికి చేకూర్చి, జగత్కల్యాణకారకమగు ననుటలో నాకు సందియములేదు. శ్రీ దేవకీనందనుడు వీరికి చిరాయురున్నతి నొసంగి, సారస్వతసేవ వీరిచే నినుమిక్కిలిగ గావింపజేయుగాక!

ఏలూరు
30—5—1955

అద్దేపల్లి నాగగోపాల రావు,
విద్వాన్., బి.ఎ., బి.ఒ.యల్.
మెంబరు పి. ఇ. యస్.

*V. Nagiah*

బ్రహ్మశ్రీ శ్రీరామ నృసింహమూర్తి కవులకు

హృదయపూర్వక నమస్సులు.

అయ్యా!

తమరుపంపిన శ్రీమదాంధ్ర భాగవతము ప్రథమ సంపుట మందినది. చదివి యానందించితి.

కవులకు, కళాకారులకు దేశములో నేమాత్రము ఆదరణలేక కృంగి కృశించుచున్న ఈ కాలములో గురుతరమైనబాధ్యతను తలపెట్టి సమర్థతతో నిర్వహించుచున్న తమకు నాజోహార్లు.

ఆంధ్రప్రజానీకం తమకు చాల ఋణపడియున్నది. భాషాసరస్వతికి తమభాగవతము ఒక ప్రత్యేక అలంకరణము. భగవంతుఁడు తమకు సదా అభ్యుదయమును జేకూర్చుఁగాక.

త్యాగరాయనగర్
మద్రాసు 17
**10—5—1955.**

నమస్సులతో
భవదీయుడు,
**చిత్తూరి వి. నాగయ్య.**

ఉత్పలమాలిక

బమ్మెరపోతరాజకృతభాగవతంబు జగద్ధితార్థమై
యిమ్మహి రాగతాళలయమిండితమై నటియించుచుండఁగాఁ
గ్రమ్మఱ మూర్తిసత్కవులు వ్రాసిరి భాగవతంబు తెల్గులో
అమ్మకచెల్ల! పూర్వకృతమైన యఖండతపఃఫలాప్తిచే
ముమ్మరమైన భక్తిఁ బరిపూతమనస్కత నాంధ్రులార! మీ
రిమ్మహితాంధ్రభాగవతమేర్పడ నారసి సారసాత్మలై
కమ్మని తత్త్వబోధముల గాథలలోని మహత్త్వసంపదల్
నెమ్మదులందునింపుకొని నెమ్మదిచెంది సుఖింపుఁడయ్య! స
త్యమ్ముగఁజెప్పుచుంటినిది యారని సంసృతి బాధలొందు లో
కమ్ముతరింపఁజేయుటకుఁగా లిఖియింపఁగఁబడ్డ గ్రంథరా
జమ్మని; తిక్కయజ్వవగు శబ్దచమత్కృతులిందు నంతటన్
గ్రమ్ముకొనెం గనుండు కవిరాజులు భారతశైలిలో నవీ
నమ్ముగ వ్రాయఁగాఁబడిన నాణెపుఁ బొత్తమిదొక్కటంచు సా
రమ్ముగ్రహించినట్టిరు పరంపరగా వచియింతు, రంతె కా
దెమ్మెయి దీనిఁబోని కృతి యింకొకటెక్కడ లేదటంచు ధై
ర్యమ్ముగఁ జెప్పఁగాఁగలరు రమ్యకవిత్వపటుత్వవేదు లే
కమ్మయి మెచ్చఁగాఁగలరు కాకవిమూకలు కావుకావుమం
చుమ్మలికంబుమై నఱచుచుండిన యెండినబండ గొంతులన్;
గ్రుమ్మఁగలారు లావుగల కోవిదవర్యులు వానిపూనికన్;
తమ్ముల తమ్ములై వలచు తావుల పూవులు చిత్తజల్లుగాఁ
జిమ్మెడు హృద్యపద్యములఁజేవలు దేఱుచునున్న దివ్యకా
వ్యమ్ముగఁదీర్చిదిద్దిన యపారకృపాపరుఁడైన సూతువా
క్యమ్ముల సొమ్ములెల్లెడల నందము చిందుచు విందుఁగూర్ప, గా
నమ్ము నొనర్చి పేర్చిన యనంత తపోమహిమాఢ్యమూర్తులన్
దమ్ములమిచ్చి సత్కృతులఁ దన్పకయుండని వారలుందు రే
నిమ్మకునీరుపోసినటు నిండినకుండలుబోలెనుండు మా
తమ్ములచేత స్వీయకథ తానయి వ్రాయఁగఁజేసి పద్మనే
త్రమ్ములవాఁడు మర్త్యులకుఁ దాపము తెల్లనడంచి మోక్షధా
మమ్మునఁ గల్పవృక్షములమధ్యములన్ విహరించి మించు భా
గ్యమ్ములొసంగుఁగాతఁ గలకాలము మూర్తికవీంద్రచంద్రులన్
సమ్మదమొప్ప సత్కవనచాతురిఁగీరితికెక్కఁ జేయుతన్.

విక్రమవిలాసము, తణుకు.
20—3—1955

విద్వాన్ పండిత పెనుమెచ్చ సత్యనారాయణరాజు.
(జయపుర సంస్థానాస్థానకవి)

# శ్రీరామ నృసింహ గ్రంథరత్నమాల

## మహారాజపోషకులు

| | | | |
|---|---|---|---|
| శ్రీ | మద్దాల రామకృష్ణమ్మనాయుడుగారు | భూస్వాములు | వీరవాసరం. |
| ,, | పచ్చిగోళ్ల అచ్యుతరామయ్యగారు | ,, | ,, |
| ,, | గ్రంధి వెంకటారావుగారు | ,, | ,, |
| ,, | వేగేశన సూరపరాజుగారు | ,, | శివదేవునిచిక్కాలం. |
| ,, | వడ్డె రంగయ్యనాయుడుగారు | ,, | ,, |
| ,, | కర్రెడ్డి కుసుమేశ్వరరావుగారు | ,, | పెదకాపవరం |
| ,, | యర్రా మన్యాలుగారు (నారయ్యగారి కుమాళ్లు) | ,, | ఉప్పులూరు |

## పోషకులు

| | | | |
|---|---|---|---|
| శ్రీ | వర్ధినీడి వీరరాఘవులుగారు | ,, | వీరవాసరం |
| ,, | వర్ధినీడి సూర్యారావుగారు | ,, | ,, |
| ,, | గుద్దటి నరసింహమూర్తిగారు | ,, | ,, |
| ,, | గుద్దటి కృష్ణమూర్తిగారు బి. యె. బి. యల్. | ,, | ,, |
| ,, | మద్దాల బాలాజీరావుగారు | (పంచాయితీబోర్డు ప్రశిడెంటు) | ,, |
| ,, | మద్దాల రంగనాయకులుగారు | భూస్వాములు | ,, |
| ,, | మద్దాల చల్లేశ్వరరావుగారు | ,, | ,, |
| ,, | మద్దాల అప్పన్నగారు | ,, | ,, |
| ,, | నక్కేళ్ళ వెంకట్రావుగారు | ,, | ,, |
| ,, | యిర్రింకి కృష్ణమూర్తిగారు (రాజయ్యగారి కు॥) | ,, | తోలేరు |
| ,, | యిర్రింకి చిననరసింహమూర్తిగారు | ,, | ,, |
| ,, | యిర్రింకి వరదరాజులుగారు | ,, | ,, |
| ,, | నూకల రాజారావుగారు | వర్తకులు | ,, |
| ,, | చవాకుల సూర్యప్రకాశరావుగారు | భూస్వాములు | ,, |
| ,, | చవాకుల చక్రపాణిరావుగారు | ,, | ,, |
| ,, | తోలేటి అప్పారావుగారు | (ఫిజికల్ ఇన్‌స్ట్రిక్టర్) | ,, |
| ,, | పెద్దేటి రామానుజులుగారు | వర్తకులు | గణపవరం |
| ,, | చెన్నంశెట్టి నరసింహస్వామిగారు | (మాజీపోష్టుమాష్టరు) | ఉండి |

| | | |
|---|---|---|
| శ్రీ చెన్నంశెట్టి సత్యనారాయణమూర్తిగారు | భూస్వాములు | ఉండి |
| ,, యలకా రామమూర్తిగారు | (భాషాభిమానులు) | తాడేపల్లిగూడెం |
| ,, బోణం వరదరాజుగారు | భూస్వాములు | బూరుగపల్లి |
| ,, నల్లం బ్రహ్మన్నగారు | ,, | గునుపూడి |
| ,, నల్లం సోమసుందరంగారు | ,, | ,, |
| ,, నల్లం రామారావుగారు | ,, | ,, |
| ,, నిమ్మల వెంకటరత్నంగారు | ,, | ఆగర్తిపాలెం |
| ,, యాసా సీతారామయ్యగారు | ,, | పూళ్ళ |
| ,, పెనుమెచ్చ రామకృష్ణంరాజుగారు | బి. యె. బి. యి. డి. | ఉండి |
| ,, యాళ్ళబండి గోపాలస్వామిగారు | ,, | కాకరపఱ్ఱు |
| ,, లొల్ల అప్పారావుగారు | ,, | ఆరవల్లి |
| ,, మంగిన గంగన్నగారు | ,, | పోలమూరు |
| ,, ఉప్పలూరి కృష్ణమూర్తిగారు | ,, | ఆకివీడు |
| ,, పల్లా పాపరావుగారు | ,, | పాలకోడేరు |
| ,, పొత్తూరి వెంకట్రాజుగారు | భూస్వాములు | అలంపురం |
| ,, ములగాల గంగరాజుగారు } | ,, | రావిపాడు |
| ,, కోటగిరి అప్పారావుగారు } | | |
| ,, అడ్డగర్ల వీరన్నగారు | ,, | రావులపఱ్ఱు |
| ,, వంకాయల సూరయ్యగారు | వర్తకులు | ముద్దాపురం |
| ,, చింతలపాటి పుల్లంరాజుగారు | భూస్వాములు | అయిభీమవరం |
| ,, వెలిశెట్టి నారాయణమూర్తిగారు | ,, | తాడేపల్లిగూడెం |
| ,, వేగేశన రామరాజుగారు | ,, | ఎండగండి |

వ్యవస్థాపకులు.

# సమీక్ష

## శ్రీమదాంధ్ర భాగవతము.

రచయితలు:— శతావధానులు, ఉభయభాషాప్రవీణులు, శ్రీ గద్వాల సంస్థానాస్థానకవులు, "శ్రీరామ నృసింహమూర్తి కవులు, అను శ్రీ గంధం శ్రీరామమూర్తి, శ్రీ ఇట్టేంకి నరసింహమూర్తులు.

వీరలు భగవద్భక్తిపరాయణులగు పుణ్యదంపతులకు జన్మించి యాంగ్లభాష యందు వ్యామోహముగల కుటుంబస్థులైనను సత్కథాశ్రవణకుతూహలమున సంస్కృతాంధ్రభాషల నభ్యసింపఁజేసిన మాతాపితల ఋణవిమోచనమునకై పురాణపఠనంబుఁగావించి తల్లిదండ్రులఁ బరిసరప్రజల సంతసింపఁజేసి యాంగ్లభాషనభ్యసించని కొదువ తీరునట్లు ఆంధ్రవిశ్వవిద్యాలయ ఉభయభాషాప్రవీణ పట్టభద్రులై పశ్చిమ గోదావరీ మండల స్థానికోన్నతపాఠశాలలఁ బ్రథమశ్రేణి ప్రధానాంధ్రోపాధ్యాయులుగ శతాధికరూప్యవేతనములనొంది యనేక స్వతంత్ర, అనువాద, గ్రంథముల రచించి సంస్కృత శ్రీమద్భాగవతాంధ్రానువాద పద్యకావ్యరచనకుఁ బూనుకొని కృతకృత్యులై యాంధ్రభాష కమూల్యమగు సేవఁజేసి యాంధ్రప్రజానీకమున కత్యధికమగు మేలు సమకూర్చిరి.

వీరి శ్రీమదాంధ్రభాగవతమునందలి ప్రథమ, ద్వితీయ, తృతీయ స్కంధములు గల ప్రథమసంపుటము, ఏకాదశ, ద్వాదశ స్కంధములుగల పంచమసంపుటమును జూచితి. అనుభవజ్ఞులు, కవిసార్వభౌములునగు బ్రహ్మశ్రీ శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారు నుడివినట్లు జంటకవుల జంటకవిత్వమున సౌకర్యముకంటె నసౌకర్యమే హెచ్చియుండుననుట సహజమే యైనను వీరి యెడ నా నుడి మార్పుఁజెందుచున్నది.

ఈ శ్రీరామ నృసింహమూర్తి కవులు బాల్యప్రభృతి కవలపిల్లలవలె కలసి మెలసి సంచరించుచు నొకేసారి సంస్కృతాంధ్రముల నభ్యసించి యొకేసారి పరీక్షలందు త్తీర్ణులై యైకమత్యమున నానందముగ సద్గ్రంథరచనఁ గావించుటఁజూడ రసగుళికాప్రభావమువలె వీరివలన మహత్తరభాగ్యమేదో మానవలోకమునకుఁ గావలసియున్నదని ద్యోతకమగుచున్నది. సహజమగు పాండిత్యము, సహజమగు భక్తిప్రపత్తులు, సంస్కరణము, ఆచరణము కల్గియుండుటచేతనే వీరి యసాధారణ ప్రతిభ వీరి గ్రంథముల వెల్లడియగుచున్నది.

సంస్కృతవ్యాసభాగవతమునందలి శ్లోకవిషయము ఆంధ్రభాగవతమునఁ బద్యమునకెక్కింపవలెనను నియమము సడలించుకొని స్వేచ్ఛానువాదముఁ గావింప మొదలిడిన నెంతసరళముగనైన రచింపవచ్చునుగాని యొక నియమమునకుఁ గట్టు పడవలసి వచ్చినప్పుడు కొంత జిగిబిగి యేర్పడక తప్పదు. దానికే గౌరవమును గల్గును.

వీరి యాంధ్రభాగవతము సంస్కృతానువాదమైనను స్వతంత్రగ్రంథముగ సరళశైలి కల్గియుండుట యాశ్చర్యవిషయముగనే తోఁచుచున్నది. భాగవతము పురాణవర్గమునకు సంబంధించినదైనను తత్త్వసంహితగ బుధులు పరిగణించిరి. ఇందు "తు, చ, అను వానియందును భగవన్మహిమను వెల్లడించి వ్యాసమహర్షి మనశ్శాంతి నొందినవాఁడాయెను. ఈభాగవతమునఁ గథకుఁ బ్రాధాన్యముగాక మానవశ్రేయోదాయకమగు విషయమునకే యెక్కువప్రాధాన్య మేర్పడుచున్నది. కాన నేయొక్కశ్లోకమును విడువక యాంధ్రీకరించి యాంధ్రప్రజానీకమునకు మేలుఁ జేకూర్చుటకే వీరలఁ బెద్దలు ప్రోత్సహింతురుగాక.

ఈక్రింది ప్రధానఘట్టములఁ గొన్ని శ్లోకములు వాని కనువాదపద్యములును నుదహరించుచున్నాడను. అవి శ్లోకమునకు సరిగా ననువదింపఁబడినవిగఁ జూపుటకుఁ గాక యందలివిషయము లెట్లు ప్రతిమానవునకు నవసరమైనవో గమనించుటకే యుదహరించితి. బుధులు నా యజ్ఞానమేదైన నున్న క్షమింతురుగాక.

## ఏకాదశ స్కంధము.

### 1 వృత్తరచనయందు వీరు సూపిన ప్రత్యేకశ్రద్ధ.

మహాస్రగ్ధర. జనినాశక్షుత్పిపాసాశ్రమముఖపటు సంసారబంధాళిచేతన్
దనుధీచిత్తేంద్రియాసూత్కరమునకుఁ బ్రమాదంబు వాటిల్లకుండన్
గనుచున్ మోహంబుఁ ద్రెంపంగలిగి సునియతైకాగ్రభక్తిన్ బరేశున్
ఘనువిష్ణున్ గొల్చుచున్ భాగవతవరుఁడు నిశ్శంకుఁడై తేజరిల్లున్. 70

శ్లో. దేహేంద్రియప్రాణమనోధియాం యో, జన్మాప్యయ క్షుద్భయతర్ష కృచ్ఛ్రైః
సంసారధర్మై రవిముహ్యమాన, స్మృత్యా హరే ర్భాగవతప్రధానః॥

తరల. సకలదేహులయందు వ్యోమముచాడ్పునం దనరారి యొ
ల్లకుఁ బ్రియంబిడు నాగమోక్త సులక్షణుం బరమాత్మునిన్
వేరులై తెలియంగలేక నివృత్తిమార్గము స్వీకరిం
పక ప్రవృత్తికి నవ్వయింత్రు సుమా మనోరథ పూర్తికై. 120

శ్లో. సర్వేషు శశ్వత్తనుభృత్స్వవస్థితం, యథాఖ మాత్మాన మభీష్ట మీశ్వరం
వేదోపగీతం చ నశృణ్వతే బుధా, మనోరథానాం ప్రవదంతి వార్తయా॥

2 కథా సందర్భమున వీరి సరళశైలి - విషయగుంభనము.

ఉ. లావుదలిర్ప యాదవకులంబిది దుర్భరవీర్యశౌర్యల
క్ష్మీవిభవోద్ధతంబయి ప్రకృష్టమదంబున ధర్మసేతువుల్
త్రావులుతప్పఁజేసి వికటంబుగలోకములం గలంచు నో
దేవతలార! దీనికిఁ బ్రతిక్రియఁ జేయక యుంటయొప్పునే? 150

చ. వినుఁడతిదృప్తులైన యదువీరుల విస్తృతమైన పంగడం
బును గడతేర్పకే యిపుడుపోవుదునేనియు ధర్మసేతు లం
ఘన మొనరించి యిక్కులము శౌర్యముతోఁ జెలరేగి లోకనా
శన మొనరించితీరును నిజంబిది సందియ మింత లే దిటన్. 151

శ్లో. తదిదం యాదవకులం, వీర్యశౌర్యశ్రియోద్ధతమ్
లోకం జిఘృక్షు ద్రుద్ధం మే, వేలయేవ మహార్ణవః॥

శ్లో. యద్యసంహృత్య దృప్తానాం, యదూనాం విపులం కులమ్
గంతా స్మ్యనేన లోకోఽయ, ముద్వేలేన వినంక్ష్యతి॥

3 నామముల క్రమము పద్యములోఁబట్టించు వీరలకూర్పు నేర్పు.

సీ. వసుధయు ననిల మంబరమును దోయంబు, ననలంబుఁ జంద్రముఁ డర్కుండుఁ
గలరవంబును నజగరము సాగరము ప, తంగంబు మధుకరమ్ముం గజంబు
అధిప! మధుఘ్నుండు హారిణంబు మీనమున్, బింగళ కురరమున్ డింభకుండుఁ
గన్యకయును శరకారుఁడు ఫణి యూర్ణ, నాభియు భ్రమరంబు నాఁ బరఁగెడు
గీ. వీర లిరువదినల్వురు ధారుణీశ్వ, రా! మదాశ్రితగురువులు ప్రకటములయి
తనరు వీరిశిక్షావృత్తులను గఱచితి, నాత్మబోధక్రమంబు నెయ్యంబుమీఱ. 188

శ్లో. పృథివీ వాయు రాకాశ, ఆపోఽగ్ని శ్చంద్రమా రవిః
కపోతోఽజగర స్సింధుః, పతంగో మధుకృ ద్గజః॥

శ్లో. మధుహా హరిణో మీనః, పింగళా కురరోఽర్భకః
కుమారీ శరకృ త్సర్ప, ఊర్ణనాభి స్సుపేశకృత్॥

శ్లో. ఏతేమే గురవో రాజం, శ్చతుర్వింశతి రాశ్రితాః
శిక్షావృత్తిభి రేతేషా, మన్వశిక్ష మిహాత్మనః॥

4 ప్రతిమానవునకు నుపయోగపడు విషయములు (కపోతోపాఖ్యానము).

ఉ. క్రూరుఁడు లుబ్ధకుండు తనకున్ బ్రమదంబిడు కామితంబు నిం
డారఁగ నక్కపోతమిథునంబును దన్నవశాబకంబులన్

బోరన బుట్టఁబెట్టుకొని పోయెఁ గృతార్థునిఁగాఁగఁ దన్ను లో
నారసికొంచు నోయదునృపాగ్రణి! యిట్టెటఁ గాలకించితే? 221

గీ. ఈ గతిఁ గుటుంబి శాంతివిహీనుఁడగుచు, ద్వంద్వసుఖములకై యాపత్రితిహోతె
దీనతఁ గుటుంబపోషణాధీనబుద్ధి, సానుబంధుఁడై సర్వనాశంబు నొందు. 222

శ్లో. తం లబ్ధ్వా లుబ్ధకః క్రూరః, కపోతం గృహమేధినం
కపోతకాన్ కపోతీంచ, సిద్ధార్థః ప్రయయౌగృహమ్॥

శ్లో. ఏవం కుటుం బ్యశాంతాత్మా, ద్వంద్వారామః పతత్రివత్
పుష్ణన్ కుటుంబం కృపణ, స్సానుబంధోఽవసీదతి॥

5 పింగళ యను వేశ్య పశ్చాత్తాపము.

గీ. అక్కటా! యజితేంద్రియనై సతంబు, సంచరించితి మోహపాశమునఁ జిక్కి
మూఢురాలను నే నసత్పురుషుఁడైన, కాంతువలనఁ గోరుచునుంటిఁ గామితముల.

చ. నిరతము మత్సకాశమున నిల్చి రతిన్ దృవిణంబు నిచ్చుచున్
మురిపెముఁ గూర్చు నీపరమపూరుషునిన్ విడనాడి యజ్ఞ నా
తురమతినై యకామదుని దుఃఖభయార్తి విషాదమోహముల్
బోరిఁబోరి నిచ్చు తుచ్ఛుఁడగు పూరుషుఁ గోరి సదా భజించితిన్. 248

ఉ. యాతనఁ బెట్టుకొంటిని మదాత్మను నే నతిగర్హ్యమైన సాం
కేతికవృత్తిచేతఁ బరికింపక స్త్రైణుఁడు లుబ్ధుఁడున్ నయా
పేతుఁడు శోచనీయుఁడును వీరిడియౌ నరుఁ జెట్టఁబట్టి వి
క్రీతముచేసి దేహము సిరిన్ రతినిన్ మది నిచ్ఛగించుచున్. 249

శ్లో. అహో! మే మోహవితతిం, పశ్యతా విజితాత్మనః
యా కాంతా దసతః కామం, కామయే యేన బాలిశా॥

శ్లో. సతం సమీపే రమణం రతిప్రదం, విత్తప్రదం నిత్య మిమం విహాయ
అకామదం దుఃఖభయార్తి శోక, మోహప్రదం తుచ్ఛ మహం భజేఽజ్ఞా॥

శ్లో. అహో! మయాత్మా పరితాపితోవృథా, సాంకేత్యవృత్త్యా హ్యతిగర్హ్యవార్తయా
స్త్రైణా న్నరా దర్థతృషోఽనుశోచ్యా, త్క్రీతేన విత్తం రతి మాత్మ నేచ్ఛతీ॥

6. అవధూత తనస్థితి యదువునకుఁ జెప్పు సందర్భము.

మ. మనుజేంద్రా! విను నాకు లేవు లవమున్ మానావమానాలు పే
ర్కొనఁగా గేస్తులకుండు చింతయును నాకున్ లేదు నిత్యంబు డిం
భునిలీలన్ విహరింతు నాత్మరతినై మూఢాత్ముఁడౌ బాలకుం
డును నాత్మజ్ఞుఁడు నిర్వురే సుఖులు ధన్యుల్ చింతకున్ దూరులున్. 261

శ్లో. నమే మానావమానౌ స్తో, నచింతా గేహ పుత్రిణాం
ఆత్మక్రీడో హ్యాత్మరతో, విచరా మీహ బాలవత్॥
శ్లో. ద్వావేవ చింతయా ముక్తౌ, పరమానంద ఆప్లుతౌ
యో విముగ్ధో జడో బాలో, యశ్చబుద్ధేః పరంగతః॥

మ. శరకారుండు శరంబునందె మనమున్ సంధించి పార్శ్వంబునన్
గరిమన్ బోయెడు రాజునేనియుఁ గనంగాఁబోని చందంబునన్
బరమాత్మ ప్రతిరుద్ధమానసుఁడు దా బాహ్యప్రదేశంబు నాం
తరమున్‌గూడ నెఱుంగఁజాలఁడు యథార్థం బిద్ది ధాత్రీశ్వరా! 268
శ్లో. తథైవ మాత్మన్యవరుద్ధచిత్తో, న వేద కించి ద్బహిరంతరం వా
యథేషుకారో నృపతిం వ్రజంత, మిషౌగతాత్మా నదదర్శ పార్శ్వే॥

ఉ. ఒక్కెడకున్ రసజ్ఞయు మఱొక్కెడకున్ బలితంపుఁదృష్ణ వే
ఱొక్కెడకేర్చి మేఢ్రము మఱొక్కెడకున్ శ్రవణంబు ఘ్రాణమొం
డొక్కెడకున్ ద్వచంబు మఱి యొక్కెడకున్ నయనోదరాదు లొం
డొక్కెడ కీడ్చు దేహిని సమద్ధతి గేస్తు సపత్నులుంబలెన్. 275
శ్లో.జిహ్వైకతోఽముమపకర్షతి కర్హితర్షా, శిశ్నోఽన్యత స్త్వగుదరం శ్రవణంకుతశ్చిత్
ఘ్రాణోఽన్యత శ్చపలదృక్క్వచకర్మశక్తి,ర్బహ్వ్యస్సపత్న్యఇవ గేహపతిం లునంతి॥

7. ఉద్ధవునకు శ్రీకృష్ణపరమాత్మ బోధించు నివృత్తిగీత.

మ. కనఁ బాలీయనిధేనువున్ గులటయౌ కాంతన్ బరాధీనమౌ
తనువున్ దుష్టతనూజుఁ బాత్రులకదత్తంబైన విత్తంబు మ
ద్ఘనలీలా గుణహీనమైన పలుకున్ దా మోహితస్వాంతుఁడౌ
మనుజుం డూరక దుఃఖదుఃఖియయి సంరక్షించుచుండుం జుమీ. 320
శ్లో. గాం దుగ్ధదోహా మసతీంచ భార్యాం, దేహం పరాధీన మసత్ప్రజాంచ
విత్తం త్వతీర్థీకృత మంగవాచం, హీనాం మయా రక్షతి దుఃఖదుఃఖీ॥

చ. చెలువునిగాఁగ జారునిగఁ జిత్తమున న్ననుఁగోరుచుండి కే
వలమగు నాస్వరూపవిభవంబు నెఱుంగనివారలయ్యు వి
హ్వలతను గోపికల్ శతసహస్రవిధంబుల నాదుసంగ మి
మ్ములఁగయికొంటఁజేసి ననుఁబొందిరి బ్రహ్మమయున్ బరాత్పరున్. 347
చ. హితమతితోడ నీపగిది నీవును నేరిమి నుద్ధవా! శ్రుతిన్
స్మృతినటులే ప్రవృత్తిని నివృత్తిని శ్రావ్యమునున్ శ్రుతంబునున్

ధృతినిఁ బరిత్యజించి జగదేకశరణ్యుని నన్ను నొక్కనిన్
మతిశరణంబుఁబొందుమిఁక మందువు సుమ్మకుతోభయుండవై. 348

శ్లో. మత్కామా రమణం జారం, మత్స్వరూపావిదోబలాః
బ్రహ్మమా మపరంప్రాపు, స్సంగా చ్ఛతసహస్రశః॥

శ్లో. తస్మా త్త్వ ముద్ధవోత్సృజ్య, చోదనాం ప్రతిచోదనాం
ప్రవృత్తించ నివృత్తించ, శ్రోతవ్యం శ్రుతమేవచ॥

శ్లో. మా మేకమేవ శరణ, మాత్మానం సర్వదేహినాం
యాహి సర్వాత్మభావేన, మయాస్యా హ్యకుతోభయః॥

క. యమి నిరపేక్షుని శాంతుని, సమదర్శిని వైరరహితు సచ్చరితు బుధో
త్తముని వెనుదవిలిచనియెద, విమల చరణరేణువులఁ బవిత్రముఁజేయన్. 392

శ్లో. నిరపేక్షం మునిం శాంతం, నిర్వైరం సమదర్శనమ్
అనువ్రజా మ్యహం నిత్యం, పూయే యే త్యంఘ్రిరేణుభిః॥

క. అంగనలసంగమున్ ద, త్సంగులసంగముఁ ద్యజించి దవుల వివిక్తం
బుం గడుక్షేమమగు నెలవు, సంగూర్చుండి తలఁపనగు నన్నలసుండై. 402

గీ. అంగనలసంగమునను దత్సంగిసంగ, మునను గడుఁగ్లేశముం బంధముసుగలిగెడు
చాడ్పునం గల్గ దన్యప్రసంగవశత, నమ్మ మిది యుద్ధవా! నీవు నెమ్మనమున.

శ్లో. స్త్రీణాం తత్సంగినాం సంగం, త్యక్త్వాదూరత ఆత్మవాన్
క్షేమేవివిక్త ఆసీన, శ్చింతయే న్మా మతంద్రితః॥

శ్లో. న తథాస్యభవేత్ క్లేశో, బంధశ్చాన్య ప్రసంగతః
యోషిత్సంగా ద్యథాపుంసో, యథా తత్సంగిసంగతః॥

సీ. రహి క్షుత్పిపాసాది రాహిత్యమున్ మఱి, దూరశ్రవణమును దూరదృష్టి
ఘనమనోజవమును గామరూపముఁ బర, కాయప్రవేశముఁ గామ్యసిద్ధి
స్వచ్ఛందమరణంబు సాప్సరోబృంద బృం, దారకక్రీడాను దర్శనంబు
నప్రతిహతగతి యగు నాజ్ఞయనునివి, పదియును గుణవై భవప్రదములు

ఆ. తగఁ ద్రికాలవేదితయును నద్వంద్వంబుఁ, దలఁపఁగాఁ బరేంగితజ్ఞతయు జ
లాగ్నివిషదివాకరాది ప్రతిష్ఠంభ, మపరిభవము సిద్ధులై దివియగు. 416

శ్లో. అనూర్మిమత్త్వం దేహేస్మిన్, దూరశ్రవణదర్శనమ్
మనోజవః కామరూపం, పరకాయప్రవేశనమ్॥

శ్లో. స్వచ్ఛందమృత్యు ర్దేవానాం, సహక్రీడా సుదర్శనమ్
యథాసంకల్పసంసిద్ధి, రాజ్ఞాప్రతిహతాగతిః॥

శ్లో. త్రికాలజ్ఞత్వ మద్వంద్వం, పరచిత్తాద్యభిజ్ఞతా
అగ్న్యర్కాంబు విషాదీనాం, ప్రతిష్టంభో పరాజయః॥

గీ. స్త్రీలఁ గాంచుట తాఁకుట ౹ మేలమాట, వేడ్క సల్లాపమాదిగా ౹ విడువవలయు
ముందు విడువవలె మిథునీ౹భూతులైన, ప్రాణులం గేస్తుకానట్టి౹బ్రహ్మచారి. 462

శ్లో. స్త్రీణాం నిరీక్షణస్పర్శ, సల్లాపక్ష్వేళనాదికం
ప్రాణినో మిథునీభూతా, నగృహస్థో౽గ్రతస్త్యజేత్॥

గీ. ప్రాయమునఁ బిన్నయును సమ౹వర్ణ యాత్మ, సదృశియు ననిందితయునైన ౹ జాయ నెన్ని
గేహమును గోరు నాతఁడు౹ద్వాహమంద, వలయుఁ జేపడు దాన ౹ శుభంబతనికి. 465

గీ. బ్రాహ్మణుని దేహమది తలం౹పంగ సుంత, క్షుద్రకామానుభూతికిం౹జొనుపఁదగదు
ఇందుఁ గృచ్ఛ్రతపం బాచ౹రించుటకును, నం దనంతసుఖప్రాప్తి౹కర్హమగును. 466

ఉ. పూని శిలోంఛవృత్తిని బ్ర౹మోదితమానసుఁడౌచు విప్రుఁ డ
న్యూనముఁ గామవర్జితము౹నూర్జితమైన ప్రశస్తధర్మముం
బూని యతిప్రసక్తికిని ౹ బోక గృహంబుననే వసించి నా
పైని మనంబు నెక్కొలిపి ౹ ప్రస్ఫుటశాంతినిఁ బొందు నిచ్చలున్. 467

శ్లో. గృహార్థీ సదృశీం భార్యా, ముద్వహే దజుగుప్సితామ్
యవీయసీంతు వయసా, సమవర్ణా మనుక్రమాత్॥

శ్లో. బ్రాహ్మణస్యహి దేహో౽యం, క్షుద్రకామాయ నేష్యతే
కృచ్ఛ్రాయ తపసేచేహ, ప్రేత్యానంతసుఖాయచ॥

శ్లో. శిలోంఛవృత్త్యా పరితుష్టచిత్తో, ధర్మంమహాంతం విరజం జుషాణః
మయ్యర్పితాత్మా గృహఏవతిష్ఠ, న్నాతిప్రసక్తస్సముపైతిశాంతిమ్॥

ఉ. ఎన్నఁగఁ దల్లిదండ్రు లతి౹వృద్ధులు భార్య యధీర శక్తిసం
పన్నులు కా రనాథులు కు౹మారులు నేనిటుఁ బోతినేనియున్
నన్నును బాసి వీరు కృప౹ణత్వమునం గడుదుఃఖితాత్ములై
చెన్నుఁదొలంగి జీవనముఁ౹జేయుదు రెట్లని గేస్తుపొక్కెడున్. 474

శ్లో. అహో! మే పితరా వృద్ధా, భార్యా బాలాత్మజాః ప్రజాః
అనాథా మామృతే దీనాః, కథం జీవంతి దుఃఖితాః॥

క. ధమనులు బయల్పడఁగనిటు, సుమహిత తపమాచరించి ౹ సుతపోమయునన్
దమిమైఁ గొల్చుచు ఋషిలో, కమునుండి పరేశునన్నుఁ౹గ్రమమునఁ జేరున్. 479

చ. ఘనమును మోక్షదంబు నతి ఽ కష్టసమార్జితమైన యీ తపం
బున నెవఁ డల్పకామములఁ ఽ బొందుటకై జతనంబుఁ జేయునో
వినుమ వాఁడారయంగఁ గడు ఽ వెఱ్ఱియు గేలికి భాజనంబునై
యనవరతంబు దుఃఖనిలఽయంబగు జీవనమున్ గ్రమించెడున్. 480

శ్లో. ఏవం చీర్ణేన తపసా, మునిర్ధమనిసంతతః
మాం తపోమయ మారాధ్య, ఋషిలోకా దుపైతిమామ్॥

శ్లో. య స్త్వేతత్కృచ్ఛ్రతశ్చీర్ణం, తపో నిశ్శ్రేయసం మహత్
కామాయాల్పీయసే యుంజ్యా, ద్బాలిశః కోపన స్తతః॥

గీ. బాలుపగిదిఁ గ్రీడింపనౌఽఁబ్రాజ్ఞుఁడయ్యు, జడునిపగిదిఁ జరింపనౌఽజతురుఁడయ్యుఁ
బలుకనగు వెఱ్ఱిభంగి విఽద్వాంసుఁడయ్యు, నైష్ఠికుండయ్యుఁ బశువట్లుఽనడువగనగు.

శ్లో. బుధో బాలకవత్క్రీడే, త్కుశలో జడవచ్చరేత్
వదే దున్మత్తవ ద్విద్వాన్, గోచర్యాం నైగమశ్చరేత్॥

గీ. గ్రామ్యసుఖకాంక్షయగును దుఃఽఖంబనంగ, బంధమోక్షవిదుండగు ఽ పండితుఁడన
మూర్ఖుఁడనఁగ దేహాద్యహం ఽ బుద్ధియగును, నన్నుఁబొందించునదియె సఽన్మార్గ
మనఁగ. 520

గీ. కాపథంబనఁ జిత్తవిఽక్షేపమగును, సత్త్వగుణసంభవంబగున్ ఽ స్వర్గమనఁగ
నరకమన ఘోరతామసోఽన్నాహమగును, వింటివే? యిది యుద్ధవా! ఽవిమలచరిత!

ఆ. గురుఁడనయిన నేనఽగుదు బంధువన గృహం, బనఁగ నరశరీరఽమగు గుణాఢ్యుఁ
డయగు నాఢ్యుఁడనఁగఽనపరితుష్టుండె ద, రిద్రుఁడనఁగఁజెల్లుఽభద్రచరిత!. 522

ఆ. అవిజితేంద్రియుండెఽయగుఁ గృపణుండన, గుణములందు బుద్ధిఽకూడనీక
యెసఁగునట్టివాఁడె ఽ యీశుండన ననీశుఁ, డనఁగఁ ద్రిగుణసక్తుఁఽడగు బుధేంద్ర!

శ్లో. దుఃఖ గ్రామ్య సుఖాపేక్షా, పండితో బంధమోక్షవిత్
మూర్ఖో దేహా ద్యహంబుద్ధిః, పంథా మన్నిగమస్స్మృతః॥

శ్లో. ఉత్పథశ్చిత్తవిక్షేప, స్స్వర్గస్సత్త్వ గుణోదయః
నరక స్తమఉన్నాహో, బంధు ర్గురు గహంసఖే॥

శ్లో. గృహంశరీరం మానుష్యం, గుణాఢ్యోహ్యాఢ్య ఉచ్యతే
దరిద్రోయ స్త్వసంతుష్టః, కృపణో యో జితేంద్రియః
గుణే ష్వస క్తధీరీశో, గుణసంగో విపర్యయః॥

గీ. జడజనుఁడు స్వీయకర్మబీఽజమునఁజేసి, భ్రాంతి నజుఁడయ్యుఁ బుట్టినఽవానిగాఁగ
నమరుఁడయ్యు మృతునిగాఁగ ఽ నరసికొనును, దారుయుక్తవహ్నింబోలెఁ ఽ
దన్ను మదిని. 568

ఆ. విను నిషేక గర్భజని బాల్య కౌమార, యౌవనవయములు నడివయస్సు నవల
జరయు మృత్యువనఁ § బరఁగుఁదొమ్మిది యవస్థలు పొసఁగుచుండుఁ §
దనువునకును. 569

శ్లో. నాత్మా స్వకర్మబీజేన, జాయతేసోఽప్యజస్సుమాన్
మ్రియతేవా మకో భ్రాంత్యా, యథాగ్ని ర్దారుసంయుతః॥
శ్లో. నిషేక గర్భ జన్మాని, బాల్య కౌమార యౌవనమ్
వయో మధ్యం జరా మృత్యు, రిత్యవస్థా స్తనోర్నవ॥

చ. తిరిగెడు కంటితో వసుమ § తీవలయంబదియెల్లఁ దిర్దిరం
దిరిగెడునట్లు దోఁచెడుగ § తిన్ గదలాడ్చు జలంబుతోడ లోఁ
దరువులు సంచరించెడు వి § ధంబునఁ దోఁచెడుభంగి భ్రాంతిసం
సరణపరీవృతుండయిన § చాఁడ్పున నాత్మయుఁదోఁచు నుద్ధవా !. 571
శ్లో. యథాంభసా ప్రచలతా, తరవోఽపిచలాఇవ
చక్షుషా భ్రామ్యమాణేన,దృశ్యతే భ్రామ్యతీవభూః॥

గీ. కీర్తిమంతుల ప్రవిమల § కీర్తియును గుణాఢ్యులగువారిశ్లాఘ్యగు § ణావళియును
స్వల్పమగులోభమునవినా § శంబునొందు,సమలరూపంబు శ్వేతకు § ష్ఠమునబోలె588
శ్లో. యశోయశస్వినాం శుద్ధం, శ్లాఘ్యాయే గుణినాం గుణాః
లోభస్స్వల్పోఽపితాన్ హంతి, శ్విత్రిం రూప మివోర్జితమ్॥

ఉ. ప్రాణసమానులాప్తులగు § భ్రాతలు జాయలుఁదల్లిదండ్రులున్
బోణిమితోడి మిత్రులును § బూర్వహితత్వముడించి యొక్కఁడు
గ్గాణినిఁబట్టి స్పర్ధలను § గైకొనుచప్పటికష్టమెల్లరున్
బ్రాణవిరోధులై సతము § వర్తిలుచుందురు తెంపుఁదోఁపఁగన్. 590
శ్లో. భిద్యంతే భ్రాతరోదారాః, పితర స్సుహృదస్తథా
ఏకాస్నిగ్ధాః కాకిణినా, సద్యస్సర్వేఽరయఃకృతాః॥

8 'మనసు స్వాధీనమైన ఘనునకు మఱి మంత్ర తంత్రములేల?' అని త్యాగరాజు పాడిన గీతార్థము.

ఉ. జ్ఞానసమీక్షు నెవ్వని మ § నంబు సమాహితమై యొసంగునో
దానము మున్నుగాఁగలుగు § ధర్మములం బనిలేదు వానికిన్
మానససంయమంబు గరి § మంబున నెవ్వఁడు పూనకుండునో
దానము మున్నుగాఁగలుగు § ధర్మములం బనిలేదు వానికిన్. 612
ఉ. జనులకు మానసంబు స్వవ § శంబగుడున్ సకలేంద్రియంబులున్
మొనసి తమంత వశ్యతనుఁ § బొందు మనంబు మఱొంటవశ్యతన్

గనదు భయంకరంబగు మ న్నంబు సుదుస్సహ మెట్టివారి క
మ్మనమును గెల్చువాఁడె మహి మన్ సకలేంద్రియజేతయయ్యెడిన్. 613

చ. గురుజవమొప్ప మర్మములఁ గోయుచుఁగెల్వఁగరానిశత్రువై
పొరిఁజెలరేగు నమ్మనము మూఢులు గెల్వఁగలేక తారు ని
ష్ఠురమతిఁ దోడిమర్త్యులఁ గడుం బగఁజూచుచునుందు రెండి వీ
రరులనుచున్ సుహృజ్జనము లంచుఁ దటస్థు లటంచు నెం త్రిహో! 614

చ. నరులు భ్రమించి కేవల మనఃపరికల్పితమైన యీ కథే
బరమున 'నాది, నే', ననెడు భావమునంబడి యంధబుద్ధులై
పరమిది యిద్ది నేననెడు భ్రాంతినిముస్గుచు నిట్లపారదు
స్తరతరభీకరాంధ తమసంబునఁ గ్రుమ్మఱుచుందు రిచ్చలున్. 615

గీ. జనము సుఖదుఃఖహేతువౌ ననిన నపుడు
నాత్మ కేమగుఁదనువున కగునుగాని
తనదు జిహ్వను దనదు దంతములఁగొఱికి
కొనిన్ గోపమెవనిమీఁద దానివే దనకుఁ గినియు. 616

శ్లో. సమాహితం యస్య మనఃప్రశాంతం, దానాదిభిః కింవదతస్యకృత్యం
అసంయతం యస్య మనోవినశ్యే,ద్దానాధిభిశ్చే దపరం కిమేభిః॥

శ్లో. మనోవశేఽన్యేహ్యభవంశ్చదేవా, మనశ్చనాన్యస్యవశం సమేతి
భీష్మోహి దేవ స్సహసస్సహీయాన్, యుంజ్యాద్వశేంతం సహిదేవదేవః॥

శ్లో. తందుర్జయం శత్రుమసహ్యవేగ, మరుంతుదం తన్నవిజిత్య కేచిత్
కుర్వం త్యసద్విగ్రహ మత్రిమర్త్యై,ర్మిత్రా ణ్యుదాసీనరిపూంశ్చ మూఢాః॥

శ్లో. దేహం మనోమాత్ర మిమం గృహీత్వా, మమాహమిత్యం దధియోమనుష్యాః
ఏషోఽహ మన్యోఽయమితిభ్రమేణ, దురంతపారే తమసి భ్రమంతి॥

శ్లో. జనోఽస్యహేతు స్సుఖదుఃఖయోశ్చే,త్కిమాత్మనస్చాత్రహిభౌమయోస్తత్
జిహ్వాం క్వచిత్సాందశతిస్వదద్భి,స్తద్వేదనాయాం కతమాయకుప్యేత్॥

9 స్త్రీవ్యామోహమున బాధఁజెంది పశ్చాత్తాపము నొందు ఐళునిగీత.

గీ. గాఁడిదయుఁబోలెఁ దత్పద తాడితుండ
నగుచుఁ జనియెడు తొయ్యలి ననుగమించి
చనుచునుంటిని నాదు తేజంబునుం బ్ర
భావమును భాగ్యవంబును వమ్ములయ్యె. 673

గీ. స్త్రీలచే నెవ్వని మన మాకృష్టమయ్యె
నట్టి వ్యర్థుని తపము విద్యయు శ్రుతంబుఁ

ద్యాగనిరతియు మౌన మే ఠ కాంతసేవ
యిన్నియున్ నిష్ఫలంబులే ఠ యెంచిచూడ. 674

క. ఏనేఁ బ్రౌఢభవమందియు, మానినియెడ గోఖరముల ఠ మాడ్కి నయితినో
వానిని నన్నుం బండిత, మానిని స్వార్థానభిజ్ఞు ఠ మహిఁగాలుపనే? 675

శ్లో. కుతస్తస్యానుభావస్స్యా, త్తేజఈశిత్వ మేవవా
యోన్వ గచ్ఛంస్త్రియంయాంతీం, ఖరవత్పాదతాడితః॥

శ్లో. కిం విద్యయా కిం తపసా, కిం త్యాగేన శ్రుతేనవా
కిం వివిక్తేన మానేన, స్త్రీభి ర్యస్య మనోహృతమ్॥

శ్లో. స్వార్థస్యాకోవిదం ధి జ్మాం, మూర్ఖం పండితమానినమ్
యోఽహ మీశ్వరతాం ప్రాప్య,స్త్రీభి ర్గోఖరవజ్జితః॥

క. కనివినిమెఱుఁగనివస్తువు, నను బోడమవుగా మనంబు ఠ నన్ః భావంబుల్
మనము స్తిమితమై ప్రాణము,లను నియమింపంగ నిశ్చకలత్వముఁగాంచున్. 682

శ్లో. అదృష్టా దశ్రుతా ద్భావా, న్న భావ ఉపజాయతే
అసంప్రయుంజతః ప్రాణాన్, శామ్యతి స్తిమితంమనః॥

10 మద్యపాన నిషేధావసరము — యాదవనాశనము.

ఉ. ఏయదిస్త్రోలినంత భ్రమి ఠయించునో మానస మట్టిదైన మై
రేయకమద్యమున్ యదువ ఠ రేణ్యులు దైవహతస్వభావులై
పాయక త్రావి తోన మధు ఠ పానమదాధికదృప్తచిత్తులై
యామెడనొండొరుల్ జగడ ఠ మాడిరి శ్రీహరిమాయగ్రమ్మఁగన్. 765

శ్లో. తతస్తస్మిన్ మహాపానం, పపుర్మైరేయకంమధు
దిష్టవిభ్రంశితధియో, యద్ద్రవై ర్భ్రియతేమనః॥

శ్లో. మహాపానాభిమత్తానాం, వీరాణాందృప్తచేతసాం
కృష్ణమాయా విమూఢానాం, సంఘర్షస్సుమహా నభూత్॥

## ద్వాదశ స్కంధము.

1. భవిష్యన్నరపాలుర చరిత్రలలో చాణక్య చంద్రగుప్తుల చరిత్ర.

గీ. నరవరోత్తమ!యామహాకనందిసుతుఁడు, శౌర్యఘనుఁడు శూద్రాగర్భకసంభవుండు
బలయుతుండు మహాపద్మకపతియనఁబడు, నందుఁడు సకలక్షత్రవికనాశకుఁడగు. 8

క. అనఘ! యనుల్లంఘితశా, సనుఁడు మహాపద్ముఁ డపర ఠ జమదగ్నిసుతుం
డనఁ దనరుచు నేకచ్ఛత్రనుగా నేలఁగలఁ డీ ధకరాస్థలినెల్లన్. 10

క. అతనికి సుమాలిముఖ్యులు, సుతులెనమం డ్రుద్భవింతు రి క్షోణిప! వారల్
శతవత్సరములు దర్పో,ద్ధతిమీఱఁగ ననుభవింతు రిధరనేలికలై.

క. అవనిం గడువిఖ్యాతుల, నవనందుల ద్విజుఁడొకఁడు వినాశమొనర్చున్
నవనందులుమడియఁగ ననుభవింత్రు మౌర్యులు సమస్తవసుమతినిఁ గలిన్.

గీ. ఆ ద్విజుఁడె చంద్రగుప్తుని నాత్మగుప్త, రాజ్యమం దభిషేకించు రాజచంద్ర!
చంద్రగుప్తసుతుఁడు వారిసారుఁడగును, వానికిఁ దనూభవుఁ డశోకవర్ధనుఁడగు.

శ్లో. మహానందిసుతో రాజన్, శూద్రాగర్భోద్భవోబలీ
మహాపద్మపతిః కశ్చి, న్నందః క్షత్రవినాశకృత్॥

శ్లో. ఏకచ్ఛత్రాం సపృథివీ, మనుల్లంఘితశాసనః
శాసిష్యతి మహాపద్మో, ద్వితీయ ఇవ భార్గవః॥

శ్లో. తస్యచాష్టౌభవిష్యంతి, సుమాలిప్రముఖాస్సుతాః
యఇమాం భోక్ష్యంతిమహీం, రాజానశ్చశతం సమాః॥

శ్లో. నవనందాన్ ద్విజఃకశ్చి, త్ప్రపన్నానుద్ధరిష్యతి
తేషా మభావే జగతీం, మౌర్యా భోక్ష్యంతి వైకలౌ॥

శ్లో. సఏవచంద్రగుప్తంవై, ద్విజోరాజ్యేఽభిషేక్ష్యతి
తత్సుతో వారిసారస్తు,తత శ్చాశోకవర్ధనః॥

## 2. కలియుగ ప్రవర్తనము.

సీ. తదనంతరమ్ము బ్రత్యహమును ధర్మంబు,సత్యంబు శౌచంబు క్షమయు దయయు
బలమునాయువు స్మృతి కలికాలమహిమచే, నశియింపఁగలవు భూనాథతిలక!
కలిని ధనంబె మర్త్యులకు జన్మాచార,గుణసముభ్యుదయ కారణమగుఁజుమి
ధర్మనీతివ్యవ స్థలకు బలంబె ప్ర,ధానహేతువుగాఁగఁ దనరుచుండు

గీ. అభిరుచియ యగు దాంపత్య మందు హేతు
వగును వాక్చాతురతయ వ్యావ హారికమున
స్త్రీత్వమునఁ బుంస్త్వమునఁ గామ చింతయ యగు
బ్రాహ్మణతకుఁ గారణము సూత్రంబ యగును. 26

వ. అన్యోన్యాపత్తికారణంబగు చిహ్నంబ యాశ్రమప్రతీతికి హేతువగు. అవృత్తిచే న్యాయదౌర్బల్యంబగు. బహుభాషణంబె పాండిత్యమగు. అనాఢ్యత్వమ యసాధుత్వంబగు. ఆఢ్యత్వంబె సాధుత్వమునకు హేతువగు.

సీ. కల్యాణమనగ స్వీకారమేయగు నెన్న, స్నానకర్మంబు ప్రసాధనంబ
దూరస్థితంబైన నీరాకరంబు తీ,ర్థంబగు కేశధారణమ సొబఁగు

కుక్షింభరత్వమగుం బురుషార్థంబు, సభ్యత్వమనఁగ ధార్ష్ట్యంబయగును
స్వకుటుంబభృతియ దక్షత్వమనంబడు, ధర్మసేవయు యశోర్థంబె యగును
గీ. ఇట్లు దుష్టప్రజాసముపేతమైన, వసుమతీమండలమునకుఁ బ్రబలగతిని
బ్రహ్మవిట్క్షత్రశూద్రవర్ణంబులందు, బలియుఁడగువాఁడె ప్రభువుగాఁబరగఁగలఁడు28
శ్లో. తతశ్చానుదినం ధర్మస్సత్యం శౌచం క్షమా దయా
కాలేన కలినా రాజన్, నఙ్క్ష్యత్యాయుర్బలం స్మృతిః॥
శ్లో. విత్తమేవ కలౌ నౄణాం, జన్మాచారగుణోదయః
ధర్మన్యాయ వ్యవస్థాయాం, కారణం బలమేవహి॥
శ్లో. దాంపత్యేఽభిరుచిర్హేతు,ర్వాక్చౌర్యం వ్యావహారికే
స్త్రీత్వేపుంస్త్వేచాభిరతి, ర్విప్రత్వేసూత్రమేవహి॥
శ్లో. లింగమే వాశ్రమఖ్యాతా,వన్యోన్యాపత్తికారణం
అవృత్త్యాన్యాయ దౌర్బల్యం, పాండిత్యే చాపలం వచః
అనాఢ్యతైవాసాధుత్వే, సాధుత్వే చాఢ్యతైవహి
స్వీకారఏవ చోద్వాహే, స్నానమేవ ప్రసాధనమ్॥
శ్లో. దూరవార్యయనంతీర్థం, లావణ్యే కేశధారణమ్
ఉదరంభరతా స్వార్థ,స్సభ్యత్వే ధార్ష్ట్యమేవహి॥
శ్లో. దాక్ష్యం కుటుంబభరణే, యశోఽర్థే ధర్మసేవనమ్
ఇత్థం ప్రజాభిర్దుష్టాభి, రాకీర్ణం క్షితిమండలమ్॥
శ్లో. బ్రహ్మవిట్క్షత్రశూద్రాణాం, యోబలీ భవితానృపః

## 3. యుగకాల నిర్ణయము.

గీ. చంద్రుఁడున్ సూర్యుఁడున్ బృహస్పతియునెపుడు
పుష్యనక్షత్రమునఁ బొత్తుపొసఁగ నేక
రాశియందుందురో యప్డు రాజచంద్ర!
కృతయుగంబు కాఁగలదు సంకేతమిద్ది. 39
శ్లో. యదా చంద్రశ్చ సూర్యశ్చ, తథాతిష్యే బృహస్పతిః
ఏకరాశౌ సమేష్యంతి, తథాభవతి తత్కృతమ్॥
గీ. సప్తదేవర్షులెప్పుడు సంచరింతురో, మఖలయం దప్పుడే గరిమంబుమీఱఁ
దాను ద్వాదశవర్షశతాత్మకుండు, కలిపురుషుఁడు ప్రవృత్తుఁడైయిలఁజెలంగు.43
ఆ. ఎపుడు మఘలనుండి ఋషులు పూర్వాషాఢఁ, జేరికొందురో యప్పుడే కారవేంద్ర!
నందునుండి మొదలు పొందు నభ్యుదయభాగ్యంబునంతకంతఁగలిపురుషుఁడు.44

శ్లో. యదా దేవర్షయస్సప్త, మఘాసు విచరంతిహి
తదా ప్రవృత్తస్తుకలి, ర్ద్వాదశాబ్ద శతాత్మకః॥
శ్లో. యదా మఘాభ్యోయాస్యంతి, పూర్వాషాఢాం మహర్షయః
తదానందాత్ప్రభృత్యేష, కలిర్వృద్ధింగమిష్యతి॥

4. భూదేవి మానవప్రవృత్తిని గర్హించుట.

చ. తనకయి గెల్పునొంద నెడఁ దం గడు వ్యగ్రతనొందు భూపులన్
గని హసియించు భూమి తమఁకంబున నన్నేలువంగ మృత్యుక్రీ
డనకులు రాజులెల్ల నకఁటా! గమకింతురు ఫేనతుల్యమౌ
తనువును నమ్మియుంట వితఁథంబగు విజ్ఞులకేని గోరికల్. 48
మ. అరిషడ్వర్గము ముందుగా గెలిచి రాఁజామాత్యపౌరాప్తశే
ఖరులన్ హస్తిపులన్ వశీకృతులుగాఁగావించి ప్రత్యర్థులన్
వెరవొప్పంగ వెలార్చి రాజులిటులుఁకర్విన్ సాగరప్రావృతన్
బోరి నిర్జింతుమటన్నయాసను గనంఁబోరంతిక స్థాంతకున్. 49
గీ. అకట! సాగరమేఖలఁనైన నన్ను, గెలిచియుం గొంద ఉరుమోహఁజలధిజొత్తు
రాత్మవిజయంబునకిదెంతఁయరయఁగ ఫల,మాత్మవిజయంబునకు ముక్తిఁయబ్బునుగద
క. నను మనువులుఁ దత్పుత్రకు,లును విడిచియ వచ్చినట్టుఁలుచనిరి కులవ
ర్ధనుఁలయ్యునిఁక నబుద్ధులు,నని మొన నను గెలువనెంతుఁరతిశోచ్యముగన్. 51
క. పితృపుత్రభ్రాత లన,న్మతులయి రాజ్యంబునన్ మఁమత హెచ్చఁగ ను
ద్ధతితోడ మదర్థంబయి, యతిఘోరమ్ముగ నొనర్తుఁరని నొండొరువుల్. 52
క. ఈ యఖిలవసుంధరయును, నాయదియే నీకులేదుఁనడు జడ! యని నా
కై యొండొరులన్ దూఱుచు, మాయురె! కొట్టుఁకొనికడఁకఁమడియుదురయయో!
గీ. మర్త్యధర్మ్ములువార లఁమర్త్యనగుచుఁ, బరగు నాయందు మమతనుఁబరపి దుస్స
హమగు కాలంబుచే నకృఁతార్థులగుచుఁ, జిట్టచివరకును గథావఁశిష్టులైరి. 55
శ్లో. దృష్ట్వాత్మని జయేవ్యగ్రాన్, నృపాన్ హసతి భూరియం
అహో! మాం విజిగీషంతి, మృత్యోః క్రీడనకాన్నృపాః॥
శ్లో. కామఏష నరేంద్రాణాం, మోఘస్స్యాద్విదుషామపి
యేన ఫేనోపమేపిండే, యేఽతివిస్రంభితా నృపాః॥
శ్లో. పూర్వం నిర్జిత్య షడ్వర్గం, జేష్యామో రాజమంత్రిణః
తత స్సచివపౌరాప్తాన్, కరీంద్రానస్య కంటకాన్॥
శ్లో. ఏవంక్రమేణ జేష్యామః, పృథ్వీం సాగరమేఖలాం
ఇత్యాశాబద్ధహృదయా, నపశ్యంత్యంతికేఽంతకమ్॥

శ్లో. సముద్రావరణాంజిత్వా, మాం విశం త్యబ్ధిమోజసా
కియదాత్మజయస్యైత, న్ముక్తిరాత్మజయేఫలమ్॥
శ్లో. యాంవిసృజ్యైవమనవ, స్తత్సుతాశ్చకురూద్వహా!
గతాయథాగతంయుద్ధే,తాం మాం జేష్యం త్యబుద్ధయః॥
శ్లో. మత్కృతే పితృపుత్రాణాం, భ్రాతృణాం చాపివిగ్రహాః
జాయతే హ్యసతాంరాజ్యే, మమతా బద్ధచేతసామ్॥
శ్లో. మమైవేయం మహీకృత్స్నా, న తేమూఢేతివాదినః
స్పర్ధమానా మిథోఘ్నంతి, మ్రియంతే మత్కృతేనృపాః॥
శ్లో. మమతాం మ య్యమర్త్యాయాం, కృత్వోచ్చై ర్మర్త్యధర్మిణః
కథావశేషాః కాలేన, హ్యకృతార్థాః కృతావిభో.॥

5. భగవద్భక్తి ప్రభావము.

గీ. హేమమున లగ్నమగుచు వహ్ని తొలఁగించు
ధాతుజమగు దుర్వర్ణంబు నా తెఱఁగున
నాత్మగతుఁడైన భగవంతుఁడచ్యుతుండు
యతిజనంబుల యశుభాశయంబులణఁచు. 73
శ్లో. యథాహేమ్ని స్థితోవహ్ని,ర్దుర్వర్ణం హంతిధాతుజమ్
ఏవమాత్మగతో విష్ణు, ర్యోగినా మశుభాశయమ్ ॥

చ. అరుదయి దోషరాశియగునట్టి కలింగల దొక్కటే మహా
త్తరగుణమో నరాధిప! యుదాత్తగుణుండు పరేశుఁడైన శ్రీ
వరుశుభకీర్తనంబుననబంధము లెల్లను విచ్చిపోవఁ ద
త్పరమగతిన్ నరుం డతిముదంబునఁబొందఁగఁ జాలు నీకలిన్. 77
చ. కృతయుగమందు ధ్యానమొనరించిన నేయది ప్రాప్తమౌ సమా
హితమతిఁ ద్రేతయందు యజియించిన నెయ్యది సంభవించు సం
తత పరిచర్యలన్ సలుపద్వాపరమం దెదికల్గునో సమ
గ్రిత నదికల్గు నీ కలియుగంబున శ్రీహరికీర్తనంబునన్॥ 78
శ్లో. కలేర్దోషనిధేరాజ, న్నస్తిహ్యేకో మహాన్ గుణః
కీర్తనాదేవకృష్ణస్య, ముక్తబంధః పరంవ్రజేత్॥
శ్లో. కృతే యద్ధ్యాయతోవిష్ణుం, త్రేతాయాం యజతోమఖైః
ద్వాపరే పరిచర్యాయాం, కలౌ తద్ధరికీర్తనాత్॥

6. శుకమహర్షి కృతపరీక్షిత్ప్రబోధము.

గీ. మృత్యువులకన్నిటికిఁ బెనుస్వామి త్రి వైన,యీశు నిన్నును విప్రవాక్యేరితుఁడగు తక్షకుండు దహింపఁడుస్వ ధరణినాథ!,కడఁగి మృత్యువుల్ నిను జెనకఁగలేవు. 100

గీ. పరమపద మైచెలంగెడుస్వ బ్రహ్మమేను, పరమధాముఁడనగు నేనెస్వబ్రహ్మమనని కడఁకనిట్టులు నిరుపాధికమగు నాత్మ,మందు నాత్మనుజొన్పుమీస్వయవనినాథ!101

గీ. ధృతియెసఁగనీపగిదినివర్తింతువేని, మొనసి విషవక్త్రమునఁ బాదమునఁగఱచెడు తక్షకాహినిఁదనువు నేతజ్జగమ్ము, నాత్మకంటె భిన్నంబుగాస్వనరయఁబోవు. 102

శ్లో. చోదితో విప్రవాక్యేన, నత్వాంధక్ష్యతి తక్షకః
మృత్యవో నోపసర్పంతి, మృత్యూనాం మృత్యు మీశ్వరమ్॥

శ్లో. అహం బ్రహ్మపరంధామ, బ్రహ్మాహం పరమంపదం
ఏవం సమీక్షన్నాత్మాన, మాత్మన్యాధాయనిష్కళే॥

శ్లో. దశంతం తక్షకం పాదే, లేలిహానం విషాననైః
నద్రక్ష్యసి శరీరంచ,విశ్వంచ పృథగాత్మనః॥

అన్నియు నిట్టి పద్యరత్నములే. ఇందు పరీక్షిన్మహారాజు మృత్యుభయము పోవుకథయేగాక ప్రళయాంతములందును మృత్యుంజయుండగు మార్కండేయమహర్షి కథయు సూచింపఁబడినది. అణిమాద్యష్టసిద్ధులు పరకాయప్రవేశ, స్వచ్ఛందమరణ, దూరశ్రవణ, దూరదర్శన, కామరూప, మనోజవ, సూర్యప్రతిష్టంభనా ద్యష్టాదశ సిద్ధులు, నష్టాదశధారణలును జెప్పఁబడినవి. భాగవతవిషయానుక్రమణిక గ్రంథాంత మున వ్యాసునిచేతనే చెప్పఁబడుటచే వీరు స్కంధాంత గద్యముల నుదహరింపకుండు టయే సమంజసముగ నున్నది.

పోతనామాత్యుని భాగవతమున సమగ్రముగ లభించని శ్రీ కృష్ణపరమాత్మ యంత్యోపదేశము (పరిపక్వజ్ఞాని, భక్తుఁడు నగు నుద్ధవునకుఁ బ్రబోధించిన నివృత్తి గీత) సరళశైలి నాంధ్రీకరించి ముందుగఁ బ్రకటించి మన కనుల యెదుటనుంచిన శ్రీ శ్రీరామనృసింహమూర్తికవుల కెంతేని నాంధ్రప్రజానీకము ఋణపడి యున్నదనిన నతిశయోక్తికానేరదు. వీరిచే రచింపఁబడిన శ్రీమదాంధ్రభాగవతము ప్రకటితమై ప్రభుత్వాదరణము, ప్రజాదరణముఁ గాంచునట్లు చేయుటకును, మఱియు నిట్టి మహత్తర గ్రంథరచనఁ గావింపఁజేయుటకును, వీరి కాయురారోగ్యభాగ్యక్షేమశ్రీసంపద లొసంగి సంరక్షించుటకును ఆభగవానున కనేక వందనశతంబు లర్పించుచున్నాడను. నాదోషము లేవేనినున్న విబుధులు మన్నింతురుగాక.

ఉప్పులూరు. }
24—5—1955 }

గంధం రామారావు.
(భాషాభిమాని)

# శ్రీమదాంధ్రభాగవతము
## (ఏకాదశ, ద్వాదశ స్కంధములు)

### కథాసంగ్రహము.

శ్రీకృష్ణపరమాత్మ కురుపాండవయుద్ధము నెపంబునను, సైన్యయుత జరాసంధాది వైరివీర నిధనంబునను భూభారమడంచి తన యపారమగు యాదవసైన్యమును నిర్మూలనము కానిదే తా నవతరించిన కార్యము పూర్తి కాదని తలంచె. తల్లికిఁ గుదురుగ నాడుకొను మంచిబిడ్డ లెందఱున్నను బరువుగఁదోఁచక యల్లరిపిల్లలు, ఆగతాయిపిల్లలు ఒకరిద్దఱున్నను బరువుగ బాధకల్గించునట్లు అధర్మాత్ములగు మనుజులు ప్రబలిన భూదేవికిని బరువుగఁదోఁచును గాబోలు. చీకాకును దొలఁగించి సంస్కరించుటయు నా దేవదేవుని పనియైయుండవచ్చు. శ్రీకృష్ణభగవానుని సంకల్పప్రభావంబున శ్రీకృష్ణ సందర్శనార్థము చనుదెంచి ద్వారకానగరసమీపస్థ పిండారకక్షేత్రమున నున్న విశ్వామిత్రాది మహర్షుల చెంతకు యదుపుత్రులు జాంబవతీసుతుండగు సాంబునికి గర్భవతియగు స్త్రీవేషము వేసి కొని పోయి "వినాశకాలే విపరీతబుద్ధిః" అనునట్లు వారలతో మహర్షులారా! మీరు త్రికాలవేదులు, మీ వాక్య మమోఘంబ కాన నడుగుచుంటిమి. గర్భవతియగు నీమె సిగ్గుచే మిమ్ము నడుగంజాలక మాచే నడిగించుచున్నది, ఈమెకుఁ బుట్టునది మగబిడ్డా? ఆడుబిడ్డా? చెప్పుఁడని వినయంబుదోఁప ననిరి.

'అతివినయం ధూర్తలక్షణ' మని యామహర్షులు దివ్యదృష్టి నదియంతయు గ్రహించి శ్రీకృష్ణభగవానుని సంతతి యింత యవివేకమునకుఁ బ్రియత్నించుచుండుటఁజూచి యాదవ వంశ వినాశమును భగవత్సంకల్పమే యని నిర్ణయించి 'ధూర్తులారా! ఈమెకు యాదవ వంశ వినాశకరమగు ముసలము పుట్టుననిరి. అంత యదుపుత్రులు సాంబుని వేషము తొలఁగించి యందుండి ముసలము పడుట గాంచి భయభ్రాంతులై యా యయోమయంబగు ముసలమును గొని రాజాస్థానమునకు వచ్చి యుగ్రసేనభూవిభున కాజరిగినవృత్తాంతమంతయు సమగ్రముగ నివేదించిరి. అప్పు డుగ్రసేనుఁడు కృష్ణానుమతి నాముసలము సముద్రపుటొడ్డున పొడిఁజేసి పాఱఁవేయుఁ డనెను. అట్లే వారుఁ గావించి పొడిని సముద్రజలమునఁ గలిపి ముసలావశేషమును నందుఁ బాఱవైచిరి. ఆపొడి వలన సముద్రజలమున నొకవిధమగు కసవు బయలుదేరెను. ముసలావశేషము నొక చేఁప మ్రింగ దానిని జాలరులు పట్టుకొన చేఁపకడుపునుండి యది బయటపడెను. దాని నొకబోయ తన బాణాగ్రమున సంధించెను.

నారదుఁడు శ్రీకృష్ణుని సేవించుటకుఁ గొన్నాళ్లు ద్వారకయందుండెను. అప్పుడు దేవకీ వసుదేవులకు శ్రీకృష్ణతత్త్వమును ప్రబోధించెను. వారును భగవంతుఁడు తమకుఁ బుత్రుఁడై జన్మించుటకు మహదానందభరితులౌచు నారదోపదేశమునఁ బుత్రునిగా భావింపక పరమాత్మగా భావించుచుండిరి. నారదుఁడు ద్వారకనున్న సమయమున దేవకీవసుదేవు లడిగిన పారమార్థికవిషయ ప్రశ్నములకు సమాధానముగ ఋషభకుమారులు నిమిచక్రవర్తికిఁ ప్రబోధించిన పరమార్థోపదేశమును వినిపించె.

ద్వారకయం దనేకములైన యరిష్టములు గానవచ్చెను. అప్పుడు శ్రీకృష్ణభగవానుఁడు తన్నుఁ జేరవచ్చిన యదువృద్ధులఁగాంచి యుత్పాతములు పెక్కులు గానవచ్చుచున్నవి. ఇఁక ద్వారకయం

దుండుట క్షేమకరముగాదు. మనమందఱము వేగ ప్రభాసతీర్థమునకుఁజేరి స్నానదానాది సత్కర్మము లాచరించుకొనుట మంచిది. అన యాదవులందఱు ప్రభాసతీర్థమునకుఁ బ్రయాణోన్ముఖులైరి. అప్పు డుద్ధవుఁ డాందోళనఁజెందుచు శ్రీకృష్ణపరమాత్మునిఁజేరి దేవా! ఏమిది? నేనెట్లు సంచరింపవలెను? అని భక్తిప్రపత్తుల నడిగెను. శ్రీకృష్ణపరమాత్మ యుద్ధవా! ఏమియులేదు. ఇదంతయు నా సంకల్పంబ. దేవప్రార్థితుఁడనై భూభారనివారణార్థ మవతరించి కృతకృత్యుఁడనైతి. యాదవులును నన్యోన్యకలహంబుల నాశనముఁ జెందఁగలరు. నేటికి నేడవనాఁడు ద్వారకయు సముద్రమున మునుఁగును. నా యవతారసమాప్తివలనఁ గలియుఁ బ్రవేశించి జనుల బాధించు. కాన నీవిట నివసింపఁదగదు. ఆభిజాత్యమందలి వ్యామోహమును విడిచి నాయందు మనంబు జొనిపి యెటనేని సంచరింపుము. దృశ్యమంతయు నశ్వరమని భావింపుము. యోగివికమ్ము. యోగికాని పురుషునకు నానార్థవిషయిక భ్రాంతి కలుగు, ఆభ్రాంతివలన గుణదోషంబులఁ బొందు. గుణదోషబుద్ధిభేదంబునఁ గర్మయనియు, నకర్మయనియు, వికర్మయనియు నేర్పడుచుండు. కాన నింద్రియముల నిగ్రహించి యోగయుక్తమనస్కుండవై యీవిశ్వంబును నాత్మయందు వీక్షింపుము. విస్తృతమైన యీ యాత్మను నధీశ్వరుఁడనగు నాయందుఁ గాంచుము. జ్ఞాన విజ్ఞానసంయుక్తుండవై శరీరులకు నాత్మభూతుండవై యాత్మానుభూతి పరితుష్టహృదయుండవైన ప్రత్యవాయంబులచేఁ బ్రతిహతుండవు కాకుందువు. బుధుఁ డర్భకుఁడువోలె నుభయాతీతుఁడయ్యును దోషబుద్ధిచే నిషేధమునుండి మరలకుండు. గుణబుద్ధిచే విహితంబును గావింపకుండు. సర్వభూతసఖుఁడు, శాంతాత్ముఁడు, జ్ఞానవిజ్ఞాన నిశ్చయకలితుఁడునై విశ్వంబును మదాత్మగా గాంచుచు వెండియు విపన్నుండు గాకుండుననిన నుద్ధవుం డిట్లనియె.

దేవా! నీచేఁ జెప్పఁబడిన యీ యోగము నేనెట్లుపొందఁగలను? విషయపరులు, అభక్తులు నగు వారికీయోగము కుదురుట దుష్కరమని తోఁచుచున్నది, నేను నహంతామమతలచే మోహబుద్ధినై యున్నాఁడను. నీవే నాకు బోధింపఁదగిన వక్తవు. కాన ననవద్యుఁడవు, ననంతసారుఁడవు, సర్వజ్ఞుఁడవు, నీశ్వరుఁడవు నగు నిన్ను మహాపాపసంతప్తుఁడ నగు నేను శరణుజొచ్చి ప్రార్థించుచుంటి నన శ్రీకృష్ణభగవానుండిట్లనియె.

ఉద్ధవా! మునులు లోకతత్త్వమును గుర్తెఱింగి దుస్సంగమునుండి యాత్మచేతనే యాత్మను నుద్ధరించుకొందురు. పురుషునకాత్మయే గురువు. ప్రత్యక్షానుమానంబులచేఁ బురుషుండు విషయాభిజ్ఞుండై శ్రేయంబువడయును. దీనికి సంబంధించిన పురాణేతిహాసం బొండుకలదు. చెప్పెద వినుము.

మా వంశమునకు మూలపురుషుండగు యదువు విహారార్థము బయలుదేరి పట్టణమువెలుపల నొక యవధూతను గాంచి వాని యాకారమునకు, వేషమునకుఁ బ్రవర్తనకు నబ్బురముఁజెంది యిట్లనియె.

అవధూతోత్తమా! సాధారణముగ మానవులు సంపదనో, కీర్తినో కాంక్షించి తిరుగుదురు. చతురుఁడవు, తరుణుఁడవు, జ్ఞానివియయ్యు మితభాషణుండవై బాలునిగతి వెఱ్ఱివానివలెఁ గర్తృత్వము వహింపక యేలతిరిగెదవు? ఎల్లజీవులు కామలోభాదులఁ బరితప్తహృదయులగుచుండ గంగలోమునిగిన యేనుంగువలె నేవిధమగు పరితాపమును జెందక ప్రశాంతపరిస్థితిని మెలఁగుచుంటివి. ఇట్టి ప్రశాంత పరిస్థితి యెట్లుకలిగె? ననిన నవధూత యదుమహారాజుం గాంచి యిట్లు పలుకఁదొడంగె.

రాజా! సంపూర్ణమగు జ్ఞానమొకచోటనుండి లభింపదు. నే నిరువదినాలుగు స్థానములనుండి కొంత పరిజ్ఞానమలవఱచుకొంటి. వానినే గురువులుగ భావించితి. వానినిఁజెప్పెద వినుము.

1. భూమి, 2. గాలి, 3. ఆకాశము, 4. జలము, 5. అగ్ని, 6. చంద్రుఁడు, 7. సూర్యుఁడు, 8. కపోతము (గువ్వ), 9. అజగరము (కొండచిలువ) 10. సముద్రము, 11. మిడుత, 12. తేనెటీఁగ, 13. ఏనుఁగు, 14. మధుహర్తుఁడు (తేనెపట్టులఁదీయువాఁడు), 15. లేడి, 16. చేఁప, 17. పింగళ (వేశ్య), 18. కురరము (పక్షి), 19. పిల్లవాఁడు, 20. కన్యక, 21. కమ్మరి, 22. పాము, 23. సాలీడు, 24. తుమ్మెద. దేనినుండి యేది గ్రహించితినో యదియును జెప్పెద వినుము.

1. భూమి:— భూతంబులచే ననేకవిధంబుల నుపభోగ్యయై నిశ్చలత్వమున మెలఁగును. అట్లే ప్రకృతిసంఘట్టనల ననేకవిధంబులగు బాధలనొందియు నిశ్చలత్వముగ మెలంగుచుంటి.

2. గాలి:— అనేక ప్రదేశంబులఁ జొచ్చియు విభిన్నత్వముగనే యుండును. అట్లే వివిధ ధర్మములైయుండు విషయములఁజొచ్చియు గుణదోష సంవర్జితాత్ముఁడనై సంగముంబొందక సంచరించుచుంటి.

3. ఆకాశము:— వాయుప్రేరితములైన మేఘాదులఁగూడియు సర్వవ్యాపకత్వము గలిగియు నవిచ్ఛిన్నంబై యసక్తంబైయుండును. అట్లే తగులంబుమాని చరించుచుంటి.

4. జలము:— ఎట్టిమాలిన్యమునఁగూడియున్నను నిర్మలత్వము, స్వభావస్నిగ్ధత్వము, మధురమూర్తియుఁగలిగి, వీక్షణ, స్పర్శన, కీర్తనాదుల నాశ్రితులఁబవిత్రులఁజేయును. అట్లే మాలిన్యము నిరసించి పవిత్రతఁ గాంచుచుంటి.

5. అగ్ని:— సర్వభక్షుండయ్యు మాలిన్యము గ్రహింపకుండు. అట్లే తపోవిరాజితుఁడనై తేజస్వినై యెట భిక్షనారగించుచున్నను మాలిన్యమునొందక శ్రేయస్కాముల కుపాస్యుండనై దాతృజనంబుల పూర్వోత్తరపాపంబుల నిశ్శేషంబుగా దగ్ధంబుగావించుచు నింధనంబుల నగ్నివోలె చరాచరాత్మకము స్వమాయావిరచితము నగు విశ్వంబుననున్న పరమాత్మగతి సంచరించుచుంటి.

6. చంద్రుఁడు:— చంద్రకళలకు వృద్ధిక్షయములు కాని చంద్రునికిలేవు. అట్లే వృద్ధిక్షయములు శరీరములకేకాని యాత్మకు (నాకు) లేవని తెలిసికొంటి.

7. సూర్యుఁడు:— కిరణములచే జలముగ్రహించి కాలానుగుణ్యముగ విడుచును. అట్లే గుణములచే గుణముల గ్రహించి సమయోచితముగ విడుచుచుంటి.

8. కపోతము (గువ్వ):— గువ్వలజంట యొకటి కలసిమెలసి జోడువిడువక మమకారమున సంచరించుచుండ నాడుగువ్వ ప్రథమగర్భముఁదాల్చి గ్రుడ్లుపెట్టెను. కాలచోదితమై యందు పిల్లలు బయలుదేరెను. మృదువైన యాకలతో శ్రావ్యమగు కూతలతో నలరారు నాపిల్లలఁగాంచి తల్లిదండ్రులానందవార్ధి మునుఁగుచుఁ దేలుచునుండిరి. ఒకనాడు పిల్లలమేతకై గువ్వలజంట యడవికిఁబోవ బోయ యొకఁడు వలపన్న గూటిలోనున్నపిల్లలు వలలోఁబడెను. ఆడుపిట్టవచ్చి పిల్లల దుస్థితిఁజూచి భరింపలేక దరిఁజేరి తానును వలందగులుకొనెను. మగపిట్టవచ్చి భార్యాపిల్లల దుస్థితింగాంచి వాపోయి వాపోయి వానినిఁజేరి వలలోఁజిక్కెను. కిరాతకుఁడు మాత్రము వాని దుస్థితి గమనింపక చరితార్థునివలె సంతసించి గువ్వలజంటను, పిల్లలను బుట్టను బెట్టుకొని యానందముతో నిల్లుఁజేరెను. అదిగాంచి యెవరితోనైన నెక్కుడు స్నేహముఁజేయకూడదని తెలిసికొంటిని.

9. అజగరము (కొండచిలువ):—ఇది కదలక మెదలక తన కేదిలభ్యమైన దానితోనే తృప్తిఁజెందుచుండును. అట్లే యధికముగాని యల్పముగాని మధురముకాని విరసముకాని దొరకినదానితోనే సంతృప్తిఁజెందుచుంటి.

10. సముద్రము:—ఎన్నినదులు వచ్చిపడినను, పడకున్నను పెరుగు, తరుగులులేక యుండును. అట్లే సంచరించుచు నింకను దీనినుండి ప్రసన్నగంభీరత అపారత్వము దుర్విగాహ్యత నలవఱచుకొంటి.

11. మిడుత:— సుఖభ్రాంతిని నగ్నిలోబడి మడియును. దాన దేవమాయయగు స్త్రీని దరిఁజేరకుంటిని.

12. తేనెటీఁగ;— పుష్పములకు నొత్తిడి లేకుండ కొలదిగనే పుష్పసారమును గ్రహించును. అట్లే గేస్తులకు భాధకలుగకుండ దేహమునిలుచు నంతగనే భుజించు మాధుకరవృత్తిచే జీవించుచుంటి.

13. ఏనుఁగు:— ఆడయేనుఁగు సంపర్కముఁగలిగిన మగయేనుఁగు దానిని విడువలేక మిగిలిన మగయేనుఁగులచే బాధింపఁబడుట బంధింపబడుటఁజూచి కొయ్యబొమ్మయగు స్త్రీనిసైతము కాలితోనైన స్పృశింపక మెలఁగుచుంటి.

14. మధుహ్నుఁడు (తేనెపట్టులఁ దీయువాఁడు:— వీనివలన లుబ్ధత్వమున నేమియు దాచియుంచక సంచరించుచుంటి.

15. లేడి:— కిరాతకునిపాటకు దరిఁజేరి మోసగింపఁబడును. ఋశ్యశృంగు నంతవాఁడును నృత్తగీతాదుల స్త్రీలకు వశ్యుఁడయ్యెను. అందువలన గ్రామ్యగీతములఁ జెవిఁజేర్చకుంటి.

16. చేప:—జిహ్వాచాపల్యమున గేలమునకుఁ జిక్కుకొనును. దాన రసనేంద్రియము జయింపకున్న మిగిలిన యింద్రియములగెల్చుట యసాధ్యమని తెలిసికొని నిరాహారత మెలఁగుచుంటి.

17. పింగళ:— ఇదియొకవేశ్య. మిథిలాపట్టణ నివాసిని, ఇదియొకనాఁటి రాత్రి యింటిగుమ్మమునఁ గూర్చుండి ధనవంతుఁడగు విటుఁడెవఁడువచ్చునా, అని తెల్లవారు వరకు నెదురుచూచి నిద్రలేక విసివి యిట్లు నిర్వేదముఁజెందె. లుబ్ధుఁడు, తుంటరి, త్రాగుఁబోతు, అవగుణుఁడు నగు విటుని గూర్చి ధనాశచే శరీరమమ్మి రతిచే సుఖింప నిచ్చగించుచుంటి. ఈ విదేహపురమ్మున నావంటి యవివేకురాలు మఱెవ్వతెయునుండదు. ఈ లక్ష్యము సర్వదా పోషకుఁడు, కామిత ప్రదుఁడునగు భగవంతు నిషైనుంచిన లక్ష్మీదేవివలె సంచరింపకపోవుదునా? అని పశ్చాత్తాపముఁజెంది భక్తురాలై తరించెను. దానిజూచి కామ్యసుఖంబుల నాస విసర్జించితి.

18 కురరము:— ఇదియొకపిట్ట. ఇదిమాంసమును దన్నుకొని పోవుచుండెను. అమాంసమునకై మఱికొన్ని పిట్టలు వెంటఁబడి దానిని బాధింప మొదలిడెను, అప్పుడది యా మాంసమును వదలి సుఖించెను. ప్రియతమమగు వస్తువును జేపట్టుటయే దుఃఖము. దానిని విడుచుటయే సుఖము. అందువలన దేనియందును ప్రేమనుంచక ముక్తుఁడనై సంచరించుచుంటి.

19. పిల్లవాఁడు:— లోకమున నేమియుఁ దెలియని పిల్లవాఁడును, అన్నియుఁ దెలిసిన మహాత్ముఁడును నిరువురే దుఃఖముహితులు, సుఖభోజనులు, మహాత్ములగతి మనకు దుర్లభము. కాన పిల్లవానివలె సంచరించుచుంటి.

20. కన్యక:—తల్లిదండ్రులింటలేని సమయమున నీమెకు పెండ్లిపెద్దలు వచ్చిరి. ఆమె వారలకొఱకు రహస్యస్థలమున ధాన్యము దంచుచుండెను. చేతిగాజులు ధ్వనిఁజేయుచుండెను. అందువలన నామెచీకాకుఁజెంది చేతి కొక్కొక్కగాజునుంచి మిగిలినవి తీసివేసెను. గోలలేకుండెను. పదుగురు కలిసినపోట్లాటయు నిద్దఱున్నను నేదో గొడవయు బయలుదేరును గాన నొక్కఁడనే యేకాంతమున నివసించుచుంటి.

21. కమ్మరి:— శరములు చేయుచు శరమునందే లక్ష్యముంచి ప్రక్కనుండి మహారాజు పోవుచున్నను లక్ష్యపెట్టఁడు. అట్లే యాత్మధ్యానమున మెలఁగుచుంటి.

22. పాము:— ఇది యేపుట్టనో నివసించును. దానినిజూచి శిథిలమగు శరీరము కలవానికి గృహనిర్మాణ ప్రయత్న మెందుకని యెక్కడనో యొక్కెడఁ దలఁ దాచుకొనుచుంటిని.

23. సాలీడు:— ఇది నోటితో బొడ్డునుండి దారమును బయటకు లాగుచు చిత్రవిచిత్రములగు నల్లికలనల్లి విహరించి మఱల హరించును. అట్లే భగవంతుఁడును నాభినుండి రజోగుణంబున విశ్వము సృజించి విహరించి హరించునని తెలిసికొని మెలఁగుచుంటి.

24. తుమ్మెద:— ఇదియొక పురుగును దెచ్చి గూటనునిచి దానిచుట్టు ఝుంకారముఁ జేయుచుండును. ఆపురుగును భయంబునఁ దుమ్మెదనే తదేక లక్ష్యముగఁ గాంచును. అందువలన నా పురుగు పూర్వశరీరముఁ ద్యజింపకయే తుమ్మెదరూపముఁదాల్చును. ఇదియే సారూప్యపదవీలక్షణమని తెలిసికొని భగవంతునిపై లక్ష్యముకలిగి ధ్యానించుచుంటి. ఈదేహమును మాత్రము సహాయముగాఁ గొని (యిదైనను నశ్వరము మనది కానిది యగుట దీని గూడ విశ్వసింపక) మెలఁగుచుంటి. గృహయజమానిని సపత్నులు తలకొక ప్రక్కకులాగునట్లు జీవుని చెవియొకవైపునకు, కన్నొకవైపునకు, ముక్కొకవైపునకు, నాలుకయొకవైపునకు లాగుచుండును. సర్వావయవశోభితమగు మానవశరీరముఁ బొందియుండుటచే మృత్యువువాతఁ బడకపూర్వమే మోక్ష మార్గముఁ దెలిసికొని సంచరింపవలెను. వైషయిక సుఖమునకేమి కొదువ? అదియంతటను లభ్యమే, అని వైరాగ్యయుతుఁడనై సంచరించుచుంటినని యవధూత యదువునకుఁ జెప్పెనని శ్రీకృష్ణపరమాత్మయుద్ధవునకుఁ జెప్పి మఱియునిట్లనియె.

ఉద్ధవా! కామ్యకర్మముల మత్పరుండవై త్యజింపుము. నిత్యనైమిత్తిక కర్మముల నాచరింపుము. ఆత్మజిజ్ఞాస కలిగి ''బుద్ధిఃకర్మానుసారిణి'' అనునట్లు కలుగు కర్మప్రేరణను నాదరింపకు. తెలియనివానికెప్పుడును దుఃఖమును దెలిసినవాని కెప్పుడును సుఖమును గలుగుటలేదు. వారివారి యహంకర్తృత్వమే సుఖదుఃఖములకుఁ గారణమగుచున్నది. గుణవైషమ్యమున నాత్మకు నానాత్వముతోఁచుచున్నది. నానాత్వబుద్ధిచేఁ బారతంత్ర్యమును, పారతంత్ర్యముచే నీశ్వరుని వలన భయమును, భయమువలన శోకమును గలుగుచున్నవి. దీని విపర్యయమే సుఖహేతువు. అనిన నుద్ధవుండిట్లనియె.

దేవా! దేహమునకు సంబంధించిన గుణములతోఁ గూడినదేహి యేలాగున నాగుణములచే బంధింపఁబడకుండును? ఎట్లు బంధింపఁబడుచుండెను? దీనిని దెల్పుమన శ్రీకృష్ణుండిట్లనియె.

ఉద్ధవా! అజ్ఞానమే జీవుని గుణములచే బంధింపఁజేయుచున్నది. జ్ఞానమే విడివడఁజేయుచున్నది. సంకల్పరహితుఁడైన గుణములచే బంధింపఁబడఁడు. శబ్దబ్రహ్మపారదర్శియైన విద్వాంసుఁడును, సాధువై పరబ్రహ్మమునందు ధ్యానముంచకున్న గొడ్డావును మేపువానివలె వాని శాస్త్రపఠనము వ్యర్థము.

ఉద్ధవుఁడు:— దేవా! సాధువనిన నెట్టివాఁడు?

శ్రీకృష్ణుఁడు:— భూతద్రోహి కానివాఁడు, అమితదయాళువు, సత్యసారుఁడు, సర్వసముఁడు, అనవద్యమతి, క్షమాఢ్యుఁడు, దాంతుఁడు, శౌచయుతుఁడు, నిష్కామశీలుఁడు, కఠినచిత్తుఁడు కానివాఁడు, అపరిగ్రహుఁడు, శాంతమనస్కుఁడు, స్థైర్యయుతుఁడు, అప్రమత్తుఁడు, ముని, లఘ్వాహారుఁడు, గభీరాశయుఁడు, అభిమాని, అమాని, మైత్రుఁడు, కవి, శక్తుఁడు, ధీరుఁడు, విశేషజ్ఞుఁడు, నిర్వికారుఁడు, అనీహుఁడు, నిశ్చలుఁడు ఇట్టివాఁడు సాధువనంబడు.

ఉద్ధవుఁడు:— దేవా! సంసారవృక్షమన నెట్టిది?

శ్రీకృష్ణుఁడు:— కర్మాత్మకమగు సంసారవృక్షమునకు భోగమనునది పుష్పము, మోక్షమనునది ఫలము, పుణ్యాపాపంబులు విత్తనములు. కర్మవాసనాశతము మూలము, గుణత్రయము నాళము, పంచభూతములు స్కంధములు, శబ్దాదివిషయ పంచకము రసంబు, ఏకాదశేంద్రియములు శాఖలు, వాతపిత్తశ్లేష్మాదులు పైబెరడులు. జీవేశ్వరులను పక్షులకు నివాసము. సుఖదుఃఖములు ఫలములు, ఈవృక్షము సూర్యమండలపర్యంతము వ్యాప్తమకలది. గ్రామంబులఁ దిరుగాడు కాముక గృధ్రంబులందు దుఃఖరూప ఫలంబును, వనంబుల నివసించు పరమహంస హంసంబులందుసుఖరూప ఫలంబును ననుభవించుచుండు.

ఉద్ధవుఁడు:— దేవా? విషయాభిలాష దుఃఖహేతువని తెలిసియు జనులు, కుక్కలు, గాడిదలు, మేకలవలె యేల విషయలోలులగుదురు?

శ్రీకృష్ణుఁడు:— వివేకశూన్యునకు దేహాదికమున నేనను మిథ్యాబుద్ధి మనంబుననుత్పన్నంబగు. ఆయహంబుద్ధివలన సత్త్వగుణ ప్రధానమగు మనము నైనను రజోగుణమలముకొను. రజోగుణ యుక్తమనమునకు దుస్సంకల్పములు కలుగుచుండు. అందుండి గుణధ్యానంబునంజేసి దుర్భరమగు కామముజనించు. అప్రమత్తుండై త్రికాలము మనంబునునిల్పి నన్నే ధ్యానించుచుండిన నట్టి ప్రమాదమునకు లోనుగాకుండు. ఉద్ధవా! కొందఱు ధర్మము, కొందఱుయశము, కొందఱుసత్యము, కొందఱుకామము, కొందఱుదమశమములు, కొందఱు స్వార్థము, కొందఱైశ్వర్యము, కొందఱుకుడుపు, కొందఱువిడుపు, కొందఱుయజ్ఞము, కొందఱుతపము, కొందఱుదానము, కొందఱువ్రతము, కొందఱు యమనియమములు మంచివందురు. వీనిఫలములు కర్మకల్పితములగుటచే అశతోగూడినవి; తుచ్ఛ సౌఖ్యములనిచ్చునవి కనుక భోగకాలమునను భావికాలమునఁగూడ దుఃఖమును గల్గించునవే కాన మదర్పితబుద్ధి నిష్కాముఁడై మెలంగవలె. అజస్రము నన్నుభజించు భక్తునకు నేను హృద్గతుండనగుట హృదయగతములైన కామములునశించు. నాచేఁజూడఁబడుట హృదయగ్రంధి భేదింపఁబడు. సర్వసంశయములు ఛేదింపఁబడు. కర్మంబులును క్షీణంబులగు. నాభక్తి నిష్కామునకు, నిరపేక్షునకు మాత్రంబకలుగు. నాయందు నియతభక్తులు, సాధులు, సమచిత్తులునై బుద్ధికిఁబరుడనగు నన్నుబొందినవానికి గుణదోషోద్భవంబులైన గుణములు కలుఁగవు.

ఉద్ధవుఁడు:— దేవా! స్వకృతంబులైన కర్మంబులచే నానావిధంబులైన దేహంబులనునెట్లు గ్రహింతురు? ఎట్లువిసర్జింతురు? అనాత్మజ్ఞులకిది దురవగాహ విషయము కాన నీవే నాయందు దయనుంచి తెల్పుము.

శ్రీకృష్ణుఁడు:— నరుల కర్మమయంబగుమనంబింద్రియ పంచకసమేతంబై లోకంబునుండి లోకంబు పయనించు. తదన్యుండగు నాత్మ యమ్మనంబు ననువర్తించు. దృష్టంబులఁగాని శ్రుతంబులఁగాని విషయంబుల ధ్యానించుమ మనంబు కర్మతంత్రంబై వానియందు విలీనంబగు. అయ్యవసరంబునదాని పూర్వాపరసంధానంబు నశించు. విషయాభినివేశంబున మనంబాత్మను స్మరింపకుండు. జంతువులకత్యంత విస్మృతియే మృత్యువు, స్మృతియే జన్మము. స్వీయకర్మబీజముచే జీవుఁ డజుఁడయ్యు, బుట్టినవానిగాను, నమరుఁడయ్యు మృతునిగాను భావించుకొనును. మనోమయంబులు వివిధంబులునైన తనువులను గుణసంగంబునంజేసి గ్రహించుచుండు. పరమేశ్వరానుగ్రహమున విసర్జించుచుండు. తండ్రిచే నాదియుఁ బుత్రునిచే నంతమును జీవునకు శరీరమగుచున్నది. ఈరెండవస్థలకును నాత్మ భిన్నుఁడు. నర్తించువానిని గానంబుఁజేయువానిని జూచుచు జనుండు వారినెట్లనుకరించు నట్లే బుద్ధిచే గుణంబుల

జూచుచు నీవు విరహితుఁడవయ్యు నప్రయత్నమున ననుకరించుచుండుము. వృక్షంబునకు ఫలంబుంబోలె నాత్మకు శరీరం బధ్రువంబు. కావునఁ దదాయాసంబును వ్యర్థంబు. యోగంబు సేవించు పురుషునకు దేహంబు నిచ్చలు జరారోగాది రాహిత్యమును బొందినను మతిమంతుఁడు మత్పరంబగు యోగంబును విసర్జించి దానిని విశ్వసింపఁడు. ఉద్ధవా! అభిజనముపై గలుగు దుస్త్యజమగు స్నేహపాశమును ద్రెంచి బదరికారణ్యమునకు జని యచ్చట నలకనందానదీతోయమున స్నానపానము లాచరించి నివారిత పాపపంకుండవై వల్కలాజినములఁ గట్టి కందమూలాశనుండవై నిస్పృహత సంచరించుచు ద్వంద్వములసైచుచు సంయతేంద్రియుండవు, శాంతుండవునై మనోవాక్కాయ కర్మంబుల నాయందె బద్ధానురాగుఁడవు కమ్ము. అట్లేని నన్నుఁబడయగలవు. అని శ్రీకృష్ణపరమాత్మ యానతీయ నాలకించి కృష్ణపరమాత్మకు ముమ్మారు వలగొని చరణద్వంద్వమున శిరంబిడి సుఖదుఃఖదూరుఁడయ్యు వీడ్కోలు సమయమున కృష్ణపరమాత్మను విడువలేక దుఃఖాశ్రువులు ప్రవహించుచుండ నెట్టకేలకు శ్రీకృష్ణు నాజ్ఞను శ్రీకృష్ణు పాదుకలు శిరంబుననునిచికొని హృదయంబున శ్రీకృష్ణునినిలిపి ధ్యానించుచుఁ దదుక్త ప్రకారంబున బదరికకేగి యుజ్జ్వలమగు తపం బాచరించి పరమభాగవతోత్తముఁడగు నుద్ధవుఁడు భగవత్సన్నిధానంబు నొందె.

యాదవు లుత్పాతములఁగాంచి భయంబుఁజెంది శ్రీకృష్ణునాజ్ఞ ద్వారక వీడి శంఖోద్ధారముఁజేరి యటనుండి సరస్వతి ప్రత్యగ్గతిఁ బ్రవహించు ప్రభాసతీర్థంబుఁజేరిరి. అచ్చట స్నానదానాదులాచరించినపిమ్మట మదమునుగల్గించు మైరేయకమను మద్యమునుద్రావి యాదవులు భగవన్మాయ నన్యోన్య కలహముల మడిసిరి. బలరాముఁడును నాత్మ నాత్మన్ జేరిచి నరలోకమును ద్యజించె. శ్రీకృష్ణపరమాత్మ బలరాముని నిర్వృతిఁగని పిప్పలవృక్షమూలంబున నిశ్చింత వామపాదము దక్షిణయూరువున నునిచి కూరుచుండెను, జరుఁడను కిరాతకుఁడు ముసలాగ్రిబాణమున మృగాననభ్రాంతినిఁ దత్పాదమునఁగొట్టె. పిదప తెలిసి యతఁడు దరిఁజేరి ప్రార్థించెను. కృష్ణపరమాత్మ యిది నా సంకల్పమేయని వాని కూర్ధ్వలోకంబులకుఁ జన ననుమతినొసంగె. కృష్ణసారథియగు దారుకుఁడు తులసీవనమాలాపరిమళమునుబట్టి శ్రీకృష్ణునిజాడ తెలిసికొని దరిఁజేరి నమస్కరించెను. కృష్ణపరమాత్మ దారుకా! నేనులేని ద్వారకను సముద్రుఁడు ముంచును. పట్టణవాసులెల్లరును నర్జునసహాయంబున నొడ్డుఁజేరుఁడు అని దారుకుని బనిచెను. దారుకుఁడుఁ జూచుచుండ రథము దివ్యాయుధములు నాకాశమునకుఁబోయి యంతర్ధానముఁజెందె. శ్రీకృష్ణుఁడు నాత్మ నాత్మమునుజేర్చి కనుంగవమూసి లోకసుందరమగు స్వీయదేహమును దగ్ధముఁజేయక యోగాగ్నిచే స్వకీయధామమును జేరె. వానితో భూమిని వీడి సత్యము, ధర్మము, ధృతి, కీర్తి,లక్ష్మియుఁ జనె. బ్రహ్మాది దేవతలును స్వధామమునకేగు శ్రీకృష్ణపరమాత్మను జూడఁజాలక పోయిరి.

దేవకియు,రోహిణీవసుదేవులును బలరామకృష్ణులఁ గానక తద్వియోగవ్యథ భరింపఁజాలక యసువుల వీడిరి. బలరామ శ్రీకృష్ణ ప్రద్యుమ్నాది సకలయాదవుల భార్యలు దమతమ పతుల శరీరములతో నగ్నింజొచ్చిరి. అర్జునుఁడుఁ దన్నుఁ దాన యుపశమింపఁజేసికొని వజ్రుని నందభిషిక్తుఁ గావించి హతావశిష్టుల, స్త్రీ, బాల, వృద్ధాదుల నింద్రప్రస్థముఁజేర్చె. పరీక్షిన్మహారాజా! నీ పితామహులు బంధువధము పార్థునివలన విని వంశధరునిగ నిన్ను నెలకొల్పి మహాపథంబును బొందిరి.

రాజా! ఇఁక మరణింతు నేనను పశుబుద్ధిని వీడుము. జంకకు. నీవు జాతుఁడవును కావు, మృతుఁడవును కావు. కళేబరమువలె నీవు నశియింపవు. నీకెక్కడను భీతిహేతువు లేనేలేదు. అంతటను నిల్చియుండునది నీవే, నశించునది నీకు సంబంధము లేనిదే యనిన రాజిట్లనియె.

శుకమహర్షీ! నిర్హేతుకజాయమానకరుణాకటాక్షుండవై దైవానుగ్రహమున సమయమున కరు ణించి తత్త్వ ముపదేశించి మహోపకార మొనర్చితివి. నా సంశయము లన్నియు నిర్మూలములైనవి. యథార్థము గ్రహించితి. శరీరమును విడుచుట కనుజ్ఞనిమ్ము. అనిన శుకమహర్షి వానికనుజ్ఞ నొసంగి మహర్షులు తోడరా యథేచ్ఛం జనియె.

పరీక్షిన్మహారాజును బుద్ధిచేత మనమును నాత్మయందు జొనిపి ప్రాఙ్ముఖంబులైన బర్హిస్సుల గంగాతీరమున నుదఙ్ముఖుండై కూరుచుండి సంగదూరుఁడును నసంశయుండునై బ్రహ్మభూతుఁడయ్యెను.

ఇట్లు సూతుఁడు శౌనకాది మహర్షులకుఁ బరమపవిత్రమగు నీ భాగవత తత్త్వసంహితం బ్రబో ధించె. వారును పరమానందమున నా సూతమహర్షికిఁ గృతజ్ఞతాపూర్వకాభివందనంబు లర్పించి శ్రీమద్భాగవత శ్రవణంబున భగవత్తత్త్వమును గ్రహించి యాచరించి యనుభవించి తరించిరి.

ఓంతత్సత్.



కీ॥ శే॥ శ్రీ మంచెం కొండయ్య, లక్ష్మీనరసమాంబలు.

భూస్వాములు (మత్స్యపురి)

శ్రీని స్వవశ్యఁగా మెలఁగఁజేసినయట్టి పురాణపూరుషుం
డైన విభుండు కృష్ణపరమాత్మ నిరంతర మాత్మశాంతినిన్
దా ననుకంపతో నొసఁగుతన్ త్రిదివంగతులైనయట్టి ల
క్ష్మీనరసాంబికామణికి శ్రీయుత కొండయ భూమిజానికిన్.

# ప్ర శం స.

ఏత దాంధ్రభాగవత పంచమ సంపుట ప్రకటనమునకు ధనసహాయకులగు

## శ్రీ మంచెంవారి వంశానుక్రమణిక.

సీ. శ్రీశుభ భారత దేశంబునందుఁ బ్ర, ఖ్యాతివహించిన యాంధ్రసీమఁ
గోమరొప్పు పశ్చిమ గోదావరీమండ, లమున సస్యశ్యామలమయి వాసిఁ
గను మత్స్యపురిఁ దేల గావర్ణమునకు న, లంకారమయ్యె మంచెం కులంబు
ప్రథితసింహాసనార్థ ప్రతిపాదక, మై మంచెనామ మన్వర్థ మయ్యె
గీ. నందుఁగలశాంబురాశిఁ బూర్ణేందుఁడువలెఁ, బ్రభవమయ్యెను రెడ్డియ్య ప్రభువరుండు
సరగ రెడ్డిపదంబు రాట్ఛబ్దభవము, కాన నది యాతనికి సార్థకతఁ జెలంగె. 1

క. ఆ రెడ్డియ ధీమణికిన్, భూరమ పులఖండవంశ ముక్తాఫలమా
నారీమణి సుబ్బమ దే, వేరిగ నయ్యెన్ గులాభివృద్ధికిఁ దోడై. 2

క. నయశాలులైన యా రె, డ్డియ సుబ్బమ్మలకు ధీపటిష్ఠులు కొండ
య్యయు వెంకటరామయ్యయు, స్మయదూరు లొదవిరి సూర్యచంద్రసదృశులై. 3

ఉ. వారలలోన జ్యేష్ఠుఁడయి భాసిలు కొండయ భూధవుండు దా
మేరుసమానధీరుఁడయి మించుట సార్థకనామధేయుఁడై
ధారుణి వన్నెకెక్కె సముదాత్తమతిన్ సరివారిలోపలన్
బేరుబ్రతిష్ఠలంబడసెఁ బేదలపాలిటి పెన్నిధానమై. 4

ఉ. ఆ నుతకీర్తి కొండయధరాధిపవర్యుని కీర్తిహంసి తా
దానముఁ ద్యాగమన్ దన పతత్రములన్ దనుపారవిప్పి యొం
దేనియు నడ్డులేకయ మహీవలయం బదియెల్లఁ గ్రుమ్మరున్
దీనుల మానసంబులను నెయ్యముఁ దియ్యముఁ గా మెలంగుచున్. 5

క. కొండయధాత్రీపతి పుల, ఖండకులోద్భూతయైన కాంతాజనస
న్మండన లక్ష్మీనరసమఁ, బెండిలి యయ్యెన్ మహేంద్రవిభవముతోడన్. 6

మ. పులఖండాఖ్య విశిష్టవంశకలశాంభోరాశి శ్రీదేవియుం
బలెనై దాఁ బురుషోత్తమస్ఫురణ విభ్రాజిల్లు కొండయ్య భూ
తలనాథున్ దగఁ జెట్టఁబట్టి ప్రజ కాదర్శోరుదాంపత్య రే
ఖల లక్ష్మీనరసాంబ చాటఁగలిగెన్ గాంతాశిరోరత్నమై. 7

మ. పులఖండాహ్వాయభూరివంశవిభవంబున్ జెప్పఁగా నేలఁ ద
త్పులఖండాఖ్యయె తెల్పుచున్నయది గాఁ బొల్పారఁ దన్మాధురీ
కలనన్ మల్లవరంబునాఁ జను నభిఖ్యం బొల్చు గ్రామంబునన్
గల రీ వంశము వార లర్థిజనతాకల్పావనీజాభులై. 8

ఉ. ఆ యనురూపపత్ని యనయంబును నాథుమనం బెఱుంగుచున్
ఛాయక్రియన్ సదా యడుగుజాడలఁ బట్టి మెలంగు చర్చలన్
జేయుచు గేహసీమ నలశ్రీయునుబోలెఁ జరించుచున్ విధుం
బాయని జ్యోత్స్నవోలె నిజభర్తృపరాయణయై చెలంగెడున్. 9

సీ. ఆదిదంపతులైన శ్రీదేవి నారాయ, ణుండును బోలె గణ్యులగు నాప్ర
సిద్ధదంపతులు లక్ష్మీనరసాంబికా, కొండయ్యభూపులకుం గుమార
రత్నంబులగుచు శ్రీరాములు వెంకట, రామయ్య సత్యనారాయ ణాభి
ధేయులు విబుధవిధేయులు ఘనభాగ, ధేయులు శుభసంప్రదాయులు ముగు
గీ. రొప్పిరిత్రిమూర్తులుంబోలెననుచితవర్త, నములఁ జరియించుచుండా మెతమకుసాటి
యనఁగ సర్వంకషప్రజ్ఞలగుచు దైవ, భక్తియుం బాపభీతి భావములఁ దనర. 10

సీ. మఱియు నాపుణ్యదంపతులకుఁ బొడమిరి, మాణిక్యమును శేషమాంబికయును
సాధ్వి మాణిక్యాంబచల్లాలమయు నను, నలువురు సుతలు సౌందర్యయుతలు
అందు మాణిక్య మింపొంద వగ్వాల సీ, తారామయార్యునిదార యయ్యె
శేషమ్మ నూకలశ్రీరాములను మహా, భాగధేయునకునుభార్యయయ్యె
గీ. అల తృతీయ మాణిక్యాంబయతివ యగుచు, నెనఁగె నూకల గోపాలకృష్ణమూర్తి
సుకృతి కవల నల్లం సోమసుందరమను, ధీయుతునకుఁ జల్లాలమ్మజాయ యయ్యె.

క. తమ తమ భర్తలతో నీ, యమ లత్యంతమగు భక్తియలరఁగ సర్వో
త్తమమగు రీతిం బరఁగిరి, తమ కాపురములు సదాఽభ్యుదయముం జెందన్. 12

గీ. పుత్ర పౌత్ర పరంప రాభ్యుదయ మెసఁగ, సిరియు సంపదతులఁ దూఁగ నిరుపమాన
వైభవంబులతోడ నివ్వారి శుభకు, టుంబము లపార కీర్తి భాగ్యంబు వడసె. 13

సీ. కొండయార్యునిపెద్దకొడుకు శ్రీరాముల, కును భద్రకాళ్యాఖ్యవనితయందుఁ
గలిగిరి సుతులు వెంకటరెడ్డినాయుడు, పాండురంగవిఠల్ శుభాఖ్యులిరువు
రలవేలుమంగతాయారు వెంకటసుబ్బ, మయు నన్నపూర్ణనామ వరలక్ష్మి
యనియెడు దుహితలునవద్యచరితలు, నలువురు పొడమిరి చెలువుమీఱ
గీ. ననఘుఁడైన వెంకటరామయాహ్వాయువల, సం జనించిరి ధర్మా గణపతిరావు
నాపయిని సత్యసింహాద్రియప్పరావు, కొండయయు మహాలక్ష్మికింగొమరులగుచు.

క. హేలగ వెంకటరామ మ, హాలక్ష్ములకు నుద్భవించి రాత్మజులై ర్ఘూ
న్నీలలక్ష్మిభాయియు శం, పాలతకెన లిందుమతియు సమంగా యమయున్. 15

సీ. ధీయుత సత్యనారాయణమూర్తికి, ల్లాలనం దగు రామలక్ష్మియందు
నిరువు రొదవిరి నాగేశ్వరరావును, వెంకటేశ్వరరావు ప్రియతనయులు
మఱి మహిషాసురమర్దని యువల శ, చీదేవి పిదప లక్ష్మీనరసమ
యనుసంజ్ఞలం జెలంగు తనూగుం గూతుంద్రను, ముప్వురం బడసె ను ముదముం దనర
గీ. సంతియే కాక సమ్మోదమలర మూడు, భాగవతకృతికన్య సౌభాగ్యమునకు
దోహదంబు నొసంగుచుం దోడ్పడంగ, నయ్యె నీసత్యనారాయణాహ్వయుండె. 16

సీ. కొండయార్యుని సోదరుండగు వెంకట, రామయాఖ్యుని భార్య రత్తమాంబ
యా దంపతులకు నారాయణమూర్తి పు, త్రకుం డాతనికి సుభద్రమ్మయందు
శ్రీయుతుండైన కాశీవిశ్వనాథము, సత్యనారాయణసంజ్ఞికుండు
హితమతి గోపాలకృష్ణమూర్తియును వెంకయ్యనాయుడు నన నలువురు
గీ. పుత్రు లొదవిరి మఱి యన్నపూర్ణయనియు
సారిది వరలక్ష్మియనియును సుతలిరువురు
ప్రభవమంది రా పుణ్యదంపతుల కిల్లె
వీరలకుటుంబము నిత్యాభివృద్ధిం గాంచు. 17

సీ. ఘనుండు కొండయ యశోధనుండు స్వబుద్ధిబ, లమున నాస్తిని సమృద్ధముగం జేసి
హూణశకంబున నొదవు పందొమ్మిది, వందలపైని ముప్పదియయిదవ
యేటను జనవరిమూంట నాస్తిని సమ, భాగముల్ రెండుగాం బంచి సోద
రాత్మజుండైన నారాయణమూర్తికి, నందొక భాగంబు నమర నొసంగి
గీ. తక్కుంగలభాగమందును దనదు జ్యేష్ఠ, పుత్రుండైన శ్రీరాములన్ బొసంగ యాజ
మాన్యమున నిల్పి నిస్పృహామానసుండయి, జీవితంబును గడపె నిశ్చింతుండగుచు.

శా. దేవబ్రాహ్మణభక్త్యుదారుండు పరస్త్రీవిత్తదూరుండు స
ద్భావుం డాశ్రితవత్సలుం డకుటిలవ్యాపార సక్తుండు భా
వావేశోద్గత సమ్మదాశ్రులు బురాణాకర్ణనంబుం దమిన్
గావింపంగం గడంగు పుణ్యమతి యెన్నం గొండయార్యుం డిలన్. 19

ఉ. ఈ మెయి నార్యకొండయ మహీరమణోత్తము వంగడంబు పె
న్దామరతంపరై బహువిధంబుల నభ్యుదయంబులొంది సు
త్రామసమానవైభవనిరంతరసౌఖ్యములందుచుండి శ్రీ
రాము ననుగ్రహంబునం బరంపరగాం బెనుపొందుం గావుతన్. 20

మ. తనకంటెన్ దన తమ్మునం దధిక వాఽత్సల్యంబు దీపింపఁగన్
జనవొప్పన్ దన కన్న నందనులకఽన్నన్ మిన్నగా భ్రాతృ నం
దనులన్ యోగక్షేమమారయుచు నఽత్యానందముం గూర్చు చి
ట్లనుకూలుండయి కొండయార్యుఁడు నిజౌఽదార్యంబుఁ జాటెన్ భువిన్. 21

మ. వ్రితియుంబోలెను నీళ్ళఁగొట్టిన పవిఽత్రంబైన చెంగావి ధో
వతులన్ బ్రత్యహమున్ ధరించు నియతింఽబాటించు ధన్యాత్ముఁ డ
ర్థితతిన్ గాదన కిచ్చివేపనుచు సుఽశ్రీలుం డుదారుండు వా
గ్యతుఁ డీ కొండయభూపుఁ డొప్పెను బురాఽణాకర్ణనోత్కంఠుఁడై. 22

ఉ. కొండయభూపుఁడుం బసిడిఽకొండక్రియన్ మన యండనుండ వే
ఱొండొక చింత డెందములఽనుండఁగ నేలిఁకఁ జాలు మాకటం
చుండుదు రెడ్డ నాఫురినిఽనున్న జనంబులు హృష్టచిత్తులై
యండజవాహుదండ నలఽరారెడు వేల్పులపిండు కైవడిన్. 23

సీ. పట్టినయదియెల్లఽబంగారమగుచునిక్క, ఋజురీతి విత్తమాఽర్జింపఁగల్గె
సలిపినయదియెల్లఽసత్కార్యమగుచునిక్కఁ, బ్రజలమన్ననలనుఽబడయఁగల్గె
నాడినయదియెల్లఽనతిప్రియంబగుచునిక్క, సార్వజనీనతఁఽజరగఁగల్గె
నడచినయదియెల్లఽన్యాయపథంబౌట, నెల్లవారలఁ దనిఽయింపఁగల్గె
గీ. కొండయమహీపునకు నధిఽకుండు సముఁ డొ
కండు నుండఁ డటం చటంఽగల జనములు
దన్నుఁ గొండాడుచుండ నాఽతండు క్షోణి
మండలాఖండలుండనఽదండి నుండె. 24

సీ. సలిపె మజ్జనవిధిఽజన్మసఫలముగ, గంగాదిపుణ్యాపఽగాజలముల
నెఱపె సాధువులకున్ఽవిభవానుసారంబు, దానధర్మములు యఽథావిధిగను
దర్శించె నాత్మపూఽతముగాఁగ వారాణ, సీముఖ్య పుణ్యా సుఽక్షేత్రములను
భజియించె సద్భక్తిఽపరతను భగవంతు, నేమఱకుండఁ దాఽనెల్లప్రొద్దు
గీ. పొచ్చ మొక్కింతయును లేకఽపుత్ర పౌత్ర
దుహితృ దౌహిత్ర యుక్తుఁడైఽతొంబదేండ్ల
జీవితము సుఖాంతమ్ముగఁఽజేసికొనియె
భవ్యచరితుండు కొండయఽపార్థివుండు. 25

ఉ. ఇంబగు భాగధేయమునఽహెచ్చుసిరుల్ గలుగంగఁ దాన లే
శం బవలేపముంగొనకఽసార్వజనీనత నొప్పుచున్ నిరా

డంబరవృత్తి భక్తిపరుఁడై భగవంతుని బూజఁ జేయుచున్
దొంబదియేండ్ల జీవితమునుం గడపెన్ ఘన కొండయార్యుఁడున్. 26

చ. క్షితిని సహస్రమాసములు జీవితుఁడైన యదృష్టశాలి పు
ణ్యాతముఁడటంచు వాకొనుదు రార్యులు శ్రీయుతకొండయక్షమా
పతి యితఁ డంతకెక్కుడగు వత్సరముల్ నుతిభాజనంబుగా
బ్రతికెనుగాన నీ సునయవంతుని జన్మము ధన్య మన్నిటన్. 27

చ. ఘనుఁ డితఁ డంత్యకాలమున గాయము వీడఁగ నుత్తరాయణం
బునకయి వేచియుండియును బోల్పఁగ నయ్యాదిరాకమున్న యీ
తనువుఁ ద్యజించె నీ సుకృతధాముఁడు శ్రీయుతరంగధామునిన్
గనుటను సద్గతింబడయఁ గాలముతోఁ బనిలేకపోయెనో. 28

మ. అలఘుప్రాభవుఁడైన కొండయవిభుం డాసక్తిమై మేదినీ
స్థలి సత్పుణ్యములైన క్షేత్రముల సందర్శించునప్డేని ని
చ్చలు దేవాయతనాదిదర్శనసముత్సాహంబె తక్కన్యమున్
దలఁపం డెంతటిమేలికట్టడములేన్ దర్శింప నొల్లం డెదన్. 29

ఉ. ప్రాణవిభుండు తన్ను నెడబాసిచనంగ వియోగజవ్యథన్
బూని భరింపలేక వెసఁ బోయి పతిం గలయంగఁ గోరె నాన్
దాను ద్వితీయమాసికము నాఁడె శరీరము నుజ్జగించె ల
క్ష్మీనరసాంబ తత్సతి క్రమింతురె భర్తృవియోగమున్ సతుల్? 30

సీ. శ్రీయుత మత్స్యపురిని వాసిగన్న మం, చెం వంగడమునఁ బ్రసిద్ధుఁడైన
కొండయ్య భూమిపాలుండు తత్పత్ని ల, క్ష్మీనరసమ యుదంచితచరితులు
రాణఁ దత్సుతులు శ్రీరాములు వెంకట, రామయ్య సత్యనారాయణాఖ్యు
లమలయశఃకాయులగు తమ జననీజ, నకుల యందలి భక్తిఁ బ్రకటితైత
గీ. దాంధ్ర భాగవతపురాణమందుఁ దుదను, బొదలు పంచమసంపుటముద్రణమున
ద్రవ్య సాహాయ్య మొసఁగిరి దాన నాత్మ, శాంతిగల్గుత నీపుణ్యజంపతులకు. 31

ఉ. శ్రీని స్వవశ్యఁగా మెలఁగ జేసినయట్టి పురాణపూరుషుం
డైన విభుండు కృష్ణపరమాత్మ నిరంతర మాత్మశాంతినిన్
దా ననుకంపతో నొసఁగుతన్ ద్రిదివంగతులైనయట్టి ల
క్ష్మీనరసాంబికామణికి శ్రీయుత కొండయ భూమిజానికిన్. 32

# విషయసూచిక

## ఏకాదశ స్కంధము

| అధ్యాయము. | విషయము. | పుట. |
|---|---|---|
| 1 | యదువంశ సంక్షయకారణ మునిశాపము | 1 |
| 2 | నారదకృత విదేహార్షభ సంవాదము | 3 |
| 3 | ఋషభకుమార ప్రోక్త భాగవతార్థప్రశంస | 9 |
| 4 | భగవదవతార సంగ్రహాభివర్ణనము | 13 |
| 5 | విష్ణుపూజావిధాన వర్ణనము | 16 |
| 6 | శ్రీకృష్ణ వైకుంఠ ప్రయాణ సన్నాహము | 20 |
| 7 | భగవద్గీత: అవధూత యదు సంవాదము (కపోతోపాఖ్యానము) | 25 |
| 8 | పింగళోపాఖ్యానము | 31 |
| 9 | కురరాది శిక్షితాభివర్ణనము | 34 |
| 10 | ఆత్మతత్త్వప్రాప్తి సాధనకథనము | 37 |
| 11 | బద్ధ ముక్త లక్షణాభివర్ణనము | 40 |
| 12 | సాధుసంగ మాభివర్ణనము | 44 |
| 13 | హంసేతిహాసము | 46 |
| 14 | ధ్యాన యోగము | 50 |
| 15 | అణిమా ద్యష్టసిద్ధి వర్ణనము | 54 |
| 16 | శ్రీమన్నారాయణవిభూ త్యభివర్ణనము | 56 |
| 17 | బ్రహ్మచారి గృహస్థ ధర్మ ప్రతిపాదనము | 59 |
| 18 | వానప్రస్థాశ్రమ ధర్మ ప్రవచనము | 63 |
| 19 | జ్ఞానస్వరూ పాభివర్ణనము | 67 |
| 20 | భక్తి జ్ఞాన క్రియాత్మక యోగ స్వరూపాభివర్ణనము | 71 |
| 21 | గుణ దోష వ్యవస్థ | 74 |
| 22 | తత్త్వ సంఖ్యానము | 76 |
| 23 | భిక్షుగీత | 81 |
| 24 | మనోమోహ నివృత్తి | 86 |
| 25 | చిత్తప్రభవ గుణవృ త్త్యభివర్ణనము | 88 |
| 26 | ఐళగీతా ద్యభివర్ణనము | 91 |
| 27 | క్రియా యోగ సంక్షేపము | 94 |
| 28 | జ్ఞానయోగ సంక్షేపము | 98 |
| 29 | భక్తియోగ సంక్షేపము | 102 |
| 30 | యదువంశ నాశనము | 106 |
| 31 | శ్రీకృష్ణ నిర్యా ణాభివర్ణనము | 111 |

## ద్వాదశ స్కంధము



గ్రంథకర్తలు.

"కోమలవాగ్విలాసములఁ గోటి వరా లెగఁబోయుచున్న శ్రీ
రామ నృసింహ మూర్తులు చిరస్మరణీయులు విశ్వకావ్య గీ
తామృత సార సంస్కృతి సమన్విత భాగవతంబు వ్యాస వా
ణీమణి మొక్కవోనికరణిన్ రచియించిరి తెన్గు బాసలోన్"

(వేదాంతకవి)




I have the pleasure to enrol Sri. Gandham Sreeramamurty and Sri. Irrinki Narasimhamurty who are popularly known as " Sreerama Narasimha Murty Kavulu " as our Court Poets. Hereafter they are entitled to the privileges of our Court.

Gadwal,
1-3-1945.

Youvaraja Saheb of Gadwal.
( For Maharani Saheba of Gadwal )

శ్రీరస్తు.

శ్రీ రామకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్రభాగవతము

శ్రీరామ నృసింహమూర్తి కవులు:—

## నివేదనము

ఉత్పలమాలిక.



మదఖండరూప! చిదచిన్మయ దివ్యకథాకలాప! బో
ధామృత! రామకృష్ణ పరమాత్మ! విరించిముఖామరావళుల్
నీ మహితప్రభావములు నేర రెఱుంగ నటన్న నింక నె
ట్లే మెఱుఁగంగ నేర్తు మఖిలేశ్వర! నీ యనుశాసనంబునన్
వ్యోమము వాయు వగ్ని జలము న్నభమున్ మునుగాఁగ సర్వమున్
దాము మెలంగునె ప్డవశ్యతం దమ కార్యకలాపకంబులన్
దామరసోద్భవుండు మును దావక నాభిహ్రదంబునందుఁ దా
నామెయి నుద్భవించి భువనాళి సృజింప నశక్తుఁడై భవ
త్కోమలపాదపద్మములకుం బ్రణమిల్లి తపంబునల్పి కా
దే మిమ్ములం గృతార్థత వహించె నహేతుకసత్కృపాస్వభా
వా! మహనీయులైన మఱి యల్పులెయైనను ద్వత్ప్రసాదల
క్ష్మీమహితోరుభాగ్యమును జెందిన నెంతటి కార్యమేనియున్
దా మొనరింపఁగా నధిక దక్షులుఁగాపుట కబ్బురంబె! నీ
నామము సంస్మరించిన జనంబు సభాజనభాజనంబుగా
దే? మునిగేయ! "త్వత్పదవిధేయులు సంచితభాగధేయులున్
ధీమహనీయులున్ సదుపదేశగరీయులు" నాఁగఁ జెల్లు శ్రీ
రామ నృసింహ మూర్తికవులన్ మముఁ దావక నిర్ణిమిత్తని
స్సీమకృపాప్రపూరపరిషించిత దివ్యకటాక్షపాత్రులం
గా ముదమొప్పఁజేసి యధికంబగు ప్రీతిని నాదరింపఁగా
నేము భవత్ప్రసాదమహిమేద్యులమై విబుధప్రకాండము
ఖ్యామణులెల్ల నాత్మల సతంబు ముదంబును జెంది సన్నుతుల్
వేమఱుఁ జేయుచుండ నతివిశ్రుతశక్తిని సంస్కృతాంధ్రభా
షామహిళాలలామలకు స్వర్ణమయాభరణంబులట్టు లి
మ్మై మృదుభావగుంఫిత సుమప్రతిమాన సుహృద్య పద్య గ

ద్యామలినాచ్ఛగుచ్ఛనిచయాత్తపరీమళలుబ్ధపండితా
ళీమధుపంబులై యమృతలేపసమాన సుమాననీయ శ
య్యామహితప్రసాదగుణాత్యభిరామములై రసాచితీ
స్థేమములై రసజ్ఞజనచిత్తవశీకరణప్రవృత్తిఁ బెన్
దీమములై సముత్సుకసుధీవరఘృష్టవిహారమాధవా
రామములై రసప్రసృమరశ్రవణోత్సవదాయిసత్కళో
ద్దామములై చెలంగ సముదంచితరీతుల గ్రంథమాలికా
స్తోమములన్ రచించితిమి సొంపుగ నున్నతపాఠశాలలం
దేమియుఁ బ్రాలుమాలిక వహింపక యొజ్జలమై పరంగి వి
శ్రామదినంబులైన దినరాజశనైశ్చరవాసరంబులన్
నీ మహితానుకంపమెయి నేము గృహాదికకృత్యజాత మె
ట్లో మఱి నిర్వహించుకొను చొద్దిక నీకుఁ బ్రియంబుగాఁగ భా
షామితసేవఁ జేయుటకునై యనిశంబును మాదు యత్నముల్
మా మనముల్ ప్రశస్తమగు మా ప్రియజీవిత సన్నివేశముల్
మా మృదుసూక్తిరీతులు సమస్తముఁ గూడ నివేదనంబుఁగా
నీమెయిఁ జేయుచుంటి మిదియెల్ల సహేతుకజాయమానన
వ్యామృతతుల్యతావక కృపార్ద్రకటాక్షనిరీక్షనైన యు
ద్దామఫలంబుగాఁగ నెడదం బరికింతు మ దల్లికానిచో
ధీమణి మిత్రసూనుఁడు సుధీవరుఁడౌ విదురుండు కోవిద
గ్రామణి యుద్ధవుండు మునుగాఁగల భాగవతోత్తముల్ లసత్
ప్రేమరసైకసారమయి వెల్గుచు శాశ్వతరూపనిర్వృతి
శ్రీమహనీయమై ప్రణుతిఁ జెందిన దేవునిగొల్చి తారు ని
ష్కామపరత్వమొప్పనఁగఁ గన్న ముక్తిపదంబుఁ గాంచి రా
కామదుఘంబుఁ బావన మఘఘ్నము వ్యాసమునిప్రణీతమున్
బామరతాపనోదకము భాగవతాఖ్య పురాణరాజమున్
క్షేమకరంబుఁగాఁగఁ దెనిఁగింపఁగఁ జేసితి దల్పకార్యమే?
యే మిఁక నీ మహోపకృతి కేమి బహూకృతి సేయనేర్తు మ
య్యా! మనసారఁ గూర్చిన కరాంజలి యొక్కఁడు దక్క గాన దే
వా! మము నిం కితో ఽధిక శుభాభ్యుదయాఢ్యులఁ జేసి సంతతం
బోము దయామయుండవయి యొప్పెడు నీకు నివే నమస్కృతుల్.

———

శ్రీరస్తు.

శ్రీరామకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్రభాగవతము

## ఏకాదశ స్కంధము

### అధ్యాయము 1.

—యదువంశ సంక్షయకారణ మునిశాపము—

శ్రీశుకుఁడు:—

క. ముసలిసహితుండు గృష్ణుం, డసురతతిం బిల్కుమార్చి ఽ యదుపరివృతుఁడై
వసుధాభారముడించె ర,భసయుతమగు కలహమ్ముల్లు ఽ పరఁగించి నృపా! 1

ఉ. క్ష్మాపతి! ద్యూత హేళన కఽచగ్రహణాదుల శత్రుకోటిచేఁ
గోపితులైన పాండునృప ఽ కుంజరసూనులు కారణంబుగాఁ
బ్రాపయి యేపుఁదోఁప నిరుఽవాగులయందును జేరికొన్న ధా
త్రీపులనెల్ల జక్కడఁచి ఽ దించెఁ బరేశుఁడు భూమి భారమున్. 2

మ. వనజాక్షుండు స్వబాహుగోపితయదుఽవ్రాతంబుచే సర్వకుం
భినికిన్ బ్రేగగు రాజసైన్యములఁ బ్రేర్మిన్ రూపఱంజేసి యా
త్మ నిటుల్ భావనఁజేసె భూభర మపాఽస్తంబయ్యెఁ గానట్లె యెం
తు నహో! దుర్దమయాదవాన్వయ మిఁకన్ ఽ దుర్ధర్షమై యుండుటన్. 3

మ. మదవిస్ఫూర్జితమున్ మహావిభవమున్ ఽ మత్సంశ్రయంబైన యీ
యదువంశంబున కొడ్లచేఁ బరిభవం ఽ బావంతయున్ గల్గ నో
ప దటుల్ గావున వేణుకాననమునన్ ఽ వహ్నింబలెన్ లోని పో
రొదవంజేసి హరించి స్వీయపద మే ఽ నొయ్యన్ బ్రవేశించెదన్. 4

గీ. అనియిటుల్గృతనిశ్చయుఁడై నరేంద్ర!, సత్యసంకల్పుఁడైన యీఽశ్వరుఁడు శౌరి
యంత మునిశాపమని యెడిఽవ్యాజమునను,స్వకులమును లీలమై నుపఽసంహరించె. 5

సీ. భువనమోహనమయిఽపొల్చు స్వమూర్తిచే, నెమ్మిఁగాంచు నరులఽనేత్రములను
నమృతవాక్కులచేత ఽ ననిశంబు వానిన, స్మరియించునవ్వారి ఽ మానసములఁ

బదచిహ్నములచేత ƒ వానిన యనురక్తిఁ,గనుగొనువారల ƒ కర్మములను
దనదిక్కునకునాచిƒకొని మేదినీస్థలిన్, సుశ్లోకమైన యƒశోవిభూతి
గీ. దెసదెసలఁ బర్వఁజేసి తƒత్కీర్తివిభవ, గాన మహిమంబుచేత జƒగానజనులు
తమముఁదరియింపఁగలరనిƒతలఁచిలోక,విభుఁడు కృష్ణుండుదాఁజేరెƒస్వీయపదము.

రాజు:—

క. దాతలు బ్రహ్మణ్యులు హరి, చేతస్కులు వృద్ధలోకƒసేవులును సువి
ఖ్యాతులునగు వృష్ణులకె, ట్లాతెఱఁగగు మౌనిశాపƒమయ్యెఁ దెలుపుమా. 7

క. యతివర! యాశాపమునకు, గతమెయ్యది? యేవిధంబు ƒ గలదది తలఁపన్
సత మేకబుద్ధులకు నే, గతి భేదముపుట్టెఁ జెప్పఁƒగదె? యదియెల్లన్. 8

శ్రీశుకుఁడు:—

ఉ. అందముకూర్పునెల్లఁగల ƒ యాకృతిధాలిచి లబ్ధకాముఁడ
య్యుం దగ మేదినిన్ హరి శుƒభోదయకర్మము లాచరించుచున్
పొందుగ గేహవాసమును ƒ బూని యశోభిరుచిన్ జరించుచున్
మ్రిందఁగఁజేయనెంచెను ధƒరాభరశేషము వో స్వవంశమున్. 9

చ. సుకృతవిధాయకంబు లతిƒశోభనముల్ సుమనోజ్ఞముల్ త్రిలో
కకలిమలాపహంబులగు ƒ కర్మములం బొనరించి కాలహా
పకుఁడయి వైభవంబునెఱƒపన్ వసుదేవునిలోఁగిటన్ వసిం
చు కమలనాభుప్రేరణను ƒ జొచ్చిరి మౌనులు ద్వారకాపురిన్. 10

వ. ఇట్లు ద్వారకానగరసమీపస్థ పిండారకక్షేత్రంబున విశ్వామిత్రాసిత కణ్వ
దుర్వాసో భృగ్వంగిరః కాశ్యప వామదేవాత్రి వసిష్ఠ నారదాదులగు మహా
ర్షులు విచ్చేసియుండ— 11

మ. ధరణీశా! యట నాటలాడు యదుపుƒత్రశ్రేణు లమ్మానులన్
దరియంగాఁజని ధూర్తులయ్యు సువినీƒతత్వంబు దోపన్ మద
స్ఫురణన్ జాంబవతీతనూభవుని సాంƒబున్ మానినీవేషభా
సురుఁ జూపించి వచించి రీపగిది నƒచ్చో దుర్విధిప్రేరణన్. 12

శా. చూలా లీకమలాయతాక్షి వినరే ƒ క్షోణీసురశ్రేష్ఠులా
రా! లజ్జన్ వహియించి మానుఖమునం ƒ బ్రశ్నించెడిన్ మిమ్ము నిం
కేలా? పెక్కు లమోఘదర్శనులు మీƒరీలేమ దా నీపయిన్
బాలుం గాంచునొ? బాలికం గనునొ? సుƒవ్యక్తంబు గావింపుఁడీ. 13

క. అనియిట్టు లపహసితులయి, మును లయ్యదుసుతులఁ గ్రోధƒమునఁబల్కిరిటుల్
వినుఁడిట యుష్మత్కులనా, శవమగు ముసలమ్ము పుట్టు ƒ జడమతులారా! 14

తరల. యదుకుమారులు విప్రశాపము నాలకించి భయం బెదన్
గదురఁ జయ్యన సాంబు కృత్రిమగర్భమున్ సడలించి య
య్యుదరమధ్య విలీనమైన యయోమయంబును విస్మయ
ప్రదమునా ముసలమ్ముఁగాంచిరి భారతాన్వయవర్ధనా! 15

గీ. "అక్కటా! మందభాగ్యులమైన మేము, సల్పినదియేమి? యేమంద్రు జనులుమమ్ము"
ననుచు భయవిహ్వలాత్ములై యదుతనయులు, ముసలముంగొని మందిరంబు
లకుఁ జనిరి. 16

క. మ్లానముఖులగుచు వార, ద్దానిని గొల్వునకుఁ దెచ్చి దాపక ధాత్రీ
జానికిని నివేదించిరి, వైనముగా సర్వయాదవ సమక్షమునన్. 17

ఆ. విని యమోఘమైన మునివర శాపంబు, గని యయోమయమగు ఘనముసలము
విస్మయంబు భయము పెనఁగొన ద్వారకా, వాసులెల్ల దుఃఖభరితులైరి. 18

వ. ఆ యవసరంబున— 19

క. ఒడయఁడగు నుగ్రసేనుఁడు, పొడిగాఁ జేయించి ముసలముం బొంకం జే
ర్పడఁగ నవశిష్టలోహము, కడలిం బడవైవఁ జేసెఁ గౌరవముఖ్యా! 20

క. ఒకమత్స్యం బా లోహపు, శకలంబున్ మ్రింగె మఱియు జలనిధి పృథుపీ
చికలన్ వహియింపంబడి, సకలము చూర్ణంబు దరిని సక్తంబయ్యెన్. 21

క. మైనికులు పట్టికొని ర, మ్మీనంబును జలధి నన్యమీనంబులతోన్
దాని కడుపులో లోహముఁ, బూనిచె బాణాగ్రమునను బోయఁడొకఁడటన్. 22

క. భగవంతుఁడు హరిసర్వో, పగతుండు సమర్థుఁడయ్యు బ్రాహ్మణశాపం
బు గడపనిచ్ఛగింపక, యగణితకాలస్వరూపుఁ డగుట నొడఁబడెన్. 23

---

## అధ్యాయము 2.

—నారదకృత విదేహర్షభ సంవాదము—

శ్రీశుకుఁడు:—

క. శ్రీరమణ బాహుగుప్త, ద్వారవతీపురమునందు వసియించెను కృ
ష్ణారాధనతత్పరుఁడయి, నారదముని కొన్నినాళ్లు నరనాథమణీ! 24

ఉ. ఎల్లెడ మిత్తిచుట్టుకొన నింద్రియవంతుఁడెవండు దేవతా
వల్లభపర్యుపాస్యమగు పద్మదళాయతనేత్రు దివ్యప
త్పల్లవమున్ సమగ్రమగు భక్తి భజింపకయుండు? నిత్యమున్
గల్లగు సంసృతిన్ గడపఁగాఁ దగినట్టి విధంబదే కదా. 25

గీ. ఓ నృపోత్తమ! వసుదేవుఁడొక్కనాఁడు, తన గృహంబున కేఁగుదెంచిన సురర్షిఁ
బ్రీతి నర్చించియు సుఖోపవిష్టుఁ జేసి, యెలమి నభివాదములొనర్చి యిట్టులనియె.

వసుదేవుఁడు:—

గీ. తల్లిదండ్రులరాక తత్సంతతికిని, బుణ్యచరితులరాక కార్పణ్యయుతుల
కెట్టు లట్లు భవద్యాత్రయెల్ల దేహి, తతికి శుభమునకగుఁ జూవె తాపసేంద్ర! 27

గీ. భూతసంఘాతమునకు వేల్పులచరితలు, సుఖమునకు దుఃఖమునకు నోసుర మునీంద్ర!
హరిపరాయణులైన మీయట్టివారి, చరిత లగుచుండుఁ గేవలసౌఖ్యమునకు. 28

గీ. ఎవరెటుల్ దేవతల భజియింత్రో వారు, నట్లె వారికిఁ గర్మసహాయులగుచు
నోలి నాయాయి ఫలములనొసఁగుచుంద్రు, సాధుజనులన్న దీనవత్సలులుగారె!

చ. అమలులమైతి మేము భవదాగమనంబున నైననున్ బుధో
త్తమ! భవదీయ భాగవత ధర్మములం దెలుపంగఁ గోరుచుం
టిమి తగవాని నాదృతి ఘటిల్లఁగ మానవుఁడాలకించి పే
రిమి నకుతోభయుండగుచు శ్రేయము పొందునుగాదె యెంతయున్. 30

గీ. ఏ నపత్యార్థమై పరమేశు ముక్తి, సిద్ధిదున్ భక్తిఁ బూజఁజేసితిని దొల్లి
దైవమాయావిమోహితాత్మకుఁడనగుట, మోక్షమునుగోరనైతిని మునివతంస!

గీ. వింతలగు వ్యసనంబు లనంతములుగ, సర్వతోభయమయినట్టి సంసరణము
నందునుండి విముక్తులమగుదుమెట్టు, లట్టిమార్గంబు శాసింపుమయ్య మాకు. 32

శ్రీశుకుఁడు:—

క. భూవర! ధీయుతుఁడగు వసు, దేవుఁడు తన్నిట్టులడుగ ధీరాత్ముండై
దేవర్షి పల్కె నతనికి, శ్రీవిభుగుణగణము సంస్మరింపుచు మదిలోన్. 33

నారదుఁడు:—

గీ. సాత్వతకులాగ్రగణ్య! ప్రశాంతహృదయ!, భాగవతధర్మములు లోకపావనములు
దెలియఁ బ్రశ్నించితివిగాన ధీవరేణ్య!, తవిలి సమ్యగ్వినిశ్చయుండవయి తహహా!

ఉ. మానుగ నాలకించినను మక్కువ నెక్కువగాఁ బఠించినన్
ధ్యానముఁ జేసినన్ మిపుల నాదృతిఁ జూపిన సమ్మతించినన్
దోన జగత్త్రియంబునకు ద్రోహము జేసినవారినైననున్
దా ననవద్యభాగవత ధర్మము పూతులఁ జేయు భూధవా! 35

గీ. పరమకల్యాణమూర్తియు భద్రదుండు, ప్రభుఁడు నారాయణుఁడు భగవంతుఁడు హరి
యధిప! నీచేతస్మారితుండయ్యె నాకుఁ, గావున మహోపకృతి సేసితీవు నిజము. 36

క. నరవర! విను దీని కుదా, హరణముగఁ బురాతనేతిహాసము ధర్మో
త్తరము విదేహర్షభ సురుచిర సంవాదాత్మకము వచింతుం దెలియన్. 37

గీ. తనయుఁడయ్యె స్వాయంభువ మనువునకుఁ బ్రియవ్రతుఁడతని కాగ్నీధ్రుఁ డాత్మజుండు
నాభి యాతనిసుతుఁడు తన్నందనుండు, ఋషభుఁడనియెడిపేరఁ గీర్తింపఁబడియె.

ఆ. మోక్షధర్మవిధివివక్షచే నవతీర్ణుఁ, డయిన యచ్యుతాంశుఁడం దతనిని
అమ్మహామహునకునామ్నాయపారగ, మయిన సుతశతముదయంబునొందె. 39

క. వారలలో జ్యేష్ఠుఁడు శ్రీ, నారాయణపరుఁడు భరతనాముఁడు వినుమా
భారతవర్షమని యతని, పేరన్ ఖ్యాతమిదిసుమ్ము విస్మయకరమై. 40

ఆ. అతఁడు భుక్తభోగుఁడైన యీ వసుమతి, విడిచివైచి యిల్లువెడలి హరిని
వరతపంబుచే నుపాసించి జన్మత్ర, యమున విష్ణుపదమునందె నధిప! 41

క. తొమ్మండుగు రా భరతుని, తమ్ములలో నధిపులైరి నవద్వీ
పమ్ముల కెనబండ్రు నొకఁడు, నిమ్ముగఁ గర్మములనడపి రిలపై ద్విజులై. 42

గీ. మఱియుఁ దొమ్మండ్రు వారిలో మహితయశులు, మునులు పరమార్థవాదులు ముక్తిపరులు
శ్రమయుతులును దిగంబరుల్ సాధువరులు, నాత్మవిద్యాప్రవీణులునయిపరగిరి. 43

వ. వారు కవి హర్యంతరిక్ష ప్రబుద్ధ పిప్పలాయ నావిర్హోత్ర ద్రమిళ చమస కరభోజ నామధేయంబుల నొప్పిరి. 44

గీ. సదసదాత్మకమైన విశ్వమును వీరు, పూర్ణమగుభగవద్రూపముగఁదలంచి
దాని స్వావ్యతిరేకచింతం గనుచును, సంచరించుచునుండిరిక్ష్మాతలమున. 45

చ. స్థిరమతితోడ నప్రతిహతేష్టగతిన్ సురసిద్ధ సాధ్య కి
న్నర నర యక్ష కింపురుష నాగమునిద్విజభూతనాథ గో
గరుడ పిశాచ రాక్షస ముఖాఖిలలోకములన్ గ్రమంబునన్
దిరిగిరి ముక్తసంగత యథేచ్ఛముగా వసుదేవభూవరా! 46

చ. నరవర! యిట్లు సర్వభువనంబులయందును స్వైరగాములై
తిరుగుచు నమ్మునీంద్రులు యదృచ్ఛ మెయిన్ జనుదెంచి రొక్కనాఁ
డరుదుగ సర్వమానినివహావృతమా యజనాభవర్షమున్
మరుచిర నైజతేజములక్షోణితలంబును వెల్గఁజేయుచున్. 47

క. రవిసన్నిభులు మహాభా, గవతోత్తములునగు వారిఁగని యజమానుం
డవు నిమియు వహ్నులున్ భూ,దివిజులు సర్వులును బ్రస్తుతించిరి క్షితిపా! 48

గీ. అచ్యుతపరాయణులవారి నాత్మఁ దెలిసి, యాసనస్థులఁ జేసి యథార్హరీతి
నర్చగావించె సంప్రీతి నాత్ముఁడగుచు, నావిదేహనృపాలుఁ డత్యధికభక్తి. 49

క. స్వనియతకాంతులవెలిఁ గెడు, సనకాదిబ్రహ్మపుత్రసదృశులవారిన్
వినయావనతుండయు నిమి, జనపతి ప్రశ్నించె నిట్లు సంప్రీతమతిన్. 50

విదేహుఁడు:—

క. యతివర్యులార! మిమ్ముఁ ద, లఁతు సాక్షాద్విష్ణుభక్తులనుగా నెద న
చ్యుతపార్షదులు చరింతు, రున్నతమతి లోకములఁ బావనంబులఁ జేయన్. 51

సీ. పరికింపఁగా క్షణభంగురమయ్యు మ, నుష్యదేహమ్ము జంతువుల కరిది
యందును దుర్లభమని మదిభావింతు, దామోదరప్రియదర్శనంబు
కావున నాత్యంతికంబగుక్షేమంబు, నడిగెదమి మ్మనఘాత్ములార!
సారంబులేని సంసారంబునం దర, గడియేని సాధుసంగంబు నరుల
గీ. కిడును బెన్నిధి పేదకబ్బింతొ ముదము, గానఁ జెప్పుఁడు మాకు భాగవతధర్మ
ములనువిననర్హులమయేని దలఁపఁగ హరి, దాననుప్రసన్నుఁడగుచుఁ దన్నైన నిచ్చు.

నారదుఁడు:—

క. అని యీ చందమున విదే, హనృపతి యడుగంగ సమ్మహాత్ములు ప్రతిపూ
జనమొనరించి పలికిరం, త నిమిపతికి ఋత్విజులు సదస్యులు వినఁగన్. 53

శా. శ్రీనారాయణపాదపద్మయుగళీసేవామృతాస్వాదనం
బే నిత్యం బకుతోభయంబునగు నంచేనెంతు నీ సంసృతిన్
మేనే నేనని యెంచి మోహవిషయోర్మిక్లిన్నచేతస్కుఁడై
గ్లానిం జెందెడువాని భీతితొలఁగుం గా యచ్యుతోపాసనన్. 54

క. తెలియని పూరుషులకుఁ గడు, సులభంబుగ నాత్మసిద్ధి చొప్పడు పొంటెన్
లలి భగవంతుఁడు తెలిపిన, వలయు నుపాయములె భాగవతధర్మంబుల్. 55

గీ. రాజవర్య! భాగవతధర్మములు పూని, నరుఁడు గానఁడు ప్రమాదమెన్నఁడు నొకింత
కడఁగి పర్వులువారిన కనులు మూసి, కొన్న స్ఖాలిత్యమొందఁడు కూలిపడఁడు. 56

మ. తనువాఙ్మానస చిత్తధీంద్రియగుణోత్పన్న స్వభావంబునన్
మనుజుం డెయ్యది యెయ్యదాచరణమున్ గావించుచుండున్ విదే
హనృపా! యా సకలంబు నొప్పమెయి సర్వాధీశ్వరుండై తన
ర్చిన నారాయణమూర్తి కేయని సమర్పింపందగు న్నిశ్చలున్. 57

చ. కువలయనాథ! యాశవిముఖుండగు వానికి మానసంబునం
దవునుజుమీ విపర్యయము నస్మృతియున్ మఱి దాన దేహసం

భవమగు భీతిఁదోఁచు హరిమాయయ దీనికి హేతువౌటచే
నవికలభక్తిమైఁ గొలువనౌ హరినిన్ గురుదేవతాత్ముఁడై. 58

ఉ. ద్వైతజగత్తు దున్నటుల స్వప్నమనోరథపంక్తికైవడిన్
ధ్యాతకు లేనిదయ్యును సతంబును దోఁచుచునుండుఁ గావునన్
జేతము చిక్కఁబట్టుకొని చేయఁగనౌ నతినిశ్చలంబుగన్
భీతివిముక్తుఁడై యపుడు పెంపునుగాంచు జనుండు భూధవా! 59

మ. అవనీనాయక! యాపయిన్ ద్రిభువనఖ్యాతంబులై యొప్పు మా
ధవుజన్మంబులుఁ గర్మజాలములు నత్యాసక్తి నాలించుచున్
శ్రవణానందకరంబులై యెసఁగు తన్నామంబులన్ బాడుచున్
భువి వీతత్రపుఁడై చరింపవలె నిర్మోహుండు నిస్పృహుండునై. 60

ఉ. ఈగతి సంచరించుచు నభీష్టహరిప్రియనామకీర్తనన్
రాగమువుట్టి డెందము కరంగఁగ నొత్తిలి నవ్వు నేడుచున్
ఆగతనంబునన్ వదరు నాపడి నిల్చును బాడు నంతలో
నాగక వెఱ్ఱిచందమున నాడు నతండిటు లోకబాహ్యుఁడై. 61

చ. గగనము వాయు వగ్ని యుదకంబు ధరిత్రియుఁ దిగ్మరశ్మి యా
దిగగల జ్యోతులున్ సకలదిక్కులు శైలములున్ ద్రుమంబు లా
పగలు సముద్రముల్ సకల వస్తువులా పరమేశు దేహమం
చు గణననెమ్మదిన్ సలుపుచున్ బ్రణమిల్లు ననన్యభావుఁడై. 62

చ. హరిని భజించువారికి సమంచితభక్తి, పరానుభూతి, సం
సరణవిరక్తి యీత్రయము మానక వాటిలు నేకకాలమం
దు రహి భుజించువానికిని దుష్టియుఁ, బుష్టియు, క్షున్నివృత్తియున్
గరము జనించుఁగాదె? యనుఘాసమునందును రాజసత్తమా! 63

చ. హరిచరణారవిందము ననన్యమతిన్ భజియించునట్టి ని
ర్భరమతియైన భాగవతవర్యునకున్ దమయంతఁ దోఁచెడున్
బరమసుఖావహంబులగు భక్తివిరక్తి హరిప్రబోధముల్
నరవర! పిమ్మటం గనఁగలండతఁ డంచిత శాంతిసంపదన్. 64

నిమి:—

గీ. భాగవతుఁ డేమిధర్మంబువాఁడు నరుల, కెట్టివాఁడయి తోఁచుఁ దానేమిచేయుఁ
బలుకు నేమి యేలక్షణములఁ బరేశుఁ, డైన భగవంతునకుఁ బ్రియుండగును జెపుడ.

హరి :—

మ. భగవద్భావము నాత్మభావమును నెవ్వాఁడెల్ల భూతంబులం
దగుణుండై పరికించుచుండు నెవఁడో యయ్యాన్ సర్వభూతంబులన్

భగవంతుండగు విష్ణునందుఁ దనలోఁ బాగొప్ప వీక్షించు సా
మ్యగతిన్ భాగవతోత్తముండతఁడు సమ్మాన్య రాజవంశోత్తమా! 66

గీ. వరుస భగవంతునందుఁ దద్భక్తులందు, బాలిశులయందు శాత్రవవర్గమందుఁ
బ్రేమ మైత్రియుఁ గృపయు నుపేక్షయునిడు, నెవఁడు మధ్యముఁడతఁడు
భాగవతులందు. 67

క. హరిపూజయందు శ్రద్ధా, భరితుండయియుండి విష్ణుభక్తజనములం
దొరులందు నెవఁ డుపేక్షా, పరుఁడై యుండునో యతండుప్రాకృతుఁడు నృపా! 68

గీ. ఇంద్రియములనర్థములుగ్రహించియునెద నెవఁడు ద్వేషింపకయును హర్షింపకయును
విష్ణుమాయావిలాసమీవిశ్వమనుచు, నోజఁ గనువాఁడె భాగవతోత్తముండు. 69

మహాస్రగ్ధర:— జని నాశ క్షుత్పిపాసాశ్రమముఖపటుసంసారబంధాళిచేతన్
తనుధీచిత్తేంద్రియాసూత్కరమునకుఁ బ్రమాదంబు వాటిల్లకుండన్
గనుచున్ మోహంబు త్రెంపన్ గలిగి మనియతైకాగ్రభక్తిన్ బరేశున్
ఘనువిష్ణున్ గొల్చుచున్ భాగవతవరుఁడు నిష్కాముఁడై తేజరిల్లున్. 70

క. తమి జన్మకర్మవర్ణా,శ్రమ జాతులచేత వెక్కసమగు నహంభా
వము దోఁప దెవని కీ దే,హమునం దాతండెచూ వెహరికిన్ బ్రియుఁడా. 71

గీ. ఆత్మయం దేని దేహాదులందు నేని, స్వపరభేదంబుచూడ లేశంబు లేక
సర్వభూతసముండును శాంతుఁడునగు, నూర్జితగుణుండె భాగవతోత్తముండు. 72

ఉ. అతివిపులత్రిలోకవిభవాభ్యుదయంబున నే నకుంఠిత
స్మృతియయి యచ్యుతగ్రథితచిత్తసురోత్తమదుర్లభంబు భ
వ్యతరమునైన శ్రీపతిపదాబ్జమునుండి నిమేషలేశమున్
క్షితిప! చలింపఁబోఁడు పరికింపఁగ వైష్ణవవర్యుఁడాత్మలోన్. 73

చ. హిమకరుఁడింపు పుట్ట నుదయించినయంతనె యుష్ణరశ్మితా
పము సకలంబు రూపఱినభంగి జగత్త్రితయా రథాంగపా
ణి మృదుపదాంగుళీ నఖమణిద్యుతిచంద్రికలన్ నిరస్తతా
పమగుమనంబునన్ మగుడఁబైకొను నె ట్లది లేశమేనియున్. 74

చ. అవశతఁబేరుకొన్న దురితౌఘవినాశన మాచరించు సా
ధ్వవన పరాయణుండయిన యచ్యుతదేవుఁడు గాఢభక్తి ర
జ్జువుల నిబద్ధపాదజలజుండయి యెవ్వని మానసంబునుం
డి వెడలకుండునో యతఁడె నిక్కపు భాగవతోత్తముండగున్. 75

## అధ్యాయము 3.

### ఋషభకుమార ప్రోక్త భాగవతార్థ ప్రశంస

రాజు:—

క. పరమేశుండగు విష్ణుని, గురుతరమాయ యది మాయికులనేనియుఁ జె
చ్చెర మోహపెట్టుననియం,దురు దెల్పుఁడు దాని వినఁగుతూహలమయ్యెన్. 76

గీ. భూరిసంసారతాపతప్తుండనయిన, జనుఁడనేను దత్తాపభేషజమనఁదగు
హరికథామృతరూపకమైన మీదు,వచనముంగ్రోలి తృప్తినిబడయకుంటి. 77

అంతరిక్షుఁడు:—

గీ. పరమమున్ నిర్గుణంబుఁ గేవలమునైన,బ్రహ్మమునయందు నాత్మవిపర్యయమెది
కలదొ యదె భగవన్మాయగాఁదెలియుమ,యీశుఁడద్దానితోన సృజించెజగము.

గీ. రాజసత్తమ! యింద్రియార్థభ్రమంబు, జాగరంబగు మఱి మానసభ్రమంబు
స్వప్నమగు వాసనాదిబీజము సుషుప్తి, యాత్రయము గూడియుండుఁ దుర్య
మగుమూర్తి. 79

వ. విశుద్ధంబగు జ్ఞానం బొక్కటియ మాయాశక్తిచే స్వప్నంబునందు గ్రాహక గ్రహణగ్రాహ్యంబులచేత సంవిత్క్రియాఫలంబులు సంభవిల్లునట్లు త్రివిధంబుల భాసిల్లుచుండు. మోహత్వంబునను, వ్యభిచారంబునను నాత్మంబునందు మాయ స్వప్నంబునందు మనోరథంబునుబోలెఁ ద్వైవిధ్యంబునొంది యుపశమించుచుండు. ఆద్యుండగు పురుషుండు సర్వభూతకారణభూతుండై స్వసృష్టంబులైన మహాభూతంబులచేత నానావిధంబులగు భూతంబులను స్వమాత్రాత్మప్రసిద్ధికై సృజియించె. ఇట్లు సృజియింపఁబడిన భూతంబులను నంతర్యామిరూపంబునఁ బ్రవేశించి పంచమహాభూతంబులచే నేకవిధంబుగను దశవిధంబులుగను నాత్మవిభాగంబుజేసి తత్తద్విషయంబులగు గుణంబులను బొందుచుండు. ఆజీవుం డాత్మప్రద్యోదితంబులైన గుణంబులచే విషయంబుల ననుభవించుచు సృజింపఁబడిన శరీరంబును దన్నుగా నెంచుచు నాశరీరాదులయందు సక్తుండైయుండు. కర్మేంద్రియంబుల వాసనాయత్తంబులగు కర్మంబులఁగావించుచు దుఃఖరూపంబగు తత్తత్కర్మఫలంబును గ్రహించుచు దేహి యీ సంసారంబునఁ గ్రుమ్మరుచుండు. ఇట్లు కర్మగతులనుబొందుచు పెక్కులైనయశుభంబులను వహించుచుఁబురుషుండుత్పత్తి మరణంబుల నవశుండై కాంచుచుండు. మహాభూతోపద్రవం బాసన్నంబగుడు ద్రవ్యగుణాత్మకంబైన వ్యక్తకార్యంబు నాద్యంతరహితంబగుకాలం బవ్యక్తత్వముఁ బొందించు. శతవర్షంబు లనావృష్టి యుద్భవిల్లు. తత్కాలంబునం దుపచి

తోష్ణుండగు నర్కుండు మూఁడులోకంబులం దపింపఁజేయు. సంకర్షణముఖానలంబు వాయుప్రేరితంబై యూర్ధ్వశిఖంబై పాతాళతలంబాదిగ సకలంబు దహించుచు నెల్లెడల వర్ధిల్లుచుండు. సంవర్తకాఖ్యంబగు మేఘగణంబు హస్తిహస్తానుకారులగు ధారలచే శతవర్షంబులువర్షించు. ఆసలిలంబున విరాడ్విగ్రహంబు లీనంబగు. అంత నవ్విరాడ్విగ్రహంబును బరిత్యజించి వైరాజపురుషుండు నిరింధనంబగు ననలంబువోలె సూక్ష్మంబగు నవ్యక్తంబునుజొచ్చు. వాయువుచే నపహృతగంధంబై భూమి జలంబున లీనంబగు. తద్వాయుహృతరసంబగు జలంబు తేజంబున విలీనంబగు. తమోహృత రూపంబగు తేజంబు వాయువునందు సంలీనంబగు! అవకాశహృతస్పర్శంబగు వాయువు నభంబున నడంగు. కాలహృతశబ్దంబగు నభంబు తామసాహంకారంబున లీనంబగు. ఇంద్రియంబులు బుద్ధియు రాజసాహంకారంబున లీనంబగు. వైకారికులైన దేవతలతో మనంబు సాత్వికాహంకారంబును బొందు. అహంకారంబును స్వకార్యంబులతోఁ గూడి పరబ్రహ్మంబునందు లీనంబగు. సృష్టి స్థితి లయ కారిణియై త్రివర్ణయగు నీ భగవన్మాయ మాచేఁ దెలుపంబడె. వెండియు నీ వింకేమి వినఁదలంతువు? 80

రాజు:—

గీ. అకృతమతులకు దుస్తరమైన విభుని, యద్భుతంబగు మాయ నెట్లజ్ఞులు ధృతి
దాటఁగలవారలో తెల్పు తాపసేంద్ర!, వినఁగ నాహృదయంబున వేడ్కయయ్యె.

ప్రబుద్ధుఁడు:—

వ. దుఃఖప్రతీకారంబునకు సుఖప్రాప్తికిని గర్మంబుల నారంభించు మిధునచారులైన నరులకు ఫలవైపరీత్యంబు గాననగు. నిత్యార్జితంబును దుర్లభంబును నాత్మమరణహేతుభూతంబును నయిన విత్తంబుచేతను సాధితంబులు, ననిత్యంబులు నగు గృహాపత్యాప్త పశుగణంబులచేతను నేమిప్రీతి లభించు? ఇట్లు కర్మనిర్మితంబులు, నశ్వరంబులు నగు నిహపరలోకంబులు మండలవర్తులకుఁ దుల్యాతిశయంబులుం బోలె ధ్వంసకారణంబులె యగు.

కావున నరుం డుత్తమంబగు శ్రేయంబు నెఱుంగఁగోరి శాబ్ద బ్రహ్మంబునందును,పరబ్రహ్మంబునందును నిష్ణాతుండై యుపశమశీలుండైన గురువునుబొంది తత్సన్నిధానంబున నాత్మస్వరూపుఁడును నాత్మప్రదుండును నగు భగవంతుండు నిర్మాయకంబగు సేవతోఁగూడిన యేధర్మంబులచేఁ బరితుష్టుండగు నట్టి భాగవతధర్మంబులను గుర్వాత్మదైవతుండై యభ్యసింపవలయు. ఆదియందు మనస్సునకు సర్వవిధంబుల నసంగంబును బదంపడి సాధుసంగంబును యథోచితంబుగ భూతంబులయందు దయామైత్రీవినయంబులును, శౌచంబును, తపంబును, తితిక్షయు, మౌనం

బును, స్వాధ్యాయంబును, నార్జవంబును, బ్రహ్మచర్యంబును, అహింసయు, ద్వంద్వ సమత్వంబును, ఆత్మేశ్వరాన్వీక్షయు, ఏకాంతశీలత్వంబును, నికేతరాహిత్యంబును, వివిక్తవస్త్ర పరిధానంబును, యదృచ్ఛాలాభ సంతుష్టియు, భగవత్ప్రీతిపాదక శాస్త్రంబులందు శ్రద్ధయుఁ, దదితరంబులం దనిందయు, మనోవాక్కర్మ నియమ నంబును, సత్యంబును, శమదమంబులును, నద్భుతకర్ముండగు హరిజన్మ కర్మగుణం బుల శ్రవణ, కీర్తన, ధ్యానంబులును, తదర్థంబైన సర్వచేష్టితంబును, యజ్ఞంబును, దానంబును, తపంబును, జపంబును నాత్మప్రియంబగు వృత్తంబు సకలంబును, దార పుత్రగృహప్రాణంబుల భగవదర్పణంబుగావించుటయును, మఱియు విష్ణుభక్తులగు మనుష్యులయందు సుహృద్భావంబును, స్థావరజంగమంబుల పరిచర్యయు, విశేషించి నరులపూజయు నందును సాధుజనుల సమారాధనంబును మఱియు భగవద్భక్త లగు భాగవతుల సేవయు, సల్పుచు పావనంబగు భగవద్యశంబొండొరులకుఁ జెప్పు కొనుటయు, పరస్పరానురక్తియు, పరస్పర సంతోషంబును, బరస్పర సుఖంబును గోరుచు పాపౌఘనాశనుండగు శ్రీహరిని స్మరించుచు నొండొరుల స్మరింపఁ జేసి కొనుచు నేకాగ్రంబగు భక్తిచేఁ బులకితంబగు తనువునుధరించుచు నొకానొకచో హరిచింతచే రోదనంబుఁజేయుచు మఱియొకచో నవ్వుచు నలౌకికులై యానం దించుచు నమస్కరించుచు నాడుచుఁ బాడుచు నా భగవల్లీలల నభినయించుచు నిట్లా పరమేశ్వరుఁ బొంది నిర్వృతిపరుఁడై తూష్ణీంభూతుండు నగు. నారాయణ జనితంబైన భక్తిచే నిట్లా భాగవత ధర్మంబులు నేర్వవలయు. అట్లేని దుస్తరం బగు మాయను దరింపఁగలఁడు. 82

రాజు:—

గీ. అనఘులార! శ్రీనారాయణాఖ్యుఁడగుచు, వరలుపరమాత్మునకుఁబరబ్రహ్మమునకుఁ
గలస్వరూపంబుఁదెల్పు నర్హులరుమీరు, తలఁచిచూడంగ బ్రహ్మవిత్తములుగాన.

పిప్పలాయనుఁడు:—

వ. రాజా! జాగర స్వప్న సుషుప్తులయందును, బహిరంతర్భాగముల యందును, దేహేంద్రియప్రాణబుద్ధ్యాదులు సంజీవితంబులై యెవ్వానివలన స్వవిషయంబులఁ జరించుచుండు నట్టి జగదుత్పత్తి స్థితి నాశహేతువును, నహేతువును నై పరఁగు పరమాత్మయే యేకతత్త్వంబుగా నెఱుంగుము. అప్పరతత్త్వంబును మనం బెఱుంగంజాలదు. అనలంబును నర్చులువోలె మనంబును, వాక్కును, చక్షు వును, బ్రాణేంద్రియంబులును, బుద్ధియుఁ బ్రకాశింపఁజేయంజాలవు. శబ్దంబును బోధకనిషేధత్వంబున నీయాత్మమూలంబును నర్థోక్తంబుగా వచింపఁగల్గెఁ గాని కేవలంబుఁ దన్మహిమంబుఁదెల్ప నక్షమంబగు. సత్త్వరజస్తమంబులను త్రిగుణంబులు

ప్రధానంబుగాఁ గల్గి మహదహంకారాత్మక చైతన్యస్వరూపంబును జీవుండని చెప్పుదురు. అది సదసదాత్మకమైయుండు. దానికి పరంబై యురుశక్తి సమన్వితంబై పరగునది పరబ్రహ్మంబనంబడు. ఈయాత్మ జనింపదు. మరణింపదు. వృద్ధిపొందదు. క్షీణింపదు. ఇది యోగమాయాయి దేహాద్యవస్థలఁ దత్తత్కాలంబుల నెఱుంగునదియైయుండు. మఱియు నిది యెందును నపాయంబులేకయుండు. ఇంద్రియంబులచే వివిధరూపంబులఁ గల్పింపఁబడిన యాత్మజ్ఞానంబు ప్రాణంబుపోలె నుపలబ్ధిమాత్రంబై యుండు. జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజ్జంబులగు చతుర్విధ భూతగ్రామంబులందు జీవు ననుసరించి ప్రాణంబుకూడ నక్కడక్కడఁ దిరుగుచుండు. ఇంద్రియ గణంబును, నహంకారంబును బ్రసుప్తంబై యుండఁ గూటస్థుండగు నాత్మ లింగశరీర రహితుండై వెలుంగుచుండు. అట్టి పరమాత్మస్వరూపుఁడగు నారాయణునిస్మృతి మాకొదవుచుండుఁ గావున శ్రీనారాయణ పదారవింద పరాయణంబగు నేకాగ్రభక్తిచే గుణకర్మజాతంబులగు మానసిక కర్మంబులను దొలఁగంజేయవలయు. విమలదృష్టిసంపన్నుండగువానికి నాదిత్య ప్రకాశంబుంబోలె విశుద్ధుండగు నాభాగవతోత్తముని మనంబున నాత్మతత్త్వంబు సాక్షాత్తుగ లభ్యంబగు. 84

రాజు:—

క. మానవుఁడు సంస్కృతుండై, దేనన్ గర్మములువిడిచి ౘ ధీనిధులారా!
జ్ఞానప్రద నైష్కర్మ్యము, నూనునొ తగనట్టి కర్మ ౘ యోగముచెపుడా! 85

క. ఈకరణిఁ దండ్రియగు ని,క్ష్వాకు నెదుర బ్రహ్మసుతులఁౘ ప్రశ్నించితి మున్
వాకొనరు వార లది నా,కా కారణ మెఱుఁగఁ జెప్పుౘడయ్యా!మీరల్. 86

ఆవిర్హోత్రుఁడు:—

వ. రాజా!కర్మయనియు, నకర్మయనియు,వికర్మయనియు వేదవాదంబు కలదు. అదిలౌకికంబుకాదు. వేదం బీశ్వరాత్మకంబగుట నందుఁ బండితులును భ్రాంతులగుదురు. కర్మమోక్షంబుకై కర్మంబులను దండ్రి బాలకుని నౌషధసేవనంబుంబోలెఁ జేయించుచు బాలానుశాసనంబును, బరోక్షవాదంబునగు వేదంబు ప్రవృత్తంబగు. వేదోక్తమైన కర్మంబును నజ్ఞుఁడు, నజితేంద్రియుండునై యాచరింపకున్న నధర్మంబగు. వికర్మంబుచే మృత్యువునుండి మృత్యువు నా నరుండు పొందుచుండు. నిస్సంగుండై యీశ్వరసమర్పితంబుగ వేదోక్తంబగు కర్మంబు నాచరించువాఁడు నైష్కర్మ్యంబును బొందు. అయినను తత్ఫలం బతనికిఁ బ్రాప్తించుచుండు. ఎవ్వాఁడు వేగంబ హృదయగ్రంథిని ఛేదింపఁగోరి తంత్రోక్తంబైన విధిచే దేవదేవుండగు కేశవు నుపాసించు వాఁ డాచార్యానుగ్రహంబువడసి తత్సందర్శితా

మ్నాయుండై యాత్మాభిమతుండగు పరమపురుషుని నభ్యర్చింపవలయు. మఱియు శౌచపరీతుండై ప్రాణసంయమనాదుల యాభిముఖ్యంబున నాసీనుండై దేహంబును బరిశోధించి షణ్న్యాసకృతరక్షుండై హరినర్చింపవలె. అర్చాప్రారంభమున హృదయంబున లబ్ధోపచారుండై ద్రవ్యక్షిత్యాత్మలింగంబులఁ బరిశోధించి యోగ్యంబులు గావించి యాసనంబును బ్రోక్షించి పాద్యాదికంబుల సమాయత్త పఱచి సన్నిధానంబున నునిచి సమాహితచిత్తుండై హృదయాదులచేఁ గృతన్యాసుండై మూలమంత్రంబున హరి నర్చింపవలె. సాంగోపాంగంబును, సపార్షదంబును శాంతంబు నగు నా పరమపురుషమూర్తిని నాత్మమంత్రంబులచే నర్ఘ్యపాద్యాచమనీయాదులచేతను, స్నానవాసోభూషణంబులచేతను గంధమాల్యాక్షతస్రజంబులచేతను, ధూపదీపోపహారంబులచేతను, యథావిధి సాంగంబుగాఁ బూజించి స్తోత్రపాఠంబులచే స్తుతించి హరికిఁ బ్రణమిల్లవలయు. తన్ను భగవన్మయునిగా ధ్యానించుచు హరిమూర్తిని బూజింపవలయు. ఇట్లనలార్కతోయాదులయందు నతిథియందు హృదయమందు నాత్మస్వరూపుఁడగు నీశ్వరు నెవండు యజించు వాఁ డచిరకాలంబున ముక్తిం బొందు. 87

---

## అధ్యాయము 4.

### —భగవదవతార సంగ్రహాభివర్ణనము—

రాజు:—

క. ఏ యే కర్మంబుల హరి, యే యే స్వచ్ఛందజన్ము | లెత్తియుఁ జేసెన్
జేయుచునుండెను మీఁదన్, జేయంగలఁ డవ్విధంబుఁ | జెప్పుఁడు మీరల్. 88

ద్రమిళుఁడు:—

చ. నరవర! యయ్యనంతుని య | నంతములైన గుణంబులెల్లనుం
బరిగణనంబు సేయుటకుఁ | బాల్పడునెవ్వఁడు వాఁడు బాలిశుం
డరయఁగ భూమిరేణువుల | నైనను దద్దయుఁ బెద్దకాల మె
ట్లో రహి గణింపనౌ హరి మ | హోజ్జ్వలశక్తుల నట్లుకాదుగా. 89

ఉ. అంబురుహోదరుండు విభుఁ | డాత్మవిసృష్టములైన పంచభూ
తంబులచే విరాట్పురముఁ | దా విరచించియుఁ బేర్మిమీఱ స్వాం
శంబున నందుఁజొచ్చి పురు | షాహ్వయుఁడై చెలువొందుచుండు స
ర్వంబును దన్మయంబె సుమి | పార్థివముఖ్య! యెఱుంగుమింతయున్. 90

వ. మఱియు నద్దేవుని దేహంబు లోకత్రయసన్నివేశంబగు. ఆతని యింద్రియం
బులు దేహధారులకు నుభయేంద్రియంబులగు. ఆతఁడు శ్వసించుచుండ జ్ఞానం
బును బలంబును నోజంబును నీహయు సత్వంబును బ్రాణులకుం గల్గుచుండు.
ఆతం డుత్పత్తిస్థితిలయ కరుండును, నాద్యకర్తయునై యొప్పుచుండు. 91

చ. ఎవని రజంబునం దొలుత § నీ జగముల్ సృజియింపఁ బంకజో
ద్భవుఁడు యదీయ సత్త్వమునఁ § బాలనసేయఁగ యజ్ఞభోక్త వి
ష్ణువును లయంబొనర్ప గిరి § శుండుఁ దమంబునఁ బుట్టిరో యనం
త విభవయుక్తుఁడైన పర § తత్త్వమయుం డతఁడెన్నఁ బార్థివా! 92

మ. జననాథా! త్రిగుణాత్మకుండయిన యా § సర్వేశుఁ డా దక్షునం
దన మూర్త్యాహ్వాయయందు ధర్మునకు శ్రీ § నారాయణుండున్ నరుం
డన మూర్తిద్వయమంది సర్వ మునిలో § కారాధితాంఘ్ర్యబ్జుఁడై
ఘన నైష్కర్మ్య సులక్షణంబుఁ దెలిపెన్ § గ్రన్నన్ దపశ్శాలియై. 93

శా. నా ధామంబుఁ గొనం దలంచె నని కం § దర్పున్ గణోపేతు స్వ
ర్నాథుండంపిన నప్సరోగణ వసం § త స్పర్శనోపేతుఁడై
సాధింపన్ బదరీవనిం దరిసి యో § జన్ బంచబాణుండుఁ దా
బాధించెన్ మహిళేక్షణేషువులఁ ద § త్త్వజ్ఞానభిజ్ఞాత్ముఁడై. 94

చ. జనవర! యాదిదేవుఁడల § శక్రకృతంబగు నక్రమంబు నా
త్మ నెఱిఁగి ఫెల్లనవ్వి విగ § తస్మయుఁడై భయకంపమానులన్
గని వచియించె నిట్లు మద § నా! పవనా! సురకాంతలార! భీ
తినిఁ గొనకుండు సుస్థిరమ § తిన్గయికొండిట మా సపర్యలన్. 95

చ. అని భగవంతుఁ డిట్టు లభ § యప్రదుఁడై యన వారలుం ద్రపా
వనతశిరస్కులై యురుకృ § పాయుతు నా విభుఁజూచి పల్కిరం
త నవికృతుండవున్ యమి జ § నార్చితపాదసరోరుహుండవున్
ఘనుఁడవునైన నీయెడలఁ § గా దిది యద్భుత మో జగత్ప్రభూ! 96

చ. త్రిదివ మతిక్రమించి భవ § దీయ పదంబును బొందఁగోరి త్వ
త్పదకమలద్వయిన్ గొలుచు § వారిఁ గమర్త్య కృతాంతరాయముల్
పొదవు మఖంబుసన్ మఘవ § ముఖ్యులఁ దన్పెడి వారిఁజేర వా
ట దయను నీవ త్రొక్కుదు క § డంగి త్వదాశ్రిత విఘ్నమూర్ధమున్. 97

శా. దేవా! క్రొందఱు మూఢు లత్యధిక శ § క్తిన్ దుస్తరాపారపా
రావారంబులుదాటి గోష్పద విని § ర్మగ్నాంగులైనట్లు స

ద్భావా! క్షుత్తృపిపాస ద్వంద్వములు జి । హ్వాశిశ్నభోగంబులున్
బోవంద్రోచి నికృష్టకోపవశులై । పోరే తుదిన్ భ్రష్టులై. 98

క. అని పొగడెడివారల క, ల్లన నవ్విభుఁడపుడు సుష్ట్వ । లంకృతతనులన్
ఘనయోగవినిర్మితలన్, దనకున్ శుశ్రూషఁజేయు । తరుణులఁ జూపెన్. 99

గీ. ఆకృతింగొన్న లక్ష్ములౌ । ట్లలరుచున్న, వారలంబొడఁగాంచి దే । వానుచరులు
వారి సలలితరూప సౌ । భాగ్యగరిమఁ, జెన్ను దొఱఁగి విభ్రాంతిని । జెందిరపుడు. 100

గీ. రాజవర్య! యా యాదినా । రాయణుండు, ప్రణతులగువారలకు నిట్లు । పలికెనగుచు
స్వర్ణభూషణమగు దాని । సదృశరూప, నొకరితన్ వీరిలోనఁ గో । రికొనుఁడనుచు. 101

గీ. 'వల్లె', యని తదాదేశంబు । నల్లనఁగొని, యా జగద్విభునకు మ్రొక్కి । యప్సరసల
మిన్నయై యొప్పు నూర్వశిన్ । మున్నిడుకొని, చనిరి దేవానుయాయులు । స్వర్గమునకు.

క. ప్రణమిల్లి యింద్రునకు సుర, గణములు తమ వినుచునుండ । గా శ్రీనారా
యణుబలమును దెలిపిరి వా, రణఁకువ నాశ్చర్యచకితుఁ । డయ్యె మఘవుఁడున్. 103

సీ. భువనకల్యాణమున్ । బొనరింపఁగాఁ గోరి, హంసస్వరూపుఁడు । నచ్యుతుండు
విష్ణుదేవుండె భా । వింప దత్తుఁడుఁ గుమా, రుండును మాజన । కుండగు ఋష
భుండునై స్వీయాంశ । మున దా నవతరించి, యాత్మయోగంబుఁ బ్ర । జావళులకు
నుపదేశమొనరించె । నోజ నాతఁడె హయ, గ్రీవావతార మం । గీకరించి

గీ. బీరమున మధుదానవున్ । బిల్కుమార్చి, యతనివక్త్రంబునందున్న । శ్రుతులనెల్ల
మగుడఁగొని తెచ్చియిచ్చెనా । దుగినునకును, నాలకించి తె? యోవిదే । హక్షితీశ! 104

చ. మనువును భూమి నోషధుల । మన్చె లయంబున మత్స్యమూర్తియై
దనుజు వధించె వార్ధిగత । ధారుణినెత్తుచుఁ గ్రోడరూపుఁడై
వనధిమథింపఁ దాల్చె గిరి । వర్యము వీపునఁ గూర్మమై జవం
బెనయ గజేంద్రు నార్తు విడి । పించెను గ్రాహమునుండి పార్థివా! 105

ఉ. ప్రోచెఁ బయోధిమగ్నులయి । పూన్కి నుతించెడు వాలఖిల్యులన్
గాచె సురేంద్రు వృత్రహన । నంబున గాఢతమఃప్రవిష్టు దో
షాచరగేహబంధితల । సాకె ననాథల దేవకాంతలన్
బీచమడంచె దైత్యకుల । వీరు స్వభక్తులకై నృసింహుఁడై. 106

మ. అల దేవాసురయుద్ధమందు సుర । రక్షార్థంబు దైత్యేంద్రులన్
బలిమిన్ ద్రుంచి కళావతీర్ణుఁడయి భా । వంబొప్పు మన్వంతరం
బుల లోకంబులనేలె యాచన । నెపంబుం బూని తాఁ గుబ్జుఁడై
బలిదైత్యేంద్రునినుండి నాచికొని దే । వశ్రేణికిచ్చె న్మహిన్. 107

క. ఘనహైహయవంశదవా, గ్నినిభుఁడు ముయ్యేడుమార్లు నిఃక్షత్రముగా
నొనరించె భూమిమండల, మును భార్గవరాముఁడై విభుఁడుపృథుశక్తిన్. 108
శా. సీతావల్లభుఁడై యతండ జలరాశిం జేర్చి బంధించి వి
ఖ్యాతంబైన పరాక్రమం బెసఁగ జన్యక్షోణి బృందారక
వ్రాతంబుల్ నుతియింపఁ బంక్తిముఖు విశ్వద్రోహు లంకాపురీ
నేతన్ ద్రుంచి జగంబునన్ వరలుచుండెన్ గీర్తివిస్తారుఁడై. 109
చ. అతఁడె ధరాభరావతరణార్థము తా నజుఁడయ్యు యాదవ
ప్రతతులలో జనించి సురవర్యుల కేనియుఁ జేయరాని యా
యత ఘనకార్యముల్ సలుపునర్హ్మలు కాక మఘంబు సేయు దు
ర్మతులజయించు వాదములరాజులక్షుద్రులఁజంపెడున్ గలిన్. 110
క. పృథులయశస్కుండును జగ, దధిపతి ఘనభుజుఁడునైన యా హరి యేవం
విధజన్మకర్మముల నేఁ, బృథివీశ్వర! తెల్పినాఁడ వేడ్కఁదలిర్పన్. 111

---

## అధ్యాయము 5.

### విష్ణుపూజావిధాన వర్ణనము

నిమి:—

గీ. ఆత్మవిదులార! భగవంతుఁడైనహరిని, నెవరు భజియింపకుందురో యవిజితేంద్రి
యులు నశాంతకాములునయి యుండువారి, కేమిగతి వాటిలునువచియింపుడయ్య.

చమసుఁడు:—

గీ. పరపురుషముఖబాహూరుపాదతలము, నుండి యాశ్రమసహితమై యుద్భవిల్లె
నాల్గువర్ణంబులందు గుణములఁబట్టి, విప్రులాదిగఁగలిగిరి వేఱువేఱ. 113
క. వీరలలో నెవరుపరమ, పూరుషు నీశ్వరుని నాత్మభూతుం గొలువన్
నేరరొ స్థానచ్యుతులై, వారలధోగతినిఁ బొందువారు నరేంద్రా! 114
వ. హరికథాదూరులును, నచ్యుతకీర్తనబాహ్యులునగు స్త్రీశూద్రాదులెల్లరు
మీయట్టివారి కనుకంపనీయులు. విప్ర, క్షత్రియ, వైశ్యులు, హరిపాదసన్నిధిని
బొంద నధికారముగలవారయ్యు వేదవిద్యచే నామ్నాయవాదులగుచు ముగ్ధులగు
చుందురు. 115

చ. అనిపుణులొచుఁ గర్మములయందు వినమ్రులుకాక మూఢుల
య్యును దురహంకృతింగొని మదోద్ధతిఁ బండితమానులై తమం
తన మధురంబులైన వచనంబులచేఁ గడు నుత్సుకత్వమున్
గొని ప్రియచాటువాక్యములుకోరి వంచిచుచు నుందు రజ్ఞతన్. 116

గీ. ఘోరసంకల్పులై రజోగుణముచేతఁ, గాముకులునహిమన్యువుల్ గలుషమతులు
దురభిమానులు డాంబికుల్ పరిహసింతు, రచ్యుత ప్రియులగువారి నహరహంబు.

వ. వ్యవాయపరంబులగు గృహంబుల స్త్రీజనంబు నారాధించుచు నొండొరులవలనఁ గామితంబుల నర్థించుచు నన్నదానదక్షిణరహితంబుగ యజ్ఞంబులఁ గావించుచు వృత్తికొఱకయి పశువులహింసించుచు మిగుల నవివేకులై ప్రవర్తింతురు. 118

చ. సిరియు విభూతియుం గులముఁ జెల్వము చాగము విద్య రూప వై
ఖరియు బలం బివెల్ల ఘనగర్వముఁ గూర్పఁగ నంధబుద్ధులై
దురిత మనస్కతన్ జెలఁగు దుష్టులు హేళనఁ జేయుచుందు రీ
శ్వరయుతులన్ హరిప్రియులసాధువులన్ నిరతంబు భూధవా! 119

తరల. సకలదేహులయందు వ్యోమముచాడ్పునం దనరారి యె
ల్లకుఁ బ్రియంబిడు నాగమోక్త సులక్షణుం బరమాత్మునిన్
వెకలులై తెలియంగలేక నివృత్తిమార్గము స్వీకరిం
పక ప్రవృత్తికి నన్వయింతురిసుమా మనోరథపూర్తికై. 120

వ. రాజా! మైథునంబును నామిషంబును మద్యసేవయు మర్త్యునకు నిత్యంబులైనను నందుఁ బ్రేరణంబు యుక్తంబుకాదు. కాని వివాహయజ్ఞాదుల నవి వేదసమ్మతంబులై యుండు. మఱియు ధనంబును ధర్మైకఫలంబుగను, ధర్మంబు జ్ఞానవిజ్ఞాన ప్రదాయకంబుగను గావించి గృహస్థులై ప్రవర్తించినను నట్టి యద్భుతప్రభావసంపన్నులగు వారు దురంతశక్తి సంపన్నంబగు మృత్యువును గానకుందురు. మఱియు మద్యమునకు నాఘ్రాణంబు విహితంబు కాని పానంబుకాదు. యజ్ఞాదుల విశసనంబు విహితంబుకాని హింసకాదు. మైథునంబు సంతానంబునకు యుక్తంబుకాని కామంబునకుఁగాదు. ఏవంవిధమగు పరిశుద్ధ స్వధర్మంబు నెఱుంగక మూఢులు భ్రమయుదురు. ఇత్తెఱంగెఱుంగని దుర్జనులు స్తబ్ధమనస్కులై దురభిమానపూరితులై పశుహింసఁ గావింతురు. ఆ పశువులు ప్రేతత్వమునుబొంది నిశ్శంకంబులై మరల వారినే భక్షించు. పరకాయంబుల నాత్మస్వరూపుఁడును భగవంతుండునగు నీశ్వరుని విరోధించుచు ననుబంధసహితంబైన కళేబరమునందు మాత్రము బద్ధానురాగులై యధోగతిపాలగుదురు. మఱియుఁ గైవల్యంబును బొందింపఁజాలక మాధ్యంబునుగల్గించు త్రివర్గంబు నుపాసించు ననాత్మజ్ఞు లాత్మఘాతంబుఁగావించుకొందురు. ఆత్మఘ్నులును, నశాంతులు నజ్ఞానులునై యుండియు జ్ఞానులమని విఱ్ఱవీగువారునగు నసత్పురుషులు కాలనిహతమనోరథులై యకృతార్థులై క్షీణింతురు. వాసుదేవ పరాఙ్ముఖులగు వీరు శ్రమసాధితములైన విత్తాపత్య సుహృద్గేహాదులను బరిత్యజించి యూపిరివిడువఁ దెఱపిలేని తమోలోకంబునఁబడుదురు. 121

రాజు:—

గీ. లీలమై భగవంతుఁ డేకాలమందు, నెట్టిఁడై యుండు వహియించు నెట్టివర్ణ
మెట్టినామమునన్ మఱియెట్టివిధిని, మనుజు లర్చింత్రు తెల్పుఁడీ మానులార! 122

కరభాజనుఁడు:—

వ. కృత, త్రేతా, ద్వాపర కలియుగంబుల నానావర్ణ నామధే యాకారంబుల నొప్పువాఁడై భగవంతుండు పెక్కు తెఱంగుల విధ్యుక్తప్రకారంబునఁ బూజింపఁ బడుచుండు. అందుఁగృతయుగంబున శుక్ల వర్ణుండు చతుర్బాహుండుఁ జటాధరుండు వల్కలాంబరుండునై *కృష్ణాజినోపవీతాక్షంబులను దండకమండలువులను ధరియించు. అప్పుడు మనుష్యులు శాంతచిత్తులు, నిర్వైరులు, సమదర్శులునై తపశ్శమదమంబుల నా దేవు నర్చింతురు. ఆయుగంబున దేవుండు హంసుఁడు సుపర్ణుండు వైకుంఠుండు, ధర్ముండు యోగీశ్వరుండు ఈశ్వరుండు పురుషుండు, అవ్యక్తుండు, పరమాత్ముఁడనని కీర్తింపంబడు. త్రేతాయుగంబున నాభగవంతుండు చతుర్బాహుండును, రక్తవర్ణుండును, త్రిమేఖలుఁడును, హిరణ్యకేశుండును, వేదాత్ముండును, స్రుక్స్రువాద్యుపలక్షణుండునై యుండు. అక్కాలంబున మనుజు లద్దేవుని ధర్మిష్ఠులు, బ్రహ్మవాదులునై త్రయీవిద్యచే నారాధింతురు. అక్కాలంబున నా భగవంతుండు విష్ణుండు యజ్ఞుండు పృశ్నిగర్భుండు సర్వదేవుండు ఉరుక్రముండు వృషాకపి జయంతుండు ఉరుగాయుండు సని చెప్పంబడు. ద్వాపరయుగంబున భగవంతుండు శ్యాముండు పీతాంబరుండు నిజాయుధధరుండు శ్రీవత్సాది లక్షణలక్షితుండునై యొప్పుచుండు. అప్పుడు మనుష్యులు మహారాజోపలక్షణుండైన యప్పరమపురుషు నెఱుంగఁగోరి వేదతంత్రములచే యజింతురు. వాసుదేవుండును సంకర్షణుండును బ్రద్యుమ్నుండును ననిరుద్ధుండును నగు నా భగవంతుని మ్రొక్కుచుందురు. మఱియు నారాయణుండును ఋషియుఁ బురుషుండును, మహాత్ముండును విశ్వేశ్వరుండును, విశ్వమయుండును సర్వభూతాత్ముండునగు నద్దేవునిఁ గొల్చుచుందురు. ఇంక కలియుగంబునఁ గృష్ణవర్ణుండును, సాంగోపాంగాస్త్రపార్షదుండును, నగు కృష్ణునిగీర్తన ప్రాయము లైన యజ్ఞంబులచే యజించుచుందురు. పరిభవవినాశకరంబును, ధ్యేయంబును, కామదుఘంబును, తీర్థనిలయంబును, బ్రహ్మమహేశ్వరవినుతంబును, రక్షకంబును, భృత్యార్తిహారంబును, ప్రణతజనభవార్ణవతారకంబునునగు నీచరణారవిందంబును భజియింతుము. మఱియు సుదుస్త్యజంబు సురప్రార్థ్యంబు నగు రాజ్యలక్ష్మిం బరిత్యజించి ధర్మపరుండై పితృవాక్యంబున నరణ్యంబునకుఁబోయి భార్యాభ్యర్థితమగు మాయామృగంబును వెంబడించిన మహాపురుషుండవగు నీచరణారవిందంబును గొలుతుము. అని యిట్లు కలియుగంబున

భగవంతు నారాధింతురు. ఇవ్విధంబున యుగానురూపంబులగు నామరూపాదుల నీశ్వరుండగు హరి తత్తద్యుగవర్తులగు మనుజులచే యజింపఁబడుచుండు. ఏ కలి యుగంబున సంకీర్తనంబుననే స్వాభీష్టంబు లభ్యంబగుచుండు నా కలియుగంబును గుణజ్ఞులును, సారవిదులునగు నార్యులుగౌరవింతురు. కాలచక్రభ్రమమాణులగు దేహులకు నీ కలియుంగబున నింతకంటె పరమంబగు లాభంబు వేఱొండులేదు. కలియుగంబున విష్ణునామస్మరణంబునంజేసి పరమంబగు శాంతియు సంసృతి వినాశ నంబును సంభవంబగు. కృతాదియుగంబులందలి ప్రజలు కలియుగంబున జన్మంబు నభిలషింతురు. కలియుగంబున జనులు నారాయణ పరాయణులగుచుందురుగదా. మహారాజా! ద్రావిడదేశంబులయందు విశేషించి తామ్రపర్ణి, కృతమాల, పయస్విని, కావేరి, మహాపుణ్యా, ప్రతీచి యనంబరగు జీవనదులుకలవు. ఆ నదీ జలంబుల నే జనంబులు పానంబుసేయుదురు, వారు ప్రాయికంబుగ నిర్మల హృద యులై భగవంతుఁడగు వాసుదేవునియందు భక్తికలిగియుందురు. ఏ నరుండు శరణ్యుండగుముకుందుని సర్వవిధంబుల శరణంబుఁబొందు నతండు దేవర్షి భూతాప్త నరులకు పితరులకుఁ గింకరుండును ఋణియును గాకుండు. అనన్యభావుండై నిజపాద మూలంబును నాశ్రయించిన ప్రియభక్తునకుఁ బరమేశుండగు హరి తద్హృదయ సన్ని విష్టుండై ప్రమాదజనితసర్వకర్మజాలంబును పరిహరించుచుండునని కరభాజ నుండు నిమిరాజున కెఱింగించె. 123

నారదుఁడు:—

క. ఈపగిది భక్తినా నిమి, భూపుఁడు భాగవతధర్మములనువిని జయం
తీ పుత్రులైన మునులన్, సోపాధ్యాయుఁడయి పూజలొనరించెఁ దమిన్. 124

క. అంతట లోకము తముఁగన, నంతర్హితులైరి సిద్ధులైన మునులు భూ
కాంతుఁడు నా ధర్మంబుల, శాంతి ననుష్ఠించి విమలసద్గతిఁ జెందెన్. 125

క. భూవర! వసుదేవ! విమల, భావా! యీవిన్న భాగవతధర్మంబుల్
నీవును శ్రద్ధాళుఁడవై, చేవ ననుష్ఠింపఁ బరముఁ జెందెద' వధిపా! 126

క. భగవంతుఁ డీశ్వరుఁడు హరి, తగమీకున్ గొమరుఁడగుట దంపతులగు మీ
యగణిత యశోవిభవమున, జగమెల్లన్ నిండియుండె జగతీనాథా! 127

గీ. పుత్రవాత్సల్యమును గృష్ణమూర్తియందుఁ, జేయుమీకుఁదద్దర్శనాశ్లేషణ శయ
నాసనాలాపభోజనాద్యఖిలవిధుల, బావితంబయ్యెనాత్మ యోపార్థివేంద్ర! 128

తరల. సతతమున్ శిశుపాల పౌండ్రకసాల్వముఖ్య నృపు ల్లన
ద్గతి విలాస విలోకనాదులధ్యానమున్ బచరించు చు

ధ్రుతి బగన్ శయనాసనంబులఁ దదన్నివేశిత బుద్ధులై
క్షితిప! పొందిరి తత్సమత్వముఁ జెప్ప నేలఁ దదీయులన్. 129

క. కుహనా మానుష భావను, విహితైశ్వర్యుండు పరుఁడు విభుఁ డవ్యయుఁడై
రహినొప్పు కృష్ణునందున్, మహీధవ! కుమారుఁడ నెడి మతినుంచకుమా. 130

క. ధరణికి వ్రేగగు నసురేశ్వరులను బరిమార్ప సాధుజనులను బ్రోవన్
ధరయందు నవతరించిన, హరికీర్తి సెలంగెఁ బూర్ణమై నిర్వృతికిన్. 131

శ్రీశుకుఁడు:—

చ. అనియిటు లాసురర్షి చెలువారఁగఁ జెప్పిన న య్యుదంతమున్
విని ఘనభాగధేయు లతివిస్మితులై వసుదేవదేవకుల్
మనములయందుఁ గృష్ణుఁడు కుమారుఁడు మా కనునట్టి మోహ మె
య్యనఁ ద్యజియించిమించి పరమాత్మునిఁగాఁ దలపోసి రయ్యెడన్. 132

చ. హితమునుగోరి పుణ్యమగునీ యితిహాసము నెవ్వఁడే సమా
హితమతియౌచు నెమ్మి భజియించునొ యీ తనువందె ధన్యుఁడై
యతఁడు సమస్తమోహనివహంబును దా విదలించివైచి ని
ర్వృతిఁగొను బ్రహ్మభూతుఁడయి యిం దనుమానము లేదు భూధవా! 133

## అధ్యాయము 6.

### శ్రీకృష్ణ వైకుంఠప్రయాణ సన్నాహము

శ్రీశుకుఁడు:—

సీ. అంతట సనకముఖ్యాత్మజులును బ్రజాపతులును దోడరాఁ బద్మభవుఁడు
భూతగణములు తోనేతేర సకలభూతాధినాథుండగు నట్టిభవుఁడు
సకల మరుద్గణ సంసేవితుండయి, ప్రాభవోపేతుఁడౌ వాసవుఁడును
ఆదిత్యులు వసువులశ్వు లాంగిరసులు, ఋభువులు రుద్రులు ఋషులు మఱియు
గీ. సాధ్య గంధర్వ చారణాప్సరసలు పితృ, సిద్ధనాగవిద్యాధర శేఖరులును
గుహ్యకులు కిన్నరుల్ గుమిఁగూడి కృష్ణ, దర్శనోత్కంఠ వచ్చిరి ద్వారవతికి. 134

మ. నరలోకాతిమనోరముండగు జగన్నాథుండు తా నే మనో
హర దేహంబున సర్వలోకముల దోషాపఘ్నమైనట్టి కీ
ర్తిరమన్ లోకచయంబులన్నిని చెనా దేహంబుతో నొప్పు శ్రీ
హరి నాపోవక చూచి రెల్లరుఁ బ్రసూనాలంకృతుం జేయుచున్. 135

క. లలితద్యోవనసుమములఁ, జెలువుగ యదునాథుఁగప్పి చిత్రపదార్థా
కలితములగువాక్కుల దివి, జులు తగ నా దేవదేవు స్తుతియించి రిటుల్. 136

దేవతలు:—

వ. ఓ జగన్నాథా! కర్మపాశంబునుండి విడివడంగోరు మహనీయులచేఁ బ్రాణేంద్రియ మనో బుద్ధి వాక్కాయంబుల నెయ్యది చింతింపంబడు నట్టి భవదీయ చరణారవిందంబునకు మేము ప్రణతులము. నీవు త్రిగుణాత్మకంబైన మాయచేఁ దద్గుణస్థుండవై మహదాది ప్రపంచంబును సృజింతువు పెంతువు దుంతువు. ఆత్మారాముండవై యవ్యవహిత సుఖపరుండవై యనవద్యుండవగు నీ వజితేంద్రియులచేఁ దెలియంబడవు. పురుషోత్తమా! శ్రవణకీర్తనాదులఁ బ్రవృద్ధంబులగు శ్రద్ధాభక్తులచే నొనఁగూడినయట్లు వేదాధ్యయన దాన తపః క్రియాదులచే దురాశయులగు మానవులకుఁ జిత్తశుద్ధి కానేరదు. అశుభంబులకు ధూమకేతువును క్షేమంబులకు మూలహేతువును మునిజన సమారాధితంబునగు తావకీన చరణకమలంబు మాకు శ్రేయోదాయకంబగు. అధ్వరాగ్నియందు వేదవిధిని వేల్వంబడిన ఆజ్యాది హవిస్సును గ్రహించి జిజ్ఞాసువులైన పరమభాగవతులాత్మయోగంబునం జేసి యే చరణపల్లవంబును ధ్యానింతు రది మాకుఁ బ్రీతిదాయకంబగు. ఎవని యురస్థలంబునఁ బర్యుషితమగు వనమాలతో భగవతి యగు శ్రీదేవి స్పర్ధగావించు నట్టి జగన్నాయకు నంఘ్రిసరోజంబు మాకు శుభావహంబగుంగాక. 137

మఱియు నసుర దేవసైన్యంబులకు భయాభయంబులఁ బుట్టించుచు సాధువులకు స్వర్గంబు నసాధువులకుఁ దదితరంబును గల్గించునట్టి త్వత్పాదపద్మం బనన్య భక్తిభావంబున భజియించు మమ్ముఁ బాపంబునుండి కాపాడుఁగాక. 138

బ్రహ్మప్రభృతిక శరీరధారులు ముక్కుకుట్టిన బలీవర్దంబులుంబోలె నెవనివశంబునఁ బ్రవర్తించుచుందురో యట్టి కాలస్వరూపుఁడవు ప్రకృతి పురుషాతీతుండవు నగు నీ చరణపయోరుహంబు మాకు సుఖంబుఁ గల్గించుఁగాత. 139

నీవలనఁ బురుషుండు శక్తింబడసి మాయాధిష్ఠితుండై విశ్వగర్భంబును దాల్చి హిరణ్మయంబగు నండకోశంబును విసర్జించె. స్థావర జంగమాత్మకంబగు విశ్వంబునకు నధీశుండవై గుణత్రయసంజాతంబులగు నర్థంబులఁ బొందియు విలిప్తుండవు కాకుందువు. త్వదన్యులగువారు నసక్తులయ్యును వాసనావశంబున విషయబద్ధులగుచుందురు. సస్మితావలోకనలేశమాత్రప్రదర్శితహావభావాదియుక్తభ్రూమండలప్రబోధితసురతమంత్రదక్షములగు ననంగబాణంబులచే షోడశసహస్ర కళత్రంబులును భవన్మానసేంద్రియంబును వికృతింబొందింప నశక్తలైరి

గదా! హృషీకేశా! భవదీయ సుధాసన్నిభకథాజలంబుల వహించుచుఁ
త్రిలోకంబుల పాపంబుల హరియింపంజాలి త్వత్పాదసంభూత తరంగిణులు సంస్రవ
ణంబులచే శ్రవణంబులను, సంగంబులచే నంగంబులను బునీతంబులు గావింప
సమర్థంబులై యుండు. 140

శ్రీశుకుఁడు:—

గీ. అని స్తుతించి యీశ్వరయుక్తుఁడై సుపర్వ, చయములం గూడి యంభోజసంభవుండు
కోర్కెదీర గోవిందునకుఁ బ్రణమిల్లి, యభ్రసీమాశ్రయుండయి యనియె నిట్లు 141

బ్రహ్మ:—

ఉ. ఓపురుషోత్తమా! శుభగుణోదయ! కేశవ! తొల్లి మేము వి
జ్ఞాపన భూభరావతరణార్థము నీకును జేసికొంటి మి
ష్టా పనియెల్లఁ దీఱె బుధులందును ధర్మము సాధుపద్ధతిన్
స్థాపితమయ్యె నిర్మల యశంబును వ్యాపితమయ్యె దిక్కులన్. 142

చ. శ్రీయదువంశమందవతరించి జగత్త్రయగేయమానశో
భాయుతభవ్యరూప విభవంబును దాలిచి సర్వలోక ని
శ్శ్రేయససిద్ధికై కడుఁ బ్రసిద్ధములైన విశుద్ధ కర్మముల్
సేయుచు నింతదన్కను వసించితిగా వసుధాతలంబునన్. 143

చ. కమలదళేక్షణా! కలియుగంబున సాధువులైన మానవుల్
విమలములైన నీ కథల వీనులవిందుగ నాలకించుచున్
బ్రమదమెసంగఁగా ననుదినంబును గీర్తనసేయుచున్ దురం
తమగు తమంబునుండి క్రమతన్ దరియింతురుగా యవశ్యమున్. 144

గీ. దేవ! యదువంశమందవతీర్ణుఁడవయి, నట్టి నీకిఁకఁ బంచవింశాధికమగు
హాయనశతంబు గడచె లోకైకనాథ! భాసమానసద్బోధ! దయాసనాథ. 145

మ. అమలాకార! పరాత్పరా! సకలలోకాధార! యీమర్త్యలో
కమునన్ నీకిఁకఁ గానరాదు దివిషత్కార్యావశేషంబు లే
శము వంశంబును సాధుశాపమున నష్టప్రాయమై యుండె నో
కమలాక్షా! యిదియెల్ల లోఁ దలఁచినన్ గార్యంబు వ్యక్తంబెకా. 146

క. నీ కింకరులై మెలఁగెదు, లోకపరీతులగు సకల లోకపతుల నీ
వో కారుణ్యపయోనిధి!, వైకుంఠా! సరసఫణితిఁ బాలింపఁగదే. 147

శ్రీశుకుఁడు:—

కం. తోయజభవముఖ్యసురని,కాయ మిటులఁ బొగడ వారిఁ గని మన్ననలన్
మాయామానవుఁ డీశ్వరుఁ, డా యదువల్లభుఁడు ప్రీతి ననె నిట్లధిపా!. 148

శ్రీకృష్ణుఁడు:—

ఆ. విబుధులార! మీదు విజ్ఞప్తి యంతయు, నెలమితోడ నిర్వహింపఁబడియె
దుష్టమతులచేత దూషితమైనట్టి, పుడమి భారమెల్ల నుడుపఁబడియె. 149

ఉ. లావు దలిర్ప యాదవకులం బిది దుర్భరవీర్యశౌర్యల
క్ష్మీ విభవోద్ధతంబయి ప్రకృష్టమదంబున ధర్మసేతువుల్
త్రావులు తప్పఁజేసి వికటంబుగ లోకములం గలంచు నో
దేవతలార! దీనికిఁ బ్రతిక్రియఁ జేయక యుంట యొప్పునే? 150

చ. వినుఁ డతి దృప్తులైన యదువీరుల విస్తృతమైన వంగడం
బును గడతేర్పకే నిపుడు పోవుదు నేనియు ధర్మసేతు లం
ఘన మొనరించి యిక్కులము క్రౌర్యముతోఁ జెలరేగి లోక నా
శన మొనరించి తీరును నిజంబిది సందియ మింత లేదిటన్. 151

క. మునిశాపంబున నీకుల, మున కారంభించెఁ జేటు పూని తదంతం
బున నేను నీదు భవనం, బునకును జను దెంతు నేగు ము సురజ్యేష్ఠా! 152

శ్రీశుకుఁడు:—

క. అని యిక్కరణి జగన్నా, థునిచే వాక్రువ్వఁగఁబడి తో యజగర్భుం
డనిమిషగణములతో నా, తనికిం బ్రణమిల్లి చనె స్వధామంబునకున్. 153

క. పదఁపడి యా ద్వారకయం, దొదవిన యుత్పాతముల మహోద్ధతిఁ గని యా
యదువృద్ధులు తనకడ కరు, గుదేర హరి వారలఁ గనుఁగొని యిట్లనియెన్. 154

శ్రీకృష్ణుఁడు:—

మ. వినుఁడయ్యా! యదువృద్ధులార! యిపు డీప్వీటన్ మహోత్పాతముల్
ఘనమై యంతటఁ దోఁచుచున్న యవి నిక్కం బెన్న నీ వంగడం
బునకున్ సంయమి శాపముం గలదు నిర్మూలంబుఁ గావింపఁ గా
వున జీవింపఁ దలంచినట్టి మనకిష్టుండం గరా దిచ్చటన్. 155

శా. ఆలస్యం బిఁక నుంత చెల్లదు ప్రభాసాఖ్యంబు తీర్థంబు సు
శ్రీలం బందును జేరుకొంద మట మున్ శీతాంశుఁ డత్యుగ్రమై
జాలింగొల్పెడు దక్షశాపమున యక్ష్మగ్రస్తుఁడై స్నానమం
దోలిం జేసియు శాపముక్తుఁడయి తా నొందెం గళాభ్యున్నతిన్. 156

చ. అతి కుతుకంబునన్ మనము నా నది గ్రుంకిడి తర్పణంబులన్
బితరుల వేల్పులం దనిపి విప్రవరేణ్యుల నెల్లరన్ గుణా
న్వితమధురాన్నపానములఁ బ్రీతులఁ జేసియుఁ బాత్రదాన మా
దృతి నిడి దానఁ బాపముఁ దరింతము నౌకల వార్ధినిం బలెన్. 157

శ్రీశుకుఁడు:—

గీ. ధీరవర! యిట్లు భగవదాదిష్టులగుచు, యాదవులు తీర్థగమనోద్యతాశయులయి
స్యందనంబులుఁ బూన్చిరి సంభ్రమమున, బహువిధములగు సంభారభారములిడి.

ఆ. కృష్ణు నిత్య మనుసరించి వర్తించెడు, నుద్ధవుండు భగవదుక్తము విని
యుగ్రతరములైన యుత్పాతములను నా, యాదవోత్తముల ప్రయాణముఁ గని.

ఆ. జగదధీశ్వరేశ్వరుఁడగు కృష్ణదేవుని, యొద్ద కేకతమున నొయ్యఁ జేరి
తత్పదాబ్జములకుఁ దలతోడ మ్రొక్కి తాఁ, బలికె నిత్తెఱఁగునఁ బ్రాంజలియయి.

ఉద్ధవుఁడు:—

క. లోకేశ! పుణ్యకీర్తన!, శ్రీకల్యాణగుణ! శ్రీహరీ! యీకులమున్
బోకార్చి ధ్రువముగా నీ, లోకముఁ ద్యజియింతువనుచు లోనెంతుఁ బ్రభూ! 161

క. అజిత! భవచ్చరణాబ్జముఁ, ద్యజియింపంజాల నే క్షణార్ధంబైనన్
నిజధామముఁ జేర్పు మధో, క్షజ! నన్నును నీకుఁ బ్రణతిశతము లొనర్తున్. 162

క. నరకోటికిఁ బరమశుభం, కరము మనోహరము నిత్యకర్ణామృతమై
పరఁగెడు నీచెయిదము జను, లరుసంబునఁ గ్రోలి విడుతురన్యస్పృహలన్. 163

గీ. స్థానశయ్యాసనాటనస్నానకేళి, భోజనాదులయం దాత్మభూతుఁడవును
ప్రియతముఁడవును నగు నిన్ను విడిచి యెట్లు, మెలఁగఁ గలవారమయ్య
భక్తులము మేము. 164

గీ. త్వదుపభుక్తములై పరిత్యక్తములగు, స్రజములం జందనముల వస్త్రముల నగలఁ
దాల్చి యుచ్ఛిష్టముం దిని తావకీన, మాయను జయింపఁగలము మేమో యధీశ!

గీ. కర్మమార్గములం దిరుగాడు మేము, యోగిసత్తమ! త్వద్వార్త నుగ్గడించి
తావకీనులౌ భక్తసత్తములతోడ, దుస్తరమగు మాయం దరింతుము శుభాంగ!

గీ. అంబుజాక్ష! నృలోకవిడంబనమగు, నీదు చెయ్వులు నీ నుడుల్ నీ గతులును
నీదు నగవులు చూడ్కులు నేము సతముఁ, దలఁచుకొనుచుఁ గీర్తించుచు
మెలఁగుదు మిట. 167

గీ. ధారుణీధవ! యిట్టు లుద్ధవునిచేత, నాథనాథుండు శౌరి విజ్ఞాపితుఁడయి
ప్రేమ నేకాంతియుం బ్రియభృత్యుఁడునగు, నుద్ధవుం బొడఁగాంచి యిట్లొయ్యఁ
బలికె. 168

## అ ధ్యా య ము 7.

భగవద్గీత: అవధూత యదుసంవాదము 'కపోతోపాఖ్యానము'

శ్రీభగవానుడు:—

గీ. ఓ మహాభాగధేయ! నీవడు క్తమెల్లఁ, దలఁచిచూడంగఁ నేఁజేయఁదలఁచినదియ పద్మభవుఁడు భవుఁడు లోకపాలకులు మ, దీయ వైకుంఠవాసమర్థించుచుండ్రి. 169

గీ. సరసిజభవార్థితుండనై స్వాంశమున య, దర్థమవతారమెత్తితిని సమస్త దేవతాకార్యమెల్లనునీర్పఁబడియె, నిరవశేషంబుగా మాననీయచరిత! 170

చ. యతివరశాపదగ్ధమయి యాదవవంశ మిదెల్ల వేల్మిడిన్
బ్రతిహతమై నశించును బరస్పర విగ్రహకారణంబునన్
హృతసకలప్రభావమగు నీపురి నేడవనాఁడు భీషణో
ద్ధతచటులోత్తరంగ కలితంబగు వారిధిముంచుఁబెల్చనన్. 171

శా. శ్రీకల్యాణగుణాకరుండనగు నా చేతం బరిత్యక్తమై
లోకంబియ్యది నష్టమంగళము సంలుప్తప్రకాశంబునౌ
వైకల్యంబునుజెందుఁ దానఁ గలియుం బాధించు నట్లాటచే
నీ కిందున్ వసియింపఁగాఁ దగదు విం టే సాధులోకోత్తమా! 172

గీ. మత్పరిత్యక్తమైన భూమండలమునఁ, గలియుగంబున భద్ర! యఖిలజనంబుఁ దలఁచిచూడంగ నిత్య మధర్మమంద, రక్తిగలిగిప్రవర్తిల్లుఁబ్రాకటముగ. 173

గీ. నీ వికఁ స్వబంధుజనుల పైస్నేహమెల్ల, విడిచి నాయందు మనముఁజొన్పి నమదృష్టి వగుచుఁ గడులెస్స నీ సమస్తావనీత, లంబునం దిరుగాడు ముల్లంబుఁ దనర. 174

వ. మనోవాక్చక్షుశ్శ్రవణాదీంద్రియ గణంబుల గ్రహింపఁబడు మాయామయంబగు నీ యఖిలంబు నశ్వరంబని యెఱుంగుము. యోగయుక్తుండుగాని పురుషునకు నానార్థవిషయిక భ్రాంతి యుత్పన్నంబగు. ఆభ్రాంతియే గుణదోషంబులఁ బొందు చుండు. గుణదోషబుద్ధి భేదంబునఁ గర్మయనియు నకర్మయనియు వికర్మయనియుఁ గలుగుచుండు. కావున నింద్రియగ్రామంబును నిగ్రహించి యోగయుక్త మన స్కుండవై యీ విశ్వంబు నాత్మయందు నిరీక్షింపుము. విస్తృతమైన యాత్మ నధీశ్వరుండనగు నాయందుఁ బరికింపుము. జ్ఞానవిజ్ఞాన సంయుక్తుండవై శరీరు లకు నాత్మభూతుండవై యాత్మానుభూతిపరితుష్టహృదయుండవై పరిత్యజించిన యెడలఁ బ్రత్యవాయంబులచేఁ బ్రతిహతుండవు కాకుండువు. ఉభయాతీతుండై బుధుం డర్భకుండుంబోలె దోషబుద్ధిచే నిషేధంబునుండి మరలకుండు. గుణబుద్ధిచే విహితంబును గావింపకుండు. సర్వభూత సఖుండును, శాంతాత్ముండును, జ్ఞాన

విజ్ఞాన నిశ్చయకలితుండును నై విశ్వంబును మదాత్మకంబుగాఁగాంచుచు వెండియు
విపన్నుండు గాకుండు. 175

శ్రీశుకుఁడు:—

ఆ. అనుచు నిట్లు భగవత్పదాదిష్టుఁడై యుద్ధవుండు భాగవత వర్యుండు భక్తిఁ
దనరఁ బార్థివేంద్ర! తత్త్వజిజ్ఞాసువై, పరమపురుషుఁ గాంచి పలికె నిట్లు. 176

ఉద్ధవుఁడు:—

వ. ఓ యోగీశ్వరా! యోగస్వరూపా! పరమపురుషా! నా శ్రేయంబుఁ గోరి సన్న్యాస లక్షణంబగు త్యాగంబుఁ జెప్పితివి. విషయపరులును నీయం దభక్తులు నగువారి కీత్యాగంబు దుష్కరంబని నా యాశయంబు. నే నహంతా మమతలచే మోహబుద్ధినై భవన్మాయావిరచితాను బంధంబుల గాఢానురక్తుండనై భవత్ప్రోక్తంబగు యోగంబు నెట్లు సాధింపగలనో యుష్మత్పాద సేవకుండనగు నన్ను శాసింపుము. ఆత్మరూపుఁడవగు నిన్నుఁ దక్క వేల్పులయందును వేఱొక్క వక్తను నేను గానను. ఈ బ్రహ్మాది సకలశరీరధారులును భవన్మాయచే విమోహితబుద్ధులై బాహ్యార్థంబులఁ బ్రవర్తింతురు. కాన నో సర్వేశ్వరా! యనవద్యుండవు, ననంతసారుండవు, సర్వజ్ఞుండవు, నీశ్వరుండవు, వైకుంఠవాసుండవు, నరసఖుండవు, నారాయణుండవు నగు నిన్ను మహాపాపసంతప్తుఁడనగు నేను శరణువొందెద ననిన నుద్ధవునకు శ్రీకృష్ణుఁ డిట్లనియె. 177

శ్రీకృష్ణుఁడు:—

వ. ఉద్ధవా! ప్రాయికంబుగ మునులు లోకతత్త్వ విశారదులై దుస్సంగంబునుండి యాత్మచేతనే యాత్మము నుద్ధరించుకొందురు. పురుషున కాత్మయే గురువు. ప్రత్యక్షానుమానంబులచే పురుషుండు విషయాభిజ్ఞుండై శ్రేయంబు వడయు. సాంఖ్యయోగ నిపుణులైన ధీరులు సర్వశక్త్యుపబృంహితుండనగు నన్ను పురుషత్వంబునన విస్తృతునిఁగాఁ బొడఁగాంతురు. ఏక ద్వి త్రి చతుష్పాద బహుపాద జంతువులు పాదరహితజంతువులు నాచే సృష్టింపఁబడినవి పెక్కులు గలవు. ఆ జంతువులకు నా పురుషశక్తి ప్రియమైనది. వానియందు హేతువులచే గ్రహింపఁబడు గుణలింగంబులచే నీశ్వరుండనగు నన్ను ధీమంతు లన్వేషింతురు. గ్రాహ్యంబు కానిదాని ననుమానంబునఁ దెలియుదురు. 178

క. విను మిచ్చోటఁ బురాతన, మనఘమునైన యవధూతయదుసంవాదం
బను నితిహాసము కోవిద,జనులు కరం బుదహరింతురు సమ్యక్ఫణితిన్. 179

క. భూభర్తయైన యదు వకుతోభయునిం దరుణుని నవధూతాకారున్
ధీభాసురు భూసురుఁ గని, యీభంగిన్ బృచ్ఛఁ జేసె నెనసిన వేడ్కన్. 180

యదువు:—

ఆ. బాలుభంగి నీవు ప్రాజ్ఞుండవయ్యును, దేనిఁబూని జగతిఁ దిరుగుచుందు
వా సునిపుణమైన యట్టి బుద్ధి జనించె, నీకు నెందునుండి నిర్మలాత్మ! 181

క. పాయికముగ మానవు లిల, నాయువు శ్రీయును యశంబు నర్థించియు కా
పాయక పురుషార్థముల న, మేయంబగు తత్త్వచింత మెలఁగుదురు గదే. 182

క. చతురుఁడవు జ్ఞానగతి వి, శ్రుతుఁడవు మితభాషణుఁడవు సుభగుండ వహో!
యతివర! బాలోన్మత్తుల,గతి నూరక తిరుగుదీ వ కర్తవగు చిలన్. 183

ఉ. వారక కామలోభభవ పావకకీలలచే జనంబు ల
వ్వారిగ దహ్యమానులయి బాధలనొందుచుఁ గుందుచుండ నే
కారణమో యెఱుంగ నల గాంగజలంబుల మగ్నమైన యా
వ్వారణరాజమట్టులు లవంబును దాఁకము నొందకుం దహో! 184

ఆ. సంయమీంద్ర! విషయ సంగసంవర్జితుఁ, డవును కేవలాత్ముఁ డవునగుచును
మెలఁగ నీకు సంభవిలిన యాత్మానంద, కారణంబుఁ దెల్పఁ గదవె నాకు. 185

శ్రీకృష్ణుఁడు:—

ఆ. సాధుశీలుండు బుద్ధి విశాలుఁడైన, యదునృపాలునిచే నిట్టులడుగఁబడి స
భాజితుండయి యమ్మహాభాగుఁడిట్టు,లనియె వినయావనతయదుజనవిభునకు.

బ్రాహ్మణుఁడు:—

ఉ. భూవర! బుద్ధ్యుపాత్తగురువుల్ పలువుర్ గలరయ్య నాకు నా
జీవక వేరినుండి యిటు బుద్ధిని గైకొని ముక్తసంగతన్
వావిరి లోకమందు నిరపాయతఁ గ్రుమ్మరుచున్న వాఁడనో
నే వచియింతు వారి వినునేర్పుఁ దలిర్పఁగ సావధానతన్. 187

సీ. వసుధయు ననిల మంబరమును దోయంబు, ననలంబుఁ జంద్రముఁ దర్యముండుఁ
గలరవంబును నజగరము సాగరము ప, తంగంబు మధుకరముం గజంబు
అధిప! మధుఘ్నుండు హరిణంబు మీనమున్, బింగళ కురరమున్ డింభకుండుఁ
గన్యకయును శరకారుఁడు ఫణి యూర్ణ, నాభియు భ్రమరంబు నాఁబరఁగెడు

గీ. వీర లిరువదినల్వురు ధారుణీశ్వ,రా! మదాశ్రితగురువులు ప్రకటములయి
తనరు వీరి శిక్షావృత్తులనుగఱచితి, నాత్మబోధక్రమంబు నెయ్యంబుమీర. 188

క. పురుషర్షభ! యదుధాత్రీ,శ్వర! యే దెవ్వానినుండి వగఁ గఱచితినో
వెరవొప్పఁగ నది దెలిపెద, సొరిది నెఱుంగుము ముదంబు చొప్పిల నధిపా! 189

సీ. దైవవశవర్తులై నభూతములచేత, నాక్రమింపంగఁ బడియు నయ్యాది యెఱిఁగిన
వాఁడు చలియింపకుండు నత్పథమునుండి, యట్టి వ్రతమును గఱచితి నవనినుండి.

వ. పరార్థతత్పరుండై పరార్థనియతసంభవుండై సాధుజనుండు పర్వతశిష్యుండై పర్వతంబునుండి పరోపకారపరతను నేర్వవలయు. మఱియు జ్ఞానంబు నశింపకుండు నట్లును, నింద్రియార్థంబులచే వాఙ్మనఃక్రియలు విక్షిప్తంబులు కాకుండునట్లును యత్నించి యతివరుండు కేవల ప్రాణవృత్తిచేతనే సంతుష్టుండు కావలయు. 191

గీ. వివిధధర్మంబులై యుండుకవిషయములను, జొచ్చియుండియు వాయువుకజోక యోగి యరయ గుణదోషసంవర్జితాత్ముఁడగుచు, సంగముంబొందకుండ మెకలంగుటొప్పు.

వ. పృథివీసంబంధంబులైన దేహంబులందుఁ బ్రవేశించి తద్గుణాశ్రయుండయ్యును యోగనిపుణుం డాత్మదర్శియై గంధంబులచే వాయువుంబోలె గుణంబులచే సంసక్తుండు కాకుండవలయు. స్థావరజంగమంబులగు భూతంబులందు బ్రహ్మాత్మ భావ సమన్వయంబుచే నంతర్గతుండయ్యును నభంబుంబోలె సర్వవ్యాపకత్వముఁ గలిగి యవిచ్ఛిన్నుండు నసక్తుండునై యుండవలయు. వాయుప్రేరితములగు మేఘాదులచేత నంతరిక్షంబుంబోలె పావకజలాన్నమయభావంబులగు కాలసృష్టి గుణంబులచేఁ బురుషుండు స్పృశింపఁబడకుండవలయు. 193

నిర్మలుండును, స్వభావస్నిగ్ధుండును, మధురమూర్తియు నరునకుఁ దీర్థభూమి యునై యోగీంద్రుండు వీక్షణ, స్పర్శన, కీర్తనాదులచేఁ దోయంబుంబోలె నిజమిత్రగుణంబును బునీతముంజేయు. 194

తేజస్వియైన యోగి తపోవిరాజితుండై యపరిగ్రహుండై సర్వభక్షుండయ్యును బావకుండుంబోలె మాలిన్యంబును గ్రహింపకుండు. 195

ఒకచో మఱుఁగుపడి మఱొకచో బయలుపడి శ్రేయస్కాముల కుపాస్యుండై యెల్లయెడల దాతృజనంబుల పూర్వోత్తరపాపంబుల నిశ్శేషంబుగా నిర్దగ్ధంబుఁ గావించుచు భిక్ష నారగించుచుండు. 196

చరాచరాత్మకంబును స్వమాయారచితంబు నగు నీ విశ్వంబుఁ బ్రవేశించి యీశ్వరుండై యింధనంబులయందుఁ బావకుండుంబోలెఁ దదంతర్గతుండై యుండు. 197

అవ్యక్తపదంబగు కాలంబుచేఁ జంద్రునకుఁగాక కళలకెట్లు క్షయంబుకలుగు నట్ల దేహంబునకు జన్మాదిభావంబులు శ్మశానాంతపర్యంతంబులై యుండును. ఆత్మకు మాత్రమట్లుకాదు. 198

ప్రవాహవేగంబగు కాలంబుచే భూతజాలంబున కుత్పత్తి నాశనంబు లగ్నిజ్వాలలకుంబోలె నిత్యంబులైన నగ్నికివలె నాత్మకుఁ గానరాకుండు. 199

మఱియు నాదిత్యుండు నిజమరీచుల సలిలంబులంబోలె యోగివరుండు గుణంబులచే గుణంబుల గ్రహించి కాలానుసారంబుగ విసర్జించుచుండుంగాని వాని సంయోగంబు బొరయఁడు. మందబుద్ధులచే స్వభేద భావంబునంజేసి జలాంతర్గత

భాస్కరుండుంబోలె గుణగతుండును, వ్యక్తిస్థుండుగా నాత్మ యుపలక్షింపంబడు. 200

గీ. ఎవనితోనేని నెందేని నెక్కుడైన, స్నేహముఁ బ్రసంగమున్ యోగి చేయరాదు;
చేసెనేని సంతాపంబుఁ జెందు దీన, బుద్ధిమాలు వర్తిల్లు కపోతమట్లు. 201

చ. వినుము కపోత మొక్క టడవిం దరుశాఖను గూడు వెట్టి కూ
ర్మి నిజకపోతితోడ విహరించుచునుండెను గొన్నియేండ్లు స్నే
హ నిచితమానసంబులయి యయ్యవి రెండునుగూడి బుద్ధి బు
ద్ధిని మఱి యంగ మంగమున దృష్టియు దృష్టిని గూర్చి నింపుగన్. 202

చ. నిలిచినఁ గూరుచున్న శయనించినఁ గ్రుమ్మరుచున్నఁ బ్రీతి రం
జిల విహరించుచున్నను నిజేచ్ఛలఁ గ్రీడలు సేయుచున్న న
వ్వలుఁగులు రెండునున్ మిధునమ్ముం బెడబాయక యెల్లప్రొద్దు వి
చ్చలవిడి సంచరించుచు నజస్రమునుండెడు మోహబద్ధమై. 203

చ. అపరిమితానురాగమున నత్యధికంబుగఁ బ్రీతి సేయుచున్
నృపవర! యక్కపోతి మది నెయ్యెది యెయ్యెది గోరుచుండుఁ దా
నపుడ కపోత మెట్టెటులో యయ్యది యయ్యది తెచ్చియిచ్చి తి
య్యపు మమకారముల్ సెలఁగ నాదృతి సేయుచునుండు నిచ్చలున్. 204

గీ. యదునృపాలోత్తమా! యంత సక్కపోతి, ప్రథమగర్భంబు ధరియించి ప్రసవసమయ
మరుగుదేరంగఁ దనపతి యంతికమున, నండములు వెట్టె నిజకులాయంబునందు.

గీ. దుర్వితర్క్యపరేశశక్తుల కతమునఁ, దగిన కాలంబునం గల్పితావయవము
లును మృదుతనూరుహములునై తనరుచుండి, పొడమె నాయండములనుండి పోతకములు 206

క. సుతవాత్సల్యముతోడ న, మితమగు తమి నాకపోతమిధునము తత్కూ
జితముల వినుచున్ నవచే, ష్టితములఁ గనుచున్ బ్రహృష్టచిత్తములయ్యెన్. 207

గీ. హృష్టపుష్టములై యలరించుచున్న, కొడుకుఁగుఱ్ఱల స్పర్శలం గూజితముల
మంజుచేష్టలఁ బత్యుద్గమములమిగులఁ, దల్లిదండ్రులకున్ బ్రమోదంబువొడమె.

గీ. ఇట్టు లన్యోన్యసంరక్తహృదయులగుచు, భూరితరవిష్ణుమాయావిమోహితులయి
మందమతులు కపోతదంపతులు తమదు, శిశువులం దమితోడఁ బోషించుచుండ.

క. ఒకనాఁ డా నిసువుల మే, తకు నయి వెస నా కపోతదంపతులు వనో
ర్వికిన్నేగి పెద్దతడవు వె, తకు చాహారంబునందుఁ దారు చరింపన్. 210

క. ఒకబోయ యాత్మగేహాం, తికమునఁ జరియించుపులుఁగు నిసుగులనంతన్
బ్రకటముగఁగాంచి వల ద, గులుకొనఁగాఁజేసె గడియలో విధివశతన్. 211

చ. నిసుగుల పోషణార్థమయి నిత్యము వేడుకఁజెందుచుండి ము
ర్వా సలుపు నక్కపోతముఁ గపోతియు నోగిరముం గ్రహించుచున్
వెసమెయిఁ బ్రీతినెక్కొన స్వనీడముఁజేరియు గూటిలోపలన్
స్వ సుతులఁ గానఁజాలక విషాదపరీతమనస్కులై రటన్. 212

ఉ. అంతట నక్కపోతి తన యాత్మజులన్ దృఢజాలబద్ధులన్
భ్రాంతమునందుఁ జూచి విధురాశయమై కడు మొఱ్ఱవెట్టు చ
త్యంతము దుఃఖభారము లెదం గలఁపంగఁ గడంగి త్రాసిత
స్వాంతుల బాలురన్ గదియఁ బాఱె హుటాహుటిఁ బ్రేమపెంపునన్. 213

గీ. పరువునంబోయి యాజాలబద్ధములగు, శాబకములఁగాంచుచు స్మృతిసన్నగిల్లఁ
దద్గతస్నేహతప్తచిత్తయయియందుఁ, దగులుకొనిపోయెనాకపోతాంగనయును.

క. ఆత్మాధికులన్ బ్రియుల ని, జాత్మజులన్ దుఃఖభార హతులఁ గపోతం
బాత్మసమను సతినింగని, యాత్మను విలపించె దైన్యమడరఁగనిటులన్. 215

చ. కటకట! నా యుపద్రవముఁ గాంచుఁడు నేనధికాల్పపుణ్యుఁడన్
గుటిలమనస్కుఁడన్ ఖగులఁ గ్రూరుఁడఁ జూడ నధన్యుఁడన్ విశం
కటుఁడ నతృప్తుఁడం దలఁపఁగా నిఁక నాకును లేదుదారి యి
ప్పటిగతి యారయం జెడెఁ ద్రివర్గపదంబగు గేహ మక్కటా! 216

క. అనురూపయు ననుకూలయుఁ, గనఁ బతిదేవతయునైనె గడు నాసతి యిం
టను నన్ను నొంటివిడిచియుఁ, దనయులతోఁజేరుచుండెఁ దా స్వర్గంబున్. 217

క. ఆలుం బిడ్డలు చావన్, జాలింబడి శూన్యమైన సదనమునం దిం
కేలా జీవించుట యిది, మేలా? ఘనదుఃఖ ముపశమించునె యిటులన్. 218

వ. అని తలపోసి యక్కపోతంబు— 219

క. జాలావృతులున్ మృత్యుక, రాలాస్యగ్రస్తులున్ దురంతశుచులు నా
యాలుంబిడ్డలఁగనుచునె, జాలిఁ బడెఁ గపోత మపుడు జాలమునందున్. 220

ఉ. క్రూరుఁడు లుబ్ధకుండు తనకున్ బ్రమదంబిడు కామితంబు నిం
డారఁగ నక్కపోతమిథునంబును దన్నవశాబకంబులన్
బోరన బుట్టఁబెట్టుకొని పోయెఁ గృతార్థునిఁగాఁగ దన్ను లో
నారసికొంచు నో యదునృపాగ్రణి! యిత్తెఱఁ గాలకించితే? 201

గీ. ఈగతిఁ గుటుంబి శాంతి విహీనుఁడగుచు, ద్వంద్వసుఖములకై యాపతత్రిపోత
దీనతఁ గుటుంబపోషణాధీనబుద్ధి, సానుబంధుఁడై సర్వనాశంబునొందు. 222

క. మానుషజన్మము నొందియు, దీనత ముక్తికిని దొలఁగి ♦ దివిరి గృహమునన్
దా నెవఁడు ఖగముగతిఁ దద, ధీనుఁడొ యారూఢభ్రష్టుఁ ♦ డెలియుదు రతనిన్. 223

---

## అ ధ్యా య ము 8.

### పింగళోపాఖ్యానము

బ్రాహ్మణుఁడు:—

గీ. దివిని నరకమందేని నైంద్రియకసుఖము, దేహికిన్ దుఃఖపరిణతిఁ ♦ దెచ్చుచుండుఁ
గావున యదుక్షితీశ్వర! ♦ కోవిదుండు, దాని గోరంగరాదు సుంతయును మదిని.

గీ. అధికమైన నల్పంబైన ♦ మధురమైన, విరసమైన యదృచ్ఛఁ బ్రా ♦ ప్తించినట్టి
యోగిరంబును భుజియించు ♦ టొప్పుఁ బ్రీతి, రాజ! యీయదె యాజగ ♦ రవ్రతంబు.

క. ఓగిరము చిక్కకున్నన్, యోగి నిరాహారుఁడున్ ని ♦ రుద్యముఁ డగుచున్
లోఁగక దివసములు మహా, భోగిగతిఁ బరుండు దిష్ట ♦ భోజనుఁడగుచున్. 226

గీ. యోగి యోజస్సహోబల ♦ యుక్తమైన, కర్మవర్జిత దేహంబు ♦ కలిగి వీత
నిద్రుఁడై శయనించు నింద్రియసమేతుఁ, డయ్యు వాంఛింపకుండు నె ♦ య్యదియు
మదిని. 227

గీ. స్తిమితతోయార్ణవంబుచం ♦ దమున మునిప్ర, సన్నగంభీరుఁడు ననంత ♦ పారుఁడు నవి
కార్యుఁడు నమేయుఁడును దుర్వి ♦ గాహ్యుడునయి, సంతతంబు నొప్పు ఱా
♦ జన్యతిలక! 228

క. శ్రీనారాయణపరుఁడయి, కానంబడు మునిసమృద్ధ ♦ కాముండైనన్
హీనుండైనను నదులఁ బ, యోనిధివలెఁ బెఱుగుఁదఱుగుఁ ♦ లుండక మెలఁగున్. 229

ఆ. దేవమాయయైన ♦ స్త్రీనిగాంచి జడుండు, దానిభావములకు ♦ లోనగుచుఁ బ్ర
లోభపరత నగ్ని ♦ లోఁబడు మిడుతచం, దమునఁగూలు నంధ ♦ తామసమున. 230

ఉ. దైవికమాయనైన వని ♦ తాకనకాభరణాంబరాది నా
నావిధవస్తుసంచయము ♦ నందు జడుండు ప్రలోభితాత్ముడై
చేవఁదొఱంగి రాగయుత ♦ చిత్తముతో నుపభోగకాంక్ష ధా
త్రీవర! యా పతంగము గ ♦ తిన్ నశియించు వినష్టదృష్టియై. 231

గీ. దేహమెంతమాత్రాన వ ♦ ర్తిల్లుచుండు, కొలఁదికొలఁదిగ భుజియింప ♦ వలయునంతె
ఫూని గ్రేస్తు బాధింపక ♦ మునివరుండు, మాధుకరవృత్తి ననుసరిం ♦ పంగవలయు. 232

క. మాపటికి రేపటికి నని, తాపసుఁ డిటు సంగ్రహింపఁ ♦ దగ దిల భిక్షన్
జేపట్టవలయు నుదరం, బే పాత్రగ మాధుకరపు ♦ వృత్తి దలిర్పన్. 233

గీ. భిక్షుకుఁడు దారుమయియగు వెలఁదినేనిఁ, బాదమున నైన సంస్పృశింపంగరాదు
అల కరేణ్వంగసంగతమైన గజము పగిది స్పృశియించువాఁడు సంబద్ధుఁడగును.

ఆ. ఆత్మ మృత్యురూపయగు నంగనం గవ, యంగరాదు ప్రాజ్ఞుఁడైనవాఁడు
పరిబలు లతనిఁ బట్టి పరిమార్తు రన్యగ, జములు గజమునట్లు జనవరేణ్య! 235

గీ. దుఃఖసంచితార్థంబు లుబ్ధులు వెఱలకు, నిడరు కుడువరు తుదకది యితరజనులె
వెరవునం గైకొని యనుభవింత్రు సూవె, దండిమై మధువున్ మధుఘ్నుండుపోలె.

క. యతియ భుజియించుఁ దొలుతన్, మతిని గృహాశీస్సులం గొసంగొరు గృహ
స్థతతుల కష్టార్జితవ, స్తుతతుల నల మధువునున్ మధుఘ్నుఁడుపోలెన్. 237

క. వినరాదు గ్రామ్యగీతము, మునివరుఁ డెన్నండు దాన మోసమ్మగు వ్యా
ధునిగీతిన్ మోహంబం, దిన హరిణమువలన దీని నేర్వంగవలయున్. 238

గీ. అంగనానివహముల గ్రామ్యంబులైన, నృత్తవాద్యగీతులఁ జిత్తమత్తమిల్ల
నెలమి హరిణీసుతుండగు ఋష్యశృంగుఁ, డాటవస్తువై వారి వశ్యతను జెందె. 239

చ. ఇరవున నెంతదక్క రసనేంద్రియమున్ గెలువంగలేఁడు సు
స్థిరమతి నంతదక్కఁ బ్రియతించి తదన్యములైన యింద్రియో
త్కరము జయింపఁగల్గినను దాన నరుండు జితేంద్రియుండు కాఁ
డు రసన గెల్చినాతఁడె కడున్ సకలంబును గెల్చినాతఁడా. 240

మ. అవనీంద్రా! కడుగాఱియంబఱచు జిహ్వాచంచలత్వంబునన్
జవులం జొక్కి జనుండు గాలమున మత్స్యంబట్లు మ్రిందున్ జయిం
త్రు వెసన్ జిహ్వనుదక్క యింద్రియతతిన్ దోడ్తో నిరాహారులై
తవులున్ మాని భుజించినన్ రసనయుం దా శాంతినిం బొందెడున్. 241

సీ. పింగళ యనియెడు వేశ్య తొల్లి విదేహ, పురసీమయందుఁ గాపురము సేయుఁ
బార్థివోత్తమ! దానివలన నా నేర్చిన, యదికొంతగలదు దెల్పెదను వినుము
పుంశ్చలియైన యాపాలతుక యొకనాఁడు, ప్రీతి వల్లభుని సంకేతమునకుఁ
గొంపోవ వెలుపలి గుమ్మములోఁ జారు, తర రూపముం దాల్చి దారి వచ్చు

గీ. పూరుషులు శుల్కదులు సురూపులు సధనులు, నైనవారిఁ గోరుచు వారల
వలికేగ
నన్యుఁ డొక్కఁడు ధనవంతుఁ డరుగుదెంచు, భూరిమూల్యప్రదుండని కోరుచుండు.

గీ. ఈగతి దురాశచే నిద్రవీగిపోవ, ద్వారభూమినిఁ జేరి యవ్వారకాంత
వెలికి లోనికిఁ బల్మఱు విసుగులేక, చేరుచుండంగ నంత నిశీథమయ్యె. 243

చ. అమిత ధనాశచేత నిటులారడిపాలయి మోము సొక్క ను
ల్లము దిగులొంద నవ్వెలవెలందుక గ్లానినిఁ జెందుచుండె నా

సమయమునందు సత్యమలసౌఖ్యవిధాయకమున్ ధనాశమూ
లముగ గలట్టిదై వెస నలంమతిపుట్టె నరేంద్ర! యూపెకున్. 244

గీ. అట్లు నిర్విణ్ణమానసయై సలిపిన,సుదతి గీతంబు నీకుఁ జెల్పెద వినుమది
పూరుషుల ఘనాశాపాశములనుద్రెంచు,హత్తుకొన్న నిర్వేదంబుకత్తివోలె. 245

వ. అజాతనిర్వేదుండు దేహబంధం బుడుపుకొనఁజాలండని రాజున కెఱింగించి
య య్యవధూతోత్తముండు మఱియు నిట్లనియె. 246

పింగళ:—

గీ. అక్కటా! యజితేంద్రియనై సతంబు,సంచరించితి మోహపాశమునఁజిక్కి
మూఢురాలను నే నసత్పురుషుఁడైన,కాంతువలనఁగోరుచునుంటిఁగామితములు.

చ. నిరతము మత్సకాశమున నిల్చి రతిన్ దవిణంబు నిచ్చుచున్
మురిపముఁగూర్చు నీ పరమపూరుషునిన్ విడనాడి యజ్ఞనా
తురమతినై యకామదునిదుఃఖభయార్తివిషాదమోహముల్
బారిపోరినిచ్చు తుచ్ఛుఁడగుపూరుషుఁగోరి సదా భజించితిన్. 248

ఉ. యాతనఁబెట్టుకొంటిని మదాత్మను నే నతి గర్హ్యమైన సాం
కేతికవృత్తిచేతఁ బరికింపక స్త్రైణుఁడు లుబ్ధుఁడున్ నయా
పేతుఁడు శోచనీయుఁడునుపీరిడియా నరుఁ జెట్టఁబట్టి వి
క్రీతముచేసి దేహము సిరిన్ రతినిన్.మది నిచ్ఛగించుచున్. 249

సీ. బహుళాస్థినిర్మితవంశవంశ్యస్థూణ,మై చర్మ రోమ నఖాళిపిహిత
మును జుగుప్సిత మలమూత్రపూర్ణ మును స్ఫురన్నవద్వారసంగ్రథితమునగు
గృహరూపమ త్యశరీరమందేఁ, దక్కయన్య యెవ్వతుక మోహంబుఁజెందు
యీ విదేహపురానఁనేనొకర్తనె మూఢ,బుద్ధినై తిని తలపోసిచూడ

గీ. మహితనిర్వృతిదాయి యాత్మప్రభుండు,నైన నారాయణునికంటెనన్యుఁడైన
కాంతునెదలోనఁగోరుచుఁగటకట!యిటు,లసతినై మోలఁగితిఁగాదె?యహరహంబు

గీ. ప్రియుఁడు మిత్రుఁడు విభుఁడు శరీరులకును, నాత్మయనగుండలంపనీయచ్యుతుండు
ఆత్మచేతనె యితని నెయ్యమునఁ గ్రీతుఁ, జేసి రమియింతునిచ్ఛలుసిరి తెఱఁగున.

వ. ఆద్యంతవంతంబులగు కామంబులును గామప్రదులు కాలచరితులగు నరులు సుర
లును బ్రేయసి కేమంత ప్రియంబు గూర్చువారలగుదురు ? 252

గీ. ఆరయన్ దురాశాగ్రస్తనైన నాకు,హాయినిచ్చు నిర్వేదమిాయదిజనించె
పూర్వకృతమగునే కర్మమునన్నొనాకు,నచ్యుతుండుదాసంప్రీతుఁడయ్యెధ్రువము.

గీ. కావు నిర్వేదహేతువుల్ కష్టములివి, యరసిచూడ నే హతభాగ్య నగుదు నేని
నరుఁడు ప్రబలనిర్వేదంబున న్గృహాది, కానుబంధంబు విడిచి శాంతాత్ముఁడగును.

సీ. విష్ణూపకృతసునిర్వేదంబు గ్రామ్యసంగత నగు నే మస్తకమునఁదాల్చి
యాత్మయందు దురాశఁ ద్యజియించి జగదధీశ్వరుఁడైన యచ్యుతు శరణుఁజొత్తు
సంతుష్టనై హరిన్ శ్రద్ధఁగొల్చుచు యదృచ్ఛాలబ్ధి మనుచు నిస్సంశయముగ
విహరింతు నే నాత్మవిభుఁడైన యవ్వాసుదేవుతో నాయాత్మ దీటుఁగొల్పి

గీ. విషయసంఘాతముషితవివేకధనము, కాలరూపకాకోదర గ్రస్తము భవ
కూపపతితము నగునాత్మ నోపియెవ్వఁ, డన్యుఁడు కడంకఁ బ్రోవ సమర్థుఁడగును.

గీ. జాతనిర్వేదుఁడగు సమస్తమున నెపుడు, నపుడు తనుదానఁగాచుకో నర్హుఁడగును
అప్రమత్తుఁడై కాలరూపాహిచేత, గ్రస్తమైన జగంబును గాంచవలయు. 256

బ్రాహ్మణుఁడు:—

క. ఈ తెఱఁగున నిశ్చితమతియై తోయలి భోగపూరుషాభిలషితసం
జాతదురాశన్ విడిచి నృపా! తల్పముఁజేరె శాంతభావముతనరన్. 257

క. ఆశ పరమదుఃఖమ్ము నిరాశ పరమసుఖము భూవరా! యిట్టుల కాం
తాశన్ బింగళ త్రెంచి మహేశా! నిదురించె సౌఖ్యమెసకంబెసఁగన్. 258

## అధ్యాయము 9.

కురరాది శిక్షితాభివర్ణనము

బ్రాహ్మణుఁడు:—

క. నరులకుఁ బ్రియతమమే దది, పరిగ్రహించుటయె దుఃఖభాజనమగుఁ జూ
పరమసుఖ మొందుదానిన్, వెరవున విడనాడువాఁడు పృథ్వీరమణా! 259

క. ఆమిషయుతకురరమును నిరామిషములగు బలదర్పితాన్యకురరముల్
బాములు వెట్టఁగ నది యా యామిషమున్ విడిచి సుఖము నందె నెడందన్. 260

మ. మనుజేంద్రా! విను నాకు లేవు లవమున్ మానావమానాలు పే
ర్కొనఁగా గేస్తులకుండు చింతయును నాకున్ లేదు నిత్యంబు డిం
భునిలీలన్ విహరింతు నాత్మరతినై మూఢాత్ముఁడౌ బాలకుం
డును నాత్మజ్ఞుఁడు నిర్వురే సుఖులు తక్కన్యుల్ చింతకున్ దూరులున్. 261

సీ. ఒకయూర కన్యక యొకర్తు తన్నన్నతల్లి యుఁదండ్రియుంటను లేనితఱిని
తను వరింపన్ గృహమునకరుదెంచిన, వారలన్ స్వయముగా గౌరవించి
యపుడు తదభ్యవహారార్థమై శాలిధాన్యంబులన్ రహస్స్థలమునందు
దంపుచునుండఁగఁ దత్ప్రకోష్ఠస్థ కాచంబులు పెన్మ్రోతనలిపె నంత

గీ. నది జుగుప్సితముగ నెంచి యా గుణవతి, చిత్తమందున నెంతయుఁ సిగ్గుఁ జెంది
యొక్కొకటిగాఁగ కాచముల్ ప్రవక్కలించి, రెండుచేతులకున్ రెండుఁ రెండె యునిచె.

గీ. క్రమ్మఱ నదంచుచుండఁ దత్కరములఁగల, జంటలన్ ధ్వనిపుట్ట నాఁసన్న తాఁగి
అందొకొక్కటి భేదించి యవలఁ బెట్టె, నొక్కటన్ని స్వనము పుట్టఁకుండె నప్డు. 263

గీ. లోకతత్త్వజిఘృక్షునీఁ లోకములను, దిమ్మరుచునుండి నేను ధాత్రీవరేణ్యా!
ఆ కుమారికవలన నయంబుఁ బరిగణించి యీయుపదేశంబుఁ నేర్చుకొంటి. 264

ఆ. పలువు రొక్కచోటఁ గలియఁ గయ్యంబగు, నిరువురున్న రేగుఁ నేవొ గొడవ
కాన నొకఁడె మెలఁగఁగా నగు యోగి యెన్నఁగ కుమారి కంకణంబు వోలె. 265

క. అనలసుఁడై వైరాగ్యంబున నభ్యాసమున జలనమున్ మాన్పి మనం
బును గూర్పవలయు నొకచోఁ, దనర జితశ్వాసుఁడున్ జితాసనుఁడగుచున్. 266

వ. పరమానందరూపుఁడగు భగవంతునియందు లబ్ధాస్పదంబై లయవిక్షేపాత్మకం
బైన మనంబు క్రమంబునఁ గర్మవాసనలన్ జయించు. పరివృద్ధంబైన సత్త్వ
గుణంబుచే రజస్తమోగుణంబుల నివారించి యనింధనంబైన యనలంబుం బోలె
నిర్వాణంబుం బొందు. 267

మ. శరకారుండు శరంబునందె మనమున్ సంధించి పార్శ్వంబునన్
గరిమన్ బోయెడు రాజు నేనియుఁ గనంగాఁ బోని చందంబునన్
బరమాత్మప్రతిరుద్ధమానసుఁడు దాఁ బాహ్యాపరిదేశంబు నాం-
తరమున్ గూడ నెఱుంగఁజాలఁడు యథార్థంబిద్ది ధాత్రీశ్వరా! 268

క. అనికేతుండు గుహాశయుఁడు నదీనుం డప్రమత్తుఁడున్ మితవచనుం
డును మఱి యేకాకియునై, ముని యాచారములఁ దెలియఁ బోక మెలఁగనౌ. 269

గీ. నశ్వరశరీరునకు సదనప్రయత్న, మరయ దుఃఖంబు నకెయ్యఁగు వ్యర్థమునగు
బరకృతంబగు గృహము సర్పంబు జొచ్చి, సుఖతరంబుగ వర్ధిల్లుచుంటఁ గనమె. 270

వ. ఏకరూపుండగు నారాయణదేవుండు నిజమాయచే బూర్వసృష్టంబగు నీజగంబును
గల్పాంతంబునఁ గాలశక్తిచే సంహరించి యద్వితీయుండును నిరాశ్రయుండు
నాత్మాధారుండునై యుండు. ఆత్మానుభావంబగు కాలంబుచేఁ బ్రధానపురుషే
శ్వరుండగు నయ్యాదిపురుషుండు సామ్యంబుం బొందింపఁబడిన సత్త్వాదిశక్తుల
యందు నిర్లిప్తుండై యుండు. మఱియుఁ గైవల్య సంజ్ఞితుండును, నిత్యానుభవానంద
పూర్ణుండును నిరుపాధికుండునై పరాపరశక్తులకుం బరముఁడై యుండు. కేవ
లాత్మానుభవంబగు కాలంబుచేఁ ద్రిగుణాత్మకంబైన స్వమాయను సంక్షోభింపఁ
జేయుచుఁ దొలుత నమ్మాయచే సూత్రరూపంబగు మహత్తత్త్వంబును సృజించు.

అన్మహాత్త్వంబునందు నీవిశ్వంబంతయుఁ బ్రోతంబై యుండు. అద్దానిచేతన బురుషుండు సంసృతియుతుండగు. నానావిధంబును ద్రిగుణాత్మకంబును నగు విశ్వంబును సృజించు నమ్మహాశక్తి సూత్రసంజ్ఞితంబై యుండు. ఊర్ణనాభి హృదయంబునుండి వక్త్రంబుద్వారా సూత్రంబును బ్రసరింపఁజేసి యద్దానితో విహారంబుఁ గావించి క్రమ్మఱ దానిం గ్రసియించును. అట్లే మహేశ్వరుండును జగదుత్పత్తిస్థితిలయంబులనొనర్చు. 271

సీ. దేహి స్నేహముననో ద్వేషంబుననో భయంబుననో యెందెందుఁ దా బుద్ధిచేత
మనము లగ్నముఁ జేయు ననువుగఁ దత్స్వరూపత్వంబు నొందు నవాస్తవముగ
భ్రమరంబుచేతఁ గీటము జొన్పఁబడి కుటిన్, ధ్యానంబుఁ జేయుచు దానిన మదిఁ
దన పూర్వదేహంబుఁ ద్యజియింపకుండఁ, దత్సారూప్యముం బొందు ధరణినాథ!

గీ. ఇట్టు లీ గురువులచేత నిట్టిబుద్ధి, శిక్షితంబయ్యె నాకు నో క్షితితలేశ!
పూని స్వాత్మోపశిక్షితమైనబుద్ధి, నెఱుఁగఁజెప్పెద విను మవహితుండవగుచు.

చ. నరవర! యార్త్యుదర్కజనినాశసమన్వితమైన దేహమున్
గురువయి నాకు నిట్టులొనగూడె విరక్తివివేకహేతువై
యురవడి తత్త్వముం దెలియుచుండుదునైనను నెన్నఁడేనియున్
బరులదె యన్ననిశ్చయముఁ బట్టి యసంగుఁడనై మెలంగెదన్. 273

మ. అరయన్ దారసుతార్థభృత్యపశుగేహాప్తాది వర్గంబులన్
బోరిపోషింపుచునుండు నీయొడలికిన్ భోగంబులన్ గూర్పఁగా
నరుఁ డత్యంతము సంచితార్థమగు చంతంబందు నద్దేహమున్
దరుధర్మంబయి బీజసృష్టి నెఱపున్ దదన్యాంతరప్రాప్తికై. 274

ఉ. ఒక్కెడకున్ రసజ్ఞయు మఱొక్కెడకున్ బలితంపుతృష్ణ వే
ఱొక్కెడ కేర్చు మేఢ్రము మఱొక్కెడకున్ శ్రవణంబు ఘ్రాణ మొం
డొక్కెడకున్ ద్వచంబు మఱియొక్కెడకున్ నయనోదరాదులొం
డొక్కెడ కీడ్చు దేహిని సమృద్ధతిగేస్తు సపత్నులుం బలెన్. 275

వ. దేవదేవుఁడగు భగవంతుండు నిజమాయాశక్తిచే వివిధంబులగు పురంబులు సృజియించి వృక్ష, సరీసృప, పశు, ఖగ, మత్స్యాదిఁ జంతుసంతానంబులఁ బ్రవేశింపజేసి యవ్వానివలన ననంతుష్టహృదయుండై పదంపడి బ్రహ్మజ్ఞానబుద్ధి సమేతంబగు పురుషశరీరంబును సృజించి పరమానందంబువడసె. 276

చ. అదనునఁ బెక్కుజన్మములయంతమునందు ననిత్యమయ్యు న
ర్థదమయి యొప్పు దుర్లభతరంబగు మానుషదేహమంది ధీ

తిదమగు మిత్త్రివాతఁబడిసరీరకపూర్వమె ముక్తికై యతిం
పఁదగు నరుండు గల్గుగదె?సవై షయికంబగు సౌఖ్యమంతటన్. 277

గీ. రాజ! యీరీతి జాతవైరాగ్యుఁడనయి, యమలవిజ్ఞానసందీపితాత్ముఁడనయి
క్రుమ్మరుచునుంటి నిట్టులీక్షోణియం ద,హంకృతిజయించి సంగంబుసనవలడించి.278

ఆ. ఒక్కగురువునుండియొదవిన జ్ఞానంబు, పుష్కలంబుగాఁగఁబోదు దలఁప
నద్వితీయమైనయట్టి యీబ్రహ్మమును,దెలుపుచుండ్రు బుషులుపలుదెఱఁగుల.

శ్రీ భగవానుఁడు:—

క. అని యీగతి యదునృపతికి, వినిచి విమలబుద్ధియైనవిప్రుఁడు తత్పూ
జనములఁగొని వందితుఁడయి,యనుమతినింబొందిచనియెనపుడ యథేచ్ఛన్. 280

క. అవధూతోక్తుల విని యు,ద్ధవ! మా పూర్వులకుఁబూర్వతముఁడగు యదుభూ
ధవుఁడున్ దగ సంగములెల్ల విడిచి సమచిత్తుఁడై మెలంగెన్ వింటే. 281

---

## అ ధ్యా య ము 10.

### ఆత్మతత్త్వప్రాప్తిసాధనకథనము

శ్రీ భగవానుఁడు:—

క. నా నుడివిన ధర్మములం, దా నవహితబుద్ధియై మదాశ్రయుఁడగుచున్
బూనవలె నరుఁ డకాముం,డై నిజ వర్ణాశ్రమాదికాచారములన్. 282

వ. పరిశుద్ధాత్ముఁడు విషయపరులగు దేహులకు గుణంబులయందు సత్యత్వాభి నివే
శంబుచేత సర్వప్రారంభంబులు వైపరీత్యంబుపొందుటను బరికించుచుండు. సుషు
ప్తిం బొందినవానికి స్వప్నగతవిషయాలోకంబును ధ్యానంబుఁజేయువానికి మనో
రథంబులును బొడమినట్లు గుణవశంబున నానార్థవిషయికంబగు బుద్ధిబొడమి
నానాత్మకంబగుటచే విఫలంబగుచుండుకావునఁ గామ్యకర్మల మత్పరుండై
త్యజియింపవలయు. నిత్యనైమిత్తికకర్మంబుల సేవింపవలయు. ఆత్మజిజ్ఞాసయందుఁ
బ్రవృత్తుండై కర్మప్రేరణను నాదరింపకుండవలయు. 283

గీ. యమనియమముల నత్యధికాదరమున, సల్పవలయు మత్పరుఁడయిశక్తికొలఁది
మత్స్వరూపుని మదభిజ్ఞమానసీయు, శాంతు గురుని నుపాసింపఁజను ననిశము.

సీ. నిర్మముండును నమానియు నమత్సరుఁ డన,సూయుఁడద్క్షుండు దక్షుం డనఘుఁడు
నర్థజిజ్ఞాసువునవితథవాక్యుండు, దృఢసౌహృదుండునుధీరమతియు
దారపుత్రగృహక్షేత్రదారస్వజనధనా,దుల నుదాసీనతనలరువాఁడు
స్వార్థంబునుంబోలెసర్వంబు సమముఁగాఁ, గనుచు దాహ్యంబగుకష్టకంబె

గీ. సరగ దాహకుఁడున్ బ్రకాశకుఁడునైన, జ్వలనుఁడుంబోలె స్థూలసూక్ష్మంబులైన తనువుల విలక్షణుండయి ద్రష్టయును స్వయంప్రకాశుండునై తనరారుచుండు.

వ. మఱియు నిరోధంబును, నుత్పత్తియు, నణుత్వంబును, బృహత్త్వంబును మున్నగు వైవిధ్యంబును దత్కృతంబులగు గుణంబులను ననుసరించి చొచ్చి యప్పరపురుషుం డిట్లు దేహగుణంబులఁ గైకొనుచుండు. పురుషునకు గుణవిరచితమైన దేహంబు తత్సంబంధమైన సంసారంబు తదధ్యాసకృతంబై కానంబడుచుండు. విజ్ఞానం బాత్మునకుఁ దత్సంసార విచ్ఛేదకంబగుఁ గావున నిజదేహస్థుఁడును, గేవలుండును, బరముండునగు పరమాత్మంబొంది యథాక్రమంబున దేహాదికము నందు వాస్తవికబుద్ధినిఁ దొలఁగింపవలయు. 286

క. ప్రథమారణి యాచార్యుం, డధరారణిశిష్యుఁడారయం బ్రవచనమా మథనోచితకాష్ఠ మవి, శ్లథమగు నరువిద్య సంధిజనితాగ్నియగున్. 287

చ. సునిపుణశిష్య సంభృత విశుద్ధతరోజ్జ్వల బుద్ధి మాయజే
యును గుణసంభవంబయినయనుద్ధరమాయను సర్వలోక వ
ర్తనము యదాత్మకంబగుచుఁ గ్రాలునొ యాగుణమున్ దహించి యిం
ధనములు లేని యగ్నివలెఁ దాన శమించును దోనబుద్ధియున్. 288

వ. అదియునుంగాక కర్మలంజేయుచు సుఖదుఃఖంబు లనుభవించుచుండు లోకకాలాగమాత్ములగు జీవాత్మలకు నానాత్వంబును నిత్యత్వంబును గలుగుననియు, సర్వభావంబుల యునికియుఁ బ్రవాహరూపంబున నిత్యంబనియుఁ, దత్తదాకృతిభేదంబున బుద్ధియు జాయమానంబై భేద్యంబై యుండు ననియుఁ దలంచితివేని యుద్ధవా! సంవత్సరాదిరూపంబగు కాలావయంబునం జేసి సర్వదేహులకు దేహయోగంబున జన్మాదులు పౌనఃపున్యంబుగఁ గలుగుచుండు. అందుఁ గర్మలం జేయువానికిని సుఖదుఃఖంబుల ననుభవించువానికిని బారతంత్ర్యంబు దోఁచుచున్న యది కాని వివశుండగువాని నే యర్థంబు పొందుచుండుట లేదుగదా? 289

విద్వాంసులైన దేహులకును సుఖంబించుకేనియు నియతమై కానంబడకుండు; మూఢులకుఁ గేవలము దుఃఖంబు మాత్రమే కలుగకుండు; నట్లాట నందు కేవల మహంకారము మాత్రమే కాని మఱియొండు లేదుగదా? 290

సుఖదుఃఖంబుల ప్రాప్తి విఘాతంబుల నెఱుంగుదురన్నను మృత్యువశులుగాకుండు నుపాయము దెలియఁ జాలరుగదా? 291

వధ్యశిలఁ బొందింపఁబడిన వధ్యునకుంబోలె దేహిని నే యర్థంబుకాని యే కామంబుకాని మృత్యుసమక్షంబున సుఖపెట్టఁజాలదు కదా? 292

ఇహలోకసౌఖ్యముంబోలె స్వర్గాదిసౌఖ్యంబును, స్పర్ధాసూయలు నాశవ్య
యాదులు ననంతంబులగు నంతరాయంబులుం గలిగి కృషివలె నిష్ఫలంబగుటం జేసి
దుష్టంబే యగుం గదా? 293

ఆ. విఘ్నతతులచే నవిహతమున్ సాధ్వను, ష్ఠితమునగుచు ధర్మగతి నలరిన
దాన సాధితమగు స్థానంబు నరుఁ డెల్లఁ, జెందఁగలఁడొ దానిఁ జెప్పెద విను. 294

గీ. యాజ్ఞికులు దేవతానివహంబు నందు, యజ్ఞములచేత యజియించి యమరలోక
మరుగుదురు దేవతలువోలె స్వార్జితమ్ము, లైన దివ్యభోగములట ననుభవింత్రు. 295

గీ. మఱియు నందు స్వపుణ్య సమార్జితమగు, విమలతరవిమానమున దేవీజనముల
నడుమ నతిహృద్యవేషముం దాలిచి విహ, రింతు గంధర్వవరులు స్తుతించుచుండ.

క. చిఱుగంటలవరుసల నే, ర్పెఱనొప్పు విమానమందు దేవవనములన్
గఱితలతోఁ గ్రీడించుచు, నెఱుఁగఁడు మది నాత్మపాతమించుక యేనిన్. 297

క. ఎందనుక పుణ్య ముండునొ, యందనుక ప్రమోదగరిమ నందుం ద్రిదివం
బందున్ గాలహతుండై, క్రిందం బడుఁ దన సుకృతము క్షీణంబగుడున్. 298

సీ. కుజనసంగంబున నజితేంద్రియుఁడుఁ గాము, పరుఁడు లుబ్ధుండుఁ గృపణమతియును
స్త్రైణుండు భూతహింసకుఁడు నధర్మర, తుండునై యవిధిచే దోఁడరిపసులఁ
బోకార్చియుం బ్రేతభూతగణంబుల, యజియించి కడపట నవశుఁడగుచు
నరకలోకంబులఁ గరిగి యత్యుల్బణ, మైన తామసజన్మమందుచుండుఁ

గీ. దనువుచేత దుఃఖోదర్కజనకకర్మ, ములను జేయుచు నాకర్మఫలములను వెండి
తనువుఁ బొందు నిట్లీ మర్త్యధర్మియైన, జనున కేమిసుఖము కాలచక్రగతిని? 299

క. ఆకల్పజీవులగు నీ, లోకంబులుఁ దదధినాథులున్ వెరతు రెదన్
నాకు ద్విపరార్ధజీవికి, లోకేశునకుం భయము గలుగు నావలనన్. 300

గీ. ఇంద్రియములు కర్మములసృజించు నింద్రియముల సృజియించుచుండు సత్త్వాదిగుణము
లింద్రియోపేతుఁడై జీవుఁ డెల్లకర్మ, ఫలముల భుజించుచుండు నవశతఁ దోఁప. 301

వ. ఎంతపర్యంతంబు గుణవైషమ్యంబు కలుగు నంతపర్యంతము నాత్మకు నానాత్వంబు కలుగు. నానాత్వం బున్నంతపర్యంతంబు పారతంత్ర్యంబుఁ బొడము. పారతంత్ర్యం బున్నంత తడవు నీశ్వరునివలన భయంబు కలుగుచుండు. ఏతద్భయవిపన్నులగు జనులు శోకాకులితమనస్కులై మోహంబుఁ జెందుదురు. గుణవిపర్యయంబు గలుగ కాలంబనియు, నాత్మయనియు నాగమంబనియు, లోకంబనియు, స్వభావంబనియు, ధర్మంబనియు నన్నుఁ బెక్కుతెఱంగులఁ బల్కుదురు. 302

ఉద్ధవుఁడు:—

గీ. దేహజగుణంబులందు వర్తించుచుండ, దేహి యెట్లు గుణముల బంధింపఁబడఁడు
తా ననావృతుఁడై యుంటఁ దలఁచిచూడ, నెట్లు బంధింపఁబడు వచియింపు మీశ!

క. ఎట్టు మెలఁగు విహరించు నిఁ కెట్టివియగు, లక్షణముల నెఱుఁగంబడుఁ దా
నెట్టు దిను విసర్జించు మ, ఱెట్టులు శయనించు నిలుచు నేగున్ జెపుమా. 304

గీ. దేవ! యీప్రశ్నమునకు నీవ ప్రీతి, నొసఁగుము సదుత్తరంబు నింపెసఁగ నిష్ఠ
యెడదయం దేను నిత్యబద్ధుఁడును నిత్య, ముక్తుఁడు నొకండె యని భ్రాంతిఁ
బొందుచుంటి. 305

---

## అ ధ్యా య ము 11.

### బద్ధముక్త లక్షణాభివర్ణనము

శ్రీభగవానుఁడు:—

గీ. బద్ధుఁడును ముక్తుఁ డని యెడు వ్యాఖ్య నాకుఁ
దనరును గుణంబువలన వాస్తవముఁగాదు
గుణము మాయానిదాన మగుటను నాకు
మోక్షమును లేదు బంధనమును గలుగదు. 306

ఆ. శోక మోహములును సుఖదుఃఖములు శరీ, రాపదయును స్వప్నమట్లు మాయ
చేతఁ గల్పితంబులై తనరారును, వాస్తవములుగావు భద్రమూర్తి! 307

వ. ఉద్ధవా! ఆత్మ మాయావినిర్మితంబులును, దేహధారులకు బంధమోక్ష కరంబులును, నాద్యంబులు నగు విద్యావిద్యలు రెండును నా శరీరంబులని యెఱుంగుము. మదంశసంభూతుండగు జీవుని కొక్కనికి మాత్రమే యవిద్యంజేసి బంధంబు ప్రాప్తించుచుండు. నాకుఁ గలుగకుండు. క్రిమ్మఱ విద్యాసంపర్కంబున ననాది యగు మోక్షంబు లబ్ధంబగుచుండు. 308

క. ఉద్ధవ! యొక దేహమున వి, రుద్ధములగు ధర్మములను రూఢిఁబఱగు నా
బద్ధునకు ముక్తునకు సం, బద్ధమగు విలక్షణతను బలికెద వినుమా. 309

సీ. వృక్షంబున యదృచ్ఛఁ గృతనీడములు సమం, బులు మిత్రములు రెండు పులుఁగులుండు
నందు నొక్కటి పిప్పలాన్నంబు భుజియించు, నన్యంబు దా నిరాహారమయ్యు
నధికబలంబున నలరుచుఁ దన్ను న, న్యంబు నెఱుంగు జ్ఞానాఢ్యమగుచుఁ
బిప్పలాదంబు భావింప నన్యంబును, దన్ను నెఱుంగక దవిలియుండు

గీ. ఎవఁ డవిద్యాసమన్వితుఁ డవు నతండె, నిత్యబద్ధుఁ డగుంజుమ్ము నిక్కువమ్ము
ఎవఁడు విద్యాసమన్వితుఁ డవు నతండ, నిత్యముక్తుఁ డనంజెల్లు నిర్మలాత్మ! 310

గీ. పరఁగ స్వప్నోత్థితుండగు నరునిభంగి, దేహగతుఁ డయ్యునుం గాఁడు ధీయుతుండు
అజ్ఞుఁ డగువాఁడె దేహస్థుఁ డయ్యు స్వప్న,గతుఁడువోలె దేహస్థుఁ డై వెతలఁ జెందు.

ఆ. ఇంద్రియములచేత నింద్రియార్థములు గై, కొనఁగఁ బడినయపుడు కోవిదుండు
నిర్వికారుఁ డగుచు నిర్లిప్తుఁ డై తా న, హంకరింపఁ జెల్ల దాత్మలోన. 312

గీ. అరయఁ బూర్వకర్మాధీనమైన యీ శ, రీరమందునఁ దాను వర్తించుచుండి
కుమతి యింద్రియ భావ్యకర్మముల నేను, కర్తనంచెంచి బద్ధుఁడౌ క్రమముఁ దప్పి.

చ. పరగతమైన కర్మ నను బద్ధుని జేయుట యెట్టులంచు లో
నరసి విరక్తుఁడౌచు శయనాసన మజ్జనభోజనాదులన్
బరువడి పండితుం డెపుడు బద్ధుఁడుగాక మెలంగు నింద్రియో
త్కరమున నింద్రియార్థ సముదాయములన్ భుజియింపఁ జేయుచున్. 314

సీ. ప్రకృతిస్థుఁ డయ్యు నభంబు భానుండును, శ్వసనుండువోలె నసక్తుఁ డగుచు
నిస్సంగనునిశిత నిపుణమనీషాసి, సంశయగ్రంథుల సమయఁ జేపి
స్వప్నంబునందుండి ప్రతిబుద్ధుడుంబోలె, సుజనుండు దేహాదిక జగమునను
వినివృత్తుఁ డగును భావింప నెవ్వాని ప్రా, ణేంద్రియ ధీమనోవృత్తులెల్లఁ

గీ. గాంచిచూడంగ వీతసంకల్పములగుఁ,దనుగతుండయ్యు నతఁడు తత్తనుగుణముల
నుండి నిర్ముక్తుఁ డగుజుమీ! యుద్ధవ! యిది, నిక్కువంబంచుఁ దెలియుము
నీమనమున. 315

క. ఘాతుకజనములు తనకున్, యాతనలిడినను మఱొక్కఁ డగ్గించిన ధీ
ఖ్యాతుఁ డగు పురుషుఁ డెప్పుడు, చేతమునం దించుకేనిఁ జెందఁడు వికృతిన్. 316

గీ. సాధ్వసాధువిషయములు నల్పువాని,నేనిఁ బలికెడివారల నేనిఁ బొగడఁ
దెగడఁ జెల్లదు మఱి సమదృష్టియగుచుఁ,బరగవలయును గుణదోషవర్జితుఁ డయి.

గీ. మంచికాని చెబ్బరకాని యించుకేని, నలుపరాదు పల్కఁగరాదు తలఁపరాదు
యతివరేణ్యుఁ డాత్మారాముఁ డై జడువలె, మెలఁగవలయు నీ వృత్తిచే
నలఘుగతిని. 318

గీ. ప్రౌఢిమీఱ శబ్దబ్రహ్మపారదర్శి, యయ్యునుం బరబ్రహ్మంబునందు ధ్యాన
ముంచఁ డేనియు గొడ్డావునోమువాని, కల్లు శాస్త్రంబు శ్రమ ఫలమగు నతనికి.

మ. కనఁ బాలీయని ధేనువున్ గులటయౌ కాంతన్ బరాధీనమౌ
తనువున్ దుష్టతనూజుఁ బాత్రిల కదత్తంబైన విత్తంబు మ

ఘ్నలీలా గుణహీనమైన పలుకున్ గాదా మోహితస్వాంతుఁడై
మనుజుం డూరక దుఃఖదుఃఖియయి సంరక్షించుచుండుంజుమీ. 320

ఉ. ఖ్యాతము శ్రీసమేతము జగజ్జని సంస్థితి నాశహేతు సం
భూతము నైన నాచరితమున్ వివరింపకయుండు నెద్ది ప్ర
స్ఫీత శుభావతారములఁ బేర్కొన దెయ్యది యాత్మతత్త్వ ని
ష్ణాతుఁడు వంధ్యమైన వచనంబును దాని ధరింపఁ డెన్నఁడున్. 321

గీ. ఇట్లు జిజ్ఞాస నాత్మయం బెనసియున్న, యట్టి దేహాదికధ్యాన మవలఁ ద్రోచి
విమలమైనమనంబున విశ్వగుండ, నైన నాయందుఁ జొన్పి శాంతతఁ గననగు. 322

గీ. బ్రహ్మమందు వినిశ్చలస్వాంతము చెలు, వార నిల్పఁగ నసమర్థుఁ డైనయెడల
నెల్లకర్మములన్ నిరపేక్షుఁడగుచు, ధృతిని నాయందుఁ దా సమర్పింపవలయు.

క. శ్రద్ధ జగత్పావనములు, వృద్ధిదములునయిన నాచరితలఁ దలఁచుచున్
బుద్ధిం బొడుచు సారెకు, నుద్ధవ! నా జన్మకర్మ లూనఁగవలయున్. 324

గీ. ధర్మకామార్థములను మదర్థమయి మ, దాశ్రయుండౌచు శ్రద్ధమై నాచరించు
చుద్ధవ! వినిశ్చలంబయి యొప్పు భక్తి, నందు నాద్యుండనైన నాయందు
బుధుఁడు. 325

గీ. స్వాంతమొప్ప నాయందు సత్సంగలబ్ధ, భక్తితో నన్ను నెవ్వఁ డుపాసనంబు
సల్పు నతఁ డలవోకమై సాధుజన సుదర్శితంబగు నాదు పదంబుఁ జెందు. 326

ఉద్ధవుఁడు:—

ఆ. సాధువెట్టివాఁడు సమ్మతుఁడగు నీకుఁ, బుణ్యచరిత! యో ప్రభూ! వచింపు
నారదాది మునిజనాదృతమగునట్టి, యెట్టిభక్తి నీకు నింపుఁగూర్చు? 327

ఉ. కారణ సంభవా! ప్రకృతికంటెఁ బరుండగు పూరుషుండ వీ
వారయ వ్యోమరూపుఁడ వనంతుఁడవున్ బురుషోత్తముండవున్
ధీరుఁడవున్ బరేశుఁడవు దేవుఁడవై వెలుఁగొందుచుందు విం
పారఁగ నాకుఁ దెల్పు విషయంబిది తెల్లముఁగాఁగ సత్కృపన్. 328

శ్రీభగవానుఁడు:—

సీ. అకృతభూత ద్రోహుఁడమిత దయాళుండు, సత్యసారుండు నుసర్వసముఁడు
ననవద్యమతియు సుకామాధ్యుండు దాంతుండు, శౌచయుతుండు నిష్కామశీలుఁ
డకఠినచిత్తుండు నపరిగ్రహుండును, శాంతమనస్కుండు స్థైర్యయుతుఁడు
మచ్ఛరణుం డప్రమత్తుండు మునియు ల, ఘ్వాహారుఁడున్ గభీరాశయుండు

గీ. మానదుండు నమానియు మైత్రుఁడు కవి, శక్తుఁడును ధీరుఁడును జితషడ్గుణుండు
నిర్వికారుం డనీహుండు నిశ్చలుఁడును, నైనవాఁడు సాధుశ్రేష్ఠుఁడనఁగఁ బడును.

గీ. గుణములను దోషముల నీ కరణి నెఱింగి, తలఁగఁ ద్రోచి మదాదిష్టధర్మములను
సాధుజనసత్తముండు నిస్సంశయమగు, భక్తితో నాదుపూజ సల్పంగవలయు.
గీ. ఎంతవాఁడనొ యెవఁడనో యెట్టివాఁడ, నో యెఱింగియెఱింగి మేధాయుతులయి
యెవరనన్యభావమునభజింత్రొ నన్ను, మాన్య! యాభక్తవరులు సమ్మతులు నాకు
సీ. మత్ప్రతిమాదులమద్భక్తజనుల సం, స్పర్శన దర్శనార్చనములు మఱి
పరిచర్య సంస్తుతివరగుణ కర్మాను, కీర్తనములును విస్ఫూర్తి కలిత
మత్కథాశ్రవణంబు మత్పరిధ్యానంబు, సర్వార్పణంబు దాస్యంబుచేత
నాత్మనివేదనంబనఘ! మజ్జనికర్మ, కథనంబు వైదికకార్య నిరతి
ఆ. వరుస నృత్త గీతవాదిత్రగోష్ఠి శు, భోద్యమంబు మద్గృహోత్సవంబు
యాత్రబలివిధానమఖిల వార్షికపర్వ, ములను వ్రతవిధానపోషణమును. 332
వ. మఱియు నుద్యానోపవన క్రీడాపురమందిర కర్మంబుల స్వతస్సంపన్న శ్రద్ధాయుతుండై యుండుటయు, సమ్మార్జనోపలేపంబుల నభిషేకమండల వర్తనంబుల నమాయకత్వంబున దాసుండుంబోలె మద్గృహ శుశ్రూషణంబు గావించుటయు, మానియు, దంభియుఁ గాక కృతంబును బొగడుకొనక యుండుటయుఁ బూర్వ నివేదితంబైన దీపావలోకంబైన నుపయోగింపకుండుటయు, సాధుపురుషుఁడు కావింపందగు. మఱియు లోకంబునఁ దన కేదేది యిష్టంబగు నాయాయి పదార్థంబెల్ల ననంతస్వరూపుఁడనగు నాకు నివేదింపనగు. 333
గీ. భానుఁ డనలుండు పాఱుండు ధేనువులును
వైష్ణవుండు నభంబు పవనము జలము
భూమియును నాత్మయును సర్వభూతములును
దలఁప నాకుఁ బూజాస్థానము లివి యనఘ! 334
సీ. యజియింపఁగా నగునాదిత్యునందుఁ ద్ర, యీవిద్యచే నన్ను భావమలర
ననలునియందు నాజ్యాది హవిస్సుచే, విప్రునం దాతిథ్యవిధులచేత
నాలమందల యందు యవసాదికంబుచే, వైష్ణవు నందు సుబంధుప్రీతి
యంబరమందు హృద్ధ్యాననిష్ఠచే, వాయువు నందు సుప్రాణదృష్టి
గీ. జలయుత ద్రవ్యములచేత జలములందు, మంత్రవిన్యాసముల చేత క్ష్మాతలమున
నాత్మయందు భోగంబుల నఖిలభూత, తతి సమతఁ గొల్వనగును క్షేత్రజ్ఞు నన్ను.
గీ. ఇట్టు లీయాశ్రయము లందు నెలమిమీఱ
శంఖచక్రగదా పద్మసహితమును చ
తుర్భుజము శాంతమునగు మద్రూపమును స
మాహితస్వాంతుఁడై భజింపంగవలయు. 336

క. ఇష్టాపూర్తముచేత న, భీష్టు నను సమాహితుఁడయి యెవఁడు గొలుచు న
త్కృష్టమగు సాధుసేవన్, శిష్టుండై నాదు భక్తిఁ జెందు నతఁడిలన్. 337

క. ప్రాయికముగ లేదితరో, పాయము సత్సంగజమగు భక్తి విధము త
క్కేయెడలను సాధులకు వి, ధేయుఁడనై యుందు నేను ధీవర! వింటే. 338

ఆ. పరమ గుహ్యమైన భక్తియోగమ్ము ను, గోప్యమైన వినఁగ గోరు నీకు
చెప్పినాఁడ నాకు సేవకుండవు కదు, నేస్తుఁడవు ప్రియుఁడవు నీవు కాన. 339

---

## అధ్యాయము 12.

### సాధుసంగమాభివర్ణనము

శ్రీభగవానుఁడు:—

సీ. అఖిలసంగాపహమైన సత్సంగ మే, యనువున నన్ను వశ్యునిగఁ జేయు
నట్లు యోగంబు సాంఖ్యంబు ధర్మంబును, స్వాధ్యాయమును దపస్త్యాగములును
ఛందముల్ వ్రతము లిష్టాపూర్తము మఖంబు,యజ్ఞము తీర్థము యమ నియమము
లొనరింపఁగా లేవు వినుము సత్సంగము,కతన దైతేయులు ఖగ మృగములు

గీ. నాగవిద్యాధరులును గంధర్వసిద్ధ
చారణులు సాధ్యగుహ్యకాప్సరసలు భువి
వైశ్యులును శూద్రులును స్త్రీలు పంచములు ర
జస్తమః ప్రకృతుల్ ప్రశస్తమతులగుచు. 340

వ. పలువురు తత్తద్యుగంబుల మత్పదంబుం బడసిరి. వారిలోఁ గొందఱ నెఱింగించెద
వినుము. 341

సీ. వృత్రుండు ప్రహ్లాద వృషపర్వ బలి బాణ, మయ విభీషణులును మాన్య చరిత!
సుగ్రీవుఁ డనిలాత్మజుఁడు జాంబవంతుండు, దంతిరాజంబు గృధ్రము వణిక్ప
థుండును మఱియు వ్యాధుండు గుబ్జ వ్రజాంగ, నలు యజ్ఞపత్నులు చెలువు మీఱ
తదితరు లాగమాధ్యయనవర్జితులు ను, పాసనాబల శూన్యు లవ్రతులును

గీ. అకృతతపులయ్యు మత్పదం బంది రహహా!, గోపికలు నగమ్మృగములు గోవులు మఱి
నాగులును సిద్ధు లేత దన్యంబులైన, మూఢజీవులున్ నన్ను నుఁ బొందరయ్యో!342

గీ. జతన మొనరించియున్ యోగసాంఖ్య దాన,మఖ తపోవ్రతములను నిర్మలినమైన
వ్యాఖ్య సన్యాసమునను స్వాధ్యాయమునను,బొందరాని ననున్ వారు బొందిరెల్లు.

గీ. రామసహితంబుగా మధురా నగరికిఁ, బూని యక్రూరుచేఁ గొనిపోఁబడిన
నా యెడ సురక్తలగుచు మదీయ విరహ, బాధ గ్రుగ్గి వ్రేతలు తలంపరు మఱెద్ది.

గీ. గుణములను దోషముల నీకరణి నెఱింగి, తలఁగఁ ద్రోచి మదాదిష్టధర్మములను
సాధుజనసత్తముండు నిస్సంశయమగు, భక్తితో నాదుపూజ సల్పంగవలయు.
గీ. ఎంతవాఁడనో యెవఁడనో యెట్టివాఁడ, నో యెఱింగి యెఱింగి మేధాయుతులయి
యెవ రనన్యభావమున భజింత్రో నన్ను, మాన్య! యాభక్తవరులు సమ్మతులు నాకు
సీ. మత్ప్రతిమాదుల మద్భక్తజనుల సం, స్పర్శన దర్శనార్చనములు మఱి
పరిచర్య సంస్తుతి వరగుణ కర్మాను, కీర్తనములును విస్ఫూర్తి కలిత
మత్కథాశ్రవణంబు మత్పరిధ్యానంబు, సర్వార్పణంబు దాస్యంబుచేత
నాత్మనివేదనంబనఘ! మజ్జనికర్మ, కథనంబు వైదికకార్య నిరతి
ఆ. వరుస నృత్త గీత వాదిత్రగోష్ఠి శు, భోద్యమంబు మద్గృహోత్సవంబు
యాత్రబలివిధాన మఖిల వార్షికపర్వ, ములను వ్రతవిధాన పోషణమును. 332
వ. మఱియు నుద్యానోపవన క్రీడాపురమందిర కర్మంబుల స్వతస్సంపన్న శ్రద్ధాయుతుండై యుండుటయు, సమ్మార్జనోప లేపంబుల నభిషేకమండల వర్తనంబుల నమాయకత్వంబున దాసుండుంబోలె మద్గృహ శుశ్రూషణంబు గావించుటయు, మానియు, దంభియుఁ గాక కృతంబును బొగడుకొనక యుండుటయుఁ బూర్వనివేదితంబైన దీపావలోకంబైన నుపయోగింపకుండుటయు, సాధుపురుషుఁడు కావింపందగు. మఱియు లోకంబునఁ దన కేదేది యిష్టంబగు నాయాయి పదార్థంబెల్ల ననంతస్వరూపుఁడనగు నాకు నివేదింపనగు. 333
గీ. భానుఁ డనలుండు పాఱుండు ధేనువులును
వైష్ణవుండు నభంబు పవనము జలము
భూమియును నాత్మయును సర్వభూతములును
దలఁప నాకుఁ బూజాస్థానము లివి యనఘ! 334
సీ. యజియింపఁగా నగు నాదిత్యునందుఁ ద్ర, యీవిద్యచే నన్ను భావమలర
ననలునియందు నాజ్యాది హవిస్సుచే, విప్రునం దాతిథ్యవిధులచేత
నాలమందల యందు యవసాదికంబుచే, వైష్ణవు నందును బంధుప్రీతి
యంబరమందు హృద్ధ్యానసన్నిష్ఠచే, వాయువు నందును బ్రాణదృష్టి
గీ. జలయుత ద్రవ్యములచేత జలములందు, మంత్రవిన్యాసముల చేత క్ష్మాతలమున
నాత్మయందు భోగంబుల నఖిలభూత, తతి సమతఁగొల్వనగును క్షేత్రజ్ఞు నన్ను.
గీ. ఇట్టు లీయాశ్రయము లందు నెలమిమీఱ
శంఖచక్రగదా పద్మసహితమును జ
తుర్భుజము శాంతమునగు మద్రూపమును స
మాహితస్వాంతుఁడై భజింపంగవలయు. 336

క. ఇష్టాపూర్తముచేత న, భీష్టు నను సమాహితుఁడయి యెవఁడు గొలుచు న
త్కృష్టమగు సాధుసేవన్, శిష్టుండై నాదు భక్తిఁ జెందు నతఁడిలన్. 337

క. ప్రాయికముగ లేదితరో, పాయము సత్సంగజమగు భక్తి విధము త
క్కేయెడలను సాధులకు వి, ధేయుఁడనై యుందు నేను ధీవర! వింటే. 338

ఆ. పరమ గుహ్యమైన భక్తియోగమ్ము ను, గోప్యమైన విను గరోరు నీకు
చెప్పినాఁడ నాకు సేవకుండవు కడు, నేస్తుఁడవు ప్రియుఁడవు నీవు కాన. 339

---

## అధ్యాయము 12.

### సాధుసంగమాభివర్ణనము

శ్రీభగవానుఁడు:—

సీ. అఖిలసంగాపహమైన సత్సంగ మే, యనువున నన్ను వశ్యునిగఁ జేయు
నట్లు యోగంబు సాంఖ్యంబు ధర్మంబును, స్వాధ్యాయమును దపస్త్యాగములును
ఛందముల్ వ్రతము లిష్టాపూర్తము మఖంబు,యజ్ఞము తీర్థము యమ నియమము
లొనరింపఁగా లేవు వినుము సత్సంగము,కతన దైతేయులు ఖగ మృగములు

గీ. నాగవిద్యాధరులును గంధర్వసిద్ధ
చారణులు సాధ్యగుహ్యకాప్సరసలు భువి
వైశ్యులును శూద్రులును స్త్రీలు పంచములు ర
జస్తమః ప్రకృతుల్ ప్రశస్తమతులగుచు. 340

వ. పలువురు తత్తద్యుగంబుల మత్పదంబుంబడసిరి. వారిలోఁ గొందఱ నెఱింగించెద
వినుము. 341

సీ. వృత్రుండు ప్రహ్లాద వృషపర్వ బలి బాణ, మయ విభీషణులును మాన్యచరిత!
సుగ్రీవుఁ డనిలాత్మజుఁడు జాంబవంతుండు, దంతిరాజంబు గృధ్రము వణిక్ప
థుండును మఱియు వ్యాధుండు గుబ్జ వ్రజాంగ, నలు యజ్ఞపత్నులు చెలువు మీఱ
తదితరు లాగమాధ్యయనవర్జితులు ను, పాసనాబల శూన్యు లవ్రతులును

గీ. అకృతతపులయ్యు మత్పదం బంది రహహా!, గోపికలు నగమృగములు గోవులు మఱి
నాగులును సిద్ధు లేత దన్యంబులైన, మూఢజీవులున్ నన్ను బొందనయ్యె! 342

గీ. జతన మొనరించియున్ యోగ సాంఖ్య దాన,ముఖ తపోవ్రతములను నిర్మలినమైన
వ్యాఖ్య సన్న్యాసమునను స్వాధ్యాయమునను,బొందరాని ననున్ వారు బొందిరల్లు.

గీ. రామసహితంబుగా మధురా నగరికిఁ, బూని యక్రూరుచేఁ గొనిపోఁబడిన
నా యెడ సురక్తలగుచు మదీయ విరహ, బాధ గ్రుంగి వ్రేతలు తలంపకు మెద్ది.

మ. తమి బృందావన సీమలన్ బ్రియుఁడనై దారొక్కన్న నాతోడఁ జి
త్తమునన్ గోర్కులు సందడింపఁగ క్షణార్థం బట్టు లే యే నిశల్
గ్రమియింపంబడెఁ గల్పసన్నిభము లై కన్పట్టె యా యా నిశల్
విమనస్కత్వముఁ గూర్చె వ్రేతలకు నుర్విన్ మద్విహీనంబులై. 345

చ. అలఘు సమాధియందు నియతాత్ములు మౌనులు నామరూపముల్
తెలియని చాడ్పునన్ జలనిధిన్ జొఱబారిన యేఱు లట్టులై
చెలువుగ నాపయిన్ మనముఁ జేరిచి తమ్ము స్వభర్తృ నందనా
ప్తుల నిహమున్ బరంబుఁ దలపోయక యుండి రటన్ వ్రజాంగనల్. 346

చ. చెలువునిగాఁగ జారునిగఁ జిత్తమున న్ననుఁ గోరుచుండి కే
వలమగు నా స్వరూపవిభవంబు నెఱుంగని వారలయ్యు వి
హ్వలతను గోపికల్ శతసహస్రవిధంబుల నాదు సంగ మి
మ్ములఁ గయికొంటఁ జేసి ననుఁ బొందిరి బ్రహ్మమయున్ బరాత్పరున్. 347

చ. హితమతితోడ నీవగిది నీవును నేరిమి నుద్ధవా! శ్రుతిన్
స్మృతినటులే ప్రవృత్తిని నివృత్తిని శ్రావ్యమునున్ శ్రుతంబునున్
ధృతినిఁ బరిత్యజించి జగదేకశరణ్యుని నన్ను నొక్కనిన్
మతి శరణంబుఁ బొందు మిఁక మందువు సు మ్మకుతోభయుండవై. 348

ఉద్ధవుఁడు:—

గీ. నాదుమనముమఱింత భ్రాంతముగఁ జేయు,నీదు వాక్యమ్ము వినునెడ నిక్కువముగ
నమితమైనసంశయము డెందమున గదిరి,యెడదొలఁగకుండె నాకు యోగేశ్వరేశ!

శ్రీకృష్ణుఁడు:—

వ. ఉద్ధవా! జీవుండు ప్రాణఘోషంబున గృహప్రవిష్టుండై మనోమయంబగు సూక్ష్మరూపంబునుబొంది యాధారాదిచక్రవ్యాప్తుండై యుదాత్తాదిస్వరంబులను నకారాది వర్ణంబులను నతిస్థూలుండై యుండు. ఇంధనంబున మథింపఁబడిన వాయుసఖుండగు పావకుం డంతరిక్షంబున నణువుఁగా నుత్పన్నుండై యాజ్యాది హవిస్సుచేఁ బ్రజ్వలితుండగునట్లు నీ వాణియు నావ్యక్తరూపంబగు. ఇట్లు భాషణంబును, గర్మంబును, గమనంబును, విసర్జనంబును, ఘ్రాణంబును, రసంబును, దృష్టియు, స్పర్శంబును, శ్రవణంబును, సంకల్పంబును (మనంబు), విజ్ఞానంబును (బుద్ధి), అభిమానంబును, సూత్రంబును, సత్త్వరజస్తమోవికారంబు ననునది మదీయ వ్యక్తంబగువాణి. ఈ జీవుండు తొలుత నీశ్వరుండును, నవ్యక్తుండును, నేకరూపుఁడునై యుండు. కాలక్రమంబున మాయావశగతుండై బీజంబు క్షేత్రంబునుంబొంది పలుతెఱంగులైనట్లు పెక్కుతెఱంగులఁ దోఁచుచుండు. ఆజీవునియందీ యశేష

జగంబును దంతువితానసంస్థంబైన పటంబుంబోలె నోతప్రోతంబై యొప్పారు చుండు. పురాతనంబును గర్మాత్మకంబును నగు నీ సంసారవృక్షంబు భోగాపవర్గంబులనెడు పుష్పఫలంబులు ప్రసవించు. ఈవృక్షంబునకుఁ బుణ్యాపాపంబులనవి రెండును బీజంబులు. కర్మవాసనాశతంబుమూలంబు. గుణత్రయంబు నాళంబులు. పంచభూతంబులు స్కంధంబులు. శబ్దాది విషయపంచకంబు రసంబు. ఏకాదశేంద్రియంబులు శాఖలు. జీవపరమాత్మలను విహంగములకుఁ గులాయం బిందొప్పారుచుండు. వాత, పిత్త, శ్లేష్మంబులు వల్కలంబులు. సుఖదుఃఖంబులు ఫలంబులు. ఈవృక్షంబు సూర్యమండలపర్యంతంబు వ్యాప్తంబై యుండు. గ్రామంబులఁ దిరుగాడు కాముక గృధ్రంబు లందు దుఃఖరూపఫలంబును, వనంబుల నివసించు పరమహంస హంసంబులు సుఖరూపఫలంబు ననుభవించు. ఇట్లు బహురూపుఁడును, మాయామయుండునగు పరమాత్మను గురుముఖంబున నెవ్వఁడెఱుంగు వాఁడు తత్త్వార్థం బెఱింగినవాఁడగు. 350

గీ. ఇట్లు గురుపాదపూజార్జితైకభక్తి, శాతతరమైన విద్యాసిచేత మిగుల
ధృతిఁదలిర్ప జీవోపాధిఁ ద్రెంచి పరముఁ, జెంది యప్రమత్తుఁడవై త్యజింపుమసిని.

---

## అధ్యాయము 13.

### హంసేతిహాసము

శ్రీకృష్ణుఁడు:—

గీ. బుద్ధిఁబొడవు సత్త్వరజస్తమోగుణములు, కలుగ వాత్మకు భంజింపవలె రజస్త
మంబులను సత్త్వమునని యమాన్వితుఁడయి, సత్త్వముడిగింపఁగావలె స సత్త్వమునన.

గీ. అరయ మద్భక్తిలక్షణమైనధర్మ, మొదవు శుద్ధసత్త్వంబున నొగి నరునకు
సాత్త్వికపదార్థసేవచే సత్త్వగుణము, పెంపగున్ దాన ధర్మంబు వృద్ధిఁబొందు. 353

క. ఒత్తిగిలి సత్త్వభవస, ద్వోత్తమధర్మమయిన రూపరు రజస్తమముల్
అత్తెఱఁగున రెండుఁజెడ నుదాత్తా! తన్మూలమగు సధర్మం బడఁగున్. 354

గీ. శాస్త్రము జలంబుఁ బ్రజయు దేశమ్ముఁగాల, కర్మ జన్మంబులును ధ్యానకలనమంత్ర
మరయ సంస్కారమనజను సట్టిపదియు, నివ్విగణియింపఁబడుగుణ హేతువులయి.

గీ. వీనిలోపలఁ బెద్దలు దేని దేనిఁ, బొగడుచుందురొ సాత్త్వికంబగు నది యది
దెగడుదురు దేని రాజసంబగునదియుఁ గఁ, దజ్జనోపేక్షితంబె యాదామసంబు. 356

ఆ. సత్త్వవృద్ధిపొంటె సాత్త్విక సేవయె, నరుఁడు సల్పఁదగు సనారతంబు
దాన ధర్మ మొదవు దాన సంస్మృతిభాగ్య, జనకమైనయట్టి జ్ఞాన మొదవు. 357

మ. తమి బృందావన సీమలన్ బ్రియుఁడనై దార్కొన్న నాతోడఁ జి
త్తమునన్ గోర్కులు సందడింపఁగ క్షణార్ధం బట్టు లే యే నిశల్
గ్రమియింపంబడెఁ గల్పసన్నిభము లై కన్పట్టె యా యా నిశల్
విమనస్కత్వముఁ గూర్చె వ్రేతలకు నుర్విన్ మద్విహీనంబులై. 345

చ. అలఘు సమాధియందు నియతాత్ములు మౌనులు నామరూపముల్
తెలియని చాడ్పునన్ జలనిధిన్ జొఱబాఱిన యేఱు లట్టులై
చెలువుగ నాపయిన్ మనముఁ జేరిచి తమ్ము స్వభర్తృ నందనా
ప్తుల నిహమున్ బరంబుఁ దలఁపోయక యుండి రటన్ వ్రజాంగనల్. 346

చ. చెలువునిగాఁగ జారునిగఁ జిత్తమున న్ననుఁ గోరుచుండి కే
వలమగు నా స్వరూపవిభవంబు నెఱుంగని వారలయ్యు వి
హ్వలతను గోపికల్ శతసహస్రవిధంబుల నాదు సంగ మి
మ్ములఁ గయికొంటఁ జేసి ననుఁ బొందిరి బ్రహ్మమయున్ బరాత్పరున్. 347

చ. హితమతితోడ నీవగిదినీవును నేరిమి నుద్ధవా! శ్రుతిన్
స్మృతినటులే ప్రవృత్తిని నివృత్తిని శ్రావ్యమునున్ శ్రుతంబునున్
ధృతినిఁ బరిత్యజించి జగదేకశరణ్యుని నన్ను నొక్కనిన్
మతి శరణంబుఁ బొందు మిఁక మందువు సు మ్మకుతోభయుండవై. 348

ఉద్ధవుఁడు:—

గీ. నాదుమనముమఱింత భ్రాంతముగఁ జేయు, నీదువాక్యమ్ము వినునెడ నిక్కువముగ
నమితమైనసంశయము డెందమున గదిరి, యెడదొలఁగకుండె నాకు యోగేశ్వరేశ!

శ్రీకృష్ణుఁడు:—

వ. ఉద్ధవా! జీవుండు ప్రాణఘోషంబున గృహాప్రవిష్టుండై మనోమయంబగు సూక్ష్మ రూపంబునుబొంది యాధారాదిచక్రవ్యాప్తుండై యుదాత్తాదిస్వరంబులను నకారాది వర్ణంబులను నతిస్థూలుండై యుండు. ఇంధనంబున మథింపఁబడిన వాయుసఖుండగు పావకుం డంతరిక్షంబున నణువుఁగా నుత్పన్నుండై యాజ్యాది హవిస్సుచేఁ బ్రజ్వలితుండగునట్లు నీ వాణియు నావ్యక్తరూపంబగు. ఇట్లు భాషణంబును, గర్మంబును, గమనంబును, విసర్జనంబును, ఘ్రాణంబును, రసంబును, దృష్టియు, స్పర్శంబును, శ్రవణంబును, సంకల్పంబును (మనంబు), విజ్ఞానంబును (బుద్ధి), అభిమానంబును, సూత్రంబును, సత్త్వరజస్తమోవికారంబు ననునది మదీయ వ్యక్తంబగువాణి. ఈ జీవుండు తొలుత నీశ్వరుండును, నవ్యక్తుండును, నేకరూపుఁడునై యుండు. కాలక్రమంబున మాయావశగతుండై బీజంబు క్షేత్రంబునుంబొంది పలు తెఱంగులైనట్లు పెక్కు తెఱంగులఁ దోఁచుచుండు. ఆజీవునియందీ యశేష

జగంబును దంతువితానసంస్థంబైన పటంబుంబోలె నోతప్రోతంబై యొప్పారుచుండు. పురాతనంబును గర్మాత్మకంబును నగు నీ సంసారవృక్షంబు భోగాపవర్గంబుల నెడు పుష్పఫలంబులు ప్రసవించు. ఈవృక్షంబునకుఁ బుణ్యాపాపంబులను నవి రెండును బీజంబులు. కర్మవాసనాశతంబుమూలంబు. గుణత్రయంబు నాళంబులు. పంచభూతంబులు స్కంధంబులు. శబ్దాది విషయపంచకంబు రసంబు. ఏకాదశేంద్రియంబులు శాఖలు. జీవపరమాత్మలను విహంగములకుఁ గులాయం బిందొప్పారుచుండు. వాత, పిత్త, శ్లేష్మంబులు వల్కలంబులు. సుఖదుఃఖంబులు ఫలంబులు. ఈవృక్షంబు సూర్యమండలపర్యంతంబు వ్యాప్తంబై యుండు. గ్రామంబులఁ దిరుగాడు కాముక గృధ్రంబు లందు దుఃఖరూపఫలంబును, వనంబుల నివసించు పరమహంస హంసంబులు సుఖరూపఫలంబు ననుభవించు. ఇట్లు బహురూపుఁడును, మాయామయుండునగు పరమాత్మను గురుముఖంబున నెవ్వ డెఱుంగు వాఁడు తత్త్వార్థం బెఱింగినవాఁడగు. 350

గీ. ఇట్లు గురుపాదపూజార్జితైకభక్తి, శాతతరమైన విద్యాసిచేత మిగుల
ధృతిఁదలిర్ప జీవోపాధిఁ ద్రెంచి పరముఁ, జెంది యప్రమత్తుఁడవై త్యజింపుమసిని.

---

## అధ్యాయము 13.

### హంసేతిహాసము

శ్రీకృష్ణుఁడు:—

గీ. బుద్ధికౌదవు సత్త్వరజస్తమోగుణములు, కలుగ వాత్మకు భంజింపవలె రజస్త
మంబులను సత్త్వమున నియమాన్వితుఁడయి, సత్త్వముడిగింపఁగావలె సత్త్వమునన

గీ. అరయ మద్భక్తిలక్షణమైనధర్మ, మొదవు శుద్ధసత్త్వంబునను నరునకు
సాత్త్వికపదార్థసేవచే సత్త్వగుణము, పెంపగున్ దాన ధర్మంబు వృద్ధిఁబొందు. 353

క. ఒత్తిగిలి సత్త్వభవస, ర్వోత్తమధర్మమున రూపరు రజస్తమముల్
అత్తెఱఁగున రెండుఁజెడ నుదాత్తా!, తన్మూలమగు నధర్మం బడఁగున్. 354

గీ. శాస్త్రము జలంబుఁ బ్రజయు దేశమ్ముఁ గాల, కర్మ జన్మంబులును ధ్యానకలనమంత్ర
మరయ సంస్కారమనఁ జనునట్టిపదియు, నివ్విగణియింపఁబడు గుణహేతువులయి.

గీ. వీనిలోపలఁ బెద్దలు దేని దేనిఁ, బొగడుచుందురో సాత్త్వికంబగు నది యది
దెగడుదురు దేని రాజసంబగునదియుఁ గఁ, దజ్జనోపేక్షితంబె తామసంబు. 356

ఆ. సత్త్వవృద్ధిఁ బొంద సాత్త్విక సేవయె, నరుఁడు సల్పఁదగు నిరంతరంబు
దాన ధర్మ మొదవు దాన సంస్మృతి భాగ్య, జనకమైనయట్టి జ్ఞాన మొదవు. 357

గీ. వేణుసంఘర్షజనిత వైశ్వానరుండు, తద్వనంబెల్లఁ గాల్చి శాంతమగునట్లు
అల గుణవ్యతికరజాతమగు తనువిది, గుణముల దహించి శాంతమగును దనంత.

ఉద్ధవుఁడు:—

గీ. నెలవులు సకలాపదలకున్విషయములని, యెఱుగుదురు కాదె? జనులు
పాయికముగ నటు
లైన శ్వ ఖ రాజ నివహంబులట్లుఁ దగిలి, యచ్యుతా! యేల విషయంబు
లనుభవింత్రు. 359

శ్రీభగవానుఁడు:—

వ. వివేకశూన్యునకు దేహాదికంబునందు నే నను మిథ్యాబుద్ధి మనంబున నుత్పన్నంబగు
చుండు. ఆ యహంబుద్ధివలన సత్త్వప్రధానమైనను మనంబును దుఃఖాత్మకంబైన
రజోగుణం బలముకొను.రజోయుక్తమైన మనస్సునకు సవికల్పంబైన సంకల్పంబుఁ
గలుగు. అందుండి గుణధ్యానంబునంజేసి దుర్భరంబగు కామంబు జనించు. 360

క. రాజస వేగవిమోహితుఁడై జడుఁ డజితేంద్రియుండునగుచుం బీడా
భాజనములైన కర్మము,లోజన్ గావించుచుండునురు కామగతిన్. 361

గీ. కోవిదుండు రజస్తమోగుణవిమూఢ,బుద్ధి యయ్యును మానసంబు నరికట్టి
దోషదృష్టి నతంద్రితాత్ముఁడయి మగుడఁ,దగులుఁ జెందకయుండు నుద్ధవ!
ధ్రువముగ. 362

క. విను మప్రమత్తుఁడై యొ,య్యన నాయందున్ మనంబునర్పింపఁగ నా
ననలసుఁడై చుఁ దిక్కాలం, బనఘ! జితశ్వాసుఁడున్ జితాసనుఁడగుచున్. 363

గీ. సర్వవిధముల మనమునుసంగ్రహించి,యర్థినాయందుఁ జొప్పించునట్లుఁ గాఁగ
ఆది మచ్ఛిష్యులగు సనకాదులకును, దెలిపినాఁడ నీయోగంబుధీవరేణ్యా! 364

ఉద్ధవుఁడు:—

క. సనకాదుల కేరూపం, బున నెప్డీ మహితయోగమును దెలిపితివో
వినుపింపుమి యారూపం, బును దెలియంగా పురాణపురుష వలచెదన్. 365

శ్రీకృష్ణుఁడు:—

క. దుగినుని మానసపుత్రికు, లగు సనకప్రభృతు లర్థినడిగిరి తండ్రిన్
దగ సూక్ష్మము నేకాంతము, నగు యోగగతిన్ వచింపుమని యవహితులై. 366

సనకాదులు:—

గీ. చిత్తముగుణంబులందునుజేరియుండు,గుణములున్ జిత్తమందునఁగూడియుండు
వానిఁ దరియించి మోక్షంబుఁబడయఁగోరు, వాని కొండొంటి వీడుటెట్లొనో
చెప్పుమ. 367

గీ. అని యడుగఁబడి భూతభావనుఁ డజుండు, కర్మవిక్షిప్తబుద్ధి సంకలితుఁ డగుటఁ
బెద్దతడవు చింతించియు వివరముగను, బ్రశ్నబీజ మెఱుంగ నప్రౌఢుఁ డయ్యె. 368

గీ. ప్రశ్నమునకుఁ దగు సదుత్తరంబు నెఱుఁగఁ, గోరి ధ్యానించెఁ ద్రిభువనగురుని నన్ను
హంసరూపంబున న్నే నయ్యబ్జయోని, యంతికంబున కరిగితి నపుడు వేడ్క. 369

చ. ననుఁ గని చెంతఁ జేరి చరణంబులకున్ గడుభక్తితోడ వం
దన మొనరించి తాతయగు ధాత నను ముందిడి నీ వెవండ వం
చని పరతత్త్వముం దెలియ నాత్మలఁ గోరెడు నమ్మునీంద్రు ల
డ్గిన యపు డేనుఁ జెప్పిన నుడిన్ విను ముద్ధవ! వెండి జెప్పెదన్. 370

క. వైవిధ్యం బది లేదుగ, దా వస్తువునకును మౌనులారా! యిఁక మీ
రేవంవిధమగు ప్రశ్నం, బే విధముగ సంఘటిల్లు నేమి వచింతున్. 371

గీ. అరసి చూడంగఁ బంచభూతాత్మకంబు, లైన భూతంబు లెల్లఁ దుల్యములు గావె
వాస్తవముగ నప్పుడు నీ వెవండవ నెడు, ప్రశ్నము మునీంద్రులార! నిరర్థకమగు.

క. మనమున వాక్కున దృష్టిని, నెనసి తదన్యేంద్రియములనే దే దిటఁ గై
కొనఁబడు నయ్యది నేనే, యని తెలియుఁడు లేదుగా మదన్యము లవమున్. 373

క. నందనులారా! విషయము, లందున్ జిత్తంబు జిత్తమందు విషయముల్
క్రిందుకొను మదాత్ముండగు, చుం దనరెడు జీవు తను వెసను మ్ముభయంబున్. 374

గీ. విషయముల సంతతంబు సేవించుకతనఁ, జిత్త మవ్వానియందుఁ జొచ్చికొనియుండు
విషయములు చిత్తమునఁ బ్రభవించుచుండు, జీవుఁ డుభయంబు మద్రూపుఁడై
విడుచును. 375

క. అల జాగ్రత్స్వప్నసుషుప్తులు ధీవృత్తు లివి సుమ్ము పొడము గుణములన్
దలఁపఁగ సాక్షిత వానికి, విలక్షణుండగుచు సంభవిలు జీవుండున్. 376

వ. ఆత్మకీ సంసృతిబంధంబు గుణవృత్తుల నొసంగునదియగు నేని తురీయుండనగు నాయందుఁ జొచ్చి యీ సంసృతిబంధంబును బరిత్యజింపవలయు. ఆత్మకు నహంకారకృతంబగు బంధంబు సనర్థహేతువుఁగా నెఱింగి నిర్విణ్ణతం జెంది తురీయంబునఁ జొచ్చి సంసారచింతను ద్యజింపవలె. పురుషునకు నానార్థబుద్ధి యుక్తులచే నెంతపర్యంతంబు నివర్తింపకుండు నంతపర్యంతంబును స్వప్నంబునందు జాగరణంబుం బోలె ననభిజ్ఞుండై జాగరణమునంద స్వప్నంబు ననుభవించుచుండు. 377

జీవుండు జాగ్రదవస్థయందు చక్షురాది సమస్త కరణంబులచే క్షణిక ధర్మంబులగు స్థూలదేహాదుల ననుభవించు. స్వప్నంబునఁ దత్సదృశంబులును, వాసనామయంబులునగు నర్థంబులను బొందు. సుషుప్తియందు వానినన్నింటి నుపసంహ

రించు. ఇట్లొక్కండ యవస్థాత్రయసాక్షియు, నింద్రియేశుండునై స్మృత్యాన్వ యంబున నొప్పారుచుండు. కావున మదీయ మాయచే గుణంబులవలన మన స్సునకు నవస్థాత్రయంబు నాయందుఁ గల్పింపఁబడెనని నిశ్చితాత్ములరై యను మాన సదుక్తి సునిశిత జ్ఞాన కృపాణంబుచేత హృద్గత సమస్త సంశయాదుల ఛేదించి నన్ను భజియింపుఁడు. మనోవిజృంభణంబును, దృష్టంబు నలాతచక్రంబు పోలె నతిచంచలంబునైన యీ జగంబును విభ్రాంతికరంబుఁగా నెఱుంగుఁడు. గుణత్రయకృతంబగు భేదంబు స్వప్నంబువలె మాయవలనఁదోఁచు. మాయా వశంబుననే యేకవిధంబైన జ్ఞానంబు బహువిధంబై భాసించు. దృశ్యంబునుండి దృష్టినిమరలించి యాత్మసుఖానుభూతియుతుండును నిష్కాముఁడునై పురుషుండు తూష్ణీభావముం బొందవలయు.దృశ్యం బొకప్పుడు గోచరించినను నవాస్తవికబుద్ధిఁ బరిత్యక్తంబై మోహజనకంబుఁగాకుండు. దేహపాతపర్యంతంబు నాభాసమాత్రం బైయుండు. 378

మ. దేహం దాను నిజస్వరూపమును బొందెడెన్ నశ్వరంబైన య
ద్దేహమ్మనున్ సిద్ధినిఁ గొన్న పూరుషుఁడు పేర్కొంగానఁ బో దుత్థితం
బైనన్ సంస్థితమైననున్ వ్యపగతంబైనన్ బునస్సంగతం
బైనం గట్టినపుట్టముం గనని యాహాలామదాంధుంబలెన్. 379

వ. ప్రారబ్ధం బున్నంతపర్యంతంబు సిద్ధపురుషుండు సప్రాణుండై మోక్షంబుకై ప్రతీక్షించుచుండు. ఆరూఢ సమాధియోగుండై వస్తుతత్త్వం బెఱింగి స్వప్నతుల్యం బగు ప్రపంచంబును మరలఁ జెందకుండు. మునీంద్రులారా! సాంఖ్యయోగం బులందలి గుహ్యంబైన మోక్షపథంబు మీకుం జెప్పంబడియె. మీకు ధర్మంబుఁ దెలుపంగోరివచ్చిన యజ్ఞపురుషుఁగా నన్నెఱుంగుఁడు. ద్విజోత్తములారా! సాంఖ్యమునకు, యోగమునకు, సత్యమునకు, సుకృతమునకుఁ, దేజమునకు, శ్రీకిని, గీర్తికిని, దమమునకు నేన పరమంబైన యాశ్రయంబనగుదును. నిర్గుణుం డను, నిరపేక్షుండను, బ్రియుండను, నాత్మరూపుండనైన నన్ను శ్రీకల్యాణ గుణంబు లాశ్రయించియుండు. 380

శ్రీభగవానుఁడు:—

చ. అని యిటు లేను దెల్పిన మహోత్తరబోధ రసానుభూతి నా
సనకసనందనాది మునిసత్తములున్ దమ సంశయంబు లె
ల్లను దెగిపోవ నిర్గత మలంబగు భక్తిని నాకు మున్ సభా
జనమొనరించి మొక్కి మొగిసంస్తుతిఁ జేసిరి పెక్కు భంగులన్. 381

గీ. ఆ పరమముని వరులచేఁ నర్చితుఁడను, బ్రస్తుతుఁడనై రయంబునఁ బద్మభవుఁడు
తా నిరీక్షించుచుండంగ దక్షిణంబ, తరలిపోయితి నేను స్వధామమునకు. 382

## అ ధ్యా య ము 14.

### ధ్యా న యో గ ము

ఉద్ధవుఁడు:—

సీ. శ్రీకృష్ణపరమాత్మ! శ్రేయముల్ పెక్కులు, బ్రహ్మవాదులు వేఱ బల్కుచుండ్రు
సర్వసంగంబు విసర్జించి యెద్దాన, నీయందె డెందంబు నిల్పియుండు
న య్యనపేక్షితమైన నిశ్చలభక్తి, యోగంబుఁ దెల్పి తీవో మహేశ!
వాని కన్నింటికి వైకల్పికముగ ప్రా, ధాన్యముండునొ యొకదానియందె
గీ. యెక్కుడు విశేషముండునో యేనెఱుంగ, వేడ్కపడుచుంటి నిద్దాని విస్తరముగఁ
దెల్పుమన్న నుద్ధవుఁ గాంచి దేవదేవుఁ, డై నకృష్ణుండు వక్కె నెయ్యంబుఁ దోఁప. 383

శ్రీభగవానుఁడు:—

గీ. వేదసంజ్ఞితయి వ్వాణి విలయమందు, నయువిదా! కాలగతిచేత నష్టమయ్యె
ఆ మదాత్మక ధర్మమె యలరునట్టి, వాణినిం జెల్పితిని దొల్త బ్రహ్మకేను. 384

సీ. ఆ తామరసనూతి యాదిపుత్రుండగు, మనువున కా వ్వాణిని వచించె
నాతనివలన భృగ్వాది సప్తప్రజా, పతులు మహర్షులు వరుసఁ గొనిరి
ఆ మునీంద్రులచేఁ దదాత్మజులగు దేవ, దానవ గుహ్యక మానవులును
నాగ విద్యాధ్రగంధర్వచారణసిద్ధ, కిందేవ కిన్నర కింపురుషులుఁ
గీ. గొనిరి సత్వరజస్తమో గుణవశతను, వారి ప్రకృతుల్ బరగెడు బహువిధములఁ
బ్రకృతులకతము, నంభూత పటలములివి, భిన్నమగును దద్బుద్ధులున్ వేఱుపడును.

సీ. ప్రకృతిఁ బట్టి యెసుమి వాక్కు లెల్లరకును, బరికించి చూడ నివ్వాటిలు నిట్లుఁ
బ్రకృతివైచిత్ర్యంబు వలన మానవులకు, బుద్ధులు భిన్నతఁ బొందుచుండుఁ
బ్రకటోపదేశ పారంపర్యమునను, గొందఱు మతుల్ భిన్నతఁ దగిలియుండు
నితరులు పాషండమతులై చరింత్రు మ, న్మాయావిమోహిత మానసులయి
ఆ. తమదుకర్మఁ బట్టి తమయభిరుచిఁ బట్టి, పల్కుచుంద్రు నరులు పలు తెఱఁగులు
గాఁగ శ్రేయములను భాగవతోత్తమ!, ఉద్ధవా! యిదెల్ల నోజవినుము. 386

సీ. కొందఱు ధర్మంబుఁ గొందఱు యశము స, త్యంబుఁ గామంబును దమశమములుఁ
గొందఱు స్వార్థంబుఁ గొంద రైశ్వర్యమున్, గుడుపును విడుపును గొందఱు మఱి

కొందఱు యజ్ఞంబుఁ గొందఱు తపమును, గొందఱు దానమున్ గోర్కె మీఱఁ
గొందఱు వ్రతమును గొందఱు యమనియ, మంబులు నంద్రు శ్రేయంబులనుచు
గీ. వీని ఫలములు కర్మకల్పితములగుట, నాశయుతములు క్షుల్ల కానందదములు
భోగకాలమునను శోక పూరితములు, భావికాలమునన్ దుఃఖ భాజనములు. 387

శా. సూరిశ్రేష్ఠ! మదర్పితాత్ముఁ డనపేక్షుండున్ బుధుండౌచు నా
త్మారామున్ననుఁబొంది పొందుసుఖముం దా రించుకంతేని నె
వ్వారల్ బొందఁగలారొకో కువిషయ వ్యామోహబద్ధాత్ములౌ
వారల్ భాగవతోత్తమా! యిది యసంబద్ధంబు భావింపఁగన్. 388

క. శాంతుం డకించనుండును, దాంతుఁడు సమచిత్తుఁడున్ మదర్పితమతియై
సంతుష్టి నొప్పువాని క,నంత సుఖవిధాయకంబులగు నెల్లదిశల్. 389

ఉ. ఒల్లఁడు పారమేష్ఠ్యపద మొల్లఁడు దైవతనాయకాసనం
బొల్లఁడు సార్వభౌమపద మొల్లఁడు సర్వరసాధిపత్యమే
నొల్లఁడు యోగసిద్ధుల మఱొల్లఁడు మోక్షపథంబు నే బుధుం
డుల్లము నాపయిం జొనిపి యొల్లఁడు జుమ్ము మదన్యమెద్దియున్. 390

క. నీవలె నాకుం బ్రీతిం, గావింపరు శంకరుండు కమలభవుఁడు శ్రీ
దేవియు, సంకర్షణుఁడును, గేవలమగు నాత్మయును బ్రకృష్టతరాత్మా! 391

క. యమి, నిరపేక్షుని, శాంతుని, సమదర్శిని, వైరరహితు సచ్చరితు బుధో
త్తముని వెనుదవిలి చనియెద, విమలచరణ రేణువులఁ బవిత్రముఁ జేయన్. 392

ఉ. కేవలులున్ బ్రశాంతులు నకించనులున్ మదుపాత్త చిత్తులున్
జీవకృపాగరిష్ఠులును శ్రేష్ఠులుఁ గామ వివర్జితాత్ములున్
బావనులైనవారు ప్రీతిభన్ బడయంగల నైరపేక్ష్య చ
ర్యావిభవాఢ్యమా సుఖము నన్యులు పొందఁగలారె? యెందునున్. 393

ఉ. ఎన్నఁగ నాదు భక్తుఁ డజితేంద్రియుఁడై విషయాళిచేత నా
పన్నతఁ బొందియున్ సుదృఢ భక్తి మెయిన్ గనబోఁడ గౌరవం
బెన్నఁడు జ్వాలితాగ్ని యెటు లింధనజాలము బుగ్గిఁ జేయునో
క్రన్నన నట్లె మద్విషయికంబగు భక్తియుఁ బాపహంబగున్. 394

సీ. ఉద్ధవ! వింటె యత్యూర్జితమైన మద్భక్తి చందంబున ధర్మము మఱి
సాంఖ్యంబు యోగంబు స్వాధ్యాయ ముఁ దపంబుఁ, ద్యాగంబు నన్నుఁ బొందంగ జేయ
వేకాంతభక్తిచే నేను గ్రాహ్యుఁడ నౌదు, శ్రద్ధాపరీతమై జరుగునట్టి
మన్నిష్ఠయగు భక్తి యెన్న శ్వపచుల నే,నియుఁ జేయు జన్మపునీతులుగను

గీ. దలఁప సత్యదయోపేత × ధర్మమేని, విశ్రుత తపస్సమన్విత × విద్యయేని
మద్విమలభక్తివిరహితా × త్మను బునీత, తరముఁగావింపఁగా సమ × ర్థములుగావు 395

గీ. ఓ మహాభాగ! యుద్ధవా! × రోమహర్షణము దరీవిభూతచిత్తమా × నందబాష్ప
కలయులేకుండ సద్భక్తి × గమ్యమగునె?, సుదృఢభక్తిలేకమనంబు × శుద్ధిఁగనునె. 396

ఉ. కుత్తుకరాల్పడన్ హృదయ × కుట్మలమున్ ద్రవియింప నొక్కచో
నొత్తిలి నవ్వ నేడ్చు మతి × యొక్కతఱిన్ మది సిగ్గువీడి గొం
తెత్తి చెలంగి పాడుఁ గడు × నృత్యముసేయు మదీయభక్తి సం
పత్తి పరీతుఁ డీ జగముఁ × బావనముం బొనరించు నిచ్చలున్. 397

మ. అనలజ్వాలలఁ దాపితంబయి హిర × ణ్యంబెట్లు మాలిన్య వ
ర్జనమున్ జేసి స్వరూపలబ్ధి చెలువా × రన్ గాంచు నాచాట్పునన్
విను మన్నిర్మలభక్తియోగమున న × య్యర్విన్ బెక్కులౌ కర్మవా
సనలన్ బాయఁగఁద్రోసి యాత్మ నను నో × జంబొందు సుమ్ముద్ధవా! 398

గీ. పరిణుతమత్పుణ్యగాథా × శ్రవణసుకీర్తనములఁ జిత్తమెంతగ శోధి × తమగుచుండు
నంతఁగాతత్త్వసూక్ష్మంబు × నరయుభక్తుఁ, డంజనోపాత్తమయినన × యనముఁబోలె.

గీ. నిరతమున్ విషయముల ధ్యా × నించువాని, స్వాంత మవ్విషయంబులన్ × సక్తమగును
నన్నుస్మరియించువాని మా × నసము విబుధ, మానితంబయి నాయందు × లీనమగును.

గీ. స్వప్నజాత మనోరథ × సదృశమైన, అసదభిధ్యానమున్ విడ × నాడి నీవు
పూనిమద్భావభావితం × బైన మనము, నిల్పు నాయందు నుద్ధవా! నేర్పుమీఱ. 401

క. అంగనల సంగమున్ ద, త్సంగుల సంగముఁ ద్యజించి × దవుల వివిక్తం
బుం గడుక్షేమమగు నెలవు, నం గూర్చుండి తలఁపనగు × నన్నలసుండై. 402

గీ. అంగనల సంగమునను ద × త్సంగిసంగ, మునను గడుఁగ్లేశముం బంధ × మునుగలిగెడు
చాడ్పునం గల్గ దన్యప్ర × సంగవశత, నమ్ముమిది యుద్ధవా! నీవు × నెమ్మనమున. 403

ఉద్ధవుఁడు:—

గీ. ఎట్టిరూపముఁ గలవాని × నెట్టివాని, నిన్ను మోక్షార్థిజనుఁడు ధ్యా × నింపవలయు
ధ్యానలక్షణమది నాకు × నంబుజాక్ష!, చెప్ప నర్హుఁడవీవ వ × చింపుమయ్య! 404

శ్రీభగవానుఁడు:—

సీ. సమమైచెలంగు నా × సనమున సమకాయుఁ, డగుచు సుఖాసీనుఁ × డై పురుషుఁడు
ఉత్సంగమునఁ జేతు × లునిచి స్వనాసాగ్ర, మునయందుఁ దనదు చూ × పులు నిగిడ్చి
గొనకొని పూరక × కుంభక రేచకం, బులచేత శోధింప × వలయుఁ గడఁకఁ
బ్రాణమార్గమును వి × పర్యయమునఁగూడ, నిర్జితేంద్రియుఁడౌచు × నేర్వవలయు

గీ. హృదిఁ జెలంగు ఘంటానాదసదృశమైన, యట్టి యోంకారమజ్జనాళాంతరోర్ణ
మట్లుఁ బ్రాణంబుచేలేపి వ్యాప్తిఁజేసి, మగుడఁ జొప్పింపవలెనం దేతగినరీతి. 405

గీ. ప్రణవసంయుక్తమైయొప్పు ప్రాణసంయ, మముల నిట్లభ్యసించుచుమానవుండు
త్రిషవణముఁబదిమార్లొనరించుచుండి, నెలగడచినంతఁ దా జితానిలుఁడగునిటు.

వ. అంతస్థంబును, ఊర్ధ్వనాళంబును, అధోముఖంబును నైన హృత్పుండరీకంబును ధ్యానవశంబున నూర్ధ్వముఖంబును, నిర్భిద్రంబును, సకర్ణికంబును, అష్టపత్రంబును గావించి సూర్యసోమాగ్నుల కుత్తరోత్తరంబుగఁ గర్ణికయందుంచి ధ్యానించవలయు. వహ్నిమధ్యంబున ధ్యానమంగళంబగు మదీయరూపంబు నిట్లు స్మరింపవలయు. 407

సీ. సమముఁ బ్రశాంతంబు సుముఖంబు చారువి, స్తృతచతుర్భుజము శుచిస్మితంబు
సుకపోలమున్ గమ్రసుందరగ్రీవంబు, హేమాంబరము ఘన శ్యామలంబు
కర్ణవిభ్రాజన్మ కరకుండలంబును, శ్రీవత్సలాంఛన శ్రీయుతంబు
శంఖచక్రగదాబ్జ సద్వనమాలా వి, భూషితమాత్తనూపుర పదంబు

గీ. కౌస్తుభ శ్రీయుతంబును ఘనకిరీట, కటకకటిసూత్ర భాస్వదంగదయుతంబు
సుప్రసన్నంబు సర్వాంగసుందరంబు,నైన నారూపు ధ్యానింపనగు బుధుండు.408

గీ. క్రమత నింద్రియముల విషయములనుండి, మనసుచేతనులాగి యమ్మనముఁగూడ
బుద్ధిసారథిచేత సర్వోజ్జ్వలాంగ, యుతుఁడనైన నాయం దొగిఁనుంపవలయు.409

సీ. పిజ్ఞమీఱంగ సర్వవ్యాపకమగు నా, మనము నాకర్షించి యనువుమీఱ
నొకచోటఁజేరిచి యుంపఁగావలయుఁ ద, దితరాంగముల్ స్మరియింపరాదు
మగుడంగ సుస్మేరమగు ముఖాబ్జంబును, భావింపవలయు భావంబుఁదనర
ఆ ముఖపద్మంబునందు నెక్కొన్న చి, త్తంబు నాకర్షించి యంబరమున

గీ. నిల్పనగు నదివిడిచి మన్నిష్ఠుఁడగుచు, నితరమొక్కంచుకయు స్మరియింపరాదు
అవహితమనస్కుఁడై జ్యోతియందు జ్యోతి, గతిని నాయందుఁ దన్మనము
గలుపవలయు. 410

క. సునిశితమగు ధ్యానమునన్, మనము నిటుల్ యుక్తముగ నొనర్చు సుకృతికిన్
విను ద్రివ్యజ్ఞానక్రియ, లను గలిగెడునట్టి భ్రమతొలంగు వెనమెయిన్. 411

## అధ్యాయము 15.

### అణిమాద్యష్టసిద్ధి వర్ణనము

శ్రీభగవానుఁడు:—

క. యతబుద్ధి జితశ్వాసుఁడు, జితేంద్రియుఁడు యుక్తుఁడునయి చిత్తము మన్ని
ష్ఠితమొనరించిన యోగికి, నతులములగు సిద్ధులగుఁ దమంతన ననఘా! 412

ఉద్ధవుఁడు:—

గీ. శ్రీనివాస! యే ధారణచేత నెట్టి, దేగతిని సిద్ధియొదవునో యెఱుఁగఁజెపుమ
సిద్ధు లెన్ని తెఱంగులో చెప్పఁ గదవె, యోగులకు సిద్ధిదుండ వీవో పరేశ! 413

శ్రీభగవానుఁడు:—

క. పదునెనిమిది సిద్ధులు మఱి, పదునెనిమిది ధారణలును వచియించిరి త
ద్విదు లష్టసిద్ధు లందున్, మదాశ్రయంబులగుఁ బది గుణాధిక్యదముల్. 414

సీ. అణిమయు మహిమయు నరయంగ లఘిమయు, దేహసంబంధి సిద్ధిత్రయంబు
ప్రాప్తి హృషీకసంబంధినియగు సిద్ధి, శ్రుతదృష్టములయందు చొప్పడునది
ప్రాకామ్యమను సిద్ధి పరగ మాయాప్రేర, ణంబు నీశత్వ మనఁబడుసిద్ధి
త్రిగుణములందు నెందే పొందులేమి వ, శిత్వంబు నాఁబడు సిద్ధి దలఁపఁ

గీ. ప్రీతి నేయే సుఖంబు లర్థించుచుండు, వాని యవసితి తుదముట్టఁబడయుటరయఁ
గామమనియెడు సిద్ధి యీక్రమత నాదు, సిద్ధు లౌత్పత్తికంబులు చెలఁగుచుండు.

సీ. దేహి క్షుత్పిపాసాది రాహిత్యమున్ మఱి, దూరశ్రవణమును దూరదృష్టి
ఘనమనోజవమును గామరూపముఁ బర, కాయప్రవేశముఁ గామ్యసిద్ధి
స్వచ్ఛందమరణంబు సాప్సరోబృంద బృం, దారక క్రీడానుదర్శనంబు
నప్రతిహతగతి యగు నాజ్ఞయును నివి, పదియును గుణవైభవప్రదములు

ఆ. తగఁ ద్రికాలవేదితయును నద్వంద్వంబుఁ, దలఁపఁగాఁ బరేంగితజ్ఞతయు జ
లాగ్ని విష దివాకరాది ప్రతిష్టంభ, మపరిభవము సిద్ధులైదివియగు. 416

గీ. యోగధారణసిద్ధులు ప్రోక్తములివి, నీకు నుద్దేశమునఁ జేసి నిర్మలాత్మ!
ఏదియెట్టు లేధారణచేఁ దగలభియించునో యింకఁ దెలిపెద నెఱుఁగుమయ్య. 417

వ. భూతసూక్ష్మాత్ముండనగు నాయందు భూతసూక్ష్మాకారంబగు మనంబును బాదు
కొల్పుచుఁ దన్మాత్రోపాసకుండై మదీయంబగు నణిమయను సిద్ధిం బొందు. మహ
త్తత్త్వోపాధినగు నాయందు యథాతథంబుగ మనంబును నెలకొల్పుచు, నాకా
శాదిభూతపరుండై తత్తద్భూతంబులమహిమయను సిద్ధింబడయు. భూతపరమాణు
మయుండనగు నాయందు జిత్తంబును రంజింపఁజేయుచు, యోగి కాల సూక్ష్మ

రూపంబగు లఘిమయను సిద్ధింగాంచు. వైకారికాహంకారోపాధినగు నాయందు నేకాగ్రంబైన మనంబును నిల్పుచు మత్పరుండై సర్వేంద్రియాత్మరూపంబగు ప్రాప్తియను సిద్ధింగను. మహత్తత్త్వ సూత్రోపాధినగు నాయందు మానసంబు నెక్కొనంజేయుచు నవ్యక్తజన్ముండనగు నా సర్వోత్కృష్టంబగు ప్రాకామ్యసిద్ధిం జెందు. కాలరూపుండను త్రిగుణమాయానియంతను, విశ్వవ్యాపకుండనునగు నాయందు మనంబుం జొనుపుచు జీవతదుపాధిచోదనంబగు నీశత్వసిద్ధిం గైకొను. భగవచ్ఛబ్దవాచ్యుండను, నారాయణుండను, దురీయాఖ్యుండను నగు నాయందు మనంబు నిగుడ్చుచు యోగిమద్ధర్ముండై వశిత్వసిద్ధింబడయు. నిర్గుణపరబ్రహ్మంబ నగు నాయందు స్వచ్ఛంబగుమనంబును జొప్పించుచుం గామావసితిం జెందుచుం బరమానందమొందు. శ్వేతద్వీపపతిని, శుద్ధుండను, ధర్మమయుండనగు నాయందు మనంబుంజొనిపి నరుండు షడూర్మిరహితుండై పరిశుద్ధత్వముంబొందు. ఆకాశాత్మక ప్రాణరూపుండనగు నాయందు మనస్సున ఘోషంబును ధ్యానించుచు, నం దభివ్యక్తంబులగు భూతవాక్యంబుల దవులనుండియే యాజీవుండు వినుచుండు. ఆదిత్యునందు నేత్రమును నేత్రమునం దాదిత్యునిఁజొనిపి యందునన్నుమనస్సుచే ధ్యానించుచు సూక్ష్మదృష్టియై విశ్వవిశ్వంబును గనుచుండు. నాయందుమనస్సును నెలకొల్పి దేహమును వాయువునందు లీనంబుఁజేసి మద్ధారణాప్రభావంబున మనంబుచనినచోటికి దేహంబునంజనుచుండు. మనం బుపాదానకారణంబుగాఁజేసి యే యే రూపమును బొందఁగోరు నా యా రూపంబును మద్యోగబలంబు నాశ్రయించి ధరించుచుండు. సిద్ధుండు పరకాయంబునన్ జొరఁదలంచుచు నందు నాత్మను జింతించుచు స్వదేహంబునువిడిచి ప్రాణవాయురూపుండై షట్పదంబువోలె ననాయాసంబునఁ బ్రవేశించు. మడిమచే గుదస్థానంబునుబీడించి ప్రాణంబును హృదయోరుఃకంఠమూర్ధంబుల నారోహింపంజేసి బ్రహ్మరంధ్రంబునుండి బ్రహ్మంబును బొందించి తనువును విసర్జించు. 418

దేవతోపవనంబుల విహరింపఁ గోరుచు మదీయ శుద్ధసత్త్వ రూపంబు ధ్యానించు సిద్ధుని సత్త్వాంశభూతలగు సురకాంతలు వ్యోమయానంబున సేవింపుచుందురు. ఎప్పుడెట్లుబుద్ధిచే సంకల్పించి మత్పరుండై నపురుషుండు సత్యరూపుండైన నాయందు మనంబు సంసక్తంబుఁగావించు నప్పుడయ్యది యట్లుపొందుచుండు. సర్వనియంతను స్వతంత్రుండనగు నా స్వభావంబుఁబడసి పురుషుండెందును విపన్నుండు గాకుండు. మఱియు నతనియాజ్ఞ నాయాజ్ఞవలె నమోఘంబై చెల్లుచుండు. మద్భక్తి పరిశుద్ధాత్ముండును, ధారణావిదుండునైన యోగికి స్వజన్మమృత్యుసహితమైన త్రికాలవస్తువిషయికసిద్ధి ప్రాప్తించు. 419

క. జలజంతువులకు నుదకము,వలె మద్యోగయుతుఁడయినవర యోగి సము
జ్జ్వలయోగమయశరీరము, నలతం బొందింపఁజాలఁ వగ్న్యాదికముల్. 420

సీ. ఛత్రచామర కేతుసహితంబుగాఁగ శ్రీ,వత్సాదిభూషితమత్పకల శు
భావతారంబులఁ ధ్యానించునట్టి సు,ధీజనుఁ డెప్పు డపరాజితుఁడగు
స్థిర యోగ ధారణచే నన్నని ట్లుపా,సించుచుండెడు మునిశేఖరునకు
ఉద్ధవా! పూర్వోక్త సిద్ధు లెల్లను సమ,గ్రంబుగా సముపపన్నంబులగును

గీ. శాంతుఁడు జితేంద్రియుఁడు జితశ్వాసుఁడునయి,నాదు ధారణ డెందమునం ధరింప
మానిపుంగవునకుఁ దలంపంగ సిద్ధి,యెయ్యదియు దుర్లభంబుఁ గాదయ్యయనఘ!

గీ. ఉత్తమంబగు యోగంబునొందఁగోరు,పూరుషున కివి ప్రత్యూహములుగఁ దద్వి
దులువచించుచునుంద్రునాతోడివాని, కెన్న నవికాలయాపన హేతువులగు. 422

వ. జన్మౌషధితపోమంత్రంబుల నెట్టిసిద్ధులుసిద్ధించు వానినెల్ల యోగి యోగంబునఁ
బడయుంగాని యితరంబులన్ దగులువడి యోగగతిం ద్యజింపఁడు. 423

గీ. ఉద్ధవా! సాంఖ్యమునకును యోగమునకుఁ,బ్రకటధర్మంబునకు బ్రహ్మవాదులకును
ఎల్ల సిద్ధులకున్నే నుహేతువగుదు,పాలకుఁడ నాదు మఱి నేను ప్రభువునగుదు. 424

గీ. భూతములవి చతుర్విధభూతతతిని, వెలిని లోను వ్యాపించెడివిధముఁగాఁగ
నఖిల జీవులకున్ బహిరంతరముల,నావృతుండనుగానట్టియాత్మనగుదు. 425

---

## అధ్యాయము 16.

### శ్రీమన్నారాయణ విభూత్యభివర్ణనము

ఉద్ధవుఁడు:—

గీ. నీవ యాద్యంతరహితం బనావృతంబు,నైన సాక్షాత్పరబ్రహ్మమనఁగఁబడుదు
వీవ సృష్టిస్థితిలయంబు లెల్లభూత, పటలమునకును జేయుచుఁ బరగుదుకద. 426

క. నానాభూతములం ద,జ్ఞానులకుం దెలియఁబడక బరఁగెడునిన్నున్
మానులు యథాతథంబుగ, ధీనుతులై కొల్చుచుంద్రు దేవేశ! హరీ! 427

క. ఏ యే భావములందున్, ధీయుతులై పరమమునులు దేనన్నిన్నున్
బాయక సేవించుచు నిర, పాయంబగు సిద్ధిగందు రపలుకుముదానిన్. 428

క. భూతాత్ముండవు భూత, వ్రాతములో నీవు గూఢవర్తి వగు దహహో!
భూతేశ! ద్రష్ట నిన్నున్, భూతములు గనంగ లేవు మూఢములగుటన్. 429

గీ. దివి భువి రసాతలంబున దిక్కులందు, నే విభూతులుగలవో మహావిభూతి
కలిత భవదనుభావితములగువాని, నాకుఁ దెల్పుము నీ చరణంబుఁగొల్తు. 430

శ్రీకృష్ణుఁడు:—

సీ. వేదంబులందేను వేదగర్భుఁడను మం, త్రంబులలోపలఁ బ్రణవమేను
కన నక్షరములం దకారంబనేను ఛం, దంబులలోన బదంబు నేను
ఎల్ల దేహములందు నింద్రుండ నే హవ్య, వాహుఁడ నే నెల్లవసువులందు
నాదిత్యనిచయమ్ము నందు విష్ణుఁడ నేను, రుద్రులలో నీశ్వరుండ నేను

గీ. వెలయ బ్రహ్మర్షులందున భృగువునేను, మహిత రాజర్షులందున మనువునేను
పులుఁగులందునఁ బక్షివిభుండనే న, గుదుఁ బ్రజాపతులందు దక్షుండనేను. 431

సీ. ఉద్ధవ! నన్ను దైత్యులలోన నసురలో, కాధిపుఁ బ్రహ్లాదుఁగా నెఱుంగు
తారౌషధులను జంద్రముగాఁగ యక్షర, క్షస్సంఘమందు వైశ్రవణుఁగాఁగ
వారణేంద్రములందు నైరావతముగ యా, దస్తతియందుఁ దదధిపుఁడైన
వరుణదేవునిగాఁగ నరులందు రాజుఁగా, ద్యుతిమంతులందునద్యుమణిఁగాఁగ

గీ. సకల తురగములందు నుచ్చైశ్శ్రవముగ, ధాతువులలోన నష్టాపదంబుఁగాఁగ
దండకృత్తులలో దండధరునిగాఁగ, ఫణుల వాసుకిఁగా మనంబునఁ దెలియుము. 432

సీ. నాగేంద్రులందు ననంతుఁడ నేనైతి, శృంగి దంష్ట్రిలలో మృగేంద్రుఁడేను
ఆశ్రమములఁ దురీయాశ్రమమేనైతి, వర్ణంబులందునఁ బ్రథమ మేను
తీర్థస్రవంతులఁ దెలియ గంగను నేను, సరసులలోన సాగరము నేను
ఆయుధములలో శరాసనంబను నేను, ధానుష్కులం బురాంతకుఁడ నేను

గీ. నివసతిస్థానములను మేరువును నేను, దుర్గమంబులను హిమవంతుఁడను నేను
వర వనస్పతులందు నశ్వత్థమేను, ధాన్యౌషధులందు యవము నేను. 433

సీ. ఘనులౌ పురోధలందును వసిష్ఠుఁడనేను, బ్రహ్మిష్ఠులం బృహస్పతిని నేను
అఖిల సేనానులయందు స్కందుఁడనేను, అగ్రేసరులయందు నజుఁడనేను
యజ్ఞంబులం బ్రహ్మయజ్ఞంబు నేనాదు, వ్రతములందు నహింసావ్రతము నేను
మహితయోగముల సమాధిని నేనాదు, రణజిగీషువుల మంత్రంబునేను

గీ. శుద్ధములయందు వాయ్వగ్నిసూర్యతోయ, గగనరూప శుద్ధపదార్థమగుదునేను
నిపుణులందు నాన్వీక్షికి నే నగుదును, ఖ్యాతివాదులయందు వికల్పమేను 434

గీ. అతివ లందున శతరూప నగుదునేను, పురుషులందున స్వాయంభువుండనేను
మునులయందు నారాయణమూర్తి నేను, దండివర్ణులఁ గుమారుండనేను. 435

వ. ధర్మంబుల సన్న్యాసంబును, క్షేమంబుల నంతర్నిష్ఠయు, గుహ్యంబులఁ బ్రియవచన మౌనంబులును, మిథునంబులఁ బ్రజాపతియు, అప్రమత్తంబుల సంవత్సరంబును, ఋతువుల వసంతంబును, మాసంబుల మార్గశీర్షంబును, నక్షత్రంబుల

నభిజిన్నక్షత్రంబును, యుగంబులఁ గృతయుగంబును, ధీరులయందు దేవలాసితు లును, వ్యాసుల ద్వైపాయనుండును, గవులయం దాత్మవంతుండగు శుక్రుండును, భగవంతులలో వాసుదేవుండును, భాగవతులలో నీవును నేనయగుదును. 436

కింపురుషుల (వానరుల) యందు హనుమంతుండును, విద్యాధరులయందు సుదర్శ నుండును, రత్నములయందుఁ బద్మరాగంబును, సుందరంబులయందుఁ బద్మకో శంబును, దర్భజాతులయందుఁ గుశంబును, హవిస్సులయందు గవ్యంబగు హవి స్సును, వ్యవసాయులయందు ధనాదిసంపత్తును, కితవులయందు ఛలగ్రహంబును, బలవంతులలో నోజస్సహంబులును, భక్తులయందుఁ దత్కృతకర్మంబును, భక్తుల యర్చనయందలి వాసుదేవాది నవవ్యూహంబునందుఁ బరరూపంబును, గంధర్వులయందు విశ్వావసుండును, అచ్చరలయందుఁ బూర్వచిత్తియుఁ, బర్వతం బులందు స్థైర్యంబును, భూమియందు గంధమాత్రంబును, జలంబునందు రసం బును, తేజస్వంతములందుఁ బావకంబును, సూర్యేందుతారకలందుఁ బ్రభయు, నభంబునందు శబ్దంబును, బ్రహ్మణ్యులయందు బలియు, వీరులయం దర్జునుండును, భూతములయం దుత్పత్తి స్థితి లయాత్మకంబగుశక్తియు, గత్యుత్సర్గవా గుపాదా నానందములు, శబ్ద స్పర్శ రూప రసగంధంబులు నను సర్వేంద్రియవ్యాపారం బులు నేన యగుదు. 437

పృథివ్యప్తేజో వాయ్వాకాశంబులను పంచభూతంబులు నేన. అహంకారంబు, మహత్తత్త్వంబు, వికృతి, పురుషుండు, అవ్యక్తము, సత్త్వరజస్తమోగుణం బులు, పరబ్రహ్మంబు నేన యగుదు. 438

ఏతత్పరిగణనంబు నేతత్పరిజ్ఞానంబుఁ దత్త్వవినిశ్చయంబును నేన యగుదు. ఈశ్వరుండును, జీవుండును, గుణంబును, గుణియు నగు నేనుదక్క మఱియొం డెద్దియు సర్వవిధంబుల లేదు. పృథివ్యాదిపరమాణు పరిగణనము నాచేత పెద్ద కాలంబునం జేయంబడుంగాని యనేక బ్రహ్మాండంబుల సృజించు నా విభూతుల పరిగణనంబట్లు శక్యంబుకాదు. తేజంబును, శ్రీయుఁ, గీర్తియు, నైశ్వర్యంబును, హ్రీయుఁ, ద్యాగంబు, సౌభాగ్యంబు, షడ్గుణైశ్వర్యసంపత్తి, బలముఁ, దితిక్ష, విజ్ఞానం బెందెందుండు నదియెల్ల నా యంశంబ. 439

ఈ నా సర్వవిభూతులిట్లు సంక్షేపంబుగ నీకుం దెల్పఁబడియె. ఇవియెల్ల గగన కుసుమతుల్యంబులేకాన వాఙ్మనః ప్రాణేంద్రియంబులను నియమింపుము. ఆత్మచే నాత్మను నియమింపుము. దానంజేసి క్రిమ్మఱ సంసారమార్గంబునం బడకుండుదువు. 440

ఉ. ఏ ముని వాఙ్మనంబుల నహీనమతి న్నియమింపనేరఁడో
ఆమఘటాంబువ ట్లొడియు నాతని జ్ఞాన తపోవ్రతంబులున్
మామకభక్తిఁ గోడి మతిమత్పరుఁడై యసు వాఙ్మనంబులం
దా మరలింపఁగావలయుఁ దాన నతండుఁ గృతార్థుఁడయ్యెడున్. 441

---

## అధ్యాయము 17.

### బ్రహ్మచారిగృహస్థధర్మ ప్రతిపాదనము

ఉద్ధవుఁడు:—

సీ. వర్ణాశ్రమాచారవంతులకును దద్వి, హీనులౌ నరులకు నీవుఁ దొల్తఁ
ద్వద్భక్తిలక్షణార్తంబగుధర్మంబుఁ, దెల్పియుంటివి కదా దేవదేవ!
ఎత్తెఱంగున ననుష్ఠించు స్వధర్మంబు,చేత నీయందు విశిష్టభక్తి
యుదయించు నరులకు నది నాకుఁ దెల్పంగ, నర్హుండ వీ వగుదువబ్జనాభ!
గీ. హంసరూపంబునం దొల్లి యబ్జజునకుఁ, బరమ సుఖమగు ధర్మంబుఁ గరుణ దనరఁ
జెప్పియుంటివికద సరసిరుహనయన! ,ఓమహాభుజ! మాధవా! యోగివినుత! 442

గీ. మునుపుబోధింపఁబడిన దయ్యును గృపాల,వాల! యది తద్దయుం బెద్ద కాలముననను
లుప్తమైపోయె మఱి మర్త్యలోకమందుఁ, బ్రాయికంబుగ నుద్భవింపఁ
దని యెంతు. 443

చ. పురుషవతంసమా! యెచట మూర్తములై కళలొప్పుచుండు నా
సరసిజసూతి దివ్య పరిషత్తునఁగూడను గానరాఁడు నే
ర్పరి యగు వక్త కర్తయును రక్షకుఁడున్ దలఁపం ద్వ దన్యుఁ డో
వరద! దయానిధీ! తెలియఁ బల్కుము సర్వము నాకు నియ్యెడన్. 444

ఉ. సూక్తికథాప్రవీణ! మధుసూదన! కర్తవుఁ బాలకుండవున్
వక్తవునైన నీ విపుడు ప్రాభవ మొప్ప మహీతలంబు సం
త్యక్తముఁజేసి యేగఁగ వినష్టినిఁ జెందిన యీ సుధర్మముల్
వ్యక్తముఁగాఁగ జేసి దెలుపంగలఁ డెవ్వఁడు చెప్పు మచ్యుతా! 445

ఆ. కాన నో ప్రభూ! సకలధర్మవిదుఁడవు, పదిచెల్లు నెవరికెట్లుఁ దద్వి
ధంబుఁ దెలియమాకుఁ ద్వద్భక్తిలక్షణ, మైన ధర్మ మోజ నానతిమ్ము. 446

శ్రీకృష్ణుఁడు:—

గీ. సాధుహృదయ! వర్ణాశ్రమాచారవంతు, లైన నరులకుఁబరమ కల్యాణకరము
ధర్మ్యమైన దీ నీ ప్రశ్న దాని నీకు, విశదపఱచెద నుద్ధవా! వినుము శ్రద్ధ. 447

సీ. ఆదినిఁ గృతయుగ్గమందుమానవులకు, వర్ణంబు హంసాఖ్యఁబ్రథితమయ్యె
జన్మంబుచేతఁబ్రజల్ గృతకృత్యులై, దనరుటఁ గృతయుగ్గమనిరి దానిఁ
బ్రణవంబు వేదమైపరఁగె మద్రూపమా, ధర్మమ్ము వృషరూపధారియయ్యె
ముక్తకల్మషులు తపోనిష్ఠులైహంసు, నన్నుపాసింతురు జనంబు లచటఁ

గీ. బిదపఁ ద్రేతాముఖాన మద్ధృదయసీమ,నుండి పాణంబునం జేసియొద వెమూఁడు
వేదములువానియం దుద్భవించెనపుడు,నరగమద్రూపమైన యజ్ఞంబుభద్ర! 448

గీ. పొడమిరప్పుడువైరాజపురుషునుండి, యాస్యబాహూరుపాదజులైన ద్విజులు
క్షత్రియులు వైశ్యశూద్రులుఁగ్రమముతో స్వ,ధర్మలక్షణులగుచునుద్ధవ!బుధవర!

సీ. దీపితవైరాజరూపుఁడనగు నాదు, జఘనమునన్ గృహాశ్రమము గల్గె
వరహృదయమునుండిబ్రహ్మచర్యముపుట్టె,వక్షస్థలిన్ వనవాసమయ్యె
సన్యాసమొదవె శీర్షమునుండియిటు జతు,ర్వర్ణంబులును జతురాశ్రమములఁ
బొడమును జన్మభూములఁబట్టి నీచో త్త,మములగు ప్రకృతులుమానవులకు

గీ. శమము దమముఁ దపంబును శౌచము ముద, మార్జవంబును క్షమయు సత్యంబు దయయు
నమలమైన మద్భక్తియు ననఁగబఱఁగు, నివియబ్రహ్మప్రకృతులు భాగవతవర్య!

గీ. తేజముబలంబుశౌర్యంబుధృతి తితిక్ష,వీర్యము సముద్యమంబు నౌదార్యముమతి
స్థైర్యగరిమ బ్రహ్మణ్యతైశ్వర్యములును,దలఁచిచూడఁగనివియక్షత్రప్రకృతులు.

గీ. ఆస్తికత దాననిష్ఠయునరయఁగా న,దంభమున్ విప్రసేవయుధనసమృద్ధి
తుష్టిఁ బొందక గడనయందున్ మెలఁగుట, ననఁగ బఱఁగెడు నివియ వైశ్య ప్రకృతులు. 452

గీ. దైవమాయను ద్విజులకుగోవులకును,వేల్పులకును శుశ్రూషఁ గావించుటయును
దానవొదవులబ్ధినిసమ్మదంబుఁగనుట, యనెడునివిశూద్రప్రకృతులౌననఘచరిత!

క. అనృతము శౌచము స్తేయం,బు నాస్తికత శుష్కకలహమున్ బెను కామం
బును, గోధమ్మును, దృష్ణయు, ననునవి పరికించిచూడనంత్యజప్రకృతుల్. 454

వ. అహింసయు, సత్యంబు, నస్తేయంబును, గామ, క్రోధలోభరహితత్వము, భూత ప్రియహితేచ్ఛయు ననునిట్టిధర్మంబు సర్వవర్ణసామాన్యంబు. బ్రహ్మక్షత్రియ వైశ్యలానుపూర్వికంబుగ ద్వితీయజన్మంబగు నుపనయనంబుంబొంది గురు కులంబున నివసించుచు జితేంద్రియులై వాఙ్నియమంబుఁగలిగి వేదాధ్యయనంబుఁ జేయవలయు. మేఖలాజిన దండాక్ష బ్రహ్మసూత్ర కమండలువుల ధరించుచు నధౌతదంతచేలుండును, జటిలుండును, ననురక్తపీఠుండునై దర్భల ధరింపనగు.

స్నానభోజన హోమంబుల జపోచ్చారణంబున నఖంబులను, రోమంబులను (కక్షోపస్థగతంబులైన రోమంబులనుగూడ) ఛేదింపరాదు. బ్రహ్మచర్యవ్రతధరుండై యొకప్పుడును బుద్ధిపూర్వకంబుగ రేతంబును విసర్జింపరాదు. తనంత రేతఃపాతంబైనప్పుడు జలంబుల నవగాహనంబుఁజేసి కృతప్రాణాయాముండై గాయత్రిం జపింపవలయు. శౌచయుక్తుండును, సమాహితచిత్తుండును, యతవాక్యుండును మౌనియునై యగ్న్యర్కాచార్య గో విప్ర గురు వృద్ధ దేవతలను ఉభయ సంధ్యల నుపాసించవలయు. 455

క. గురు నన్నుఁగాఁ దెలియఁగనగు, నరభనమునఁ బరిభవింపఁ జన దొక్కపుడున్
నరబుద్ధి తగదు చేయం, బరికింపఁగ సర్వదేవమయుఁడు గురుఁడగున్. 456

క. ఆతనికి భిక్ష సాయం, ప్రాతంబులఁ దెచ్చి తగ సమర్పింపవలెన్
బ్రీతి మెసవవలెఁ దదను,జ్ఞాతుండై మిగులు దాని జాతుఁడు నియతిన్. 457

క. యాన సుఖాసన శయన, స్థానంబుల దేశికున కజస్రము పూజల్
దీనునివగిదిం జేయుచుఁ, దా నిలువవలెం దరిం గృతాంజలియగుచున్. 458

గీ. ఆత్మవిద్యాసమాప్తి పర్యంతమిట్లు, ఖండితంబుగ వ్రతమును గడఁకఁ బూని
భోగబాహ్యుఁడై గురుకులంబున వసింప, వలయుఁజుమ్ము శిష్యుండు నేర్పల
వడంగ. 459

వ. ఛందోలోకంబగు బ్రహ్మలోకంబు నారోహింపందలంచినవాఁడు బృహద్వ్రతుండై స్వాధ్యాయార్థంబు గురువునకు నిజదేహంబు నర్పింపవలయు. 460

గీ. అగ్నియందును గురువు నందాత్మయందు, సర్వభూతములందు నీశ్వరుని నన్ను
బ్రహ్మవర్చస్వియుం గతపాపుఁడునయి, పూజసేయవలె నపృథగ్బుద్ధియగుచు.

గీ. స్త్రీలఁగాంచుట తాకుట మేలమాట, వేడ్క సల్లాప మాదిగా విడువవలయు
ముందు విడువవలె మిథునీభూతులైన, ప్రాణులం గేస్తుకానట్టి బ్రహ్మచారి. 462

సీ. శౌచ మాచమనంబు స్నానసంధ్యోపాస్తు, లును మదభ్యర్చనమును జపంబుఁ
బృథుతీర్థసేవ యస్పృశ్యం బభక్ష్యం బ, భాష్యంబు విడుచుట భవ్యహృదయ!
అఖిలభూతంబులయందు మద్భావ మో, జను మనోవాక్కాయసంయమంబు
ననొప్పు నిద్ది సర్వాశ్రమములకుఁ బ, యుక్తమైన నియమమూర్జితాత్మ!

గీ. ఇట్లు పావకుగతి జ్వలించుచుండి, బ్రహ్మచర్యవ్రతుండగు బ్రాహ్మణుండు
అమలచిత్తుండు దగ్ధ కర్మాశయుండు,నగుచుఁ దపమున మద్భక్తుఁడగునుజూవె.

సీ. అంత ననంతరమగు ద్వితీయాశ్రమ, మును జొరంగఁదలంచు నిగమార్థ
జిజ్ఞాసచేత దక్షిణనిచ్చి గురునకుఁ, దదనుమోదితుఁడయి తాన మాచ

రింపంగవలయునుగృహమునసేన్ వన, మ్మునసేఁ బ్రవేశింపఁగఁబూనవలయు
బ్రాహ్మణుండై నచోఁ బ్రవ్రజింపఁగవచ్చు, నాశ్రమంబుననుండియాశ్రమంబుఁ

గీ. జొరవలయు నట్లుఁగాక మత్పరుఁడుకాని, మానవుఁడు యథేచ్ఛం జరింపంగవలవ
దాశ్రమ విరుద్ధ వర్తనుఁడగుచు నెప్పుడు, ధీసమన్విత! యుద్ధవా! యదీని వింటె. 464

గీ. ప్రాయమునఁబిన్న యున్ సమవర్ణయాత్మ, సదృశియుననిందితయునైన జాయనెన్ని
గేహమునుగోరునాతఁ డుద్వాహమంద, వలయుఁ జేపడుదాన శుభంబతనికి. 465

సీ. ఎల్లద్విజన్ములకిజ్యాధ్యయన దాన, ములును ముఖ్యపు ధర్మములు ప్రతిగ్ర
హంబు నధ్యాపనయాజనంబులు కేవ, లము బ్రాహ్మణునకె చెల్లంగుచుండుఁ
దేజంబుఁ దపముఁ గీర్తిని రూపుమాపెడు, నదిగా మదిఁ బ్రతిగ్రహంబు నెంచి
యన్యవృత్తులనేని నరసి దోషమ్ముఁ జీ, వింపవలె శిలోంఛవృత్తిచేత

గీ. బ్రాహ్మణుని దేహ మదితలంపంగనుంత, క్షుద్రకామానుభూతికింజొనుపఁదగదు
ఇందుఁ గృచ్ఛ తపం బాచరించుటకును, నం దనంత సుఖప్రాప్తికర్హమగును. 466

ఉ. పూని శిలోంఛవృత్తినిఁ బరిమోదిత మానసుఁడౌచు విప్రుఁ డ
న్యూనముఁ గామవర్జితము నూర్జితమైన పరిశస్తధర్మముం
బూని యతిప్రసక్తికినిఁ బోక గృహంబునసే వసించి నా
పైని మనంబు నెక్కొలిపి ప్రస్ఫుట శాంతినిఁబొందు నిచ్చలున్. 467

గీ. ఆర్తిఁగుందెడు మత్పరాయణుని విప్రు, నుల్లముఁ ద్రవింపఁగా నెవ్వరుద్ధరింత్రొ
వారి నే నుద్ధరింతు నాపదలనుండి, భీకరసముద్రముననుండి నౌకబోలె. 468

గీ. వ్యసనముననుండి తండ్రికైవడిని రాజు, ప్రీతి సర్వప్రజల నుద్ధరింపవలయు
మొనసి తనుఁదాన రక్షించుకొనఁగవలయు, గజపతి గజంబులంబోలెఁ గడు
వెరవున. 469

గీ. ఇట్టివాఁడయి నరపతియిందు సకల, మైన యశుభవ్రజంబు బాయంగఁద్రోచి
యర్కవర్చస్కమగు వ్యోమయానమెక్కి, యందు నింద్రునితోఁగూడ హర్ష
మందు. 470

వ. విప్రుం డాపన్నుండై వణిగ్వృత్తిచే విక్రియార్హంబులగు వస్తువులవలన నాపదఁ
దరింపనగు. అందును విపన్నుండై ఖడ్గంబున నుపాధి నవలంబింపఁదగునంతియకాని
నీచసేవ యుక్తంబుకాదు. రాజన్యుఁడు వైశ్యవృత్తి నాపన్నుండైనప్పుడు వేటచే
జీవింపనగు. కాకున్న విప్రరూపంబునఁ జరింపనగుఁ, గాని శ్వవృత్తి యోగ్యంబు
కాదు. వైశ్యుఁడు శూద్రవృత్తిని భజింపనగు. శూద్రుండు కారుకటవృత్తి నవ
లంబింపవచ్చు. ఆపన్ముక్తుండు నింద్యమగు కర్మంబున జీవనోపాధిం బొందరాదు.
విభవానుసారంబుగ స్వాధ్యాయ, స్వధా, స్వాహా, బల్యన్నాదుల మదూర్తిపు

లగు, దేవర్షి పితృభూతంబుల యజించవలయు. యదృచ్ఛాలబ్ధంబైన ధనంబును గాని శుద్ధోపార్జితధనంబునంగాని భృత్యులఁ బీడింపక యజ్ఞంబుల నన్ను యజింపవలయు. కుటుంబమున నసక్తుండు కారాదు. కుటుంబియైయున్నను భగవంతుఁడైన నగు నన్ను నేమఱం జనదు. విద్వాంసుం డదృష్టంబును దృష్టంబుంబలె నశ్వరంబుఁగా నెఱుంగు. 471

ఆ. పాంథ సంగమమగుభార్యాతనూజాప్త, బంధు సంగమంబుప్రతి తనువున
వీరుఁ జెడుచునుండ్రువారక నిద్రాప్రయాణమమునందు స్వప్నకథయుఁబోలె. 472

సీ. ఇల్లు యుక్తుల్ విమర్శించుచు గేస్తు గేహమున వసించుచునతిథిమాడ్కి
నిర్మమత్వుండునునిరహంకృతియునయి, నిలయంబుచేత బంధితుఁడు గాక
గార్హస్థ్య సంబంధికర్మంబులను యజ్ఞములను మద్భక్తిసంపూర్ణుఁడగుచు
సదనమునందుండఁజనును గాదేనిఁ బ్రజావంతుఁడై వనింజనగవలయుఁ

గీ. గాకయున్నఁబ్రవజితుఁడుకావలయును, గృహమునందు నానక్తుఁడైప్రీతిదార
పుత్రవిత్తేషణంబులమూఢుఁడగుచుఁదనకుఁ దా బద్ధుఁడగు నహంతామమతల.

ఉ. ఎన్నఁగఁ దల్లిదండ్రు లతివృద్ధులు భార్య యధీర శక్తిసం
పన్నులు కారనాథులు కుమారులు నే నిటుఁబోతినేనియున్
నన్నునుబాసి వీరు కృపణత్వమునం గడు దుఃఖితాత్ములై
చెన్నుదొఱంగి జీవనముఁజేయుదురెట్లని గేస్తు పొక్కెడున్. 474

గీ. ఈగతిం గృహవాసనాకృష్టహృదయుఁ, డగుచు మూఢాత్ముఁ డతఁడు మోహమునఁ బగిలి
తనివిగానక వారినిదలఁచుకొనుచు,మడిసి యావల నంధతమసముసొచ్చు.475

---

## అ ధ్యా య ము 18.

### వానప్రస్థాశ్రమ ధర్మప్రవచనము

శ్రీకృష్ణుడు:—

చ. వనమును జేరువాఁడు తన భార్యను బుత్రుల కప్పగించియో
తన వెనువెంటనుం గొనియొ తద్వనభూమికి నేగి యందు నొ
య్యన వసియింపఁగావలయు నాయువునందుఁ దృతీయభాగముం
జనఁ గడు శాంతచిత్తుఁడయి స్వాంతమునందు విరక్తిపుట్టఁగన్. 476

సీ. వన్యంబులుం గడుఁ బావనంబులునైన, కందమూలఫలాదికములచేత
వృత్తిని దనకుఁ గల్పించుకోవలయు వ, ల్కలమును బట్టగాఁ గట్టవలయుఁ

గాఁ దేని ధరియింపఁ గావలయుఁ దృణ ప, ర్ణాజినంబులనేని నయము మెఱయ
మఱియుఁ గేశములు రోమములు నఖంబులు, శ్మశ్రువులును ధరింపంగవలయు
గీ. దంతధావన మొనరింపఁ దగదు జలము, లందును త్రికాలమునుం దానమాడ వలయు
నెలమి భూతలమున శయనింపవలయు, నేమ మొప్ప వానప్రస్థుఁడో మహాత్మ! 477

వ. గ్రీష్మకాలంబునఁ బంచాగ్ని మధ్యంబుననుండియుఁ బ్రావృట్కాలంబున జడివాన యందుండియు, శిశిరకాలంబునఁ గుత్తుకబంటి జలంబున నిమగ్నుండై యుండియుఁ దపం బాచరింపవలయు. అగ్నిపక్వంబేని కాలపక్వంబేని ఱోట ఱాతన్నలిపికాని దంతంబుల నమలిగాని భుజింపవలయు. తనకు జీవనోపాధి భూతంబగు పదార్థంబు దేశకాలబలాభిజ్ఞుండై తాన సమకూర్చుకొనవలయు. అంతియకాని కాలాంతరంబునను నన్యాహృతంబును గైకొనరాదు. వన్యంబులచేఁ గాలపోషితంబులగు చరుపురోడాశంబుల నిర్వాపనంబుఁ జేయవలయు. వానప్రస్థుండు శ్రౌతంబగు పశువుచే నన్ను యజింపరాదు. ఆమ్నాయవాదులచే మునికిఁ బ్రోక్తంబులైన యమావాస్య పౌర్ణమాసి చాతుర్మాస్యంబులందు యజ్ఞముఁ గావింపవలె. 478

క. ధమనులు బయల్పడఁగ నిట, సుమహిత తప మాచరించి సుతపోమయునన్
దమిమైఁ గొల్చుచు ఋషిలో, కమునుండి పరేశు నన్నుఁ గ్రమమునఁ జేరున్. 479

చ. ఘనమును మోక్షదంబు నతికష్ట సమార్జితమైన యీ తపం
బున నెవఁ డల్పకామములఁ బొందుటకై జతనంబుఁ జేయునో
విను మతఁ డారయంగఁ గడు వెఱ్ఱియు గేలికి భాజనంబునై
యనవరతంబు దుఃఖ నిలయంబగు జీవనమున్ గ్రమించెడున్. 480

మ. ముదిమిం గంపము మేనవుట్ట నియమంబుల్ లెస్సఁ బాటింపలే
ని దశన్ వర్తిలుచుండు నెప్పు డపుడే నిశ్శంకతన్ వహ్నులన్
బదిలం బొప్పఁగ నాత్మలోఁ జొనిపియు న్నాయందుఁ జిత్తంబు జ్ఞా
నదమా రీతిని నిల్పి పెంపుఁ దనరన్ వహ్నిం జొరంగావలెన్. 481

వ. కర్మవిపాకంబులును, నిరయాత్మకంబులు నగు లోకంబులందు విరాగంబు గల్గి నప్పుడు సమ్యగ్విధానంబున న్యస్తాగ్నియై ప్రవ్రజితుండు కావగు. ఉపదేశానుసారంబుగ నన్ను యజించి సర్వస్వము ఋత్విజున కర్పించి స్వప్రాణమునం దగ్నిఁ జొనిపి నిరపేక్షుండై సన్యసింపవలయు. సన్యసించు బ్రాహ్మణునకు 'ఇతండు మమ్మతిక్రమించి పరముం బొందుచుండె' నని దేవతలు భార్యాదిరూప

ధారుడై విఘ్నంబుఁ గలిగింతురు. ముని బట్టకట్టునేని యది కౌపీనాచ్ఛాదన మాత్రంబై యుండవలయు. దండకమండలువులకంటెఁ వ్యక్తంబైన యితరంబాక్కిఁంచుకయు నవిపన్నుండై నప్పుడు ధరింపరాదు. దృష్టిపూతంబగు దేశంబునఁ బాదంబు నుంచవలయు. వస్త్రపూతంబైన జలంబుఁ (వడకట్టబడినది) ద్రావవలయు. సత్యపూతంబైన వాక్యంబు నుడువవలయు. మనఃపూతంబైన కార్యంబుఁ జేయవలయు. వాక్కాయమనంబులకు మౌనంబు, అనీహ, ప్రాణాయామము నను నివి క్రమంబున శిక్షలగు. ఇవి లేనియతండు కేవల వేణుదండంబుల యతి కానేరఁడు. చతుర్విధవర్ణములయందు విగర్హ్యంబులు ననుద్దిష్టపూర్వములునైన యేడు గృహంబుల భిక్ష నర్థించుచుఁ జరింపవలయు. లబ్ధంబైన దానఁ బరితుష్టుండు గావలయు. ఊరికి వెలుపలనున్న స్వచ్ఛజలాశయంబునుజేరి యందాచమించి వాఙ్నియతుండై సకృత్పావితంబైన పదార్థంబు విభజించి మిగిలిన దంతయును భుజింపనగు. నిస్సంగుఁడు, యతసమస్తేంద్రియుండు, ఆత్మరతుఁడు, సమదర్శనుండునై సర్వభూవలయంబు నేకాకిగఁ జరింపవలయు. 482

గీ. విజనమును నిర్భయంబునై ౯ వెలయునట్టి,స్థానముం బొంది మద్భావ ౯ సదమలాత్ముఁ
డగుచు ముని యేకరూపుని ౯ నాత్మఁదలఁప, నగును నాతో నభేదంబు ౯ నరసి
కొనుచు. 483

గీ. జ్ఞాన నిష్ఠాగరిష్ఠుఁడై ౯ సంయమీంద్రుఁ, డాత్మకుం బంధ మోక్షంబు౯లరయుచుండుఁ
బూని యింద్రియనిక్షేప౯మౌను బంధ, మింద్రియ నిరోధమే మోక్ష౯మిద్ధచరిత!

క. కావున షడ్వర్గము మ, ద్భావమ్మున నడిపి మౌని ౯ బహు కామములన్
దా వైరాగ్యముఁబూనియుఁ, గేవలమగు నాత్మసుఖ మొ౯గిం గొని తిరుగున్. 485

వ. పురంబుల గ్రామంబుల వ్రజంబుల సార్థంబుల భిక్షార్థంబుఁ జొచ్చుచుఁ బుణ్య, దేశ, సరిత్పర్వత వనాశ్రమయుక్తంబగు మహీవలయంబును గ్రుమ్మరుచుండవలయు. వానప్రస్థాశ్రమంబున సారెకు భిక్షంబు స్వీకరింపవలయు. శిలాన్నంబుచే శుద్ధసత్వుండు నష్టసమ్మోహుండునై సిద్ధిఁబొందు. దృశ్యంబు నశ్యంబు కావున నీ కనంబడుదానినెల్ల వాస్తవికబుద్ధిం గనరాదు. ఐహికాముష్మికంబులందు విరక్తచిత్తుండై తదర్థకకృత్యమునుండి విరమింపనగు. ఆత్మంబునందు మనోవాక్ప్రాణయుతంబగు నీ సమస్తవిశ్వంబు మాయయని హేతువాదంబున నెఱింగి విడిచి యాత్మనిష్ఠుండగుచు మగుడ దానిని స్మరింపకుండవలయు. విరక్తుండు, జ్ఞాననిష్ఠుఁడు, నిరపేక్షుఁడు మద్భక్తుండునై త్రిదండాది సహితంబులగు నాశ్రమంబులను విడిచి విధివశుండుగాక చరింపవలయు. 486

గీ. బాలుపగిదిఁ గ్రీడింపనోపుఁ బ్రాజ్ఞుఁడయ్యు, జడునిపగిదిఁ జరింపనోపుఁ జతురుఁడయ్యుఁ
బలుకనగు వెఱ్ఱిభంగి విద్వాంసుఁడయ్యు, నైష్ఠికుండయ్యుఁ బశువట్లు నడువఁగనగు.

వ. వేదవాదరతుండును, బాషండియుఁ గేవలతర్కనిష్ఠుండునగుచు నరుఁడు శుష్కవాదవివాదంబుల నేదే నొకపక్షంబు నాశ్రయింపరాదు. 488

సీ. ధీరాత్ముఁడగుచు నుద్విగ్నుండు కారాదు, జనములవలనఁ దాను జనముల
నుద్విగ్నులం జేయు టొప్పదు సైరింప, వలయును మది నతివాదములను
నెవరినేనిఁ బరాభవింపరా దెవ్వని,తో నేని వైరంబుఁ బూనఁ దగదు
దేహవిషయము నుద్దేశించి భూతంబు, లం దాత్మయందుఁ బరాత్ముని నను

గీ. బహువిధములైన యలతోయపాత్రములను దుహినభానుండు కైవడిఁ దోఁచుచుండు
నఖిలభూతగణంబు లేకాత్మకములు, గా నెఱుంగవలయును మాని మదిని. 489

క. ఒకయప్పు డాహారము దొర,కకయున్నన్ మది విషాదకలితుఁడు కారా
దొకచో దొరకిన ముదమం,దకయుండఁగఁదగును విధికృతము భయమనుచున్. 490

గీ. ప్రాణధారణమునకుఁ జొప్పడునుగాన, నోగిరంబును గోరుట యుక్తమగుఁ
బ్రాణధారణమున నెత్త్వగతచింత,యగును దత్త్వం బెఱిఁగియయ్యాదియు విడుచు.

క. కోరక దొరకిన యన్నము, సారయుతంబైన విగతసారమయిన నిం
పారఁగఁదిననగు నట్లే, యారసి శయ్యయును బొందనగుఁ బ్రాప్తంబున్. 492

గీ. శౌచమాచమనంబును స్నానమున్న, నియమములుఁ గూడఁ బ్రేరణం జేయరాదు
ఈశ్వరుఁడనైన నే నెట్టు లెసఁగుచుందు,నట్లు జ్ఞానియుఁ జరియింపనగుఁ దనంత. 493

వ. ఆతనికి భేదప్రతీతి మద్వీక్షణంబను జ్ఞానంబున నిహతంబగు. దేహాంతపర్యంతంబు నొకానొకప్పుడు తత్ఖ్యాతి కలుగుచున్నను మత్సంపన్నుండై యుండు. 494

సీ. మునియు దుఃఖోదర్కములగు కామంబుల,యందు నిర్విణ్ణుఁడై యాత్మవంతుఁ
డగుచు మద్ధర్మంబుఁ దగ నెఱుంగఁగలేక, గురుచరణముఁ జేరి కొనఁగవలయు
నెంతకు బ్రహ్మంబు నెఱుఁగు నందనకఁ బ్రాజ్ఞుండు శ్రద్ధాళువై గురువరునకుఁ
బరిచర్య లాచరింపఁ గనగు నాదృతి,చొప్పడఁగా ననసూయుఁడగుచు

గీ. నెవఁడు షడ్వర్గ మెలమిఁ జయింపక యవ,శేంద్రియనియంతయై కర మీడ్వఁబడుచు
జ్ఞానవైరాగ్యవిరహితస్వాంతుఁడై త్రిదండముం దాల్చు వ్యర్థుఁ డాతం డుచూవె.

గీ. అపరిపక్వాశయుఁడు ధర్మహానిదుఁడయి, యమరులందన్ను నాత్మస్థుఁడైన నన్ను
వంచనముఁ జేయుటకు నయ్యెపాల్పడి జడుఁ,డిందునకు నందునకుఁ గాక హీనుఁడగును.

వ. బ్రహ్మచారికి ధర్మంబు శమంబు నహింసయు, వానప్రస్థునకుఁ దపంబు సమీక్షయు, గృహస్థునకు భూతరక్ష యజ్ఞంబును, సన్యాసికి నాచార్యసేవనంబును ప్రధాన

ధర్మంబులు. అందు ఋతుకాలంబునమాత్రము భార్యాసంగమంబుఁజేయు గృహస్థునకు బ్రహ్మచర్యంబు, శౌచంబు, సంతోషము, భూతసఖిత్వము, ధర్మంబులగు. సర్వాశ్రమవాసులకు మదీయోపాసనంబ ముఖ్యధర్మంబు. 497

ఇట్లు నన్నేవఁ డనన్యభావుండై స్వధర్మంబున భజియించుచు సర్వభూతంబులయందు మద్భావుండైయుండు నతం డచిరకాలంబున మద్భక్తింబొందు. ఉద్ధవా! అ య్యనపాయినియగు మద్భక్తిచే సర్వలోకేశ్వరుండను, సర్వజగదుత్పత్తిస్థితిలయహేతుభూతుండను గారణబ్రహ్మమనగు నన్నుంబొందు. మఱియు స్వధర్మపరుండును జ్ఞానవిజ్ఞానసంపన్నుండు, విరక్తుండునై ముని నన్నుంజేరఁగలఁడు. ఇది వర్ణాశ్రమవంతుల కాచారలక్షణంబగు ధర్మంబు. అదియ మద్భక్తియుతంబై మోక్షఫల దాయకంబగు. 498

క. ఏ నీగతి నీ యడిగిన, దానికి నుత్తరము బుధనుతా! వాక్రొంటిన్
దీన స్వధర్మయుతుఁడు మద, ధీనుండై మత్పరమగతి న్నరుఁడందున్. 499

---

## అధ్యాయము 19.

### జ్ఞానస్వరూపాభివర్ణనము

శ్రీ భగవానుఁడు:—

సీ. ఆత్మవంతుండు విద్యాశ్రుతసంపన్నుఁ, డనుమాన రహితుండునైన జ్ఞాని
యెఱిఁగి మాయామాత్రమిదియని కడపల, జ్ఞానంబునాయందుసంత్యజించు
జ్ఞానికి నేన యిష్టతముఁడ ఫలము మ, త్సాధనంబును గడుసమ్మతమగు
స్వర్గాపవర్గముల్సకలంబునేన య, న్యంబు నాకంటెఁ బ్రియంబులేదు
గీ. జ్ఞానవిజ్ఞాన సంపన్నులైనవారు, మత్పదంబ శ్రేష్ఠంబనినుది నెఱిఁగిరి
జ్ఞానియును నాకుఁబ్రియతముఁడౌనుజూడ, జ్ఞానముననన్ను నాతఁడుబూనియుండు.
గీ. జ్ఞానకలచేత నే,శుద్ధిసల్పఁబడునో, తపము దానంబుఁ దీర్థంబుజపముఁదదిత
రంబులైన పవిత్రధర్మములుకూడ, దాని గావింపఁగా సమర్థములుగావు. 591
గీ. కాన జ్ఞానసమన్వితమైన దాని,గా నెఱింగి నీయాత్మ ననూనభక్తి
జ్ఞానవిజ్ఞానసంపత్తికలితుఁడవయి, భావముననన్ను భజియింపుప్రజ్ఞ మెఱయ. 502
గీ. జ్ఞానవిజ్ఞానయుక్తంబుసలిపినన్ను, నాత్మనాత్మంబునయజించియాదిమునులు
నిఖిల యజ్ఞేశ్వరుండనై నెగడునన్నుఁ, బడయఁగలిగిరిసు మ్ముద్ధవా! నిజమ్ము.503

వ. ఉద్ధవా! త్రివిధంబైన యే వికారంబు నిన్నాశ్రయించె నది మాయయకాని పరమార్థంబుకాదు. రజ్జువునందు సర్పభ్రాంతివలె నడుమన సంభవించినది కాని

యాద్యంతంబులయందు లేదు. కావున నీకు జన్మాదులెట్లు కలుగు? ఆద్యంతంబుల
నేది కలదో యదియ మధ్యకాలంబునం గలదని యెఱింగించినవిని యుద్ధవుండిట్లనియె.

ఉద్ధవుఁడు:—
దేవా! విజ్ఞానవైరాగ్యయుక్తంబును బురాతనంబును విపులంబును విశుద్ధంబునగు
జ్ఞానంబుఁ దెలుపు. మఱియు నో విశ్వేశ్వరా! బ్రహ్మాదులకుం దుర్లభంబగు భక్తి
యోగంబును గూడ నెఱింగింపుము. 505

మ. ఘనతాపత్రయ పీడ్యమానుఁడు మహాఘోరగ్రక్రూరసంసార మా
ర్గ నితాంతవ్యథితుండు నా నరునకున్ గంజాక్ష! పీయూషవృ
ష్టిని గావించెడు తావకీనపదరాజీవాతపత్రంబు ద
క్క నిఁకొండెద్దియు దిక్కుఁ గాఁ గలదె నేఁ గాంచన్ నిజం బాడెదన్. 506

మ. భవకూపంబునఁ గూలి కాలఫణిచేఁ బల్మిన్ సుసందష్టమ
య్యు వివేకంబుఁ దొఱంగి క్షుద్రసుఖతృష్ణోద్విగ్నమై యెంతయున్
వివశత్వంబును జెందియున్న జనమున్ నీ వుద్ధరింపంగదే
నవపీయూష సమాపవర్గ్యవచనన్యాసంబునన్ సత్కృపన్. 507

శ్రీభగవానుఁడు:—
సీ. అనవుడు శ్రీకృష్ణుఁడనియె నిట్లుద్ధవా!, తొల్లి యజాతశత్రుండు దీని
ధర్మవిద్వరుని శాంతనవుని బ్రశ్నించె మే, మెల్లరమును దగమి వినుచుండ
భారతయుద్ధముతీరిన పదఁపడి, నఖిల బంధువధ విహ్వలమతి యయి
పెక్కులు ధర్మముల్ విని యనంతరమందుఁ, బ్రశ్నించె ముఖ్య ధర్మములు దెలియ
గీ. జ్ఞానవిజ్ఞానములు భక్తిశ్రద్ధయున్ వి, రక్తియుం గూర్చునట్టి ధర్మముల నేను
బోధపఱతు దేవవ్రతుముఖమునుండి, విన్నవాని నుద్ధవ! నీకు విశ్రుతముగ. 508

వ. ప్రకృతిపురుష మహదహంకార, శబ్దస్పర్శ రూప రసగంధంబులను తొమ్మిదియు, నేకాదశేంద్రియంబులును, బంచమహాభూతంబులును, సత్త్వరజస్తమోగుణంబులును, నష్టావింశతి తత్త్వంబులును బ్రహ్మాదిస్థావరాంతంబులగు. భూతంబులందనుగతంబులుగా నెద్దానం గనునో యీ భావంబుల ననుగతంబైన యేకంబగు నాత్మ నెద్దానం గనునో యదియె జ్ఞానంబని నా నిశ్చితంబు. ఏకాత్మకంబైన యెద్దాన ననేకాత్మకంబుఁ గనకుండునది విజ్ఞానంబగు. త్రిగుణాత్మకంబులగు భావంబులకు నుత్పత్తిస్థితిలయంబులు గాననగు. ఆద్యంతమధ్యములఁ గార్యంబునుండి కార్యమును గుఱించి యే దనుగమించుఁ దల్లయంబున నేది మిగులు నదియె సత్పదార్థంబగు. శ్రుతి, ప్రత్యక్షము, ఐతిహ్యము, అనుమానము, అను ప్రమాణ

చతుష్టయమునందు వ్యవస్థితి లేమిం జేసి మిథ్యాత్వంబున బుధుండు విరక్తిం బొందు
కర్మలు పరిణామరూపంబులగుట విరించి లోకపర్యంతంబు నదృష్టంబు దృష్టంబువలె
నశుభంబుగను నశ్వరంబుగను గనుచుండు. 509

గీ. భక్తియోగంబు దొల్తన పలుకఁ బడియె, ననఘ! యైనను సంప్రీతి నందు నీకు
మగుడఁ దెల్పెద వినుము శ్రేయమాభిలాషి, వగుచు మద్భక్తి కారణ మవహితమతి.

సీ. మత్కథా శ్రవణంబు మత్కీర్తనంబును, మత్పూజల న్నిష్ఠ మత్స్తుతియును
మత్పరిచర్యా సమాదరణమును మ, త్పాద సర్వాంగాభివందనంబు
మద్భక్త వరపూజ మద్బుద్ధి సకలభూ, తంబులన్ మన్నిమిత్తమగు నంగ
చేష్టయు వాక్కులచే మద్గుణకథన, మర్పి మనంబు నాయందు నిడుట.

గీ. అఖిల కామ విసర్జనం బర్థభోగ, సుఖములు మదర్థమై త్యజించుటయు నిష్ట
దత్తహుతభుక్తముల్ మహాతపము వ్రతము, నాకునై సల్పుటివి కనస్భక్తిదములు.

క. మానవు లీ ధర్మంబుల, చే నాత్మ నివేదనంబుఁ జేయ నొదవున
న్యూనంబగు మద్భక్తి జ, గానన్ వారికిఁక నొండువ కలుగదు లవమున్. 512

గీ. ఆత్మరూపుఁడనైన నాయందు సత్త్వ, యుతము శాంతంబునై యొప్పు నుల్లమెపుడు
చేర్చునప్పుడె ధర్మమ్ముఁ జెందు మఱియు, జ్ఞానవైరాగ్యములు మహైశ్వర్యములును.

గీ. ఎపుడు దేహాదికమ్ము నం దింద్రియములు, బరువు లిడుచు రజోదుష్ట భావయుతము
లగుచునుండు నొయప్పుడె యరసి చూడఁ, దద్విపర్యయమైన యధర్మ మొందు. 514

గీ. మద్విమలభక్తిఁ గూర్చు ధర్మంబు నాత్మ, దర్శనజ్ఞానముం గుణత్రయము నంద
సంగ మణిమాదులైన యైశ్వర్యములును, వరుస నుద్ధవ! నీకుఁ దెల్పంగఁబడియె.

ఉద్ధవుఁడు:—

సీ. యమ మెన్ని తెఱఁగు ల్నియమ మెన్ని విధములు?, శమమన నేదేది దమమనంగ
ధృతియు దానంబుఁ దితిక్షయుఁ దపము శౌ, చంబును శౌర్యంబు సత్యమ్మృతముఁ
ద్యాగ మిష్టధనంబు దక్షిణ యజ్ఞంబు, బలము లాభంబును భగము విద్య
హ్రీయు శ్రీయు సుఖంబు నో యయ్య! దుఃఖంబు, ననఁగ నెయ్యవి తెల్పు మదియుఁ గాక

గీ. పండితుండనఁగ నెవఁడు? మూర్ఖుండెవండు? మార్గమనఁగ నేదింక నమార్గ మేది?
ఏది స్వర్గంబు? నరకంబదే దధీశ!, తేటతెల్లముఁగా నాకుఁ దెలుపుమయ్య. 516

గీ. ఎవఁడు బంధువు గృహమేధి యెవఁడు ధనికుఁ, డెవ్వఁడు దరిద్రుఁ డెవ్వఁడు కృపణుఁ డీశుఁ
డెవ్వఁడీ ప్రశ్నముల నెల్ల నెఱుఁగఁ జెపుము, ప్రీతిఁ దెల్పు మేతద్విపరీతములను. 517

శ్రీభగవానుఁడు:—

సీ. అనఘ! యహింస సత్యంబు నస్తేయ మ, సంగంబు హ్రీయు నసంచయంబు
స్థైర్యంబు క్షమ బ్రహ్మచర్యమాస్తిక్యంబు, మౌనంబు భయము యమంబు లివ్వి

శౌచంబుఁ దపమును జపమును హోమంబు, నాతిథ్యవిధియు మదర్చనంబుఁ
దీర్థాటనముఁ బరార్థేహయుఁ దృష్టి యా, చార్య సేవనమును శ్రద్ధయు నివి

గీ. నియమములు దెల్పఁబడియెఁ బండ్రెండుకాని, వృత్తులకు నుబ్రవృత్తులకి త్తెఱఁగున
స్థిరమతి నుపాసితంబులై పురుషులకి వ, భీష్టకామంబులం బెల్లు నిడుకుచుండు. 518

సీ. మన్నిష్ఠబుద్ధి శమము దమ మింద్రియ, సంయమంబగుఁ దితిక్షయన దుఃఖ
సహనంబు జిహ్వాది జయమగు ధృతియన, దండసంత్యాగ మాదాన మనఁగఁ
దపమనఁ గామముం ద్యజియించుటేయగు, శౌర్యంబు వాసనా జయము తలఁప
సత్యంబునా సర్వ సమదర్శనంబగు, ఋతము కవీడ్య సూనృత వచనము

గీ. శౌచమనఁ గర్మములయం దసంగమంబు, త్యాగమనఁగ సమస్త సన్న్యాసమగును
ధర్మమన మానవుల కిష్టధనము చూవె, యజ్ఞమన భగవంతుఁ డనైన నేన. 519

సీ. అమలాత్మ! దక్షిణయన జ్ఞానసందేశ, మగును బ్రాణాయామమగు బలమన
భగమనఁ గా మదైశ్వర్యభావమగును లా, భమన మదుత్తమభక్తియగును
విద్యయనఁగ నాత్మభేదాపనయనంబె, హీనకర్మల రోతహ్రీయగుఁ జుమి
నైరపేక్ష్యాది గుణంబులౌ శ్రీయన, సుఖమనఁగా దుఃఖసుఖవినష్టి

గీ. గ్రామ్య సుఖకాంక్షయగును దుఃఖంబనంగ, బంధమోక్షవిదుండగు పండితుఁడన
మూర్ఖుఁడనఁగ దేహాద్యహంబుద్ధియగును, నన్ను బొందించునది యెన్న మార్గమనఁగ.

గీ. కాపథంబనఁ జిత్త విక్షేపమగును, సత్త్వగుణ సంభవంబగు స్వర్గ మనఁగ
నరకమన ఘోరతామసోన్నాహమగును, వింటివే యిదియుద్ధవా! విమలచరిత!

ఆ. గురుఁడ నయిన నేనగుదు బంధువన గృహం, బనఁగ నరశరీరమగు గుణాఢ్యుఁ
డయగు నాఢ్యుఁడనఁగ నపరితుష్టుండె ద, రిద్రుఁడనఁగఁ జెల్లు భద్రచరిత! 522

ఆ. అవిజితేంద్రియుండె యగుఁ గృపణుండన, గుణములందు బుద్ధి కూడ నీక
యొనఁగునట్టి వాఁడె యీశుండనఁగ నీశుఁ, డనఁగఁ ద్రిగుణసక్తుఁ డగు బుధేంద్ర!

వ. ఉద్ధవా! యీ నీ ప్రశ్నంబులెల్ల లెస్సగా నిరూపింపఁబడినవి. గుణదోషంబుల లక్షణంబు పెక్కు తెఱంగుల చెప్పి చాలు. గుణదోషదర్శనంబు దోషంబగు. ఉభయవర్జనంబె గుణంబగు నని భగవంతుఁ డెఱింగించిన విని యుద్ధవుండిట్లనియె.

---

## అధ్యాయము 20.

### —భక్తిజ్ఞానక్రియాత్మక యోగస్వరూపాభివర్ణనము.—

ఉద్ధవుఁడు:—

వ. దేవా! విధియుం బ్రతిషేధంబును నధీశ్వరుండవగు నీయాజ్ఞారూపంబగు వేదంబ. అరవిందనయన! అదియు విధేయ ప్రతిషేధ్య కర్మంబులఁ బుణ్యాపాపఫలరూపంబులుగాఁ గర్మల నపేక్షించు. ప్రతిలోమ విలోమజంబగు వర్ణాశ్రమ వికల్పంబును ద్రవ్యదేశవయః కాలంబులను, స్వర్గనరకంబులను నిషేధవిధిలక్షణంబగు కర్మకాండంబు మానవుల కెట్లు త్వద్వచనంబువినా గుణదోషభేద దృష్టిందక్క యనుపలబ్ధార్థంబునందును సాధ్యసాధనంబులందును నిశ్శ్రేయసంబునగు. పరమేశ్వరా! పితృదేవమానవులకుఁ ద్వద్వచన రూపంబగు వేదంబు చక్షువు. గుణదోషభేద దృష్టి త్వన్నిగమంబువలననే కాని స్వతస్సిద్ధంబుకాదు. నిగమంబున భేదంబున కపవాదంబులేదని భ్రమించుచుంటి. 525

శ్రీభగవానుఁడు:—

చ. నరులకు మేలుఁ గూర్పఁగ మనంబున నేను దలంచి యుద్ధవా!
కర మనుకంప జ్ఞానమునుఁగర్మము భక్తియు నాఁగ నొప్పు సు
స్థిరతరయోగముల్ దెలిపితిన్ దలపోయఁగ వానికంటె నే
వెరవును గానరాదు పృథివీస్థలినెందు నొకించుకేనియున్. 526

మ. వినుమీ యోగములందుఁ గర్మముల నిర్విణ్ణాత్ములై త్యాగు లౌ
చును న్యాసంబొనరించు వారలకునై సుజ్ఞాన యోగంబునున్
బెను కోర్కుల్ మొలకెత్తఁ గర్మముల నిర్వేదంబు లేశంబు నొం
దని మర్త్యాళికిఁ గర్మయోగమును వాంఛాసిద్ధినిం గూర్చెదున్. 527

క. యాదృచ్ఛికముగ మత్కథ, నాదుల శ్రద్ధఁగొని కర్మలందెవ్వఁడు ని
ర్వేదముఁ గనఁ డతిసక్తత, నూదఁడొ సిద్ధిదము భక్తియోగ మతనికిన్. 528

గీ. ఎంతఁదనక విసుగు జనియింపకుండు, మత్కథా శ్రవణాదులయమదిని శ్రద్ధ
యెంతఁ దనుకఁ గల్గక యుండునంతఁదనకఁ, గర్మములఁ బూరుషుఁడుచేయఁగ
గావలయును. 529

గీ. ఫలముఁ గాంక్షింపక స్వధర్మవర్తియగుచు, యజ్ఞములను యజించుచునర్థిమెని
షిద్ధకర్మముల నొకింతఁజేయకున్నఁ, బూరుషుఁడు స్వర్గనరకముల్ పొందఁబోఁడు.

మ. మనుజుం డీతనువందు నుండుచు స్వధర్మస్థుండు నిష్కల్మషుం
డును రాగాది మలాభ్యపేత హృదయుండున్ శాంతభావుండు నై

కను నత్యంతము జన్మపావనకరర్జ్ఞానంబు కాదేని నో
యనఘా! భాగ్యము కల్మినింబడయుఁ బూర్జ్యంబైన మద్భక్తినిన్. 531

గీ. స్వర్గవాసులును నిరయవాసులుఁ గడు, నిచ్ఛగింతు రీలోకముననెడదలందుఁ
గోరుచుందు రీమర్త్య శరీరమునెద, జ్ఞానభక్తుల కిది సాధకంబుగాన. 532

వ. ఆ యుభయ శరీరంబులు నట్లుకావు. 533

క. చతురుండై నరుఁడల స్వ, ర్గతినేనియుఁ గాక నిరయగతినేనియు న
మ్మతిఁ గోరరాదు మఱి మ, ర్త్య తనువునేనియును నందేతా నేమఱుటన్. 534

చ. యమసములౌ కిరాతులు దయారసహీన మనస్కులై స్వకే
తముఁ గృతనీడమున్ గడు ముదావహమైన మహీరుహంబు బ
ల్మిమెయిఁ గలంచుచుండఁ గనిలీలగఁ దాని త్యజించి లంపట
త్వము దిగనాడి క్షేమముగఁ దా నరుగుంగద పక్షి యుద్ధవా! 535

ఉ. ధీయుతుఁడైన పూరుషుఁడుధీరతఁ దోఁపఁగ రేఁ బవళ్ళచే
నాయువు గోయఁగాఁ బడుటనాత్మ నెఱింగియెఱింగి స్వీయమా
కాయము భీతుపెల్లునఁ బ్రకంపము నొందఁగ ముక్త సంగుఁడై
ధ్యేయుని నన్ను లో నెఱిఁగియెంతయు శాంతమనస్కుఁడయ్యెడున్. 536

వ. జనుఁ డెవ్వాఁడు సుదుర్లభంబును యదృచ్ఛాలబ్ధమున్ సర్వ సా
ధనమున్ సద్గురుకర్ణధారమును నాద్యంబైన యీ మద్విభూ
త్యనుకూలాంచితమారు తేరితనృ దేహాఖ్యప్లవంబంది యీ
ఘన సంసారసముద్రముం గడవఁడాకష్టాత్ముఁ డాత్మఘ్నుఁడౌ. 537

సీ. ఆరబ్ధకార్యములందు నిర్విణ్ణుఁడై, యచల వైరాగ్య ముక్తాత్ముఁడగుచు
నప్పుడు పర్వేంద్రియంబుల నరికట్టు, నభ్యాసమునఁ జేసియచలముగ మ
నంబును జిక్కబూనంగసగును యోగి, చిక్కబట్టినను సుస్థిరముఁగాక
తిరిగెడుచో నతంద్రితుఁడుగా కల్లన, కొలఁదిగ దాని కోర్కులు నెఱపుచు

గీ. వశముఁగావింపనగు జితప్రాణుఁడగుచు, మనము విడరాదు సత్త్వసంపన్నమైన
బుద్ధిచేతను మానసంబును గడంక, స్వవశతను బొందఁజేయంగవలయుబల్మి. 538

గీ. పొగరుఁబోతు గుఱ్ఱంబునుబోలెను దద, భీష్టమెఱిఁగి వర్తించుచుబిగియలాగు
చుంగ్రహించుటయిదిమనస్సంగ్రహమును,పరమ యోగంబుఁగాస్మరింపంబడియెడి.

వ. సాంఖ్యయోగంబునఁ బ్రతిలోమానులోమంబులగు సర్వతత్త్వంబుల నుత్పత్తి
వినాశంబుల మనఃప్రసాదపర్యంతము ధ్యానింపవలయు. వినుపుం గొన్న
వాఁడు విరక్తుండు గురూక్తవేదియునగు పూరుషుని మనంబు పౌనఃపున్యంబగు
చింతం ద్యజించు. 540

వ. యమాదియోగపదంబులచేతను, ఆన్వీక్షకీవిద్యచేతను, మత్పూజోపాసనాదుల చేతను, యోగ్యుండను బరమాత్ముండనగు నన్ను స్మరింపవలయును. తదితరంబు సేయరాదు. యోగి ప్రమాదంబున నేదేని వినింద్యకర్మంబాచరించిన నప్పాపంబును యోగంబుననే దహింపవలె. ఒకప్పుడుం దదితరంబు చేయరాదు. స్వస్వాధికారమునం దే నిష్ఠకల దది గుణంబని చెప్పంబడు. తద్విపర్యయంబె దోషంబగు. గుణదోషంబుల కిదియ నిర్ణయము. ఈ విధానంబుచేతన సంగత్యాగేచ్ఛంజేసి జాత్యశుద్ధంబులగు కర్మంబులకు నియమంబుకావింపఁబడియె. మత్కథలయందు శ్రద్ధాళువై యితరకర్మంబులయందు నిర్వేదంబువొంది పురుషుండు కామంబుల దుఃఖాత్మకంబులుఁగా నెఱింగినను దత్పరిత్యాగమునం దశక్తుండయ్యె. కావున శ్రద్ధాళుండు దృఢనిశ్చయుండునై దుఃఖోదర్కములగు నీ కామంబులఁబొందుచున్నను గర్హించుచు నన్నుభజింపవలయు. మత్ప్రోక్తంబగు భక్తియోగంబున నజస్రము నన్ను భజించు మునికి నేను హృద్గతుండనై యుండుటంజేసి హృదయగతంబులైన కామంబులు నశించు. అఖిలాత్ముఁడనగు నేను జూడంబడుచుండ హృదయగ్రంథి భేదింపఁబడు. సర్వసంశయంబులు ఛేదింపఁబడు. కర్మంబులెల్ల క్షీణంబులగు. కావున మద్భక్తియుక్తుండై మదాత్మకుండైనయోగికిఁ బ్రాయికంబుగ జ్ఞానంబును వైరాగ్యమును శ్రేయస్సాధనంబుకాదు. కర్మంబులచేతను, దపంబుచేతను, జ్ఞానవైరాగ్యంబులచేతను, యోగంబుచేతను, ధర్మంబుచేతను, శ్రేయంబులచేతను, దదితరంబులచేతను, నెయ్యది యెయ్యది పొందంబడుఁ దత్సర్వంబును, మద్భక్తుండు మద్భక్తియోగంబున వైశమ పడయు. నాభక్తుండు కోరునేని స్వర్గాపవర్గంబులను మన్నివాసంబగు వైకుంఠంబునేనిం బొందఁగలండు. సాధువులు, ధీరులు నేకాంతులునగు మద్భక్తులు నాచే నొసంగంబడిన పునరావృత్తిరహితంబగు కైవల్యంబునేనిం గ్రహింపరు. నిరపేక్షత్వంబ యుత్కృష్టంబగు నిశ్శ్రేయససాధనంబండురు. నాభక్తి నిష్కామునకు నిరపేక్షునకు మాత్రంబకలుగు. నాయందు నియతభక్తులును, సాధులు, సమచిత్తులునై బుద్ధికిఁ బరుండనగునన్నుంబొందినవారికి గుణదోషోద్భవంబులైన గుణంబులుకలుగవు. 541

గీ. ఎవ్వరిట్లు నాచే వచియింపఁబడిన, మత్పథంబు లనుష్ఠింత్రో తత్పరతను
వారు క్షేమంబుగానాదుపదముగందు; రలఘుగతిఁబరబ్రహ్మముం దెలిసికొంద్రు.

---

## అధ్యాయము 21.

### గుణదోషవ్యవస్థ

శ్రీభగవానుఁడు:—

మ. తెలియంగా వినుమయ్య మత్కథితభక్తిజ్ఞాన కర్మాత్మకం
బుల భద్రప్రదమత్పథంబులను సత్యమ్మార్గధాత్ములెవ్వారు వి
వ్వాలతన్ వీడుదు రట్టివా రిట ననిత్యంబైన దేహానం జం
చల భోగంబులఁ బొందుచుండ్రి పృథుసంసారంబులో మగ్గుచున్. 543

వ. స్వస్వాధికారంబునందలి నిష్ఠయ గుణంబని కీర్తింపంబడు. తద్విపర్యయంబ దోషంబగు. గుణదోషంబుల కిది నిశ్చయంబగు విచికిత్సార్థంబు. ద్రవ్యంబునకు శుద్ధ్యశుద్ధులు గుణదోషంబులు శుభాశుభంబులు విధింపఁబడియె. ధర్మసంబంధంబైన భారంబు నుద్వహించు నాచే ధర్మార్థంబు వ్యవహారార్థంబు యాత్రార్థంబు నని యీ యాచారంబు చూపంబడియె. ఈ ప్రాణులకు స్వార్థసిద్ధికొఱకు సమంబులైన ధాతువులందును విషమంబైన నామరూపంబులు కల్పింపఁబడుచున్నవి. దేశకాలాదిభావంబులగు వస్తువులకుఁ గర్మసంకోచార్థము నాచే గుణదోషంబులు విధింపఁబడియె. దేశంబులలో నకృష్ణసారంబు నబ్రహ్మణ్యమునగు దేశం బశుచియగు. కృష్ణసారంబగు దేశంబైనను నసౌవీరంబు నసమ్మార్జనాదిశూన్యంబగు కీకట దేశం బశుచియగు. ద్రవ్యసంపత్తిచేతఁగాని స్వతస్సిద్ధముగఁగాని కర్మార్హంబైన కాలంబు గుణవంతంబు. ద్రవ్యాలాభాదులఁగర్మనుండి నివృత్తంబగు కాలంబు దోషయుక్తంబగు. ద్రవ్యవచనంబుల ద్రవ్యమునకుశుద్ధియు నశుద్ధియునగు. సంస్కారంబునఁ గాలంబున నధికత్వాల్పత్వంబుల ద్రవ్యమునకు శుద్ధ్యశుద్ధులు పొసంగు. శక్తిచేతను నశక్తిచేతను బుద్ధిచేతను సమృద్ధిచేతను దేశావస్థానుసారంబుగ నఘంబుఁ జేయుటయుఁజెల్లు. ధాన్యదార్వస్థితంతువులకు వాయువుచేతను రసతైజసంబులకు నగ్నిచేతను జర్మములకు మృత్తోయంబులచేతను బృథివీసంబంధంబులకు మిళితంబులచేతను శుద్ధియగు. అమేధ్యలిప్తము తక్షణక్షారామ్లోదాది కంబులచే గంధ లేపంబులవిడిచి స్వగతమలంబును ద్యజించి ప్రకృతింబొందు. అదియ శౌచంబనంబడు. స్నానదానతపోవస్థా వీర్యసంస్కారకర్మంబులచేత మత్స్మరణంబు చేతను నాత్మశుద్ధియగు. ఇట్లుశుద్ధుండై ద్విజుండు కర్మంబు నాచరింపవలయు.పరిజ్ఞానంబున మంత్రశుద్ధియు నీశ్వరార్పణంబునఁ గర్మశుద్ధియునగు. దేశకాలద్రవ్యకర్తృ మంత్ర కర్మంబుల ధర్మంబేర్పడు. ఏతద్విపర్యయం బధర్మంబగు. ఒకానొకచో గుణంబ దోషంబగు. దోషంబునొకప్పుడువిధిచే గుణంబగు. సమానకర్మాచరణం బపతితుల కుంబోలెఁ బతితులకు దోషంబుకాదు. సంగంబు యతికింబోలె గేస్తువునకుఁ

బూర్వస్వీకృతంబుగావున, దోషంబకాక గుణంబయగు. నరుఁ డెందెందు నివృత్తుం డగు నందందునుండి విముక్తుండుగావలయు. శోకభయాపహంబగు నీధర్మంబు నరులకు క్షేమంబగు. విషయములందు గుణధ్యానంబువలనఁ బురుషునకు వానియందు సంగంబుకలుగు. సంగంబునఁ గామంబుఁ గామంబునఁ గలహంబునగు. కలహంబున సహింపరాని క్రోధంబును గ్రోధంబున మోహంబును మోహంబున వెళంబ చేత నావిస్మృతియుఁగలుగు. చేతనారహితంబగుజంతు వసద్రూపంబగు. దానం జేసి మృతకల్పంబగు. ఆ జీవునకుఁ బురుషార్థహానియగు. పురుషుండు వృక్షజీవికచే వ్యర్థంబుగఁ జర్మభస్త్రికవలె శ్వసించుచు విషయవ్యామోహంబునఁ దన్ను నెదిరి నెఱుంగకుండు. ఈఫలశ్రుతి నరులకు శ్రేయోదాయకంబుగాదు. ఔషధంబునందు రుచ్యుత్పాదనంబుంబోలె శ్రేయోవివక్ష నిది చెప్పంబడియె. సహజంబుగఁ దన కనర్థహేతువులగు కామంబులయందునుఁ బ్రాణంబులయందును స్వజనంబులయందునుమర్త్యులాస క్తమనస్కులగుదురు. స్వార్థానభిజ్ఞులై పాపపథంబునందుఁ బరిభ్రమించుచుఁ దమంబునఁజొచ్చు పరిప్వాభూతులైన సమ్యానవులను బుధుండెట్లు మగుడ నా కామాదులయందుఁ బ్రవర్తింపఁజేయు? ఇట్లు వేదనిశ్చయంబు నెఱుంగక కుబుద్ధులు కొందఱు ఫలశ్రుతిం బుష్పితంబుఁగాఁ జెప్పుదురు. వేదజ్ఞులగు వారట్లు చెప్పరు. కాముకులు లుబ్ధులు నవాంతరఫలంబులం బరమఫలబుద్ధిగలవారు నగ్నిసాధ్యకర్మాభినివేశలు స్తవివేకులు, ధూమమార్గాంతులై స్వలోకంబు నెఱుంగకుందురు. ఎవనివలన నీజగం బుత్పత్తిల్లె నట్టిహృదయస్థుండగు నన్నుఁ గర్మశస్త్రిలును బ్రాణతర్పణపరులు, నీహారచక్షువులు నగువారు తెలియంజాలరు. విషయాత్మకులైన వారు పరోక్షంబగు నామతంబు నెఱుంగక వ్యర్థంబుగఁ బశువుల హింసింతురు. పిమ్మటఁ బ్రేతరూపంబులగువానిచే హింసింపఁబడుదురు. హింసయందు రాగంబు గల్గెనేని నది యజ్ఞంబకాని చోదనంబుకాదనియెడు వేదధ్వని వినియుఁ గర్మలం బ్రబుద్ధత్వంబు నందరు. హింసావిహారపరులు కుమతులై నిజసుఖేచ్ఛ నుపలబ్ధంబులగు పశువులచే దేవతాపితృభూతగణంబుల యజింతురు. ఈలోకంబున హృదయంబునం గోర్కుల సంకల్పించుకొనుచు స్వప్నతుల్యంబు నశాశ్వతంబు శ్రవణప్రియంబునగు పరలోకంబును వణిజుం డర్థంబులుంబోలెఁ బోఁగొట్టుకొందురు. రజస్సత్త్వతమోనిష్ఠులగువారు సానురూపులగు నిందాదులను దేవాదులను నుపాసింతురు. భేదదర్శులగుట న న్నుపాసింపఁబోరు. "ఇహంబున దేవతలను యజ్ఞంబులయజించి దివంబుం జేరి క్రీడింతుము; తదోభ్గాంతంబున మగుడ నిండు మహాగృహస్థులమగుదు"మని యిట్టి పుష్పితవాక్కున నాకృష్టమనస్కులై దురభిమానులు స్తబ్ధులునగు నరులకు మద్వార్తయేనియు రుచియింపకుండు. ఈ వేదం

బులు బ్రహ్మాత్మవిషయంబులు. ఋషులు పరోక్షవాదులు. నాకుం బరోక్షంబె ప్రియంబు. ప్రాణేంద్రియమనోమయంబును, సముద్రంబువలె ననంతపారంబును గంభీరంబు దుర్విగాహ్యంబునగు శబ్దబ్రహ్మంబు నత్యంతదుర్బోధంబు. ఆ శబ్దబ్రహ్మం బనంతశక్తి సంపన్నుండను బ్రహ్మస్వరూపుఁడను, బరమపురుషుఁడనగు నాచే భూతంబులయం దంతర్యామిరూపంబున బిసంబులం దంతువుపోలె నధిష్ఠితంబయ్యె. ఊర్ణనాభి హృదయంబునుండి ముఖద్వారంబున నెట్లూర్ణంబు వెడలఁగ్రక్కునట్లు ఘోషవంతుఁడు ప్రాణరూపుఁడు ఛందోమయుండు, నమృతమయుండునగుప్రభువు స్పర్శవర్ణరూపియగు మనంబున సహస్రపదవియు స్వరోష్మాంతస్థభూషితయు, విచిత్రభాషావ్యాప్తయు చతురుత్తరఛందోభిలక్షితయు, ననంతపారయునగు శబ్దశక్తిని సృజించు; నుపసంహరించు. గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతి, ఛందము ననువానిచేఁ బరివృతంబగు శబ్దంబును నేమిచేయునో యేమిపల్కునో యేమి సంకల్పించి వికల్పించునో యను తద్హృదయమును లోకంబున మదన్యుండెవండు నెఱుంగనోపండు. నన్ను యజ్ఞరూపుం జేయు తత్తద్దేవతారూపంబుల వ్యాహరించు వికల్పించి నిశ్చయించు. అది సర్వంబు నేన. సర్వవేదం బేతావన్మాత్రంబ. శబ్దంబు నన్నునాశ్రయించి భేదంబును మాయామాత్రంబుగాఁ బ్రకటించి యంతంబునఁ బ్రసన్నంబగు. 544

---

## అ ధ్యా య ము 22.

### తత్త్వసంఖ్యానము

ఉద్ధవుఁడు:—

వ. విశ్వేశ్వరా! మహర్షులచేఁ దత్త్వంబులు కతిసంఖ్యాకంబులు చెప్పంబడియె? దేవా! నీ వష్టావింశతితత్త్వంబులు నుడివితివి. అవి మేమును వినియుంటిమి. కొందఱిరువదియాఱు తత్త్వంబులను, మఱికొందఱు పంచవింశతి తత్త్వంబులను,గొందఱు సప్తతత్త్వంబులను, వేఱొకకొందఱు పంచదశతత్త్వంబులను, నన్యులు సప్తదశతత్త్వంబులను,గొందఱు షోడశతత్త్వంబులను,గొందఱు త్రయోదశతత్త్వంబులను జెప్పుచురు. ఏయభిప్రాయము నుద్దేశించి తత్త్వసంఖ్యాపరిమాణంబును బృథగ్రూపంబుల వ్యాఖ్యానింతు రద్దాని నాయుష్మంతుఁడవైన నీవు నాకెఱింగింపు మనిన విని శ్రీకృష్ణుండిట్లనియె. 545

శ్రీభగవానుఁడు:—

గీ. బుధవర! నిఖిలాంతర్గతక్రములగు తత్త్వ, ములను గుఱించి బ్రాహ్మణులు
సెప్పునది యుక్త
మేకద? మదీయ మాయ నంగీకరించి, నుడువువారల కేదియేన్ కదుర్ఘటంబె? 546

క. "నీ నుడివిన యది సరికా, దే నుడివినదె తగు" నంచు § నీగతిఁ బంతం
బూని వివదింప హేతువు, లౌనుజుమీ మ ద్దురత్య § యాద్భుతశక్తుల్. 547

ఆ. వాని వ్యతికరమున § వక్తల కీరీతి, భేదము వివదింప § విషయమయ్యె
శమము దమముఁ గల్గ § సమయునుదోడన, వాద మప్పు డుడుగు § భేదబుద్ధి. 548

క. అనఘా! తత్త్వములొండొం, టను జొచ్చుట వక్త నిలుక § డం జెప్పఁగడం
గిన క్రమముఁబట్టియే యొ, ప్పను బౌర్వాపర్యగణన § మున్ బుధముఖ్యా! 549

గీ. వినుమ యొకతత్త్వమందున్ బ్ర § విష్టములయి
క్రమతఁజూపట్టు నితర త § త్త్వములుఁగూడ
పూర్వమందో పరంబందొ § సర్వగతులఁ
దత్త్వములు గూడియుండును § దత్త్వమందె. 550

గీ. కాన నీతత్త్వములఁ గార్య § కారణత్వ, గణన సల్పెడు వక్త ము § ఖంబునుండి
ఏది మనము గ్రహింతుమో § యెన్నఁగ నది, యెల్ల యుక్తియుక్తమ్మని § యే
తలంపు. 551

గీ. తగ ననాద్య విద్యాయుక్తుఁ § డగు పురుషున, కాత్మవేత్తృతలేదు త § నంతఁదనకు
జ్ఞానదాయకుఁడున్ మఱి § సర్వవిదుఁడు, నగుచు వెలుఁగొందుచుండుఁ ద § దన్యుఁ
డనఘ! 552

క. ఇరువురుఁ జిద్రూపులగుటఁ, బురుషేశ్వరులకును లేదు § పో వైషమ్యం
బరయంగ వ్యర్థమగుఁ దది, తర కల్పన ప్రకృతిగుణమె § తగ జ్ఞానమగున్. 553

గీ. వరగుణా! గుణసామ్యంబె § ప్రకృతిసుమ్ము, భూతసృష్టిస్థితివినాశ § హేతువులయి
సత్త్వము రజంబు తమము నా § జనుగుణములు, ప్రకృతికె పొనంగుఁగాని
యా § త్మకుఁ గలుఁగవు. 554

గీ. సత్త్వమెన్న జ్ఞానంబు ర § జంబు కర్మ, తమమె యజ్ఞానమనియుఁ ద § త్త్వజ్ఞులంద్రు
అరసిచూడఁ గాలము గుణ § వ్యతికరంబ, సూత్రమగును స్వభావంబు § సూరివర్య!

వ. పురుషుండు, ప్రకృతి, వ్యక్తంబు, అహంకారంబు, నభంబు, అనిలంబు, జ్యోతియు, సలిలంబు, భూమియు నను నీతొమ్మిదియు నాత్మతత్త్వంబులని చెప్పంబడియె. 556

సీ. శ్రోత్రంబు త్వచమును § నేత్రంబు జిహ్వయు, ఘ్రాణంబు ననునివి § జ్ఞానశక్తుఁ
లాదట వాక్పాణి § పాదపాయూపస్థ, ములు కర్మశక్తులు § తలఁపఁగ మన
ముభయాత్మకంబయి § యొప్పు శబ్దస్పర్శ, రసగంధరూపముల్ § పొసఁగు జ్ఞాన
విషయమ్ములై కర్మ § విషయమ్ములుక్తిగ, త్యుత్సర్గశిల్పంబు § లొప్పుచుండు

సీ. కార్యకారణరూపిణిశ్రీగాఁ దనరుచుఁ, బ్రకృతి యీ విశ్వసృష్ట్యాది ♣ వ్యక్తరూప మమరఁదాల్చు సత్త్వాదిగుణములచేతఁ, బరఁగ వీక్షించు పురుషుఁ డవ్యక్తుఁ డగుచు. 557

ఆ. పరమపురుష వీక్ష ♣ వ్యక్తాదిధాతువుల్, వికృతిఁ గొనుచు లబ్ధవీర్యములయి ప్రకృతిబలము తోడుపడ సంగతములౌచు,నండమును సృజించుననువుమీఱ.558

వ. ఆకాశాది పంచకంబు జీవుండు నుభయాధారభూతుండగు నాత్మయందును, సప్త ధాతువులనఁ బరఁగుదురు. ఆ సప్తధాతువులవలన దేహేంద్రియప్రాణంబు లుత్పన్నంబులయ్యె. అందొక్కటియును నన్యతరంబువిడిచి యుద్భవింపనేరదు. షడ్ధాతుపక్షంబున భూతంబులైదు పరమపురుషుఁ డాఱవవాఁడని గ్రహింపనగు. ఆత్మసంభూతంబులైన వానింగూడి పరమాత్ముం డీవిశ్వంబు సృజించె. తత్త్వం బులు నాలుగనుపక్షంబున నగ్ని జల పృథ్వులుఁ దజ్జన్మహేతువగు నాత్మయు నని యెఱుంగనగు. వానివలన నీజగంబు జాతంబయ్యె. ఏకాదశత్వంబున నీ యాత్మయు మహాభూతేంద్రియంబులు గణింపఁబడె. సప్తదశత్వంబున భూత మాత్రేంద్రియంబులు పదునైదును, మనస్సొక్కటియు, నాత్మయు సంఖ్యానింపఁ బడె. షోడశత్వగణనంబున నీయాత్మయె మనస్సుగాఁ జెప్పఁబడియె. త్రయోదశ సంఖ్యానంబున భూతంబులేను నింద్రియంబులైదు మనంబు జీవుఁడు నాత్మయు నని యంగీకృతంబయ్యె. 559

గీ. అని యిటుల్ తత్త్వములకు సంఖ్యానముఁ బలు
తెఱఁగులంజేసినారు మునిప్రవరులు
అంతయున్ న్యాయమును యుక్తిమంతమునగుఁ
బండితుల వాక్యమేది శోభనముఁగాదు? 560

ఉద్ధవుఁడు:—

సీ. అనఘ! యాత్మవిలక్షణములయ్యుఁ బ్రకృతి, పురుషు లుభయులు నన్యోన్యముం గలియుచు నాశ్రయించుట వారలయందు భేద, మేమియుం గానరాకుండుఁ ♣ గృష్ణ! నాకు.

గీ. ప్రకృతియం దాత్మతోఁచును ♣ బ్రకృతి యాత్మ, యందుఁదోఁచును బుండరీక కాక్ష! కృష్ణ!
ఈ మహాసంశయంబు నాహృద్గతంబు, ధీరవాక్కుల నీవె ఛేదింపఁదగుదు. 562

కం. నీవలననె జ్ఞానంబగు, జీవులకు న్నీదుమాయచేఁ దన్నాశం
బౌవిహీలు స్వీయమాయన్, నీవ యెఱుంగుదు వారుండు ♣ నేరఁడెఱుంగన్.563

శ్రీ భగవానుఁడు:—

క. ప్రకృతికిఁ బురుషునకును బ్రా, యక యంతర మెంతయేని గనగు విను వైకా
రిక సృష్టియిది గుణక్షో, భకృతమ్మయి పరగుఁజుగమ్మవాస్తవమగుచున్. 564

వ. ఉద్ధవా! గుణమయంబగు మదీయమాయ గుణంబులచేఁ బెక్కువిధంబుల భేద బుద్ధులను ధరించుచుండు. వైకారికం బధ్యాత్మంబు నధిదైవంబు నధిభూతంబు నని ముత్తెఱంగులై యుండు. దృక్కధ్యాత్మంబు. రూపం బధిభూతంబు. ఆకాశంబున స్వయంప్రకాశమానంబగు సూర్యతేజం బధిదైవంబు. ఇవి లోకంబునఁ బరస్పరసమ్మేళనంబున సిద్ధించు. స్వకీయానుభూతిచే సర్వసిద్ధిమంతుండు నాద్యుండు నగు నాత్మ యీ మూఁడింటికిఁ బరుండై యుండు. ఇట్లే త్వక్ఛ్రోత్రజిహ్వానాసాదులకు మనంబునకు నైన గుణక్షోభకృతంబగు వికారంబు ప్రధానమూలంబగు మహత్తు నుండి యుత్పన్నంబయ్యె. వైకారిక తామసేంద్రియ త్రివిధమోహ వికల్ప హేతువనై నేను బరఁగుదు. ఆత్మ పరిజ్ఞానమయము. "కలదు లేదు" అను భేదార్థ నిష్ఠమైన వివాదంబు వ్యర్థమైనను స్వలోకరూపుఁడనగు నావలనఁ బరావృత్త బుద్ధులైన పురుషులకు విరమింపకుండు. 565

ఉద్ధవుఁడు:—

వ. ప్రభూ! నీవలనఁ బరావృత్తబుద్ధులగువారు స్వకృతంబులైన కర్మంబులచే నానా విధంబులైన దేహంబులను నెట్లుగ్రహింతురు? ఎట్లు విసర్జింతురు? దేవా! అనాత్మజ్ఞులకు దురవగాహంబైన నీవిషయంబు నాకు నెఱింగింపుము. లోకంబునఁ బెక్కురు విద్వాంసులు కలరు కాని వారు నాకు హితోపదేష్టలు కాఁజాలరు. 566

శ్రీభగవానుఁడు:—

వ. ఉద్ధవా! నరుల కర్మమయంబగు మనం బింద్రియపంచకసమేతంబై లోకంబు నుండి లోకంబుఁ బయనించు. తదన్యుండగు నాత్మ యమ్మనంబు ననువర్తించు. దృష్టంబులఁగాని శ్రుతంబులఁగాని విషయంబులు ధ్యానించుచు మనంబు కర్మతంత్రంబై వానియందు విలీనంబగు. అయ్యవసరంబున దాని పూర్వాపరసంధానంబు నశించు. విషయాభినివేశంబున మనం బాత్మను స్మరింపకుండు. జంతువులకత్యంతవిస్మృతియే మృత్యువగు. పురుషునకు స్వప్నమనోరథంబులుంబోలె జన్మత్వంబున నాత్మ తత్త్వంబున నుత్పత్తిమరణంబు లయథార్థంబులగాఁ జెప్పుదురు. ఇతండు స్వప్నము నందును మనోరథంబునందును బ్రాక్తనవిషయంబులను స్మరింపఁడు. పూర్వసిద్ధుండైనను దన్ను నపూర్వునిగా భావించు. మనస్సృష్టిచేతనే వస్తువునందుఁ ద్రివిధంబగు నుత్తమ,మధ్య మాధమత్వంబు తోఁచుచుండు. బాహ్యాభ్యంతరభేదంబును గలుఁగు. జీవుండు స్వప్నంబున నసత్యంబులైన దేహాదులను గల్పించుకొనుచు

బహురూపుఁడై దుష్పుత్రజనకుండు వడువునవర్తించు. భూతంబులలక్ష్యవేగంబగు కాలంబుచే నెల్లప్పుడును భావాభావంబులు జెందుచుండు. అతిసూక్ష్మంబగు విషయంబగుటంజేసి యది గోచరింపకుండు. అర్చిస్సులకు స్రోతస్సులకు ఫలములకు వనస్పతికి నెట్లో యట్లె సర్వభూతంబులకు వయోఽవస్థాదులు సేయంబడియె. అర్చిస్సులలో నదియే యీదీపంబనియు స్రోతస్సులలో నదియే యీజలంబనియు నరులలో నతఁడే యీపురుషుఁడనియు, వ్యర్థాయుష్కులగువారికి వాక్కును బుద్ధియు వ్యర్థముగఁ గల్గుచుండు. 567

గీ. జడజనుఁడు స్వీయకర్మ బీజమునఁజేసి, భ్రాంతి నజుఁడయ్యుఁబుట్టినవానిఁగాఁగ
నమరుఁడయ్యు మృతునిగాఁగ నరసికొనును, దారుయుక్త వహ్నింబోలెఁ
దన్ను మదిని. 568

ఆ. విను నిషేకగర్భజని బాల్య కౌమార, యౌవనములు నడి వయస్సునవల
జరయు మృత్యువునఁబరఁగు తొమ్మిదియవ, స్థలు పొసంగుచుండుఁదనువునకును.

వ. మనోమయంబులు వివిధంబులునైన తనువులను గుణసంగంబునంజేసి గ్రహించుచుండు. పరమేశ్వరానుగ్రహంబున విసర్జించుచుండు. పితృపుత్రులచేతను దేహంబునకు భవాత్యయంబులు దృశ్యంబులగుచున్నయవి. భవాత్యయవస్తువుల గుర్తెఱింగియు నజ్ఞుండు తదుభయలక్ష్యుండుగాకుండు. విద్వాంసుఁ డెవండు బీజవిపాకంబులఁ దరువునకు జన్మవినాశంబుల నెఱుంగునో యాతం డాతరువునకు విలక్షణుండయి కానంబడు. ఇట్లె ద్రష్టయుఁ దనువుకంటె భిన్నుండగు. అవివేకియైన పురుషుండు ప్రకృతికంటెఁ దన్ను విలక్షణునిగా నెఱుంగక తత్త్వస్పర్శంబున విమూఢుండై సంసారంబునుబొందు. సత్త్వగుణంబున ఋషిదేవతాత్వంబును రజోగుణసంగంబున నసురమానవత్వంబును దమోగుణసంగంబున భూతతిర్యక్త్వంబును గర్మభ్రామితుండై పొందు. నర్తించువారిని గానంబుఁజేయువారినిఁ జూచుచుఁ బురుషుండు వారి నెట్లనుకరించు నట్ల బుద్ధిచే గుణంబులంజూచుచు, నీహావిరహితుండయ్యు ననుకరించుచుండు. 570

చ. తిరిగెడు కంటితో వసుమతీవలయం బదియెల్లఁ దిర్దిరం
దిరిగెడునట్లు దోఁచెడు గతిన్ గదలాడు జలంబుతోడ లోఁ
దరువులు సంచలించెడు విధంబునఁ దోఁచుభంగి భ్రాంతి సం
సరణపరీవృతుండయిన చాడ్పున నాత్మయుఁ దోఁచు నుద్ధవా! 571

క. తలఁప మనోరథబుద్ధులు, కలఁ గనునర్థములు, నెట్లు కల్లలగునో య
ట్లలె యాత్మకు సంసారముఁ, గలిగినటులుఁ దోఁచుఁగాని కలుఁగదు తెలియన్.

వ. స్వప్నంబున నర్థాగమంబెట్లట్లు విషయధ్యానపరుండగు జీవునకు వాస్తవంబున లేనిదయ్యును సంసారంబుతొలంగకుండుఁ గావున నుద్ధవా! ఆత్మజ్ఞానంబులేమిం జేసి కలిగిన భ్రాంతిఁగా నెఱుంగుచు దుష్టేంద్రియంబులచే విషయంబుల నుప భోగింపకుము. శ్రేయస్కాముఁడగునరుం డసాధుజనంబులచే నధిక్షిప్తుండయ్యు నవమానితుండయ్యు నపహాసితుండయ్యు లేక యసూయితుండయ్యును దాడితుండయ్యును నిరోధితుండయ్యును వృత్తినుండి తొలఁగింపఁబడినఁవాడయ్యును నిష్ఠితుండును మూత్రితుఁడు నిట్లనేకవిధంబులఁ బ్రకంపితుండయ్యును బలు కష్టంబుల నొందియుఁ దన్నుఁ దా నుద్ధరించు కొనవలయు. 573

ఉద్ధవుఁడు:—

మ. బలియంబైనదికాదె యెన్నఁగ స్వభావంబీశ! త్వద్ధర్మస
క్తులు శాంతాత్ములునైన త్వచ్చరణభక్తుల్ దక్క విద్వద్వరే
ణ్యులుగూడన్ సయిరింపలేరు తమయందున్ గ్రూరతాబుద్ధి దు
ష్టులుగావించు వ్యతిక్రమంబు నదియెట్లుల్ గల్గునో తెల్పుమా. 574

---

## అధ్యాయము 23.

### భిక్షుగీత

శ్రీశుకుఁడు:—

మ. శ్రవణీయాద్భుతవీర్యధుర్యుఁడును దాశార్హర్షభుండైన మా
ధవుఁ డీరీతిని సర్వభాగవతముఖ్యార్థన్యుండు ధన్యుండుఁ బ్ర
శ్నవిదగ్రేసరుఁడైన యుద్ధవునిచేసంప్రార్థితుండై తదీ
య వచోవైఖరి నాదరించుచును నెయ్యంబొప్పఁగా నిట్లనెన్. 575

శ్రీభగవానుఁడు:—

క. ఖల వాక్ క్షుభిత మనంబుఁ బ్రదిలపరుపంజాలు ధీరధీసంపన్నుం
డలఘుయశుఁడు సాధువరుఁడు, గలుఁగండెందున్ దలంపఁగా గురుశిష్యా! 576

క. కుజనపరుషవాగ్బాణ, వ్రజములు మర్మములఁ గలఁచి వ్యథపెట్టు గతిన్
సుజనుల మానసమునకును, గజిబిజి గల్గింపఁ బోవుగా తదితరముల్. 577

క. అతిపుణ్యంబై యొప్పెడు, నితిహాసముఁ జెప్పుచుందు నిట నీవు సమా
హితమతివై వినుముద్ధవ!, హితమతి నద్దాని నీకు నే నెఱిఁగింతున్. 578

క. కుజనాభిభూతుఁడై యది, నిజకర్మవిపాకముగ గణించుచు ధృతి న
క్కజముగఁ బూనిన భిక్షుఁడు, విజితేంద్రియుఁ డొకఁడు పాడె బేరిమి దీనిన్.

సీ. ద్విజుఁడొక్కరుం డవంతీ దేశముల యందుఁ, గలఁడు వణిగ్వృత్తిఁ గడు ధనంబుఁ
గడియించి లోభియై కామియు గోపి క, దర్యుండు నగుచు నాతండు మాట
చేతనైనను దనజ్ఞాతుల నతిథుల, నాదరింపక శూన్యమగు గృహమునఁ
దానును గుడువక హీనునిభంగిఁ బ్రి, వర్తించుచుండ నా పాపరతుని

ఆ. పుత్రబాంధవులును దారపుత్రికలును, ద్రోహమొనరింప నాత్మలందుఁ దలఁచిరి
యెంతయు విషణ్ణులగుచును భృత్యజనులు, నించుకేనియుఁ బ్రియముఁ గావింపకుండ్రి.

గీ. యక్షువిత్తంబునకుఁ బోలె రక్షణంబ, కడఁకఁ జేయుచు నుభయలోక చ్యుతుఁడయి
ధర్మకామహీనత సతతంబు మెలఁగు, వానిపైఁ బంచభాగులు పూనిరలుక. 581

క. వారి యవజ్ఞ ధనాగమ, కారణమగు పుణ్యమెడలఁగా శ్రమ మిగులన్
భూరితరంబగు తద్ధన, మూరక నాశంబు నొందె నుద్ధవ! వింటే. 582

క. కొంచెము జ్ఞాతులు దస్యులుఁ, గొంచెము రాజులును గొనిరి కొంచెము మఱియున్
గొంచెము దైవవశంబునఁ, గొంచెముఁ గాలమునఁ జెడియెఁ గుమతిధనమిటుల్.

గీ. ధర్మకామవిహీనుఁ డాతండు తన ధ, నం బడెల్ల నీకై వడి నష్టమగుడు
నెల్ల జనములచేత నుపేక్షితుఁడయి, స్వాంతమందు దురంతమౌ చింతఁ జెందె.

క. అతఁడు విగతధనుఁడయి వ్య, గ్రత నీగతి బాష్పరుద్ధకంఠుండగుచున్
మతిఁ దద్దవగచుచుండఁగ, నతి నిర్వేదంబు ప్రభవమయ్యె మనమునన్. 585

చ. అపుడతఁ డిట్లు పల్కె నకటా! కడుకష్టము దాపురించె బా
పపరుఁడనైన నే నిటులు వమ్ముగ నాత్మను గ్లేశపెట్టితిన్
గృపణత ధర్మకామములకించుక యేనియుఁ గాని యట్టి వ్య
ర్థపు ధనమూలఖేదము నితాంతముఁ బూనితి బాలిశుండనై. 586

క. లోభికి నర్థంబులు సుఖ,లాభంబును గూరుపవు దలంప నొకప్డేన్
నీ భువనమ్మున మిగుల వ్య, థాభరకర నరక మిడుఁ బదఁపడి మృతునకున్. 587

గీ. కీర్తిమంతుల ప్రవిమల కీర్తియును గు, ణాఢ్యులగువారి శ్లాఘ్య గుణావళియును
స్వల్పమగు లోభమున వినాశంబు నొందు, నమలరూపంబు శ్వేతకుష్ఠమునఁ బోలె.

వ. సాధనంబున, సిద్ధియందు, నుత్కర్షంబున, రక్షణంబున, వ్యయంబున, నాశోప
భోగంబుల నరులకు నర్థంబువలన నాయాసంబును, భయంబును, జింతయు,
భ్రాంతియుఁ గలుఁగుచుండు. స్తేయంబును, హింసయు, ననృతంబును, దంభమును,
గామమును, గ్రోధమును, స్మయంబును, మదంబును, ఖేదంబును, వైరంబు,
నవిశ్వాసంబును, నంస్పర్ధయు, స్త్రీ, ద్యూత, మద్య, విషయిక వ్యసనంబులునను
నీపదునేనును నరులకు నర్థమూలంబులగు ననర్థంబులని తలంపఁబడెఁ గావున
నర్థాఖ్యంబగు ననర్థంబును దూరంబున విసర్జింపవలయు. 589

ఉ. ప్రాణ సమానులాప్తులగు భ్రాతలు జాయలుఁ దల్లిదండ్రులున్
బోణిమితోడి మిత్రులును బూర్వహితత్వముడించి యొక్క దు
గ్గాణిని బట్టి స్పర్ధలను గైకొను చప్పటి కష్ట మెల్లరున్
బ్రాణవిరోధులై సతము వర్తిలుచుందురు తెంపు దోఁపఁగన్. 590

క. అలఁతి ధనంబున్నకై వీ, రలు కోపాటోపములఁ బరఁగుచున్ స్పర్ధా
కుల చిత్తులగుచుఁ బ్రాణం, బుల విడుతురు కూర్మివిడిచి పొలియింత్రొరులన్. 591

సీ. అమరసంప్రార్థనీయమగు మానుష్య జ, న్మమునంది యందు బ్రాహ్మణతఁ బడసి
యెవఁ డాత్మహితము గ్రహింపక విడనాడు, నతఁ డశుభంబగు గతినిఁ బొందు
స్వర్గాపవర్గ భవ్యద్వారమైన యీ, భూలోకముం బొంది పురుషుఁ డెవఁడు
తగిలి సర్వానర్థధామమైనట్టి యీ, ద్రవిణంబునందుఁ బెద్దమక మొదవఁ

గీ. బ్రీతి దేవర్షి పితరుల భూతములను, జ్ఞాతులను బందుగులను భాగార్హులైన
వారినిం దనియింప కవారి ధనముఁ, గూర్చునాతఁ డధోగతిఁ గూలుఁ గాదె.592

క. ధనమును బ్రాయము బలమును, ననుదినమున్ జెల్లె నాకు వ్యర్థార్థేహన్
సునిపుణులు వాన సిద్ధిం, గనుదురు వృద్ధుండ నేమిఁ గకన్ సాధింతున్. 593

ఆ. వ్యర్థమైన యట్టి యర్థస్పృహం జేసి, పండితుండు క్లేశపడుటఁ జూడ
నెవని మాయనో గణింప నీలోకంబు, మోహితం బటంచు బుద్ధినెంతు. 594

వ. మృత్యుగ్రస్తుండగు జనునకు ధనములచేఁగాని, ధనదులచేఁగాని, కామములచేఁ
గాని, కామదులచేఁగాని, కర్మములచేఁగాని, జన్మదాయకులచేఁగాని యేమి
ప్రయోజనంబు? 595

గీ. ఇట్టి దశ నన్నుఁ బొందించి యెలమి నాత్మ, తారకమగు నిర్వేదంబుఁ గూరిచె భగ
వంతుఁ డీశుఁడు సర్వదేవమయుఁడు నగు, హరి ధ్రువంబుగ సంప్రీతుఁ డయ్యె నాకు.

గీ. అప్రమత్తుఁడనై నే మదంగములను, శోషిల నొనర్తుఁ గాలావశేషమునను
నఖిలమైన స్వార్థంబుఁ ద్యాజ్యముగఁ జేసి, యాత్మసిద్ధిని బొందఁ బ్రయత్నపడుదు.

గీ. త్రిజగదధినాథులైన యా దేవతలును
నను ననుగ్రహింతురి తగు మన్ననలొసఁగుచు
నోజ ఖట్వాంగుఁ డొక్క ముహూర్తమంద
బ్రహ్మలోకంబు సాధించి పడయఁడె మును. 598

శ్రీభగవానుఁడు:—

సీ. అనుచుఁ దలపోసి యా ద్విజుఁ డనుపరిఘ, విల్లఁగా హృదయగ్రంథు లెల్లఁ గోసి
శాంతుఁడును భిక్షుకుఁడు మునియై సత్తముండు, నగుచు వర్తిల్లె నుద్ధవా! యనఘచరిత!

క. యతచిత్తేంద్రియ తతి మా, రుతుఁడై యాక్షితితలంబుఁ గ్రుమ్మరుచు నల
క్షితుఁడు నసంగుఁడునై తో,న తిరిపమున కరిగె గ్రామనగరంబులకున్. 600

క. ప్రవయస్కుండును భిక్షుఁడు, నవధూతయునైన యతని నతి దర్పితులై
వివిధ తిరస్కృతులం బరి, భవించి రుద్ధవ! ఖల స్వభావులగు జనుల్. 601

క. కొందఱు త్రివేణుదండముఁ, గొందఱు పాత్రంబును మఱికొందఱు చీరన్
గొందఱు కమండలువు నీఁకఁ, గొందఱు సూత్రమును గొనిరి కొంద ఱుబొంతన్.

క. పిమ్మట వారివిగో కై, కొమ్మని చూపించి యొసఁగి కూళతనమునన్
గ్రమ్మఱ నాచికొనిరి ప్రిన,భమ్మెసఁగన్ వాని నెల్లఁ బకపక నగుచున్. 603

గీ. నదితటమ్మున భైక్ష్యాటనమునఁ గొన్న, యన్నమును భుజియించెడు నతని మూర్ధ
భాగమందున బల్మి నీ బాపరతులు, చేరి విడిచిరి మూత్ర నిష్ఠీవనములు. 604

గీ. మౌనమును వహియించిన వానిఁ బల్కు,రింత్రు పల్కకయున్న మర్దింత్రు పెలుచ
దొంగ యితఁడని వానిపై దోషమిడుచుఁ, గొందఱాతని బెదరింత్రు క్రుద్ధులగుచు.

క. కట్టుఁడు కట్టుండనుచును, గట్టిదులై కొందఱతనిఁ గట్టుదురు మఱిన్
నెట్టుదురు స్వజనవర్జితుఁ, డిట్టి విధముఁ గొనె నటంచు హింసింత్రతనిన్. 606

సీ. "అహహా! యీతండు మహాసారవంతుండు, ధృతిశాలి పర్వతపతియుఁబోలె
మౌనంబునన్ శక్తిమంతుఁడై యర్థసా,ధకుఁడగు నీతండు బకముపోలె"
అని కొందఱిట్లు ప్రహాసంబుఁ జేయుదు,రొరులు నపానవాయువు విడుతురు
ఆటపిట్టనుబోలె నరికట్టుదురు నిరో,ధింతురు కొందఱు తీవ్రితమెయి

గీ. ఇట్టులా బ్రాహ్మణుఁడు సంతపించి భౌతికంబు దైహికమును దైవికంబునైన
దుఃఖమును బొంది చిత్తమందుండ దలంచెఁ, బ్రాప్తమైనట్టి తనదు ప్రారబ్ధమనుచు.

క. తను ధర్మభ్రష్టునిగా, నొనరించెడు నీచజనులయొత్తిడిఁబడి మె
ల్లన సాత్త్వికధృతిఁ గైకొని, తనంత నీ గాథఁ బాడె ధర్మస్థుండై. 608

భిక్షుఁడు:—

మ. గణుతింపన్ జనమిద్ది నాకు సుఖదుఃఖప్రాప్తికిం గాదు కా
రణ మావంతయు దేవతాగ్రహములున్ బ్రాక్కర్మకాలంబులే
నణుమాత్రంబును గావు సంసృతి సమాఖ్యంబైన చక్రంబు స్వై
రణ వర్తిల్లఁగఁ జేయుడెందమె సమగ్రంబైన మూలంబగున్. 609

మ. బలియంబైన మనంబె యీగుణములన్ బ్రోదిన్ సృజించున్ గుణం
బులచేతన్ సితకృష్ణలోహితములై పొల్పారు కర్మోత్కరం
బులు సంభూతములౌను గర్మములచేఁ బుట్టున్ సవర్ణంబులౌ
పలుజన్మంబులు నందు నిందుఁ బరికింపన్నిక్కువం బింతయున్. 610

ఉ. దానము సద్వ్రతంబును స్వధర్మముఁ గర్మములున్ శ్రుతంబు నా
లో నియమంబులున్ యమములున్ గమనింప నివెల్ల నెంతయున్
మానస నిగ్రహాంత విధిమంతములై యుపయుక్తమౌను ద
న్మానస నిగ్రహంబ పరమంబగు యోగముకాదె యన్నిటన్. 611

ఉ. జ్ఞానసమీక్ష నెవ్వని మనంబు సమాహితమై యెసంగునో
దానము మున్నుగాఁ గలుఁగు ధర్మములం బనిలేదు వానికిన్
మానససంయమంబు గరిమంబున నెవ్వఁడు పూనకుండునో
దానము మున్నుగాఁ గలుఁగు ధర్మములం బనిలేదు వానికిన్. 612

ఉ. జనులకు మానసంబు స్వవశంబగుడున్ సకలేంద్రియంబులున్
మొనసి తమంత వశ్యతనుబొందు మనంబు మఱొంట వశ్యతన్
గనదు భయంకరంబగు మనంబు సుదుస్సహమెట్టివారి క
మ్మనమును గెల్చువాఁడె మహిమన్ సకలేంద్రియ జేత యయ్యెడిన్. 613

చ. గురుజవమొప్ప మర్మములఁ గోయుచుఁ గెల్వఁగరాని శత్రువై
పొరిఁ జెలరేగు నమ్మనము మూఢులు గెల్వఁగలేక తారు ని
ష్ఠురమతిఁ దోడి మర్త్యులఁ గషుం బగఁ జూచుచునుంద్రు వెండి వీ
రరు లనుచున్ సుహృజ్జనములంచుఁ దటస్థులటంచు నెంత్రహా ! 614

చ. నరులు భ్రమించి కేవల మనఃపరికల్పితమైన యీ కళే
బరమున 'నాది, నే' ననెడు భావమునంబడి యంధబుద్ధులై
పరమిది యిద్ది నే ననెడు భ్రాంతినిమున్గుచు నిట్లపారదు
స్తరతరభీకరాంధతమసంబునఁ గ్రుమ్మఱుచుంద్రు నిచ్చలున్. 615

గీ. జనము సుఖదుఃఖహేతు వౌననిన నపుడు, నాత్మ కేమగుఁ దనువునకగునుగాని
తనదుజిహ్వనుదనదుదంతములఁగొఱికి,కొని యెవనిమీద దాని వేదనకుఁగినియు.

వ. ఇంద్రియాధిష్ఠానదేవతలు సుఖదుఃఖములకు హేతువగుదురేని దాన నాత్మకేమగు? స్వహస్తంబుచే స్వముఖం బభిహతంబగునప్పు డెవనిపైఁ బురుషుండు క్రుద్ధుండగు? ఆత్మ సుఖదుఃఖహేతువగునేని నది నిజస్వభావంబు కాని యితరంబు వలననైనదికాదు. ఆత్మకంటె నన్యంబులేదు. ఉన్నట్లుతోఁచిన నది మిథ్యయగుఁగాన నెద్దానన్ సుఖదుఃఖంబులాత్మకుఁగలుఁగమి నెవరిని గోపింపనగు? గ్రహంబులు సుఖదుఃఖంబులకు నిమిత్తంబులగునేని జన్మరహితంబగు నాత్మకేమగు? గ్రహంబులచే గ్రహంబులకుఁబీడయగునని దైవజ్ఞులు చెప్పుదురుగాన గ్రహదేహభిన్నుండైన పురుషుం డెవ్వనికై కోపించు? కర్మము సుఖదుఃఖములకు హేతువగునేని

దాన నాత్మ కేమగు? దేహంబుజడంబు. ఆత్మ శుద్ధజ్ఞాన స్వరూపంబు. కాన దేనిపైఁ గోపించు? కాలము సుఖదుఃఖహేతువందమన్న ను దానఁగాలాత్మకుండగు నాత్మకు నేమగు? అగ్నికిఁదాపంబు హిమంబునకు శైత్యంబును గలుగవుగదా? కాన నెవనిఁ గోపింపనగు! దేనిచేత నెందును నెట్లును బరాత్పరుఁడైన యాత్మకు ద్వంద్వోప రాగంబులేదు. అహంకారపరుండును సంసారరూపుఁడునగు జీవునకుమాత్రమే యిదియగు. ఇట్లు ప్రబుద్ధుండై పురుషుండు భూతంబులవలనభీతుండుకాకుండు.

ఉ. ఆ ముని యిట్లు పూర్వతముౕలైన మహర్షులు పూనినట్టి వి
ద్యామహితాత్మనిష్ఠ హృదౕయంబునఁగైకొని నేను న మ్ముకుం
దామలపాదపంకజసౕమర్చలఁజేసి క్షణంబులోన ను
ద్దామదురంతపారసముౕద్రగతమంబును నిస్తరించెదన్. 618

శ్రీభగవానుఁడు:—

మ. అని నిర్వేదముఁజెంది నష్టధనుఁడైౕయ స్త్రశ్రముండౌచు నా
ర్తి నివృత్తుండయి ప్రవ్రజించి పుడమిన్ౕదిర్గాడు చీరీతి దు
ర్జనధిక్కారముఁబొందియేనియు స్వధౕర్మభ్రంశముంజెంద క
మ్మౌని యీనిర్మలమైన గాథనుడివెన్ౕబొల్పొప్పఁగా నుద్ధవా! 619

క. లే దిల సుఖదుఃఖప్రద, మేదియుఁ బురుషునకు నన్యౕమెన్న భ్రమయు మి
త్రోదాసీనరిపులును బ్ర,మాదకలిత సంసృతియుఁ దౕమస్సంభవముల్. 620

గీ. కాన నన్నివిధంబుల ౕ మానసమును, నిగ్రహింపు మో యుద్ధవ! ౕనియమనిష్ఠ
లొప్ప మన్నివేశితబుద్ధి ౕ యుక్తుఁడవయి, యోగసంగ్రహమింతవౕట్టేగదయ్య.

గీ. అనఘ! యీభిక్షు గీతమైౕనట్టి బ్రహ్మ, నిష్ఠను సమాహితుండయిౕనిపుణతమెయి
నెవఁడుధరియించు విను వినుౕపించువాఁడు, పరిభవింపంగఁబడఁడుద్వంౕద్వములచేత.

---

## అ ధ్యా య ము 24.

### మ నో మో హ ని వృ త్తి

గీ. అనఘ! పూర్వవినిశ్చితౕమైన సాంఖ్య, యోగమును వచియించెద ౕ నోర్మివినుము
దానిన యెఱింగి పురుషుఁడు ౕ తత్క్షణంబె, భేదహేతుక భ్రమమునుౕవిడిచిపైచు. 623

వ. అవికల్పితంబగు నర్థంబొక్కటియె జ్ఞానంబయ్యె. ఆద్యంబగు కృతయుగంబున జను లీజ్ఞానంబుచేతనె వివేకనిపుణులైరి. నిర్వికల్పకంబును నవాఙ్మానసగోచరంబును బ్రహ్మరూపంబు నగు నీజ్ఞానంబు మాయావిలాసరూపంబున ద్వివిధంబయ్యె. ఆ ద్వివిధాంశంబులయందు నొక్కటి కార్యకారణరూపిణి యగు ప్రకృతియయ్యె.

అన్యతమంబగు జ్ఞానంబు పురుషుండని చెప్పంబడు. నాచే సంక్షుభితంబగు ప్రకృతికిఁ దమోరజస్సత్త్వంబులను గుణంబులయ్యె. ఆ గుణంబులవలన మహాసూత్రసంయుతంబగు సూత్రం బుత్పన్నంబయ్యె. వికృతింబొందిన యాసూత్రంబువలన విమోహనంబగు నహంకారంబు వొడమె. అహంకారంబు వైకారికంబు తైజసంబు తామసంబు నని ముత్తెఱంగులయ్యె. చిదచిన్మయంబగు నా యహంకారంబు తన్మాత్రేంద్రియ మనంబులకుఁ గారణంబయ్యె. తన్మాత్రలవలన నర్థంబును, దామసంబువలన నింద్రియంబులును, దైజసంబువలన దేవతలును, వైకృతంబువలన నేకాదశతత్త్వంబులును గలిగె. 624

గీ. తలఁప నాచేత సంచోదితంబులగుచుఁ, బ్రోవుగాఁ గూడుకొని సర్వభావములును
నాకు నత్యుత్తమాయతనమగునట్టి, యండ ముద్భూతముగఁ జేసె నమలచరిత !

గీ. అంబుసంస్థితమైన యయ్యండమందు, సంభవించితి నేను విశ్వాఖ్యమైన
నలిన ముద్భూతమయ్యె నానాభినుండి, యాత్మభవుఁ డుద్భవించె నయ్యబ్జమందు.

గీ. నా యనుగ్రహమునఁ జేసి నలినజుఁడు త, పోబలోపేతుఁడై రజంబున సృజించె
లోకమయతన్ సపాలకలోకములను, భూర్భువస్స్వరభిఖ్యల ముత్తెఱఁగుల. 627

గీ. ఓకమై దేవతలకు స్వర్లోకమమరె, మొగి భువర్లోక మిరవయ్యె భూతములకు
నయ్యె భూలోకమిక్క మర్త్యాదులకును, నెలవు త్రితయపరంబు సిద్ధులకునయ్యె.

వ. ఈమూఁడింటికిఁ గ్రిందిభాగం బసురనాగులకు నివాసంబుగాఁ బ్రభువు సృజించె. త్రిలోకంబులందును సర్వగతులును బ్రాప్తించు. భక్తియోగంబునకు మద్గతి సిద్ధించు. కాలాత్ముఁడను విధాత్రుఁడనగు నాచే నీజగంబు కర్మయుక్తంబుగాఁ జేయంబడి గుణప్రవాహంబున మునుఁగుచుఁ దేలుచు నుండు. అణువును, బృహత్తును, గృశము, స్థూలము నగు నేయేభావంబు ప్రసిద్ధంబగు నదియెల్లఁ బ్రకృతి పురుషులచే నభివ్యాప్తంబగు. తైజసంబులగు కటకకుండలాదులుం బార్థివంబులగు ఘటశరావాదులుంబలె నేది దేనికి నాదియు నంతము నైయుండునో యదె దానికి మధ్యంబునై యుండును. వికారంబు వ్యవహారార్థంబు. పూర్వమైన భావంబు దేని నుపాదానముగాఁ జేసి పరమైన భావంబును సృజించునో యాద్యంతగతంబైన యది సత్పదార్థమని చెప్పంబడు. ఈకార్యంబునకుఁ బ్రకృతి యుపాదానకారణంబు. పరమపురుషుండు దాని కధిష్ఠానంబు. కాలంబు గుణాభివ్యంజకంబు. తత్త్రితయంబును బ్రహ్మరూపుఁడనగు నేన యగుదు. పౌర్వాపర్యంబున నిత్యము సర్గము ప్రవర్తించుచుండు. పరమేశ్వర వీక్షాపర్యంతంబు స్థిత్యంతంబగు గుణవిసర్గంబు జరుగుచుండు. లోకకల్ప వికల్పకంబైన విహా

ట్స్వరూపంబు నాచేఁ బొందఁబడి భువనంబులతోఁ గూడఁ బంచత్వంబునకు విభాగమునకు యోగ్యంబగుచుండు. 629

సీ. అన్నమునందు మర్త్యశరీర మణఁగు న, న్నము బీజములను లీనమగునట్లె
బీజంబులును బృథివిని లీనమగుఁ బృథ్వి, గంధంబునం దణఁగారు సొరిది
నణఁగు జలంబులయందు గంధంబును, నగుణమా రసమున జలములణఁగు
రసమును వైశ్వానరమున లీనంబగు, నగ్ని రూపంబున నణఁగు వాయు
గీ. వునను రూపమ్మణఁగు స్పర్శమునను వాయు, వణఁగు నంబరమున స్పర్శ మణఁగు నంబ
రంబు శబ్దతన్మాత్ర లీనంబగు నఖి, లేంద్రియములు స్వయోనులన్ లీనములగు. 630

వ. ఇంద్రియకారణభూతులగు దేవతలును వైకారికంబును నియంతయు నగు మనస్సున విలీనులగుదురు. శబ్దంబు భూతాదియగు తామసాహంకారంబున నణంగు. ఆ భూతాదియును మహత్తున లీనంబగు. గుణవర్తరంబగు నామహత్తును స్వగుణంబుల విలీనంబగు. ఆగుణంబులును నవ్యక్తంబున నణంగు. ఆ యవ్యక్తంబును నవ్యయంబగు కాలంబున లీనంబగు. కాలంబును మాయామయుండగు జీవునియందణంగు. జీవుండును నజుండను నాత్మస్వరూపుఁడనగు నాయందు విలీనుండగు. ఆత్మ కేవలుండై విశ్వోత్పత్తి లయ హేతుభూతుండై యాత్మస్థుండై యుండు. 631

చ. అమలినబుద్ధి నీగతి సమస్తముఁ గన్గొనఁ జాలునట్టి సం
యమికి నిఁకెట్లు కల్గెడిని మానసికంబగు భేదహేతుక
భ్రమములు కల్గినన్ హృదయభాగమునం దవి యెట్లునిల్చు? వ్యో
మమున నినుండు దోఁపఁగఁ దమంబు పదంపడి నిల్వఁగల్గునే? 632

గీ. ధీవరేణ్య! పరాపరదృక్కునై వె, లుంగు నేఁ బ్రతిలోమానులోమముగను
సంశయగ్రంథి విచ్ఛేదిసాంఖ్యయోగ, విధిని దీని వచించితిం బెంపుమీఱ. 633

---

## అ ధ్యా య ము 25.

### చిత్తప్రభవ గుణవృత్త్యభివర్ణనము

శ్రీభగవానుఁడు: —

గీ. నరుఁ డమిశ్రములైన గుణములలోన, దేన నెట్టివాఁడగునో యద్దాని నెల్ల
నీకుఁ దెలియంగఁబఱచెద నేను బ్రీతి, నుద్ధవా! యాలకింపుము శ్రద్ధ కల్మి. 634

సీ. శమముఁ దమంబును సత్యంబుఁ దపము స్మృతియు వివేకంబుఁ దితిక్షయు దయ
త్యాగంబుఁ దుష్టియు దానము హ్రీయును, శ్రద్ధ స్వనిర్వృతి సాత్త్వికములుఁ
గామంబుఁ దృష్ణ యీహా మదేచ్ఛా గర్వ, భేదమ్ములు యశమ్ముఁ బ్రీతి సుఖము
నపహాసితమ్ము వీర్యావిష్కరణమును, బ్రబలోద్యమము నివి రాజసములు
గీ. ప్రకటమైన క్రోధంబు లోభం బనృతము
యాచ్ఞ హింస దంభము కలహంబు శ్రమము
భ్రమము నార్తియు శోక మోహములు నిద్ర
తంద్ర యాశ భీతి జడిమ తామసములు. 635
గీ. ప్రకటముగ మున్నె వర్ణింపఁబడియె బుధవ, రేణ్య! సత్త్వరజస్తమోవృత్తులివ్వి
యింకఁ దత్సన్నిపాతంబు నెఱుకపఱతు, నేను వినుమా యతిశ్రద్ధధానుఁడవయి.
గీ. ఏను నాదని యెడు బుద్ధి యేది కలదొ, పలుకఁగాఁబడు నది సన్నిపాతమనుచు
ఆరయఁగ మనోమాత్రేంద్రియాసువులను, వ్యవహృతియె సన్నిపాత ముద్ధవ!
తెలియుము. 637
గీ. మర్త్యుఁడెపుడు ధర్మార్థకామంబులఁ బరి, నిష్ఠితుండయి వర్తిలున్ద్రిగుణసన్ని
కర్ష మప్పుడ యతనికిఁ గల్గఁజేయుఁ, గ్రమముతోడ శ్రద్ధారతిద్రవ్యములను. 638
వ. పురుషునకుం బ్రవృత్తిలక్షణంబగు గృహాశ్రమంబున నిష్ఠ జనియించునేనిఁ బదం
పడి నిత్యనైమిత్తికాది స్వధర్మంబును నతఁ డనుష్ఠించు. అదియును గుణసన్ని
పాతంబ యగు. 639
గీ. శమదమాదులఁ బురుషుని సాత్త్వికునిగఁ, గ్రమతఁ గామాదికంబుల రాజసునిగఁ
దలఁపఁ గ్రోధాదికంబులఁ దామసునిగ, నిపుణమగుబుద్ధిని ననుమానింపఁదగును.
క. నిరపేక్షుఁడై స్వకర్మలఁ, బరఁగు చెవఁడు నన్ను భక్తిభజియించునొ యా
నరునైన నారినైనన్, గరమెఱుఁగఁగ నౌను సాత్త్వికప్రకృతినిగాన్. 641
క. పలుకోర్కులతోడ స్వకర్మల నను భజియించువాని రాజసమతిఁగాఁ
దలఁపుము హింసారతి నిచ్చలు నన్ను భజింపఁ దామస ప్రకృతియగున్. 642
గీ. చిత్తజన్య గుణంబులచేత భూత, వర్గమందు జీవుండు నిబద్ధుఁడగునుఁ
మాన్యచరిత! సత్త్వరజస్తమంబులనెడు, గుణములవ్వి జీవునకె నాకుంగలుఁగవు:
క. అమలినశివసుందరసత్త్వ మితరముల గెల్చునేని ధర్మజ్ఞానా
ది మహితుఁడై పురుషుఁడు సౌఖ్యముతో నొప్పారు సంశయము లేదిందున్. 644
గీ. భేదసంగంబులకును బ్రవృత్తికిం గ, తంబగు రజోగుణంబు సత్త్వతమములను
గెల్చుచోఁ గర్మమున్ శ్రీయుఁ గీర్తియు నొనఁ, గూడ నరుఁడు దుఃఖంబుతోఁ
గూడియుండు. 645

గీ. మూఢము లయం బనుద్యమమునగు తమము, సత్త్వరజముల నిర్జింపఁజాలెనేని
నిద్ర యాశయు హింసయున్ విస్తరిల్ల, శోకమోహంబులన్ బురుషుండు కలఁగు.

గీ. ఎప్పుడు ప్రసన్నమగుఁ జిత్తమింద్రియములు
నెపుడు నిర్వృతిఁ జెందునో యపుడ దేహ
భయము సంగంబుఁ దొలఁగంగఁ బరఁగు దాని
మత్పదమగు సత్త్వంబుగా మదిఁ దెలియుము. 647

ఆ. వికృతిఁ గొనుచుఁ గ్రియల విక్షిప్తబుద్ధియై, చిత్తమందుఁ దా నివృత్తిలేక
సరఁగఁ దనువునందు స్వాస్థ్యంబుఁ బొందక, భ్రాంతుఁడగుట యది రజమనఁబడు.

గీ. మానసంబును నిగ్రహింపంగ లేక, నష్టమున్ లీనమగుచు నజ్ఞానదమయి
పృథుతమోగ్లానిఁ జేయుచు వెతలఁ గూర్చు, నట్టిది తమోగుణంబని యరయుమయ్య.

క. తగ సత్త్వగుణము పెంపొం, దఁగ దేవబలమున కభ్యుదయమగు రజమున్
నిగిడిన నసురబలము పెం,పగు రక్షోబలము వృద్ధియగుఁ దమబుద్ధిన్. 650

ఆ. సత్త్వవృద్ధినగును జాగరణంబు ర,జఃప్రవృద్ధివలన స్వప్నమగును
నగు సుషుప్తియుం దమోఽభ్యుదయమున జం,తువునకుం దురీయమవును మాఁట.

గీ. సత్త్వమున మీఁది మీఁదికిన్ జనులు బ్రహ్మ,దనుకఁ బోదురు తమమున స్థావరంబు
దనుక క్రిందికిఁ గ్రిందికిన్ జనుచునుంద్రు, రజమువలన మానవులై పరఁగుచునుంద్రు.

గీ. సత్త్వవృద్ధిని మృతజనుల్ స్వర్గపదవి, వడయుదురు రజోవృద్ధి మడియువారు
కందురు నృలోకముం దమమందు మృతులు, నరకమును గొంద్రు నిర్గుణుల్
నన్నె కందుర్. 653

చ. ఫలము నపేక్షచేయకయె భక్తిని నాకు సమర్పణంబుగా
నలిపెడునట్టి కర్మమది సాత్త్వికమంచు నెఱుంగు ముద్ధవా!
యిలను ఫలంబుఁ గోరి యొనరించెడు కర్మము రాజసంబు హిం
సల నతిఘోరమై పరఁగ సల్పెడు కర్మము తామసంబగున్. 654

క. అమలినకైవల్యజ్ఞా,నము సాత్త్వికమగు రజోగుణజము తనూజ్ఞా
నముఁ దలఁపఁ బ్రాకృతజ్ఞా,నము తామసమౌను నిర్గుణము మత్పరమా. 655

క. వనవాసము సాత్త్వికము పు,రనివాసము రాజసమ్మొరయ ద్యూతనికే
తనవాసము తామసమగు, ననఘా! నిర్గుణము మద్గృహనివాసమగున్. 656

గీ. సాత్త్వికుండౌ ననాసక్తి సలుపువాఁడు, రాగదూషితుఁడగువాఁడు రాజసుండు
తామసుండు స్మృతిభ్రష్టతాయుతుండు, నిర్గుణుం డారయంగ మన్నిష్ఠుఁడగును.

గీ. సాత్త్వికమగు నాధ్యాత్మికశ్రద్ధ చూడ, రాజసంబగు నిఖిలకర్మగతశ్రద్ధ
తామసమగు నధర్మగతమగు శ్రద్ధ, నిర్గుణంబగు శ్రద్ధ మన్నిషితమగు. 658

గీ. పథ్యమున్ శుద్ధము యదృచ్ఛఁ బ్రాప్తమునగు
నోగిరము సాత్త్వికమ్మగుచుండు రాజ
సమగు నైంద్రియికము తామసమగుభీతి
దంబు నార్తిద మపరిశుద్ధం బగునది. 659

క. అమలాత్మోత్థంబగు సౌఖ్యము సాత్త్వికము విషయోత్థమది రాజసమాం
గ్రిమ మొప్ప మోహదైన్యోత్థము తామసమగును మద్గతము నిర్గుణమా. 660

సీ. ద్రవ్యంబు దేశంబుఁదలఁప ఫలంబును, గాలంబు జ్ఞానంబుఁ గర్మ కర్త
శ్రద్ధ యాకృతి యవస్థయు నిష్ఠ యివియెల్ల, త్రిగుణాత్మకములని తెలియుమయ్య
ధృతిఁ బురుషావ్యక్తసధిష్ఠిత సర్వభా, వంబులును గుణమయంబులగును
దృష్టంబు శ్రుతముబుద్ధిని ననుధ్యాతంబు, గుణమయంబని యెఱుంగుముకుమార

గీ. పురుషునకుఁ గుణకర్మ సముత్థములయి
యెసఁగు సంసృతు లివి జీవుఁ డెవఁడు చిత్త
మునను బొడమెడు నీగుణంబులను గెల్చు
భక్తియుక్తిని నతఁడు మద్భావముఁగను. 661

సీ. కావున జ్ఞానవిజ్ఞానసంభవమగు, నీదేహముంబొందియెలమి బుధుఁడు
గుణములతోడి తగులమును గడఁక వర్జించి నన్భక్తి భజింపఁగనగు
నిస్సంగుఁడున్ జితేంద్రియుఁ డప్రమత్తుఁడు, నగుచు సేవింపఁగననగును నన్ను
సత్త్వసేవన్ రజస్తమములు గెల్వనౌ, నురుసత్త్వమును యోగయుక్తుఁడగుచు

గీ. నైరపేక్ష్యంబుతోడ శాంతత వహించి, గెల్వఁవలయును బేర్మి యోగీశ్వరుండు
పాసఁగ యోగయుక్తుండు జీవుఁడు గుణోత్థ, లింగదేహముఁబాసి
నన్నుం గలియును. 662

క. జీవుండు లింగతనువును, భావోత్థగుణములను బెడఁ బాసి తగన్ మ
ద్భావుఁడయి మగుడఁ బొందన్, బోవఁడు విషయాభిరతినిఁ బూర్ణుండగుచున్.

---

## అధ్యాయము 26.

—ఐళగీతాద్యభి వర్ణనము—

శ్రీభగవానుఁడు:—

గీ. మత్స్వరూపజ్ఞ లక్షణసమహితమగు నృ, దేహమంది మద్ధర్మ సుస్థితుఁడయి ముని
నన్ను నాత్మస్థు నవ్యయానందరూపు, భద్రదాయకుఁ బరమాత్ముఁబడయఁ
గలఁడు. 664

సీ. జ్ఞాననిష్ఠన్ ద్రిగుణాత్మకమైన జీవోపాధిచేత విముక్తుఁడగుచు
వస్తువుల్ గాక యొప్పరిదృశ్యమానంబు, లైన మాయామాత్రమగు గుణముల
వర్తించుచున్న యవస్తువులగు గుణములతోడఁ గూడంగ బోఁడు బుధుఁడు
శిశ్నోదర సుఖసంసేవి దుర్జనముల, సంగంబు నెన్నఁడు సలుపఁబోఁడు
ఆ. అంధు ననుసరించు నంధుల పోలిక, వాని ననుగమించువాఁ డురువడి
నంధతమసమందు నప్పుడ పడుఁజూవె, యిందు లేదొకింత సందియంబు. 665
గీ. సద్యశుండు పురూరవశ్చక్రవర్తి, యైలుఁ డల యూర్వశీవిరహార్తి మోహ
వివశుఁడయ్యును జాతనిర్వేదుఁడగుచుఁ, బాడె నీగాథ శోకవిభ్రాంతినుడిగి. 666
గీ. తన్ను విడనాడి చనియెడు దానిఁ గాంచి, నగ్నుఁడగుచు నృపాలుఁ డున్మత్తునివలె
"నాగుమా ఘోరహృదయ జాయా!" యటంచు, విక్లబత విలపించుచు వెంబడించె.
గీ. తనివిఁ జెందని మదిని క్షుద్రంబులైన, కామములఁ గోరు చూర్వశీకాంతయందె
చేతమాసన్నమగుటయు భూతభావి, వర్షరాత్రులఁ దెలియఁ డా పార్థివుండు. 668
ఐలుఁడు:—
ఆ. అహహ? కామకలుషితాత్ముఁడనగు నాదు, ప్రకట మోహవిస్తరంబుఁ గనుఁడు
కౌఁగిలించి దేవి కంఠ మాయుఃఖండ, ములగు రేఁబవళ్లు దలఁపనైతి. 669
గీ. పొద్దుపోడుచుట యేనియుఁ గుర్తింపలేని
మొగిఁ దెలియనైతి నూర్వశీ ముషితుఁడనయి
యేండ్లు నుంబూండ్లు గడచిన నేనొకింత
నరయలేకుంటి దినముల నకటకట ! 670
గీ. పార్థివశిఖామణిని జక్రవర్తినైన, నేను క్రీడామృగంబుగా నెలఁత చేతఁ
జేయఁబడితి నింకేమి వచింతు నాదు, నాత్మసమ్మోహమున హహో! ప్రహసనమయ్యె.
గీ. చక్రవర్తిని ననుఁ బరిచ్ఛదసమేతుఁ, దృణమువలె నెట్టి యేగెడు స్త్రీని దీని
నగ్నరూపుఁడ నగుచు నున్మత్తునివలె, వెంబడించితి నేడ్చుచుం బెక్కులేల? 672
గీ. గాడిదయుఁబోలెఁ దత్పదతాడితుండ, నగుచుఁ జనియెడు తొయ్యలి ననుగమించి
చనుచునుంటిని నాదు తేజంబునుం బ్ర, భావమును బ్రాభవంబును నవమ్మలయ్యె.
గీ. స్త్రీలచే నెవ్వని మనమాకృష్టమయ్యె, నట్టి వ్యర్థుని తపము విద్యయు శ్రుతంబు
త్యాగనిరతియు మౌన మేకాంతసేవ, యిన్నియున్ నిష్ఫలంబులే యెంచిచూడ.
క. ఏనేఁ బ్రాభవమందియు మానిని యెడ, గో ఖరములమాడ్కి నయితినో
వానిని నన్నుం బండితు, మానిని స్వార్థానభిజ్ఞమహిఁ గాలుపనే? 675
గీ. పావకుం డాహుతులచేత బలె ననేక, హాయనమ్ము లూర్వశి యధరాసవంబు
నర్థిఁ గ్రోలెదునాకు నయ్యాత్మభవుఁడు, కాముఁ డొక్కింత తృప్తుండుఁ గాక యుండె.

క. వరదుం డాత్మారామే, శ్వరుఁడగు హరి యొకఁడు దక్క-పరుఁ డెవ్వఁడు నే
ర్పరియగు నరయంగఁ బోరిం, బోరిఁ గులటాపహృతచిత్తమును విడిపింపన్. 677

క. అల దేవిచే యథార్థో,క్తులఁ బలుభంగులఁ బ్రబోధితుఁడనైన మదా
విలుఁడనగు నాదు మనమం,దలి మోహముఁ దొలఁగ దవిజితాత్ముఁడనగుటన్.

సీ. రజ్జువునందు సర్పభ్రాంతిఁ గొని తత్స్వ,రూపంబు తెలియఁగా నోపనట్టి
ద్రష్ట కాఁ ద్రాఁడుచందమున నా కీకాంత, యే యపకృతిఁ జేసె నెంచిచూడ
నజితేంద్రియుండ నేనగుటఁ జేసి మదీయ,నాశంబునకుఁ గారణంబ నేన
దౌర్గంధ్యసంకలితము నశుద్ధంబు న,తి మలినమైన యీ దేహ మేడ

గీ. గొనబుగాను సౌమనస్యాదిగుణము లేడ! అక్కటా! యవిద్యాకృతాధ్యాసమిద్ది
దీనిఁ దెలియంగలేమి నిర్ధీయుతులును, మోహవారాశిలోఁ బడి మునుఁగుచుంద్రు.

వ. పితరులకును భార్యకును స్వామికిని నగ్నికిని శ్వగృధ్రంబులకును సుహృదులకును దనకును నే కళేబరంబు నిశ్చితంబు కాదో యమేధ్యంబును దుచ్ఛంబును నగు నా శరీరంబునందు మూఢు లత్యాసక్తులగుదురు. సునసంబును సుస్మితంబును నగు స్త్రీముఖంబును గని ముగ్ధులగుచుందురు. త్వఙ్మాంసరుధిరస్నాయుమేదోమజ్జాస్థిసంఘాతంబును మలమూత్రపూయంబునగు కళేబరంబున రమియించు కుమతులకును గ్రిములకును భేదం బేమి కలదు? 680

గీ. అయినను వివేకి యింతులయందు స్త్రైణులందు సంగం బొకపుడు సేయంగరాదు.
ఊరకయ విషయేంద్రియయోగమునన, మనము క్షోభిల్లు మఱి యన్యమునను
గాదు. 681

క. కనివిని యెఱుఁగని వస్తువు,నను బొడమవుగా మనంబునను భావంబుల్
మనము స్తిమితమై ప్రాణము,లను నియమింపంగ నిశ్చలత్వముఁ గాంచున్. 682

గీ. కావునను సంగ మొనరింపఁ గడఁగవలవ, దింద్రియంబులతో నలయింతులందు
స్త్రైణులందు షడ్వర్గముప్రాజ్ఞులకును, నమ్మరా దన మమ్ముబోంట్ల ననఁ నేల? 683

శ్రీకృష్ణుఁడు:—

మ. అని గానం బొనరించుచున్ నృపవరుండ యూర్వశీలోక మం
తన వర్జించి లసద్వివేకమున నాత్మారాముఁడై మించుచున్
ఘనవిజ్ఞానవిధూతమోహుఁడగుచున్ సమాసీశ్వరాలభ్యునిన్
ననుఁ బ్రాపింపఁగఁ గల్గెఁ జుమ్ము పరతుండై నేర్పుమై నుద్ధవా! 684

గీ. కాన దుస్సంగముఁ ద్యజించి కడఁక బుద్ధిశాలి సత్సంగ మొనరింపఁ జను సతంబు
సాధుజనులు హితోపదేశంబు కతనఁ, బొలుపుగా మనోవ్యాసంగమును హరింత్రు.

మ. నిరపేక్షుల్ సమదర్శులున్ సతతమన్నిష్ఠుల్ ప్రశాంతాత్ములున్
నిరహంకారులు నిష్పరిగ్రహమతుల్ నిర్ద్వంద్వులున్ నిర్మముల్
గరిమన్ సాధులు వారియం దొదవు మద్గాథల్ మహాభాగ! త
ద్వరగాథాశ్రవణంబునన్ నరుల పాపంబుల్ పునీతంబులౌ. 686

చ. మసలక యాదృతాత్ములు నమత్సరచిత్తులు శ్రద్ధధానులై
విసువక యెవ్వ రా కథల విందురొ గానముఁ జేయుచుందురో కై
వసమయి యుయ్యకొందురో తగ వారలు ఘోరభవార్ణవంబునన్
వెసఁ దరియించి నాపయి నవిస్మృతభక్తినిఁ గాంతు రుద్ధవా! 687

చ. అకలుష సుస్వరూపుఁడ ననంతగుణుండ సుఖానుభూతి రూ
పకుఁడ ననైన నాపయిని భక్తినిఁ బొందినయట్టి సాధుకో
టికి నవశిష్టమొండు పురడింపఁగఁ గానఁగ రా దిఁకెద్దియున్
సకల మనోరథంబులు సుసాధ్యములౌను సమగ్రభక్తికిన్. 688

క. దేవుండైన విభావసు, సేవించెడివారి కెట్లు శీతతమోభీ
త్యావిర్భావము కలుగదొ, యావిధి సత్సేవకుల కగు బుధవర్యా! 689

గీ. ఘోరసంసారవారధిఁ గూలి మునిఁగి, తేలుచుండెడివారికి ధీవరేణ్య!
వారి మగ్నులకున్ నౌకపగిది బ్రహ్మవిదులు సాధులాశ్రయమయి వెలయుచుంద్రు.

గీ. అన్నమే ప్రాణులకుఁ బ్రాణమార్తులకును, నేన శరణంబను గతాసులైన నరుల
కరయ ధర్మంబె విత్తమౌనురు భవాబ్ధిభీతులకు సాధువులె పరిత్రాత లెన్న. 691

గీ. సాధు లంతరదృష్టు లొసంగుచుందు, రొసఁగురవి బహిర్దృష్టి సముదితుఁడగుచుఁ
బరఁగ సాధులె దేవతల్ బాంధవులును, సాధువులె యాత్మయును నేను సాధువర్య!.

ఆ. వైరసేనుఁ డగు పురూరవుఁ డిటు గమ, నించి యూర్వశి యెడ నిస్పృహుఁడయి
సంచరించె ముక్తసంగుఁ డాత్మారాముఁ, డగుచు నీ వసుమతి యందు ననఘ!

---

## అధ్యాయము 27.

### క్రియాయోగ సంక్షేపము

ఉద్ధవుఁడు:—

సీ. భక్తులెవ్వార లేభంగి నెద్దాన ని, న్నర్చించుచుందురో యనవరతము
మాధవా! యా త్వదారాధనరూపక్రి, యా యోగమున్ దెలియం బలుకుము
నారదుండును సదాచారుండు వ్యాసుండు, నాచార్యుఁడైన బృహస్పతియును
మునులు దేనిని జెప్పుదురు నిశ్శ్రేయస, సాధనంబుగ సారెసారె కెంచి

గీ. త్వన్ముఖపయోరుహ వినిస్సృతమగు దాని
నజుఁడు భగవంతుఁ డాత్మజులగు భృగుముఖు
లైన వారికి నెఱిఁగించె నలఘుఫణితి
దేవికిం దెల్పె నా మహాదేవుఁ డర్థి. 694

ఆ. సర్వవర్ణములకు సర్వాశ్రమములకు, సొరిది నింతులకును శూద్రులకును
నిదియె సమ్మతము ప్రకృష్ట నిశ్శ్రేయసోదయము నంచు నా యెదం దలంతు.

గీ. వికచ కమలదళాక్ష! విశ్వేశ్వరేశ!, నాథ! కర్మబంధ విమోచనమగు దీని
భక్తజనుఁడ నత్యంతానురక్తుఁడనగు, నాకుఁ దెలుపుమనన్ హరి వా కొనె నిటు.

శ్రీ భగవానుఁడు:—

గీ. ఉద్ధవ! యనంత పారమై యొప్పు కర్మ, కాండమున కంతమన్న దికానరాదు
ఆనుపూర్వికముగ యథార్థంబుఁ గాఁగ, నిప్పు, డేను సంక్షేపించి చెప్పెదవిను.

గీ. త్రివిధమై వైదికంబు తాంత్రికము మిశ్ర, మనియు మత్పూజ పరగెడు నరసిచూడ
మూఁట నీప్సితవిధిచే తమూలపురుషు, నన్ను నర్చింపవలయు ననారతంబు. 698

ఆ. పూని స్వాగమోక్తమైన ద్విజత్వంబుఁ, బొంది యేవిధమునఁ బూరుషుండు
శ్రద్ధభక్తియును బొసంగఁగా నన్ను న, ర్చింపవలెనొ దానిఁ జెప్పెద విను. 699

గీ. ప్రతిమ యందొ స్థండిల మందొ వహ్ని యందొ
యుదక మందొ సూర్యుని యందొ హృదయమందొ
ద్విజుని యందొ ద్రవ్యమున భక్తియుతుఁ డగుచు
నాత్మగురు నన్ను నర్చింపనగు నమాయ. 700

ఆ. తను విశుద్ధి పొంది ధౌత దంతుండయి, తొలుత స్నానమాడవలయుఁ బురుషుఁ
డెన్న నుభయమంత్ర మృద్గ్రహణాదుల, స్నాన మాడుటది ప్రశస్తము సుమి. 701

వ. వేదచోదితంబులగు సంధ్యోపాసనాది కర్మంబులచేత మత్పూజ సత్సంకల్పుఁడై యాచరింపవలయు. శిలామయము, దారుమయము, లోహమయము, లేప్యము, లేఖ్యము, సికతామయము, మనోమయము, మణిమయంబు నని ప్రతిమ యష్ట విధంబుల స్మరియింపఁబడియె. ప్రతిమయే భగవన్మందిరంబగునని యెఱుంగునది. స్థిరంబగు ప్రతిమయందు నుద్వాసావాహనంబులచే నర్చనంబుఁ గావింపవలయు. అస్థిరంబగు ప్రతిమయందు నది వైకల్పికంబుగానగు. స్థండిలంబున నుభయంబునగు. అవిలేప్యంబగు ప్రతిమయందు స్నపనంబు యుక్తంబగు. తదితరంబునఁ బరిమార్జనంబె కర్తవ్యంబు. యథాలబ్ధంబులు ప్రసిద్ధంబులునైన ద్రవ్యంబులచేతఁ బ్రతిమాదులయందు నమాయకులై భక్తులు హృదయపూర్వకంబుగ నుదర్చఁగావిం

పవలయు. అర్చయందు స్నానాలంకరణంబు శ్రేష్ఠంబగు. స్థండిలంబునఁ దత్త్వ విన్యాసంబును, వహ్ని యందు నాజ్యప్లుతంబగు హవిస్సును, సూర్యునందు నభ్యర్హ ణంబును సలిలంబునందు సలిలాదులచే నర్చయు శ్రేష్ఠంబగు. నా భక్తునిచే శ్రద్ధోపహృతంబగు సలిలంబును, శ్రేష్ఠంబ యగు. ధూపము, పుష్పంబులు, దీపంబు, నన్నాదినైవేద్యంబును వేఱ చెప్పనేల? పరిశుద్ధుండై సంభృతసంభారుం డగుచుఁ బ్రాఙ్ముఖంబులగు దర్భలచేఁ గల్పితాసనుండగుచుఁ బ్రాఙ్ముఖంబుగాఁ గాని యుదఙ్ముఖంబుగాఁగాని యాసీనుండై యాభిముఖ్యంబునఁ బ్రతిమయందుఁ బూజఁ గావింపవలయు. కృతన్యాసమగు నా ప్రతిమను బాణితలంబునఁ బరిమా ర్జనంబు సేయవలయు. ప్రోక్షణీయంబగు కలశంబును బ్రోక్షణీయంబగు నుదకపా త్రంబును యథాతథంబుగఁ జందనపుష్పాదుల సంస్కరింపవలయు. ఆ జలం బులచేతనే దేవమందిరంబును ద్రవ్యంబులను దన్నును బ్రోక్షించుకొని మూఁడు పాత్రంబులను నుదకంబులచేతను నా యా ద్రవ్యంబులచేతను. సంపూర్ణంబులు గావింపవలయు. పాద్యార్ఘ్యాచమనీయార్థము పాత్రత్రయంబును హృదయంబున శీర్షంబున శిఖచేతను గాయత్రిచేతను నభిమంత్రింపవలయు. వాయ్వగ్ని పరిశు ద్ధంబగు దేహంబున హృత్పద్మస్థితంబగు శ్రేష్ఠంబైన యాజీవకళను ధ్యానింపవలయు. ఆత్మభూతయగు నా జీవకళచేత దేహంబు వ్యాప్తంబు కాఁగఁ దన్మయుండై సమర్చించి యావాహనంబుఁ జేసి ప్రతిమాదుల నందు స్థాపించి న్యస్తాంగుండైన నన్నుఁ బూజింపవలయు. పాద్యోపస్పర్శార్హణాదులగు నుపచారములను నాచరిం పవలయును. ధర్మాదులగు తొమ్మిదింటిచేతఁ గర్ణికా కేసరోజ్జ్వలంబును నష్టదళం బునునగు పద్మంబును నా కాసనంబుగాఁ గల్పించి యుభయసిద్ధికొఱకు నుభయవే దతంత్రంబులచేత జపింపవలయు. సుదర్శనంబును, పాంచజన్యంబును, గదయును, నసియును, బాణమును, ధనువును, హలంబును, ముసలంబును, కౌస్తుభంబును, వనమాలను శ్రీవత్సంబును ననుసరించి పూజింపవలయు. నందుని, సునందుని, గరుడుని, ప్రచండుని, మహాబలుని, బలునిఁ, కుముదునిఁ, కుముదేక్షణుని, దుర్గను, వినాయకుని, వ్యాసుని, విష్వక్సేనుని, గురువులను, సురలను, స్వస్వస్థానం బుల నభిముఖులైనవారినిఁ బ్రోక్షణాదులచేఁ బూజింపవలయు. చందనోశీర కర్పూర కుంకుమాగరువాసితంబులగు సలిలంబులచే నిత్యంబును విభవానుసా రంబుగ మంత్రంబులచే స్నానమాడింపవలయు. స్వర్ణఘర్మానువాకంబుచేతను, మహాపురుషవిద్యచేతను, పురుషసూక్తంబుచేతను, రాజనాది సామగానంబుల చేతను జపించవలయు. వస్త్రోపవీతాభరణ పత్రస్రగ్గంధలేపనంబులచే మద్భక్తుండు ప్రేమయుక్తుండై నన్ను యథోచితంబుగ నలంకరింపవలయు. పాద్యంబును,

నాచమనీయంబును, గంధపుష్పాక్షతలును, ధూపదీపనైవేద్యంబులను సర్చకుండు శ్రద్ధమై నాకు సమర్పింపవలయును. 702
గుడపాయసఘృతంబులను శష్కుల్యపూపమోదకంబులను, సంయావ దధిసూపంబులను నైవేద్యంబుఁ గావింపవలయు. అభ్యంగోన్మర్దనాదర్శ దంతధావనాభిషేచనంబులను, నన్నాద్యగీతనృత్తంబులను, బ్రత్యహంబుఁ బర్వాదినంబులందును బూజఁగావింపవలయు. శాస్త్రోక్తప్రకారంబున మేఖలావర్త వేదికలచేఁ గల్పితంబైన కుండంబున నగ్నినిఁ జేతితోఁ బ్రజ్వలింపంజేసి ప్రోగు చేయవలయును. పదంపడి యథావిధిగ దర్భలఁ బఱచి యంతటను బ్రోక్షించి యగ్నియందు ద్రవ్యములచే నన్నుంగూర్చి హోమంబుఁ జేయవలయును. తప్తకార్తస్వరసన్నిభంబులగు శంఖచక్రగదాంబుజంబులతో నొప్పారు చతుర్భుజంబులు కలవానినిఁ బ్రశాంతునిఁ బద్మకింజల్కచేలుని, స్ఫురత్కిరీటకటక కటిసూత్రవరాంగదుని శ్రీవత్సవక్షునిఁ గౌస్తుభధరుని వనమాలిని నన్ను ధ్యానించుచు హవిస్సుచే నభిఘరింపఁబడిన దారువులనుంచి యాఘారసంజ్ఞకంబులగు యాగంబులను నాజ్యభాగంబులను నాజ్యప్లుతంబగు హవిస్సును నొసంగి మూలమంత్రంబున షోడశోపచార విధానంబుల వేల్వవలయును. ధర్మాదులకొఱకు న్యాయంబును స్విష్టకృతంబునునైన భాగంబును మంత్రంబులచే సమర్పింపవలయు. ఇట్లు బుధుం డభ్యర్చనంబుఁజేసి పదంపడి నమస్కరించి పార్షదులకొఱకు బలి నొసంగవలయును. పిదప నారాయణాత్మకంబగు మూలమంత్రంబును జపింపవలయు. ఆచమనం బొసంగి విష్వక్సేనునికొఱకు నుచ్ఛేషంబును గల్పించి తదనుజ్ఞఁదరువాతఁ దాను భుజింపవలయు. అనంతరము పరిమళోపేతమైన తాంబూలాదికంబు ముఖవాసంబుగా నొసంగి మఱియును బుష్పాంజలిచేఁ బూజింపవలయు. పిమ్మట మదీయ కర్మంబులను గానంబుఁజేయుచు నృత్యంబుఁ జేయుచు స్తోత్రంబుఁజేయుచు నభినయంబుఁ గావించుచు మత్కథల వినుచు వినిపించుచు ముహూర్తకాలంబు వ్యగ్రతం బరిత్యజించి లబ్ధావసరుండు గావలయు. వివిధంబులైన పౌరాణిక స్తవంబులచేతను, బ్రాకృతస్తోత్రంబులచేతను స్తుతించి "భగవానుఁడా! ప్రసన్నుఁడవుకమ్ము" అని సాష్టాంగదండ ప్రణామంబు లాచరింపవలయును. శిరంబును మత్పాదంబుల నునిచి కరంబులచేఁ నాచరణంబు లంటి "ఓ లోకేశా! మృత్యుగ్రహార్ణవత్రస్తుండను బ్రపన్నుండ నగు నన్ను రక్షింపుము" అని వేడుకొని మద్దత్తంబగు శేషంబును సాదరంబుగా శిరంబునం దిడుకొని జ్యోతి జ్యోతియందు నుద్వాస్యంబుఁగాఁజేసి న న్నుద్వాసనంబుఁ జేయవలయు. ప్రతిమాదులయందు నెందుఁ దనకు శ్రద్ధ యుత్పాదిల్లునో యందు.

నన్నర్చింపవలయు. సర్వభూతంబులయందును సర్వాత్ముఁడనగు నే నవస్థితుండనై యుందును. ఇట్లు క్రియాయోగపదంబులఁ బురుషుం డర్చించుచు నావలన నభీప్సితంబగు నుభయసిద్ధినిబొందు. మత్ప్రతిమను బ్రతిష్ఠింపఁజేసి దృఢమగు మందిరంబును రచియింపవలయును. రమ్యంబులైన పుష్పోద్యానంబులను, బూజాయాత్రోత్సవాశ్రితంబులగు క్షేత్రాదుల నొసంగి ప్రతిదినంబును బూజఁగావింపవలయు. మహాపర్వంబులయందును బ్రతిదినంబును బూజాదుల నిర్వాహణార్థము క్షేత్రాపణపురగ్రామములనిచ్చి పురుషుండు మత్సామ్యంబువడయు. ప్రతిష్ఠవలన సార్వభౌమపదంబును, మందిరనిర్మాణంబువలన భువనత్రయంబును, బూజాదికంబువలన బ్రహ్మలోకంబును నీ మూఁడింటివలన మత్సామ్యమును బొందును. నిరపేక్షంబగు భక్తియోగంబున నన్నే పొందును. ఈవిధంబుగ నెవ్వఁడు నన్నుఁ బూజించు వాఁడు భక్తియోగంబును బడయును. ఎవఁడు స్వదత్తంబుఁగాని పరదత్తంబుఁగాని దేవతాబ్రాహ్మణవృత్తిని హరించునో వాఁడయుతాయుత వత్సరంబులు మలభోజియై జన్మింపఁగలండు. కర్తయును సహకారియుఁ గారణభూతుండును ననుమోదకుండును దత్కర్మఫలభాగులగుదురు. సారథ్యాదుల యందు నీఫలం బత్యధికంబగు. 703

---

## అధ్యాయము 28.

### —జ్ఞానయోగ సంక్షేపము—

శ్రీ భగవానుఁడు:—

సీ. ప్రకృతిపురుషులచేఁ - బరఁగు విశ్వంబు నే, కాత్మకంబుగ మదిం - గనుచు నరుఁడు
భావింపఁగఁ బరస్వ - భావకర్మంబులఁ, బొగడరా దొక్కింత - దెగడరాదు
ఏవాఁడిటు పరస్వ - భావకర్మములఁ బ్ర, శంసించు నిందించు - జగతి వాఁడు
మిథ్యాత్వమునను భ్ర - మించుటంజేసి స్వా, ర్థంబునందుండి ప్ర - భ్రష్టుఁడగును
గీ. తైజసంబగు నింద్రియో - త్కరము నిద్ర, చేతఁ బరిభూతిఁగొన నష్ట - చేతనుఁడయి
స్వప్నమో లేక సుప్తియో - పడయు జీవుఁ, బోలె నానార్థదర్శియై -
పురుషుఁడు చెడు. 704

సీ. వస్తువుకాని యీ - ద్వైతంబునకును నా, రయఁగ భద్రం బభ - ద్రంబు కలదె?
ప్రతిబింబమును బ్రతి - ధ్వనియు నాభాస గ, ల్గించు నర్థంబును - లేనివయ్యు
నట్టులు దేహాదు - లైన భావంబులున్, మృత్యుపర్యంతమున్ - భీతిఁగూర్చు
నాత్మ యొక్కటియ యి - య్యఖిలవిశ్వం బాత్మ, ప్రభువయి సృజియింపఁ - బడు
సృజించు

గీ. నెన్నఁ బాలింపఁబడును బాలించుఁ దాన, సంహరింపంగఁబడు మఱి సంహరించు
నిన్నిటికిఁగూడ నాత్మయే యీశ్వరుఁడగు, నాత్మమునకంటె నేది యన్యంబు
లేదు. 705

వ. అయినను నిర్మూలంబయ్యుఁ ద్రివిధంబైన ప్రతీతి యాత్మయందుఁ గన్పట్టు నిది
మాయచే నేర్పడిన త్రిగుణకృతంబని యెఱుంగుము. 706

గీ. జ్ఞాన విజ్ఞాన నైపుణ్య కలితమైన, యీ మదుక్తము ధీరత నెఱిఁగినట్టి
జనుఁడు నిందింపఁ డెవనిని సంస్తుతింపఁ,డర్కుఁడుంబోలె లోకమునందుఁదిరుగు.

గీ. మానవుండు ప్రత్యక్షానుమానములను, నాగమజ్ఞానమునను నాత్మానుభూతి
వైభవంబున నాద్యంతవంత మదియ,సత్యమని యెంచి తిరుగు నిస్తంద్రత నిటు.

ఉద్ధవుఁడు:—

గీ. ఆత్మకున్ లేదు లేదు దేహంబునకును,ద్రష్టృదృశ్యంబులకుఁగూడఁదలఁప లేదు
సంభవింపదుగా జడాజడములకును, సంసృతి యిఁక నెవ్వనికగుం జగదధీశ! 709

గీ. ఆత్మ యగుణంబు పరిశుద్ధమవ్యయము స్వ, యంప్రకాశ మనావృతమగ్నిఁబోలెఁ
దలఁప దేహము జడమెకా దారువవలె, నింక సంసారమియ్యది యెవ్వనికగు!

శ్రీకృష్ణుఁడు:—

గీ. ఎంతదనుక నాత్మకును దేహేంద్రియాసు,గణముతోడ సంబంధముఁగల్గునంత
దనుక నవివేకశక్తి నాత్మకును మిథ్య, యయ్యు సంసృతి ఫలవంతమగుచుఁ
బరఁగు. 711

గీ. ధీనుతా! వాస్తవంబున లేనిదయ్యు, విషయములను ధ్యానించు పూరుషునకిందు
సంసృతి తొలంగకుండును సంతతంబు, స్వప్నమందు ననర్థసంభవముఁబోలె. 712

గీ. పోల్చిచూడఁగ నప్రతిబుద్ధునకును, బహ్వనర్థకల్పక మగు స్వప్నమదియ
మేలుకొనియున్నవానికిఁ జాలనిదగు, మోహమును గలిగింపఁగా బుధవరేణ్య!

గీ. సాధువర! శోకహర్ష భీ క్రోధ లోభ, మోహ మద మత్సరాదులుం బుట్టువు
మృతి
యివి యహంకారమునకెకా కీశ్వరుఁడగు, నాత్మకునులేవుసుమ్ము రవ్వంతయేని.

వ. దేహేంద్రియప్రాణమనోభిమానుండగు జీవుండు గుణకర్మరూపుఁడై కాలవశుం
డగుచు సూత్రంబనియు మహత్తనియు బహువిధంబులఁ జెప్పంబడుచు సంసారం
బునఁ బరువులిడుచుండు. నిర్మూలంబును బహురూపరూపితంబు నగు మనోవచః
ప్రాణశరీరకర్మంబును నుపాసనానిశితమైన జ్ఞానాసిచేత ఛేదించి నిస్పృహుండై
మునీంద్రుండు భూమిం దిరుగాడుచుండు. జ్ఞానంబు వివేకంబు వేదంబుఁ దపంబును

స్వానుభవంబు నుపదేశంబుఁ దర్కంబు నివియెల్ల సత్యప్రతిపాదకంబులు. కేవలంబును గాలస్వరూపంబును హేతుభూతంబునగు నేది యీజగంబునకు నాద్యంతంబులందుఁగలదో యదియే మధ్యకాలంబునందును గలదు. హిరణ్మయాభరణంబునకుఁ బురోభాగంబునఁ బశ్చాద్భాగంబున నెట్లు హిరణ్యంబు భాసిల్లుచుండు నట్లే నానాపదేశంబుల వ్యవహరింపఁబడుచున్నను మధ్యభాగంబునందును విరాజిల్లుచుండు. నేనును నీజగంబునకు నట్టి తెఱంగున భాసిల్లుచుందును. జాగ్రదాది త్ర్యవస్థంబగు నీవిజ్ఞానంబు కారణకార్యకర్తృరూపంబగు గుణత్రయమయంబై యుండు. అన్వయంబునను వ్యతిరేకంబునను మఱియావస్థచే నదియె సత్యంబగు. ఏది యాదియందును నంతమందును లేకుండెనో యది మధ్యంబున వ్యపదేశమాత్రంబ కాని వాస్తవంబున లేదు. ఇతరముచేఁ బ్రకాశితంబయిన యది తద్రూపంబయగునని నానిశ్చయంబు. లేనిదయ్యును వైకారికంబైన రాజససృష్టి యేది తోఁచుచున్నదియో యది స్వయంజ్యోతియగు పరబ్రహ్మ పరిణామంబ కాని యన్యంబు కాదు. ఇట్లు బ్రహ్మజ్ఞానహేతువులచే విశారదుండైన పురుషుం డాత్మసందేహంబును ద్రెంచి స్వానందపరితుష్టుండై సమస్తేంద్రియంబులనుండి యుపరతుండగు. పార్థివంబగు శరీరంబును దేవతలును బ్రాణంబులును వాయుజలాగ్నులును మనంబును బుద్ధియు సత్త్వంబును నహంకారంబును నాకాశంబును భూమియు శబ్దాది విషయంబులును బ్రకృతియు నాత్మకానేరవు. మత్స్వరూపంబును బొందిన వానికి సమాహితంబులగు గుణాత్మక కరణంబులచే నేమిగుణంబగు? మేఘంబులు కప్పినను విప్పినను సూర్యుని కేమిదూషణంబగు? వాయ్వగ్ని జలపృథివీగుణంబులతోడను గతాగతంబులగు ఋతుగణంబులతోడను నభం బెట్లు సక్తంబు కాదో యట్లే యక్షరపరబ్రహ్మంబును సంసృతిహేతువులగు సత్త్వరజస్తమోగుణంబులతోఁ దగులంబునొందదు. కావున మాయా రచితంబులగు గుణంబులయందు సంగంబు పరివర్జనీయంబు. దృఢమైన మద్భక్తియోగంబున మనఃకషాయంబగు రజోగుణంబు నిరసింపవలయు. ఆమయంబు లెస్సగఁ జికిత్సఁ జేయంబడినదయ్యు నరులకు మరల మరల నెట్లు మొలకలెత్తునో యట్లే మనంబునం దపరిపక్వంబైన కలుషకర్మము సంగియగు కుయోగిని వేధించు. మనుష్యకృతంబులుఁ ద్రిదశకృతంబులు నగు నంతరాయంబులచే నే కుయోగులు నిహతులగుదురో వారు పూర్వాభ్యాస బలంబున మరల యోగంబునఁ గూడుదురు కాని కర్మతంత్రులుకారు 715

ఎవనిచేతనైనను బ్రేరేపింపఁబడి మరణపర్యంతంబు దేహి కర్మంబు నాచరించుచు వికృతిం బొందు. విద్వాంసుండు దేహమునందున్నను గర్మంబునన్ వికృతిం బొందక యాత్మసుఖానుభూతిచే నివృత్తతృష్ణుండగు. నిలిచియున్నను గూర్చున్నను

నడుచుచున్నను శయనించినను మూత్రించుచున్నను నన్నమును భుజించుచున్నను స్వభావప్రాప్తంబగు దర్శనస్పర్శనాదికంబగు నన్యకర్మం బాచరించుచున్నను నాత్మస్థబుద్ధియగువాఁడు దేహంబునెఱుంగకుండు. నానావిధంబులైన ననుమానంబులచే విరుద్ధంబై యాత్మవ్యతిరిక్తంబైన యసదింద్రియార్థంబును జూచుచున్నను మనీషి మేల్కన్నపిమ్మటఁ దిరోహితంబగు స్వప్నవృత్తాంతంబునుం బోలె వాస్తవంబుగాఁ దలంపఁడు. పూర్వగృహీతంబగు గుణకర్మంబుల చిత్రింబైన యజ్ఞానకార్యంబగు దేహేంద్రియాదిలక్షణంబు నాత్మారోపితంబై గ్రహింపఁబడినను జ్ఞానంబున నివర్తించు. ఆత్మ యేరూపంబునను గ్రహింపఁబడదు. భానూదయంబు తమంబును నరచక్షువుల కెట్లు పోఁగొట్టునో యట్లు కలిగింపదు. ఇట్లు నిపుణమైన మత్సమీక్షజరిగిన నది పురుషబుద్ధితమిస్రంబును నివారించును. ఇది స్వయంజ్యోతియు నజంబును నప్రమేయంబును మహావిభూతియు సకలానుభూతియు నేకంబును నద్వితీయంబును నగు పరమాత్మస్వరూపంబు. దీన వాక్ప్రాణంబులు నివర్తింపఁబడు. కేవలంబగు నాత్మంబునందు దేహబుద్ధి యేదికలదో యదియ యాత్మసమ్మోహంబు. ఆత్మంబుదక్క మఱొం డవలంబనేదియు దేనికిని లేదు. నామరూపంబులచే నుపలక్షితంబగు పంచభూతాత్మకంబైన ద్వైతం బబాధితంబని పండితమానుల వ్యర్థంబైన యర్థవాదము. అపక్వయోగుఁడైన యోగికి యోగంబునం బ్రవర్తించు కాయంబు రోగాద్యుపద్రవంబులచేఁ బరిభవింపఁబడు. అక్కడ నీ ప్రతీకారంబు విధింపఁబడె. యోగధారణచేతను గొన్నింటిని, ధారణాన్వితంబులైన యాసనంబులచేఁ గొన్నింటిని, దపోమంత్రౌషధంబులచేఁ గొన్నింటిని, రోగాద్యుపద్రవంబులను నివారించుకొనవలయు. మఱికొన్నింటిని మదనుధ్యానంబున నామసంకీర్తనాదుల యోగేశ్వరానువృత్తిని నశుభప్రదంబులగు నుపద్రవంబులను బాపుకొనవలయును. కొందఱు కోవిదులు జరారోగాది రహితంబును దారుణ్యవయస్కంబునుగా నీదేహంబును భావించి నానావిధోపాయంబుల సిద్ధికొఱకు యోగంబును బూనుదురు. కాని యది ప్రాజ్ఞులచే నాదరణీయంబు కాదు. వృక్షంబునకు ఫలంబుంబోలె నాత్మకు శరీరం బధ్రువంబు కావునఁ దజాయాసంబును వ్యర్థంబ. యోగంబును సేవించు పురుషునకు దేహంబు నిచ్చలు జరారోగాది రాహిత్యంబును బొందినను మతిమంతుండు మత్పరంబగు యోగంబును విసర్జించి దానిని విశ్వసింపరాదు. యోగి మదుపాశ్రయుండై యీ యోగచర్య నాచరించుచు నిస్పృహుండును నాత్మసుఖానుభవుండు నగుచు నంతరాయంబులచే నిహతుండు గాకుండు— 716

## అ ధ్యా య ము 29.

### భక్తియోగ సంక్షేపము

ఉద్ధవుఁడు:—

క. అవశీకృతాత్మునకు నీ, పరివిణుత యోగము సుదుశ్చరమని తలఁతుఁ గే
శవ! పురుషుండెట్టులు సి,ద్ధివడయునది నాకు వేగ దెలుపంగదవే. 717

క. నలినాక్షా! యోగాభిర, తులు మనము నిగ్రహింపఁ దొడరుచు నది కే
వలమున్ లోఁగొన రామికి, నలసటఁ గొనుచుంద్రు కాదె? యఖిలాధీశా! 718

శా. సారాసార విచారకోవిదులు హంసశ్రేష్ఠు లంభోజనా
భా! రమ్యంబు సుఖావహంబునగు నీపాదాబ్జమున్ భక్తిమై
నారాధించి తరింత్రుగా భువన నాథా! యోగకర్మాభిమా
నారూఢాత్ములు మేలు పొందరటు త్వన్మాయా పరాభూతులై. 719

శా. నీవే దిక్కని కొల్చుదాసులను మన్నింం తీ వటం టబ్రమే
దేవా! యాశ్రిత బాంధవా! త్రిభువనాధీశోరుకోటీరకో
టీవిభ్రాజిత పాదపీఠుఁడవు తండ్రీ! నీవు సత్సఖ్యమున్
గావింపంగఁ గడంగవా కొ్కమృగసంఘాతంబుతో నో ప్రభూ! 720

మ. సకలాత్మ ప్రియనాయకున్ నిను బ్రజాసర్వార్థ సంధాయకున్
స్వకృతజ్ఞుండగు వాఁడెవండు విడువంజాలున్ క్షణంబేని వే
ఱొకనిన్ క్షుద్రఫలానుభూతికయి తానుల్లంబులోఁ గొల్చునే
యకటా! త్వచ్చరణాశ్రియంబె కద? మూలాధారమా నెల్లకున్. 721

ఉ. వేయు నిఁకేల చెప్పఁగఁ గవీంద్రులు త్వత్కృతముం దలంచి బ్ర
హ్మాయువు చేతనైన నకటా! యనృణిత్వముఁ బొందలేరు దే
వా! యనిశంబు నీవు బహిరంతర భాగములన్ గురుండవై
పాయక చేతనాత్మకతవర్తిలి ప్రోతువు గాదె మాధవా! 722

శ్రీశుకుఁడు:—

తరల. అనుచు నిట్లనురక్తమాన సుఁడైన యుద్ధవుచేతఁ గం
జ నయనుండు జగద్వినోది స్వశక్తిచేతఁ ద్రిమూర్తులన్
గొనినయట్టిఁడు దేవదేవుఁడు కూర్మిమీఱఁగఁ బృష్టుఁడై
యనియెఁ బ్రేమ మనోహరస్మితుఁడౌచు నాతని కీగతిన్. 723

శ్రీకృష్ణుఁడు:—

ఉ. ఉద్ధవ! నేను నీకతి శుభోదయదాయి మదీయ ధర్మమున్
బద్ధతిమీఱ నిప్డు డభివర్ణనఁ జేసెద నాలకింపుమా

శ్రద్ధఁ దలిర్ప మర్త్యుఁడు నిరంతర మా శుభధర్మమున్ లస
ద్బుద్ధి నొనర్చినన్ గెలుచుదుర్జయ ఘోరదురంత మృత్యువున్. 724

క. వినుమః మదర్పితచిత్తుం, డును మద్ధర్మాభిరక్తుఁడు నయి నరుం డా
త్మను నను దలఁచుచు నాకై, పొనరింపఁగవలయుఁ గర్మములు నన్నింటిన్. 725

గీ. సతము మద్భక్తులగు సాధుజనులతోడఁ, జెన్నెసఁగు పుణ్యతీర్థముల్ చేరవలయు
దేవదానవ మానవాదికగణముల, నాదుభక్తుల కర్మలన్ గైకొనఁదగు. 726

గీ. వేఱుగాఁగాని సంఘీభవించి కాని, గీత నృత్తాది రాజవిభూతుల నభి
రామముగ దివ్యవర్ష యాత్రామహోత్స, వాదులన్నాకునై సలుపంగవలయు.

గీ. అఖిల భూతంబులన్ బహిరంతరముల, యందుఁ బూర్ణుండనగుచు నపావృతుండ
నైన యాత్మను నన్నుఁదానాత్మఁగాంచ,వలయు నమలాత్మకుండై నభంబువోలె.

మ. ప్రమతీ! యీగతి జ్ఞానమూర్తియయి మద్భావంబునన్ సర్వభూ
తములన్ భావనసేయుచున్ బ్రియముతోదర్శించుచున్ బ్రాహ్మణో
త్తమునిన్ బుల్కసు స్తేను విప్రహితు మార్తాండున్ స్ఫులింగంబు న
క్రిము శాంతున్ సమదృష్టిఁ గాంచు నతఁడేగా పండితుం డారయన్. 729

గీ. నరులయందు మద్భావ మనారతంబుఁ, గూర్చి భావించు పురుషునకునఘాత్మ!
స్పర్థయునసూయయున్ దిరస్కారబుద్ధి,మఱియహంకారమున్ క్షణమాత్రఁ జెడును.

ఆ. తను హసించు సఖులఁద్యజియించి దైహిక, దృష్టి నుజ్జగించి హ్రీని విడిచి
సాగిలపడి భువి శ్వచండాల గో ఖరం, బులకు నీశబుద్ధి మ్రొక్కవలయు. 731

క. ఎందనుక సర్వభూతము, లందున్ మద్భావ ముదయమందదొ యనఘా!
యందనుకఁ బూరుషుఁడు పూ,నందగు నీక్రియను వాఙ్మనః కాయములన్. 732

క. సమునకు బ్రహ్మాత్మకమై, యమరున్ సర్వంబు విద్యనాత్మ గతిన్ బ్ర
హ్మమ్ముఁగను చెల్లెడ నతఁ డువ, రమించుఁ గర్మములనుండి గ్రంధులు సడలన్.

మ. స్థితబుద్ధీ! విను సర్వకల్పముల సధ్రీచీనమా సర్వభూ
త తతిన్ లెస్సఁగ వాఙ్మనః క్రియల మద్భావంబునం గొంట సు
వ్రత! మద్ధర్మము నాశమంద దిదియున్ బ్రారబ్ధమై సుంత ని
శ్చితమయ్యెంజుమి నిర్గుణత్వమున నాచే నిద్ది నిష్కామికిన్. 734

గీ. అమరకోటికి నేని దుర్గమమయి తన,రారు యీ బ్రహ్మవాద సంగ్రహము నీకు
వరుస సంక్షేపముగ సప్రపంచముగను, ధీమణీ! యుద్ధవా! యిట్లు తెలుపఁబడియె.

గీ. ఉద్ధవా! యతివిస్పష్టయుక్తి కలిత,మైన జ్ఞానము నిగదితమయ్యె నీకు
దీనిఁబురుషుండెఱింగిసందియము లెల్లఁ,దొలఁగబంధవిముక్తిఁబొందునుధ్రువంబు.

క. నీ యడిగిన ప్రశ్నమునకు, నీయఁబడె సదుత్తరంబు హితమతిఁ బురుషుం
డీయది తెలియన్ గుహ్యా మ,మేయమునగు బ్రహ్మపద మమృతుఁడై పొందున్.

క. ఏవాఁడు నాదుభక్తుల, కీవిద్యన్ బుష్కలముగ నిచ్చునొ మదిలో
భావింప నేను జ్ఞానదుఁ,డా వానికి నాత్మ నుండ నగుదును వింటే. 738

క. పరమపవిత్రంబును గదుఁ, బరిశుద్ధము నైన దీనిఁ బఠియించినఁ జె
చ్చెర జ్ఞానదీపమున నను, దరిసింపఁగఁ జేయు చపుడతఁడు పూతుఁడగున్. 739

క. ఏనరుఁ డవ్యగ్రుండై, దీనిని నాయందు భక్తి దీటు కొలుపుచున్
దాను గడు శ్రద్ధ వినునో, యా నరుఁ డురుకర్మముక్తుఁ డగును దసంతన్. 740

క. చెలువుఁడ! యుద్ధవ! నీచేఁ, దెలియంబడె నయ్యా! స్ఫుట గతిన్ బ్రహ్మ మిఁకన్
దొలఁగెనె నీహృదయము నం,దలి మోహము శోకమున్ వినష్టములగుచున్.

సీ. వినుము దీనిని దాంభికునకు నాస్తికున, కశుశ్రూషువునకు నీచునకు శఠున
కవినీతమతికి నుద్ధవ! యభక్తున కీయ, వలవ దేతద్దోషవర్జితుండు
బ్రహ్మణ్యుఁడును బ్రియవర్తనుండును సాధు, వర్యుఁడు శుచియునౌ వానికెలమి
దెలుపంగఁ దగు భక్తిగలరేని శూద్రయో, షిజ్జనములకును జెప్పఁగనగు
గీ. దీనిఁ దెలిసిన వారికిఁ దెలియఁదగిన, దన్యమెద్దియుఁ గానరాదరసి చూడ
సుధను గ్రోలిన వారికిసుంతయేనిఁ, గ్రోలఁదగినదియేది మిగులదు కాదె! 742

వ. జ్ఞానంబునందును, గర్మంబునందును, యోగంబునందును, వార్తయందును, దండధారణంబునందును నరులకు యావన్మాత్రంబగు నర్థంబు కలదో చతుర్విధంబగు తావన్మాత్రంబగు నర్థంబు నీకు నేనయని యెఱుంగుము. మర్త్యుం డెప్పుడు త్యక్తసమస్తకర్ముఁడై మదర్పితాత్ముఁడగునో యప్పుడ నాచే నమృతత్వంబును బొందింపంబడి మత్సామ్యంబుం బడయు. 743

శ్రీశుకుఁడు:—

చ. స్థిరతరయోగమార్గమును దెల్ప గ్రహించిన యుద్ధవుండు శ్రీ
వరు వచనంబు వేడ్కఁ గొలుపన్ విని ప్రీత్యుపరుద్ధకంఠుఁడై
స్ఫురదురుసమ్మదాశ్రుపరిపూర్ణవిలోచనయుగ్ముఁడౌచు వే
కరయుగళంబు మోడ్చి పలుకంగ నశక్తత నుండె నత్తఱిన్. 744

చ. ప్రణయరసాభిఘూర్ణమయి వర్తిలు చిత్తము నొయ్య ధీరతా
గుణమునఁ జిక్కఁబట్టి తనకుం జరితార్థత నెంచికొంచుఁ జే
రణఁకువతోఁ దదీయచరణాబ్జముల న్నిజశీర్షమంటగాఁ
బ్రణతులొనర్చి యాపగిదిఁ బల్కెఁ గృతాంజలియై మురారికిన్. 745

ఉద్ధవుఁడు:—

మ. ఘనమా తావకసన్నిధానమున నుదగ్రిస్ఫూర్తి నన్నావరిం
చిన వ్యామోహమయాంధకారము నశించెన్ దోన విచ్ఛిన్నమై
వనజాతేక్షణ! తిగ్మభానుఁడు సమీపస్థుండుఁగాఁగాఁ దమం
బును శీతంబు భయంబు నేకరణి నోపున్ బాధ కల్పింపఁగన్. 746

శా. ఐనన్ దేవ! దయామయాత్ముఁడవు నీవై యిచ్చియుం టిష్ట వి
జ్ఞానాత్మోజ్జ్వల సుప్రదీపకళికన్ నాకున్ గృతజ్ఞుం డెవం
డైన న్నీ చరణాబ్జమూలమును బాయం జూచి యిం కన్యమున్
దీనుండై శరణంబునొందునొకొ చింతింపంగ లోకేశ్వరా! 747

మ. నిజమాయాగతి సృష్టివృద్ధికొఱకై నీచే నధీశా! యధో
క్షజ! వృష్ణ్యంధకభోజసాత్వతులపైఁ గల్పింపఁగాఁబడ్డ ధృ
త్యజరూపంబగు స్నేహపాశమిది యాత్మజ్ఞాన హేతిక్షతిన్
వృజినౌఘుంబులతోడుతన్ క్షణమునన్ విచ్ఛిన్నమయ్యెంజుమీ. 748

క. నీ యడుగుఁదమ్మియం దన, పాయిని యగు రతినొసఁగి ప్రపన్నుఁడనగు న
న్నీ యెడ శాసింపఁగదె మ, హాయోగీ! నీకివే మదభివందనముల్. 749

శ్రీభగవానుఁడు:—

చ. అనవుడు వాసుదేవుఁడు దయంబున నిట్లను వాని కుద్ధవా!
చనుమిఁక మన్నియోగమున సమ్మతిమై బదరీసమాఖ్యమై
యెనయు మదాశ్రమంబునకు నీవట మత్పద తీర్థతోయమం
దును దగ స్నానపానములఁ దుష్టినిఁ జెంది విశుద్ధినొందుమా. 750

సీ. అలకనందానదీసలిలవీక్షోద్ధూత, పాపపంకుండవై వల్కలములఁ
గట్టి వన్యములైన కందమూలాదుల, నారగించుచు నిస్పృహతఁ బరఁగుచు
ద్వంద్వముల్ సైచుచు భవ్యశీలుండవు, సంయతేంద్రియుఁడవు శాంతుఁడవయి
ఘనసమాహితబుద్ధి జ్ఞానవిజ్ఞానయు, క్తుఁడవౌచు మచ్ఛిక్షితోరుగతిని

గీ. స్మరణఁజేయుచు నాయందమనసు వాక్కు, నిల్పి మద్ధర్మరతుఁడవై నీవు కడఁకఁ
ద్రిగుణరూపకగతులఁ నతిక్రమించి, యవల నుద్ధవ! ననుఁ బడయంగఁగలవు. 751

శ్రీశుకుఁడు:—

చ. అని హరిమేధుఁడైన హరి యానతి నీయఁగ నాలకించి యా
తనికిని మూఁడుమారులుఁ బ్రదక్షిణముం బొనరించి యడ్గుదో
యినిఁ దలఁజేర్చి యార్ద్రహృదయేరితుఁడై సుఖదుఃఖదూరుఁడ
య్యును బృథులాశ్రుపూరముల నుద్ధవుఁ డోడిచె నిర్గమంబునన్. 752

ఉ. ఆ హరిపీడఁజాలక స*మాకులమానసుఁడై సుదుస్త్యజ
స్నేహవియోగకాతరతఁ *జెందుచు నుద్ధవుఁ డీశుఁడైన యా
శ్రీహరి పాదుకల్ తనదు * శీర్షమునన్ ధరియించి సారెక
వ్యాహతభక్తి బ్రొక్కుచుఁ ద*దాజ్ఞ మెయిన్ జనె నెట్టకేలకున్. 753

చ. పదపడి శ్రీహరిన్ హృదయ*భాగమున న్నెలకొల్పి భక్తకా
మదుఁడు జగద్విభుండు నగు * మాధవుచే నుపదిష్టమైన యా
బదరిక కేగి యుజ్జ్వల త*పంబొనరించి మహత్త్వమొప్పు త
త్పదవినిబొందె నా పరమ*భాగవతుండగు నుద్ధవుండటన్. 754

మ. అల యోగీశ్వర సేవితాంఘ్రికమలుం*డై యొప్పు శ్రీజాని కే
వల మా భాగవతోత్తమోద్ధవునకున్ * వాక్రుచ్చియున్నట్టి పు
ష్కలమోదాంబుధి సంభృతంబగు ఘన * జ్ఞానామృతం బెవ్వఁడి
మ్ముల సేవించునో వానిమూలమున ని*ర్ముక్తంబగున్ లోకమున్. 755

మ. భ్రమరంబుంబలె వేదకర్త హరి పూ*ర్ణజ్ఞాన విజ్ఞానసా
రము వేదామృతసారమున్ భవభయా*ర్చాటంబు దీర్పంగొనెన్
అమృతం బంబుధినుండిపొందె నుభయం * బాత్మీయులన్ గ్రోలఁజే
సె మహాత్మున్ బురుషోత్తముం గొలుతు నా * శ్రీవిష్ణు రోచిష్ణునిన్. 756

---

## అధ్యాయము 30.

### యదుపంశ నాశనము

పరీక్షిత్తు :—

చ. వరమునిసత్తమా! పరమ * భాగవతుండగు నుద్ధవుండు తా
నరిగినయంత ద్వారవతి * యందిఁక నేమి యొనర్చె శౌరి యా
వరమునిశాపదగ్ధము స్వ*వంశము కాఁగ సమస్తలోచనో
త్కరములకున్ బ్రియంబగుచుఁ * గ్రాలు స్వదేహమువీడె నేగతిన్? 757

సీ. చానలు దామెందు * సంలగ్నమగుచూడ్కి, మరలింపఁగా నస*మర్థులై రో
పీనులఁ జొచ్చి స*న్మానసలగ్నమై, యచ్చోటనుండి యే * యదివెడలదో
ఎద్దాని శోభ వ*ర్ణింపం గవీంద్రుల, నుడుల నుల్లాస మి*బ్బడిఁ బెరిగెనో
పార్థు రథంబునఁ * బరఁగు దేనినిఁగని, యని హతుల్ తత్సామ్య*మును బడసిరో

గీ. అట్టి త్రిభువనమోహన*మైనరూప, మెట్టిపరిణతిఁగనెఁ దుది*నెఱుఁగఁజెపుమ
వినఁగుతూహలమయ్యె న*మ్మనమునందు, ననిన నృపునకు శుకుఁడు న*య్యమున
ననియె. 758

శ్రీశుకుఁడు:—

గీ. దివిని భువి నభ్రమున సముత్థితములైన, నురుతరోత్పాతములఁ గని హరి సుధర్మ
యందు నాసీనులైన యయ్యాదవులను, నెల్లరం బోడఁగాంచి తానిట్లు వలికె. 759

శ్రీకృష్ణుఁడు:—

చ. ఇవె యదువీరులార! ఝుళిపించుచుఁ గాలుసిడంబులై యుప
ద్రవములు పెక్కుఁ దోచెడినిద్వారవతీ నగరిన్ దురత్యయం
బవు ద్విజశాపమొందు మనయన్వయమున్ గ్రసియింపనుండె న
ట్లవుట వసింపరాదు మనకారయ నొక్కముహూర్తమే నిటన్. 760

క. నారులు బాలురు వృద్ధులు, ద్వారవతీపట్టణంబు వదలియు శంఖ
ద్వారమ్మునకుం జెచ్చెరఁ, జేరంగావలయును యదుశేఖరులారా! 761

క. దురితగతితో మనము సర, స్వతిప్రత్యగ్గతిని నెచటఁ బ్రవహించునో యా
నుతిభాజనమైన ప్రభా, సతీర్థరాజమ్ముఁ జేరఁ జనుదమురండీ. 762

సీ. అందుఁ దీర్థములాడి యందఱమును మనము పరిశుద్ధులమయి యుపవసించి
యట స్నపనాలేపనార్చనంబులచేత, జేజేల నెల్లఁ బూజింతమట్ల
గోభూహిరణ్యవాసోభద్రగజవాజి, రథవేశ్మములతోడ బ్రాభవమున
నర్చింతమెలమిస్వస్త్యయనముల్ ప్రీతి సల్పఁగ మహాభాగుల బ్రాహ్మణులను

గీ. నీ విధి యరిష్టహరము భద్రావహంబు, భూతములలోన దేవతా వ్రాతగోద్వి
జార్చనమ్ము యదూద్వహులార! యాత్మఁ, దలఁచిచూడఁగఁ బరమపదప్రదంబు.

చ. అని తన కానతిచ్చిన మురారి నుడుల్ యదువృద్ధులెల్లవా
రును విని వల్లె యంచును నరోత్తమ! నావలనెక్కి వేగిరం
బెనయుఁ బ్రభాసతీర్థమున కేగి యటన్ యదుదేవునాజ్ఞ శో
భనయుతకర్మముల్ పరమభక్తి నిసల్పి రనల్పబుద్ధులై. 764

ఉ. ఏయది గోలినంత భ్రమియించునో మానస మట్టిదైన మై
రేయకమద్యమున్ యదువరేణ్యులు దైవహతస్వభావులై
పాయక తావితోన మధుపానమదాధికదృప్తచిత్తులై
యాయెడ నొండొరుల్ జగడమాడిరి శ్రీహరిమాయ గ్రమ్మఁగన్. 765

శా. హాలాపానమదాతిరేకమున స్వీయాంగంబు లుప్పొంగ న
వ్వేలన్ గ్రోధపరీతచిత్తులగుచున్ వీరాగ్రణుల్ యాదవుల్
గేలన్ జాపకృపాణముద్గరగదల్ కీలించి లోకత్రయా
భీలప్రక్రియఁ బోరుసల్పిరి కృధావేశమ్ము దీపింపఁగన్. 766

చ. అమితచలధ్వజాన్వితములౌ రథ సామజవాజిగోఖరో
ష్ట్రమహిషగాజు లుద్భటభటాళులు నశ్వతరాదికంబులున్
గములుగఁ గూర్చి కొట్టుకొనఁగా సమకట్టిరి వారలెల్ల దం
తముల మదావళంబులు వనంబునఁ బోలెను దుర్మదాంధులై. 767

సీ. సమరోర్వీరూఢమత్సరులు ప్రద్యుమ్నసాంబులు మఱి యక్రూరభోజపతులు
ననిరుద్ధసాత్యకులును సుచారుగదులు, గరిమ సుభద్రసంగ్రామజితులు
ధైర్యశాలులు సుమిత్రాసురథులుఁ గూడి, పోరుసల్పిరి యతిఘోరముగను
గడఁక వైభిపదోల్ముక సహస్రజిచ్ఛత, జిద్భానుముఖ్యులున్ శ్రీశుమాయ

గీ. నతి విమోహితులై దుర్మదాంధకార, కలితులై ఘోరజన్యరంగంబునందు
నొండొరులఁ గూడ ముట్టియుద్దండత మెయిఁ, గొట్టుకొనఁగఁ గడంగిరి కురువరేణ్య!

వ. మఱియు దాశార్హభోజాంధకవృష్ణిసాత్వతులును మాధుర శూరసేనులును వితర్జనులుఁ గుకురులుఁ గుంతులు మద్రులు సౌహార్దంబును విడిచి యొండొరువులఁ గొట్టుకొనిరి. కొడుకులు తండ్రులతోఁ బోరఁ దొడంగిరి. భ్రాతలును భాగినేయులును దౌహిత్రులు పితృవ్యులు మాతులులు నగువారితో యుద్ధమొనర్చిరి. మిత్రులు మిత్రులతోడను, సుహృదులు సుహృదులతోడను, జ్ఞాతులు జ్ఞాతులతోడను మూఢబుద్ధులై కలహింపఁ దొడంగిరి. శరంబులు భగ్నంబులు కాఁగ ధనువులు ధ్వంసంబులగుడు శస్త్రంబులు క్షీణంబులగుడు నేరకాముష్టులఁ బ్రహరించుకొనిరి. ఆ యేరకాముష్టులును వజ్రకల్పంబులయ్యె. పదంపడి ముష్టులన్ బరిఘులఁ దాల్చి కృష్ణునిచే నివారింపఁబడియు నాతనిపై ద్వేషభావంబుఁ బూని కొట్టనుద్యోగించిరి. మఱియు మోహావిష్టులై బలభద్రునిఁ గూడ తమ్మెదుర్పు వానిఁగా నెంచి యాతతాయులై హననోన్ముఖులై పైఁబడవచ్చిరి. అంత వారును నతిక్రుద్ధులై యుద్యమించి యేరకాముష్టిపరిఘాధరులై యుద్ధంబునఁ జరించుచుఁ బ్రహరించిరి. 769

క. ద్విజశాపోపహతు లధో, క్షజమాయావృతులునై నకష్టులకున్ వం
శజవహ్ని వనముఁ బలె, దుస్త్యజమగు క్రోధంబు వంశహానిం గూర్చెన్. 770

క. ఇట్టులు స్వకులులు సర్వులు, గిట్టఁగ నిశ్శేషముగ నక్షితిభర మెల్లన్
నెట్టంబడె నంచపుడా, దిట్ట జనార్దనుఁడు తన మదిం దలపోసెన్. 771

క. వారాంనిధిపృథువేలన్, బౌరుషయోగంబుఁ బూని బలరాముం డా
త్మారాము నాత్మ నాత్మం, జేరిచి నరలోకముం ద్యజించె నరేంద్రా! 772

క. బలరాముని నిర్వృతిఁ గని, యల భగవంతుండు శౌరి యదుదేవుఁడు పి
ప్పలమూలాశ్రితుఁడై భూ, స్థలిఁ దూష్ణీభావమున నిషణ్ణుండయ్యెన్. 773

క. లలితచతుర్భుజమగు రూ, పాలయఁగ నిర్ధూమవహ్నియుంబోలె దిశా
వలయంబు వితిమిరముగన్, సలుపుచు వెలుఁగొందె లోకనాథుం డంతన్. 774

సీ. శ్రీవత్సలాంఛనస్థేము మేఘశ్యాముఁ, గల్యాణధాము లోకాభిరాము
మకరకుండల లసన్మణికిరీటోపేతుఁ, గౌశేయవసనయుగ్మపరివీతుఁ
దప్తకార్తస్వరదీప్తవర్చస్కుఁ గౌస్తుభయుతోరస్కు భాసురయశస్కు
సురుచిరస్మితమనోహరవదనాంభోజు, మార్తాండసన్నిభమహిత తేజు

గీ. హారనూపురముద్రాసమంచితాంగు, లలితవనమాలికాఢ్యు విలాసకలితు
బ్రహ్మసూత్రకకటిసూత్రభాసమానుఁ, బుండరీకాక్షునిఁ బురాణపురుషుఁ గృష్ణు.

గీ. ఆకృతిం గొన్నయట్టి నిజాయుధములఁ, బరఁగుచుఁ జతుర్భుజుండయి పంకజారు
ణమగు వామపదము దక్షిణమగునట్టి, యూరువునను జేరిచి కూరుచున్నవాని.

చ. జరుఁ డను లుబ్ధకుండు మృగశంక మెయిన్ ముసలావశేషలో
హరచితసాయకంబున మృగాననరూప తదంఘ్రి నేసి యా
పురుషుఁ జతుర్భుజుం దెలిసిపోయి కృతాఘుఁడు కాన భీతుఁడై
శిరమున నామురద్విషుని శ్రీయుత పాదయుగంబునం బడెన్. 777

ఉ. ఏ నెఱుఁగంగలేక యొనరించితి నిట్టి మహాపరాధమున్
దీనులపాలివాఁడవగు నీవు ననున్ క్షమియింపు మో ప్రభూ!
మానవకోటికెల్ల గరిమన్ యదమస్మరణంబు దుర్భరా
జ్ఞాన తమోఘ్నమా భుజగశాయికి నీ కఘముం బొనర్చితిన్. 778

క. కావున మృగలుబ్ధకు దు, ర్భావుని శిక్షింపు నన్ను వైకుంఠా! నే
నీవిధి నదతిక్రమమును, గావింపకయుందు లోకకల్యాణకరా! 779

చ. అజుఁడును రుద్రముఖ్యులు తదంగభవుల్ మఱి వేదదర్శు ల
క్కజముగ నీదుశక్తి నెఱుఁగంగ నశక్తులటన్న నో యధో
క్షజ! భవదీయమాయ నలసత్వముఁ జెందినయట్టి పాపయో
నిజులము మేమిఁకన్ దెలియ నేర్తుమె త్వద్విచికీర్షితార్థమున్. 780

శ్రీకృష్ణుఁడు:—

క. ఓయి జర! లెమ్ము జడియకు, నా యభిమతకార్యమే యొనర్చితి సుకృతా
త్మాయతనమైన స్వర్గము, నా యాదేశమునఁ జయ్యనం జను మిపుడే. 781

శ్రీశుకుఁడు:—

క. అని భగవంతుఁడు లీలా, మనుజుఁడునగు కృష్ణుచే సమాదిష్టుండై
ఘను హరి ముమ్మరు వలఁగొని, చనియె విమానమున బోయ స్వర్గమ్మునకున్. 782

సీ. నృపవర! దారుకుండంత శ్రీకృష్ణుజాడ, నెమకుచున్ మందమారుతాసేవితమైన
తులసి నెత్తావి మూర్కొని తెలిసి దాన, హరికి నాభిముఖ్యంబున నరిగె నరిగ.

ఉ. శ్రీకలితోజ్జ్వలాయుధపరీవృతుఁడై సువిశాల పిప్పలా
నోకహ మూలమే తనకు నూత్న గృహంబుగఁ జేసికొన్న లో
కైకవిభున్ హరిన్ బరముఁ గన్గొని తేర్దిగి స్నేహపారవ
శ్యాకలితుండు బాష్పభరితాత్ముఁడునై పడియెన్ బదంబులన్. 784

దారుకుఁడు:—

చ. అమృతగభస్తి యస్తమయమందునుబోలె భవత్పదారవిం
దముఁ గనఁజాలనట్టిదగు నాదగు దృష్టి మహాతమఃప్రవి
ష్టమయి వినష్టమయ్యె నకటా! యిఁక దిక్కులెఱుంగకుంటి వి
శ్వమున నొకింతయేనియును శాంతినిఁ బొందకయుంటి నోప్రభూ! 785

క. అని దారుకుఁ డీవడువున, ననుచుండన్ గరుడలాంఛనాంచితరథమొ
య్యన సాశ్వధ్వజమై యెగ, సె నభంబున కతఁడుఁ గనఁగ క్షితితలనాథా! 786

క. ఆ రథము వెంటఁజనె థా, త్రీరమణా! విష్ణుదేవు దివ్యాయుధముల్
ఆరీతి కబ్బురంపడు, దారుకుఁ గని శౌరి యివ్విధంబునఁ బలికెన్. 787

శ్రీభగవానుఁడు:—

క. ద్వారవతికిఁ బొమ్మిఁక నో, దారుక! జ్ఞాతులమిథోవధమ్మును మఱి యా
సీరాయుధ నిర్యాణము, వారక నా దశయుఁ దెల్పు బంధుజనులకున్. 788

క. ద్వారకను స్వబంధువులగు, మీరలు నిలువందగదు సుమీ క్షణమేనిన్
బారావారము దేల్చుచు, నారయ మత్త్యక్తమైన యాదవపురమున్. 789

క. తమతమ పరిగ్రహము స, ర్వముఁగొని నా పితలునెల్ల వారిం దప్రప్ర
స్థము బొందు త్వరితగతితో, నమరాధీశ్వరతనూభవాన్వితులగుచున్. 790

గీ. దారుకా! నీవు నింక మద్ధర్మముఁగొని, జ్ఞాననిష్ఠాత్ముఁడవు నుపేక్షకుఁడవునయి
క్రమముమీఱ మన్మాయా విరచితమైన, దీని నెఱిఁగి యాత్మ నుపశాంతినిఁ
బడయుము. 791

శ్రీశుకుఁడు:—

క. అని తెలుపంబడి తా వల, గొని శౌరికి సారెసారెకున్ మ్రొక్కులు పె
క్కొనరిచి తత్పదములు శిర, మునఁ దాకియుఁ బురికినేగె శోకకలితుఁడై. 792

## అ ధ్యా య ము. 31.

### —శ్రీకృష్ణ నిర్యాణాభివర్ణనము—

శ్రీశుకుఁడు:—

సీ. అంత నటకువచ్చి ƒ రబ్జభవుండు భ, వానీసమన్వితుఁడైన భవుఁడు
శక్రప్రముఖులైన ƒ సర్వదేవతలు ప్ర, జేశ్వరయుతులు మునీశ్వరులును
పితృసిద్ధగంధర్వ ƒ విద్యాధరోరగ, చారణ యక్షరక్షస్తతులును
ద్విజ కిన్నరాప్సరోవ్రజములు శ్రీకృష్ణ, నిర్యాణదర్శన ƒ నిరతులగుచుఁ
ఆ. బరమభక్తియుక్తి ƒ హరిజన్మకర్మలఁ, బాడుచుం బొగడుచు ƒ వరవిమాన
చయముతోడ నభము ƒ సంకులపఱచుచుఁ, గురిసి రెల్లయెడలఁ ƒ గుసుమవృష్టి.
చ. హరి భగవంతుఁ డాత్మవిభుఁ ƒ డాత్మవిభూతుల వారినెల్లఁ జె
చ్చెరఁగని యాత్మ నాత్మమునఁ ƒ జేర్చి కనుంగవమూసి లోకసుం
దరమగు స్వీయదేహమును ƒ దగ్ధముఁజేయక యోగవహ్నిచే
స్ఫురదురుయోగధారణను ƒ బొల్చుచుఁ జేరె స్వకీయధామమున్. 794
గీ. మొరసె దివి దుందుభులు పూలమొత్తములును
గురిసె వ్యోమంబునుండియా ƒ హరినిఁగూడి
ధరణి నెడఁబాసి సత్యంబు ƒ ధర్మము ధృతి
కీర్తియున్ శ్రీయు వెంటనేగె న్నరేంద్ర! 795
గీ. బ్రహ్మ ముఖ్య దేవాదివర్గంబులెల్లఁ, దగ నవిజ్ఞాతగతియై స్వధామమునకు
వెడలి చను కృష్ణు నత్యంతవిస్మితులయి, చూడఁజాలకపోయిరి క్షోణినాథ! 796
ఆ. అభ్రమండలంబుఁ ƒ ద్యజియించి వెస నాక, సంబునందుఁబోవు ƒ శంపగతిని
మనుజు లెఱుఁగనట్టు ƒ లనిమిషకోటులు, నెఱుఁగఁజాలరైరి ƒ కృష్ణుగతిని. 797
క. హరి యోగగతికినై య,బ్బురపాటును గొనుచు నతనిఁ ƒ బొగడుచు నా తా
మరసభవ భవాదులు నో, ధరణీశ్వర! చనిరి స్వస్వధామమ్ములకున్. 798
చ. కువలయనాథ! యా పరునకుం దనుభృజ్జననాత్యయాది చే
ష్ట వితతమాయచే నగు విడంబనమే యనుచున్ దలంపు న
ట్టువునకుఁబోలె నాత్మ నతఁడున్ జగమున్ సృజియించి యందుఁ బొం
ది విహృతిఁజేసి కూలిచి తుదిన్ విరతింగొను స్వీయశక్తిచేన్. 799
చ. నరవర! మర్త్యవిగ్రహమునన్ హరి యా యమలోకనీతునిన్
గురుసుతుఁదెచ్చెఁ బ్రోచె శరణుండయి నిన్ బరమాస్త్రదగ్ధుఁ దా
నరవడి యంతకాంతకుని ƒ నుగ్రునిగెల్చె సదేహు వ్యాధుఁ జె
చ్చెర దివికంపె నట్టిఁడగు ƒ శ్రీహరి స్వావనమం దశక్తుఁడే? 800

ఉ. ఐనను సర్వలోకనివహస్థితి సంభవనాశహేతువున్
మానిత సర్వశక్తి లసమానుఁడునౌ హరి లోకనాథుఁ డీ
మానవదేహమున్ స్వమహిమన్ నిలుపంగఁ దలంపఁడయ్యె భూ
జానివరా! స్వకీయులకు స్వాత్మగతిన్ దగఁ జూపఁగోరుచున్. 801

క. ఈ కృష్ణుని పరమగతిన్, వేకువ నెవ్వాఁడు లేచి వినియత మతియై
యేకాంతభక్తిఁ బొగడునొ, ప్రాకటముగ నాతఁడా పరమగతిఁ బడయున్. 802

గీ. దారుకుఁడు హరిపంపు ద్వారకకును, జేరి యల వసుదేవోగ్రసేనుల చర
ణములవ్రాలి శుగశ్రుపూరములు వెల్లి, విరియఁ బరిపించితములుఁగావించెనంత.

క. సాకల్యంబుగఁ దెలిపెన్, భూకాంతా! వృష్ణినిధనమున్ విని జనముల్
శోకవిమూర్ఛితులైరట, నాకులపాటులు తమ హృదయములఁ గలంపన్. 804

క. విగతాసువు లగుచున్ జ్ఞా, తిగణము లెచ్చోట భూపతితులైరో వగం
బొగులు చటకుఁ జేరిరి శీ, ఘ్రగతిన్ జను లెల్ల హరివిరహవిహ్వలులై. 805

గీ. దేవకియు రోహిణియు వసుదేవుఁడు నటఁ,దనయులన్ గృష్ణరాములఁ గనక వగల
స్మృతినిఁ గోల్పోయిరవల నచ్యుత వియోగ, యాతనాతురులై వీడిరసువులనట.

క. సతులెల్లరు నటఁ దమతమ, పతులఁ గవుఁగలించి చితులపయి నెక్కిరి రా
జతిలక! రామునిపత్నులు, పతిదేహముఁ గౌఁగలించి పడి రనలమునన్. 807

సీ. పార్థివ! వసుదేవుపత్నులుఁ దద్గాత్రి, మొగి హరిస్నుషలు ప్రద్యుమ్న ముఖ్య
నిజపతితనువులం జేరిచి కౌఁగిటన్, గడఁకఁ జొచ్చిరి పావకంబునందు
నంత రుక్మిణ్యాదులగు కృష్ణసతులుఁ, దదాత్మకలై జొచ్చిరగ్ని యందుఁ
గ్రీడి యాత్మసఖుండు ప్రియుఁడు నౌ శ్రీకృష్ణు, విరహభారమ్మున విహ్వలుఁడయి

గీ. కృష్ణగీతోక్తులను నూరడించి కొనియెఁ
దొడరి తనుదాన నష్టగోత్రులు హతులగు
బంధులకు నెల్లఁ జేయించెఁ బరఁగ సాంప
రాయికమ్ము యథావిధిం గ్రమముతోడ. 808

మ. ధరణీనాయక! యచ్యుతావసథమున్ దప్పించి యాలోన శ్రీ
హరి సంవర్జితమైన ద్వారవతి నయ్యంభోధి ముంచెన్ దృటిన్
స్మరణన్-బాపహమున్ శుభంబునగు శ్రీమన్మందిరంబందు నా
పరుఁడౌ కృష్ణుఁడు నిత్యసన్నిహితుఁడై వర్తించె దీవ్యద్గతిన్. 809

గీ. అంతట ధనంజయుండు హతావశేషులైన స్త్రీ బాలవృద్ధ చయమ్ములఁ గొని
పోయి పేర్మి నింద్రప్రస్థపురవరంబుఁ,జేర్చి యందు వజ్రుని నభిషిక్తుఁ జేసె. 810

గీ. పార్థివా! నీపితామహుల్ బంధువధముఁ, బార్థువలన నాకర్ణించి వంశధరునిఁ
గాఁగ నిన్నను నెలకొల్పి గరిమమీఱు, నందఱున్ బొందిరోజ మహాపథంబు.

ఆ. దేవదేవుఁడైన యాదవాసుదేవుని, జన్మకర్మములను శ్రద్ధతోడ
నెవఁడు కీర్తనమ్ముఁ దవిలి కావించునో, యపుడ యఘవిముక్తుఁ డగు నతండు.

చ. ప్రభువర! యిట్లిహమ్మునఁ బరమ్మున భద్రముఁ గూర్పఁ జాలు శ్రీ
విభు రుచిరావతార పృథువీర్యములు న్నవశైశవ క్రియా
విభవములు న్నిరంతరము విస్మృతిలేక స్మరించుచో నరుం
డభయదుఁడైన యట్టి హరియందు వినిర్మలభక్తి చెందెడున్. 813

గద్యము.

శతావధానులు, ఉభయభాషాప్రవీణులు, 'శ్రీరామనృసింహమూర్తి
కవులు' అను గంధం శ్రీరామమూర్తి, ఇట్టింకి నరసింహామూర్తు
లచే రచింపఁబడిన శ్రీమదాంధ్రభాగవతమున
ఏకాదశ స్కంధము సంపూర్ణము.

శ్రీరస్తు.

శ్రీరామకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్రభాగవతము

## ద్వాదశ స్కంధము

### అధ్యాయము 1.

భవిష్యన్నరపాలాద్యభివర్ణనము

రాజు:—

గీ. మునివరా! యదువంశ విభూషణుఁడగు, కృష్ణుఁడు స్వధామమునకు నేగినపదపడి
పృథ్వి నెవ్వనివంశంబు విస్తరిల్లె, విశదపఱుపు నాకిది విన వేడ్కయయ్యె. 1

శ్రీశుకుఁడు:—

గీ. రాజ! బార్హద్రథుండు పురంజయుఁడన, నంతిముఁడగును శునకాఖ్యుఁ డతని మంత్రి
స్వామినివధించి ప్రద్యోతసంజ్ఞుఁ బుత్రుఁ, బ్రభునిఁ జేయుఁ దత్తనయుఁడు బాలకుండు.

గీ. పుత్రుఁడగును విశాఖయూపుఁ డతనికిని, వానిసుతుఁడగు జనకుండు వానికొడుకు
నందివర్ధుఁడగు న్నరనాథ! వీర, లైదుగురును బ్రద్యోతనులనఁ బడుదురు. 3

గీ. ఏలుదురు నూటముప్పదియెన్మిదేండ్లు, వీరు పృథుశక్తి నీ పృథివీ తలంబు
నందివర్ధునకగు శిశునాభుఁడనెడి, కొడుకు వానికిఁ గాకవర్ణుఁడు సుతుఁడగు. 4

గీ. క్షేమధన్వుఁ డాతనిపట్టి క్షేత్రజుండు, క్షత్రధర్మజుఁ డతనికి సంభవించు
నతనికిన్ విధిసారుండు సుతుఁడగు మఱి, వానికి నజాతశత్రుండు సూనుఁడగును. 5

గీ. దర్భకుఁడు తత్సుతుండగు దర్భకునకు, నందనుం డజయుండగు నందివర్ధ
నుండు తత్పుత్రుఁడగు మహానందియనెడి, పేరివాఁ డాతనికిని కుమారుఁడగును.

గీ. జనవరా! వీరలుపదుండ్రు శైశునాభు, లనఁగఁ జనుదురు మున్నూటయరువదేండ్లు
మీ నృపాలురు వసుమతి నేలఁగలరు, కలియుగంబున నో కురుకుల వతంస! 7

గీ. నరవరోత్తమ! యామహానందిసుతుఁడు, శౌర్యఘనుఁడు శూద్రాగర్భసంభవుండు
బలయుతుండు మహాపద్మపతియనఁబడు, నందుఁడు సకలక్షత్రవినాశకుఁడగు. 8

వ. నాటంగోలె నృపాలురు శూద్రప్రాయులు, నధార్మికులు నగుదురు. 9

క. అనఘ! యనుల్లంఘితశా, సనుఁడు మహాపద్ముఁ డపరజమదగ్ని సుతుం
డనఁ దనరుచు నేకచ్ఛత్రనుగా నేలఁగలఁ డీ ధరాస్థలి నెల్లన్. 10

క. అతనికి సుమాలిముఖ్యులు, సుతులెనమం డ్రుద్భవింత్రు క్షోణిప! వారల్
శతవత్సరములు దర్పో, ద్ధతి మీఱఁగ ననుభవింత్రు ధర నేలికలై. 11

క. అవనిం గడువిఖ్యాతుల, నవనందుల ద్విజుఁ డొకఁడు విప్రనాశ మొనర్చున్
నవనందులు మడియఁగ నను, భవింత్రు మౌర్యులు సమస్తవసుమతినిఁ గలిన్. 12

గీ. ఆ ద్విజుఁడె చంద్రగుప్తుని నాత్మగుప్త, రాజ్యమం దభిషేకించు రాజచంద్ర!
చంద్రగుప్తసుతుఁడు వారిసారుఁడగును, వానికిఁ దనూభవుఁ డశోకవర్ధనుఁడగు.

గీ. సుయశుఁ డతనికిసుతుఁడగు సుయశునకును,సంయుతుండుసుతుండగు సంయుతునకు
శాలిశూకుఁడు పుత్రుఁ డా శాలిశూకు, నకును సోమశర్మాఖ్యుఁడు నందనుఁడగు.

క. వీరు పదుండ్రును మౌర్యులు, భూరిమహిమఁ గలిని నూట ముప్పది యేడేం
డ్లో రాజచంద్ర! ధరణిన్, దా రుపభోగింత్రు రాజధర్మనిరతులై. 15

గీ. మౌర్యుని బృహద్రథున్ బిల్కుమార్చి కలిని
నతని సేనాపతియగు శుంగాహ్వయుండు
పుష్యమిత్రుఁడు స్వయముగఁ బానికమెయి
నెల్ల విశ్వంభరారాజ్య మేలఁ గలఁడు. 16

వ. ఆ పుష్యమిత్రున కగ్నిమిత్రుండు నతనికి సుజ్యేష్ఠుఁడు నతనికి వసుమిత్రుండు వానికి భద్రుండును వానికిఁ గళింగుండును వానికి యోగుండును వానికి ధ్వజమిత్రుండును వానికి దేవహూతియుఁ బొడమంగలరు. 17

క. దశశుంగులు వారలు వ, ర్షశతాధిక మనుభవింత్రు జగతినిఁ బిదపన్
వశయగుఁ గణ్వులకున్ బా, లిశులకు విశ్వంభరాస్థలి కురుశ్రేష్ఠా! 18

గీ. భూవరా! శుంగుఁ గాముకుం దేవహూతిఁ, జంపి కణ్వుండు వసుదేవసంజ్ఞకుఁడగు
నాతనియమాత్యుఁడీ మేదినీతలంబు,స్వయముగా నేలఁగలఁడు ప్రాభవమున మీఱ.

గీ. అతనిపుత్రుఁడు భూమిత్రుఁ డతనిసుతుఁడు, పరఁగు నారాయణుఁడనఁ గణ్వాయనులగు
వీరు కలియుగాన ననుభవింతురధిప!, యిలను మున్నూట నలువదేండ్లు గరిమ.

గీ. కాణ్వుఁడైన సుశర్మఁ బోకార్చి యతని, భృత్యుఁ డాంధ్రజాతీయుఁడు వృషలుఁడుతమి
గొంతకాల మసాధువై కువలయమ్ము, ననుభవింపఁగలండు నృపాగ్రగణ్య! 21

గీ. వానిపిమ్మటఁ గృష్ణాఖ్యుఁడైన యతని, భ్రాత నేతగాఁ గలఁడు విశ్వంభరకును
అతని కుమారకుండు శ్రీశాతకర్ణుఁ, డతనికిం బౌర్ణమాసుఁ డాత్మజుండు. 22

వ. పౌర్ణమాసునకు లంబోదరుండు, నతనికి శిబిలకుండు వానికి దండమానుండును, వానికి నరిష్టకర్మ్ముఁడును, వానికి హాలేయుండును, వానికిఁ దిలకుండును, వానికిఁ

బురీష సేతుండును, వానికి రాజైన సుదర్శనుండును, వానికిఁ జకోరుండును, వానికిఁ జరముఁడగు శివస్వాతియు, నతనికి గోమతియు, నతనికిఁ బురీమంతుండును, వానికి వీరుండును, వానికి వేధుండును, నతనికి శివుండును, వానికి స్కందుండును, వానికి యజ్ఞశీలుండును, వానికి సితుండును, వాని కసితుండును, వానికి శ్రుతస్కంధుండును, వానికి యజ్ఞశత్రుండును నుద్భవింపఁగలరు. యజ్ఞశత్రునకు విజయుండును నతనికి భావ్యుండును, వానికిఁ జంద్రబీజుండును, వానికి సులోమధీనాముఁడు నుద్భవింతురు. 23

క. విను ముప్పందుఱ్ఱు నృపాలకు, లనువుగ నన్నూటయేఁబదాఱేండ్లు ధరి
త్రిని గరిమ ననుభవింతురు; సునిశితమగు ప్రజ్ఞతోడఁ గ్షోణీరమణా! 24

వ. ఆవభృతి యను నగరమునకు నతిలోలుపులైన సప్తాభీరులును దశగర్దభులును షోడశ కంకులును గ్రిమ్మలు రాజులు కాఁగలరు. అనంతరం బెనమండ్రు యవనులును, బదునల్వురు బర్బరులును, బదుముప్వురు మురుండులును, బదునొక్కండ్రు మౌను లును నీవసుంధరను వేయుందొంబదితొమ్మిదియేం డ్లనుభవింతురు. ఏకాదశ మౌనులు మున్నూఱేం డ్లవని ననుభవింపఁగలరు. భూతనందుండు, నవంహారుం డును, శిశునందియుఁ ద ద్భ్రాతయగు యశోనందియు బ్రవీరకుండునుంగూడి భూమిని నూటయాఱేం డ్లుపభోగింపఁగలరు. భూతనందాదులకు యథాయథం బుగఁ బదుముప్వురు బాహ్లికులు పుత్రులు కాఁగలరు. పదంపడి పుష్యమిత్రుండు రాజగు. అతనికొడుకు దుర్మిత్రుండు, సప్తాంధ్రులు, సప్తకోసలులు నేకకాలికులై వైదూర్యపతులగుదురు. తదనంతరంబు నైషధులు రాజులగుదురు. మాగ ధంబులకు విశ్వస్ఫూర్జనాముఁ డపరపురంజయుఁ డగుచు రాజు కాఁగలండు. అతండు బ్రాహ్మణాదివర్ణంబులఁ బుళింద యదు మద్రికులగా నొనర్పఁగలఁడు. అతండు పద్మవతీపురిని నివసించుచు దుర్మతియై వీర్యవంతుండగుచు క్షత్రంబును బెల్లగించి ప్రజల నబ్రహ్మణ్యాభూయిష్ఠులుగా స్థాపింపఁగలండు. గంగా ద్వారంబు మొదలు ప్రయాగపర్యంతంబుఁ గల భూమి ననుభవింపఁగలండు. సౌరాష్ట్రావంతి కాభీర శూ ద్రార్బుద మాళవరాజు లుపనయనరహితులై శూద్రప్రాయులగుదురు. వేదాచారశూన్యులై శూద్రులును, నంత్యజులు మున్నగువారును, మ్లేచ్ఛులును సింధుతీరభాగంబును జంద్రభాగానదీప్రాంతం బును గాంచీపురంబును గాశ్మీరమండలంబును ననుభవింపఁగలరు. తుల్యకాలికు లైన రాజులు మ్లేచ్ఛప్రాయులు, నధర్మపరులు, ననృతవాదులు, తీవ్రక్రోధులు, నిస్సారులు నగుదురు. మఱియు స్త్రీ, బాల, గో, ద్విజఘ్నులు, పరదార ధనా సక్తులు నల్పసత్త్వులు, నల్పాయుష్కులు, నపరిష్కృతులు క్రియాహీనులు

రజస్తమోవంతులునై రాజన్యరూపులగు మ్లేచ్ఛులు ప్రజలం బీడింపఁగలరు. దుష్ట నాథులై జానపదములును, దచ్ఛీలాచారవాదులై పరస్పరము రాజులచేఁ బీడింపఁ బడి క్షయంబుఁ బొందుదురు. 25

---

## అధ్యాయము 2.

### కలియుగధర్మ కల్క్యవతారాది ప్రతిపాదనము

శ్రీశుకుఁడు:—

సీ. తదనంతరమ్ము బ్రహ్మహామును ధర్మంబు, సత్యంబు శౌచంబు క్షమయు దయయు
బలము నాయువు స్మృతి కలికాలమహిమచే, నశియింపఁగలవు భూనాథతిలక!
కలిని ధనంబె మర్త్యులకు జన్మాచార, గుణ సమభ్యుదయ కారణమగుఁజుమీ
ధర్మనీతివ్యవస్థలకు బలంబె ప్ర, ధానహేతువుగాఁగఁ దనరుచుండు
గీ. అభిరుచియయగు దాంపత్యమందు హేతు
వగును వాక్చాతురతయ వ్యావహారికమున
స్త్రీత్వమునఁ బుంస్త్వమునఁ గామచింతయ యగు
బ్రాహ్మణతకుఁ గారణము సూత్రంబయగును. 26

వ. అన్యోన్యాపత్తికారణంబగు చిహ్నంబ యాశ్రమప్రతీతికి హేతువగు. ఆవృత్తిచే న్యాయ దౌర్బల్యంబగు. బహుభాషణంబె పాండిత్యంబగు. అనాఢ్యత్వమ యసాధుత్వంబగు. ఆఢ్యత్వంబె సాధుత్వంబునకు హేతువగు. 27

సీ. కల్యాణమన్న స్వీకారమే యగునెన్న, స్నానకర్మంబు ప్రసాధనంబ
దూరస్థితంబైన నీరాకరంబు తీ, ర్థంబగు కేశధారణము సొబఁగు
కుక్షింభరత్వమగుం బురుషార్థంబు, సభ్యత్వమనఁగ ధార్ష్ట్యంబయగును
స్వకుటుంబ భృతియ దక్షత్వమనంబడు, ధర్మసేవయు యశోర్థంబె యగును
గీ. ఇట్లు దుష్టప్రజాసముపేతమైన, వసుమతీమండలమునకుఁ బ్రసభగతిని
బ్రహ్మవిట్క్షత్ర శూద్రవర్ణంబులందు, బలియుఁడగువాఁడె ప్రభువుగాఁ బరఁగఁ
గలఁడు. 28

గీ. నిర్ఘృణుల్ దస్యుధర్ములున్ బిశునులైన, క్రూరరాజులచే నిజదార ధనము లపహృతంబులుగాఁగఁ బ్రజాలి వెడలి, పోవుదురు గిరికాననంబులకు బెదరి. 29

గీ. ప్రజ లనావృష్టిదోషంబువలనఁ జేసి, శాక కందమూలామిష క్షౌద్ర ఫల సు మాష్టి భోజనులగుచుఁ దారై నశింత్రు, వికృతదుర్భిక్ష సంజ్వరపీడితులయి. 30

గీ. ప్రబల శీతవాతాతపవర్షములను, నాధులన్ వ్యాధులన్ క్షుత్తృడాదికముల
నొండొరులచేతఁ దాపంబునొందుచుంద్రు, కలియుగంబునఁ బ్రజలెల్లఁ గౌరవేంద్ర!

వ. మఱియుఁ గలియుగంబున నరులకు ముప్పది, యిరువదియేండ్లు పరమాయువగు. 32

సీ. కలిదోషమునఁ జేసి కలశరీరుల శరీ, రములెల్ల క్షీయమాణములు కాఁగ
వర్ణాశ్రమాచారవంతుల వేదదృ, ష్టమగు ధర్మంబు నష్టంబు గాఁగ
ధర్మంబు పాషండకర్మకీర్ణముఁ గాఁగ, సకలరాజులు దస్యుసములు కాఁగ
నరులు చౌర్యాది నానావిధరూపక, దుర్వృత్తి కలితచిత్తులును గాఁగ

గీ. వర్ణములు శూద్రతుల్యతఁ బడయ మొదవు
లజము లట్టులు కాఁగఁ బుణ్యాశ్రమములు
గృహములట్టులు కాఁగ నూహింప బాంధ
వాళులును జూడ స్యాలులయట్లుఁ గాఁగ. 33

వ. మఱియు నోషధులు శ్యామాకప్రాయంబులు కాఁగ, వృక్షంబులు శమీప్రా
యంబులు కాఁగ, మేఘంబులు తటిత్ప్రాయంబులు కాఁగ, గేహంబులు శూన్య
ప్రాయంబులు నగు. 34

మ. నరు లీభంగి ననహ్యధర్ములగుచున్ నష్టాత్ములౌచున్ గలి
స్ఫురణన్ మానిచి ధర్మరక్షణవిధంబున్ బొందుగాఁ జేయ శ్రీ
హరి జన్మించుఁ జరాచరేశుఁడు గురుం డాద్యుండునై యొప్పు శ్రీ
ధరు జన్మంబగు ధర్మగుప్తికయి భక్తాభీష్ట సంసిద్ధికై. 35

గీ. శంబలగ్రామ ముఖ్యుఁడున్ సాధులోక, విశ్రుతుఁడు బ్రాహ్మణుఁడునైన విష్ణుయశు ని
కేతనంబునఁ దాను గల్కియను పేర, విష్ణుదేవుండు ప్రాదుర్భవింపఁగలఁడు. 36

శా. అష్టైశ్వర్య గుణాన్వితుండు హరి లోకాధీశ్వరుం డాశ్రితా
భీష్ట శ్రీదుఁడు దేవదత్తము మహావేగంబునౌ యశ్వమున్
హృష్టాత్ముండయి యెక్కి కత్తిఁ గొని ధాత్రీమండలిం దిర్గుచున్
దుష్టశ్రేణుల రాజచిహ్నధరులన్ దున్ముం బ్రభావాఢ్యుఁడై. 37

చ. హతులగు దస్యులెల్ల మడియంగను శార్ఙ్గధరాంగరాగపు
ణ్యాతర సుగంధమారుతము లంటుటఁ బాపవిముక్తులై శుచి
వ్రతులగు పౌరజానపదరాజుల మానసముల్ శుభంబులై
యతివిశదంబులౌచు వెలయుంగల వాపయి రాజసత్తమా! 38

సీ. వాసుదేవుఁడు భగవంతుఁడు సత్త్వరూ, పుఁడునగు హరి హృదిఁ బొసఁగియుండ
నవ్వారలకు స్థూలమైన ప్రజాసృష్టి, సంభవింపఁగలదు జనవరేణ్య!
పరమాత్ముఁడును ధర్మపతి హరి కల్కిరూ, పంబున నెప్పుడు ప్రభవమొందు
నప్పుడ కృతయుగంబగుఁ బ్రజాసంతతి, యును శుద్ధసత్త్వగుణోదయమగు
గీ. చంద్రుఁడున్ సూర్యుఁడున్ బృహస్పతియు నెపుడు, పుష్యనక్షత్రమునఁ బొత్తు పొసఁగ నేక
రాశియందుందురో యప్డె రాజచంద్ర!, కృతయుగంబు రాఁగలదు సంకేతమిద్ది.
క. కడచిన భూపాలుర ని, ప్పుడు వర్తిలు పార్థివులను భూనాయక! యే
ర్పడ భావిరాజులను జె, ప్పడ నుడివితి సోమసూర్య వంశోద్భవులన్. 40
వ. రాజా! భవజ్జన్మ మారంభించి నందాభిషేక పర్యంతంబు నగు కాలంబు వేయు
న్నూటపదేను సంవత్సరంబులు. సప్తర్షులలో నెవ్వరు పూర్వోదితులై కన్పట్టు
దురో వారినడుమ సమదేశావస్థితమయినట్టి నక్షత్రంబుతోఁగూడి ఋషులు
మానవసంవత్సరశతంబుందురు. త్వదీయకాలంబునం దిప్పుడు ఋషులా మఘా
నక్షత్రంబు నాశ్రయించియుండిరి. భగవంతుండైన విష్ణుదేవుని యంశభూతుం
డగు కృష్ణుం డెప్పుడు దివంగతుండయ్యె మనఃకలుషకారియగు కలి యప్పుడ
లోకంబునఁ జొచ్చె. 41
గీ. ఎంతదనుక రమాహృదయేశ్వరుండు, తన శుభోదయ పాదపద్మములచేతఁ
దాకుచుందిరుఁగాడె నంతదనుక వసుధ, నాక్రమింపఁగఁ గలి చాలఁడయ్యెనధిప!
గీ. సప్తదేవర్షులెప్పుడు సంచరింత్రో, మఖలయం దప్పుడే గరిమంబుమీరఁ
దాను ద్వాదశవర్షశతాత్మకుండు, కలిపురుషుఁడు ప్రవృత్తుఁడై యిలఁ జెలంగు. 43
ఆ. ఎప్పుడు మఘలనుండి ఋషులు పూర్వాషాఢ, జేరికొంద్రో యపుడె కౌరవేంద్ర!
నందునుండి మొదలు పొందు నభ్యుదయభా, గ్యంబు నంతకంతఁ గలిపురుషుఁడు.
క. ఏ దినమునఁ ద్రిదివమునకు, యాదవవిభుఁడైన కృష్ణుఁడరిగెనొ రాజా!
యా దినమందుననె కలియు, గాది సమారబ్ధమయ్యెనండ్రు మునీషుల్. 45
వ. చతుర్థంబగు దివ్యాబ్దసహస్రాంతంబునఁ గృతయుగంబు రాఁగలదు. అప్పుడు
నరుల కాత్మప్రకాశనంబగు. ఎట్లు భువి రాజవంశంబులు చెప్పంబడె నట్ల ప్రతియు
గంబున విప్రవిట్శూద్రవంశంబులు జ్ఞేయంబులు. కథావశిష్టులు నామచిహ్నులు
నగు మహాత్ముల కీర్తిమాత్రము నిల్చియుండు. శంతనుభ్రాతయగు దేవాపియు
నిక్ష్వాకువంశజుండగు మరువును మహాయోగబలాన్వితులై కలాపగ్రామంబున
నివసింపంగలరు. వాసుదేవానుశిక్షితులగు వారిరువురుఁ గలియుగాంతంబునం

జేరి ధర్మంబును దొల్లిటియట్ల ప్రథితంబుఁజేయఁగలరు. కృతము, త్రేత, ద్వాపరము, కలి యని యుగములు నాలుగు. ఈక్రమయోగంబున పిభుండు ప్రాణుల యందు వర్తించు. రాజా! నాచేత నీరాజులు తెల్పంబడిరి. అట్ల యితరరాజులును భూమియందు మమతనుంచి యంతంబున దీనిం ద్యజియించి నిధనంబు నొందిరి. రాజనామదేహంబునకును గ్రిమి విట్ భస్మసంజ్ఞయగు. తదర్థంబై భూతద్రోహియగువాఁడు స్వార్థంబేమియెఱింగె ? భూతద్రోహంబువలన నిరయంబ యగు. అజ్ఞులు పావకతోయాన్నమయంబగు కాయంబును, నాత్మత్వంబున గ్రహించి భూమియందును మమతనుంచి తుదకు నుభయంబును ద్యజించి నిధనంబుం గనిరి. 46

గీ. రాజచంద్ర! యేయేరాజులలోజమునను, క్షితివలయమును ననుభవింపచిరో స్వశక్తి వారలెల్లరునుం గాలవశముచేత, క్షీణులై నామమాత్రావశిష్టులైరి. 47

---

## అధ్యాయము 3.

### యుగలక్షణవిస్తారము

శ్రీశుకుఁడు:—

చ. తనకయి గెల్పునొంద నెడదం గడు వ్యగ్రతనొందు భూపులన్
గని హసియించు భూమి తమకంబున నగ్గెలువంగ మృత్యుక్రీ
డనకులు రాజులెల్ల నకటా! గమకింతురు ఫేన తుల్యమౌ
తనువును నమ్మియుంట వితథంబగు వీరల కోర్కు లన్నియున్. 48

మ. అరిషడ్వర్గము ముందుఁగా గెలిచి రాజామాత్య పౌరాప్త శే
ఖరులన్ హస్తిపులన్ వశీకృతులుగాఁ గావించి ప్రత్యర్థులన్
వెరవొప్పంగ వెలార్చి రాజులిటు లుర్విన్ సాగర ప్రావృతన్
బోరి నిర్జింతుమటన్న యాసను గనంబో రంతికస్థాంతకున్. 49

గీ. అకట! సాగరమేఖలనైన నన్ను, గెలిచియుం గొంద ఱురుమోహజలధిజొత్తు రాత్మవిజయంబున కిదెంతయరయఁగ ఫల, మాత్మవిజయంబునకు ముక్తి యబ్బునుగద. 50

క. నను మనువులుఁ దత్పుత్రకు, లును విడిచియ వచ్చినట్టులు చనిరి కులవ ర్ధనులయ్యు నీఁక నబుద్ధులు, ననిమొన నను గెలువనెంతురతి శోచ్యముగన్. 51

క. పితృపుత్రభ్రాతలస, న్మతులయి రాజ్యంబునన్ మమత హెచ్చఁగ ను ద్ధతితోడ మదర్థంబయి, యతిఘోరమ్ముగ నొనర్తురని నొండొరువుల్. 52

క. 'ఈ యఖిల వసుంధరయును, నాయదియే నీకులేదు నను జడ!' యని నా
కై యొండొరులన్ దూఱుచు, మాయురె! కొట్టుకొని కడఁక మడియుదు రయయో!

సీ. ధీరులు పృథువు పురూరవుండును గాధి, యును భరతుండు నహుషుఁడు నర్జు
నుండు మాంధాత రాముండును సగరుండు, ఖట్వాంగ దుందుమారగయ రఘువులు
శంతనుండు యయాతి శర్యాతి తృణబిందుఁ, డు నృగ భగీరథులును గకుత్థ్సుఁ
డలనైషధుండుఁ గువలయాశ్వుఁడు హిరణ్యకశిపుండు వృత్రాఖ్యగల దితిజుఁడు

గీ. నముచి శంబర రావణ నరక తార, కాఖ్యులును హిరణ్యాక్షుండు నన్యులైన
దైత్యులును రాజులును శౌర్యధనులు ఘనులు, నగుచు సర్వవిజేతలై నెగడిరియును.

గీ. మర్త్యధర్ములు వార లమర్త్యనగుచుఁ బరఁగు నాయందు మమతను బరపి దుస్స
హమగు కాలంబుచే నకృతార్థులగుచుఁ, జిట్టచివరకును గథావశిష్టులైరి. 55

ఉ. జానగు కీర్తి లోకములఁ జల్లి గతాయువులైన పుణ్యభూ
జానుల భవ్యగాథ లివి చక్కఁగఁ దెల్పఁబడెన్ బ్రకృష్ట వి
జ్ఞాన విరక్తిబోధ కయి సల్పిన వాక్యవిభూతు లివ్వి యో
మానవనాథ! దీనఁ బరమార్థముఁ గల్గదు సుమ్మొకింతయున్. 56

ఉ. సారె కమంగళఘ్నమగు శౌరి గుణాద్యభివాదనం బెటన్
వారక సల్పఁగాఁ బడు నవశ్యము దానినె సంతతంబుఁ దాఁ
బూరుషుఁ డాలకింపవలె భూరమణాగ్రణి! కృష్ణునందు న
వ్వారిగ సుస్థిర ప్రకట భక్తి మదిన్ జనియింపఁ గోరుచున్. 57

రాజు:—

చ. మునివర! యే యుపాయమును బూని జనంబులు చాలఁ బెంపుఁ జెం
దిన కలిదోషజాలమును ధీరతఁ బాపుకొనంగలారు తె
ల్పు నుడువుమా మఱిన్ యుగములున్ యుగధర్మములున్ సమస్త వి
ఘ్న న! లయకల్పమానమును గాలమయుండగు విష్ణుసద్గతిన్. 58

శ్రీశుకుఁడు:—

గీ. కృతయుగమ్మునఁ దజ్జనధృతమగుచుఁ బొదలు చతుష్పాదకలితమౌ ధర్మమధిప!
తలఁప సత్యదయాతపోదానము లని, ధర్మదేవుని నాల్గుపాదములు పరఁగు. 59

వ. కృతయుగంబునఁ బ్రాయికంబుగ జనులు సంతుష్టులు, కరుణులు, మైత్రులు, శాంతులు, దాంతులు, నాత్మారాములు, సమదర్శులు, నాత్మాభ్యాసరతులు నగుదురు. త్రేతాయుగంబున ధర్మపాదంబులఁ దురీయాంశం బధర్మపాదంబు లగు ననృతంబు హింస యసంతుష్టి విగ్రహంబులను వానిచే హీనంబగు. అప్పుడు

జనులు క్రియాతపోయోగనిష్ఠులు, నాతిహింసురులు, నాతిలంపటులు, త్రైవర్గికులు, బ్రాహ్మణప్రధానులై యుండురు. ద్వాపరంబునం దపస్సత్యదయాదానంబులను ధర్మపాదంబు లం దర్థం బధర్మలక్షణంబులగు హింస, యతుష్టి, యనృతంబు, ద్వేషంబు లనువానిచే నశించు. అప్పుడు జనులు యశస్వులు, మహాశీలురు, స్వాధ్యాయాధ్యయనరతులు, నాఢ్యులు, గుటుంబులు, దృప్తులు, క్షత్రియబ్రాహ్మణ ప్రధానులు నగుదురు. కలియుగంబునం బ్రవృద్ధంబులగు నధర్మహేతువులచే ధర్మపాదంబు తురీయాంశంబుమాత్ర మవశిష్టంబగు. అదియు నంతంబున నశించు. అప్పుడు జనులు లుబ్ధులు, దురాచారులు, నిర్దయులు, శుష్కవైరులు, దుర్భగులు, దీర్ఘక్రోధులు శూద్రకైవర్తాది ప్రధానులు నగుదురు. 67

పురుషునియందు సత్త్వరజస్తమోగుణంబులు గానంబడు. కాలప్రేరితంబులై యవియ పరివర్తనం బెందుచుండు. ఎప్పుడు మనోబుద్ధీంద్రియంబులు సత్త్వంబునం దతిశయించి వర్తించు నెప్పుడు జ్ఞానంబునం దపంబున రుచియగు నప్పుడ కృతయుగమని యెఱుంగనగు. ఎప్పుడు దేహులకుం గర్మంబులం గాలంబుల యశంబున నభిరుచి కలుఁగు నప్పుడ రజోవృత్తిధర్మంబగు త్రేతాయుగంబని తెలియుము. ఎప్పుడు లోభం బసంతుష్టి, మానంబు దంభంబు, మత్సరంబు కామ్యకర్మాభిరతియునగు నప్పుడు రజస్తమోవృత్తిధర్మంబగు ద్వాపరంబని గ్రహింపుము. ఎప్పుడు మాయ, యనృతము, నలసత, నిద్ర, హింస, విషాదము, శోకమోహంబులు, భయదైన్యంబులు కలుఁగు నప్పుడ తమోవృత్తిప్రధానంబగు కలియుగంబని భావింపుము. 60

సీ. కలిఁబట్టి క్షుద్రదృక్కష్టులు మందభాగ్యులు, బహ్వాశనుల్ కామపరులు విత్తహీనులౌదురు నరు లింతులున్ స్వైరిణుల్, కుటిలస్వభావ లగుదురు తలఁప
జనపదంబులు దస్యుజనపీడితంబులౌ, శ్రుతులు పాషండదూషితములగును
పృథ్వీపతుల్ ప్రజాపీడకులగుదురు, బ్రాహ్మణుల్ శిశ్నోదరపరులగుదు
ర వ్రతు లశౌచులు గవటులౌదురధిప!, భిక్షులు కుటుంబులౌదు రుర్వి వనస్థు
లందఱున్ గ్రామవాసులై యుంద్రు యతులు, విత్తలోలుపులగుదురు వింటిదీని.

గీ. హ్రస్వకాయులు బహ్వపత్యులును విగత, లజ్జలుం గటుకభాషిణుల్ బహ్వాశనలు
చౌర్య కాపట్యయుక్తోగ్రసాహసలును, నారులగుదురు కలివర్తనమునం జేసి. 63

గీ. వణిజులును క్షుద్రులగుచుం గాపట్యవృత్తి, దివురుదురు క్రయవిక్రయాది వ్యవహృతి
నఖిలజను లవిపత్తునైనఁ గాని, నింద్యవృత్తి మంచిదిగ మన్నింతురెపల. 64

క. విత్తవిహీనుం బతి స, ర్వోత్తమునైనం ద్యజింతు రురక భటులు రా
జోత్తమ! విపన్ను భృత్యుని, నత్తఁగనీక త్యజియింతు రాపతులు కలిన్. 65

క. విడుతురు కులమర్యాదల, విడుతురు పాలీనియాలఁ బితృసోదరులన్
విడిచి సురతసౌహృదులయి, నడి నరులొనరింత్రు స్యాలసంవాదాదుల్. 66

గీ. భూవరా! తపోవేషోపజీవులగుచు, శూద్రులు ప్రతిగ్రహంబొనర్చుచుఁ జరింత్రు
చెలఁగి యుత్తమాసన మధిష్ఠించి ధర్మ, ముల వచింత్రు ధర్మానభిజ్ఞులగుజనులు.

సీ. విగతాన్నమగు పృథివీతలంబునఁ బ్రజ, లెల్లరు నుద్విగ్నహృదయులగుచు
దుర్భిక్షభయమునఁ దూలుచు ననావృష్టి, భయమున వ్యాకులపడుచు నన్న
పాన వస్త్రమ్ములు స్నానభూషలును లే, క పిశాచములభంగిఁ గాఁ జరింత్రు
కలియుగంబునను దుర్గాణికేనియు నిగ్ర, హించి సౌహార్దంబుఁ డించి ప్రియము

గీ. లగు నిజప్రాణములనేని మొగిఁ ద్యజింత్రు, స్థవిరులగు పితరులనేని సాకఁబోరు
ప్రజ లజస్రము శిశ్నోదరంభరులయి, కులజుల సుతుల భార్యలఁ గోపగింత్రు. 68

ఉ. వెండియు నాలకింపుమిది వీరవతంసమ! క్షోణిమండలా
ఖండల! వాసుదేవుఁ ద్రిజగత్ప్రతివందితపాదు శ్రీదు నా
కుండును మర్త్యుఁ డీ కలియుగంబునఁ దాను భజింపఁబోఁడు పా
షండ విభిన్నచిత్తుఁడయి సంతమసంబునఁ గూలి మ్రగ్గుచున్. 69

గీ. మడియున ప్డాకులుండైనపుడును బడిన, యపుడు స్ఖాలిత్యముంబొందినప్డుగాని
యెవనినామం బవశత స్మరింప నరుఁడు, సద్గతిఁగను దద్భజనంబు సల్పరు కలి.70

గీ. ద్రవ్యదేశాత్మ జన్య సర్వకలిదోష, ములను బరువడి హరియించుఁ బూరుషులకు
ధారుణీనాథ! సతము చిత్తస్థుఁడగుచు,నొప్పెడు భగవంతుఁడు పురుషోత్తముండు.

క. వినినను బొగడిన ధ్యానిం, చినఁ బూజించినను దగ భజించినను జనా
ర్దనుఁడు హృదయమ్మున న్నెల, కొని యణఁచున్ నరులజన్మకోట్యశుభంబుల్.

గీ. హేమమున లగ్నమగుచు వహ్ని తొలఁగించు
ధాతుజమగు దుర్వర్ణంబు నా తెఱఁగున
నాత్మగతుఁడైన భగవంతుఁ డచ్యుతుండు
యతిజనంబుల యశుభాశయంబు లణఁచు. 73

క. తపముల వ్రతముల విద్యల, జపముల యోగములఁ దీర్ఘసంసేవలనేన్
విపులాత్మసిద్ధి కలుగదు, నిపుణత హరి నీవు మదిని నిల్పుటను బలెన్. 74

ఉ. కావున నెల్లభంగుల జగద్గురుఁ గేశవు వాసుదేవు క్షో
ణీవర! నీదుచిత్తమున నిల్పుమిఁకన్ మరణోన్ముఖుండవై

యీావు పరాత్పరుండగు రమేశుని సర్వ జగచ్ఛరేణ్యునిన్
భావమున న్నరుండు నిలుపం బరమంబగు తద్గతిం గనున్. 75

క. మరణోన్ముఖులగు నరులా, పరమేశ్వరు హరిని హృదిని భావింప జగ
ద్గురుఁ డతఁడు సర్వమయుఁ డౌ, పురుషవరుల నాత్మభావమును బొందించున్.76

చ. అరుదియి దోషరాశియగునట్టి కలిం గలదొక్కటే మహా
త్తరగుణ మో నరాధిప! యుదాత్తగుణుండు పరేశుఁడైన శ్రీ
వరు శుభకీర్తనంబునన బంధములెల్లను విచ్చిపోవఁ ద
త్పరమ గతిన్ నరుం డతిముదంబునఁ బొందఁగఁజాలు నీకలిన్. 77

చ. కృతయుగమందు ధ్యాన మొనరించిన నేయది ప్రాప్తమౌ సమా
హితమతిఁ త్రేతయందు యజియించిన నెయ్యది సంభవించు సం
తత పరిచర్యలన్ సలుప ద్వాపరమందెదికల్గునో సమ
గ్రత నదికల్గు నీ కలియుగంబున శ్రీహరి కీర్తనంబునన్. 78

---

## అధ్యాయము 4.

### చతుర్విధ లయస్వరూపాభివర్ణనము

శ్రీశుకుఁడు:—

వ. రాజా! పరమాణ్వాది ద్విపరార్థపర్యంతకాలంబు నీకెఱింగింపఁబడె. ఇఁక యుగ పరిమాణంబును గల్పలయంబులును వినుము. చతుర్యుగసహస్రము బ్రహ్మకొక్కదినంబని చెప్పంబడు. చతుర్దశమనువుల కాలంబు కల్పంబగు. తత్కల్పాంతంబునఁ బ్రళయమగు. అది బ్రహ్మకొక్కరాత్రి యని చెప్పంబడు. అందు నీ మూఁడులోకంబులు లయించు. విశ్వస్రష్టు భగవంతుం డాత్మభవుఁడునగు శ్రీనారాయణుండు విశ్వంబు నాత్మాధీనముఁజేసి యనంతాసనుండై శయనించు. పరమేష్ఠియైన బ్రహ్మదేవుని ద్విపరార్థంబగు నాయు వతిక్రాంతంబగుడు మహదహంకార పంచతన్మాత్రంబులనెడు సప్తధాతువులు లయించు. విషస్వభావమగు ప్రళయంబున నండకోశంబు విలీనంబగు. పర్జన్యుండు శతవర్షంబులు భూమియందు వర్షింపమింజేసి నిరాహారులై ప్రజలు క్షుద్బాధకతంబున నొండొరుల భక్షించుకొనుచుఁ దత్కాలోపప్లుతులయి క్రమంబున క్షీణింతురు. 79

సాముద్రిక దైహిక భౌమ రసంబులను సంవర్తకమార్తాండుండు ఘోరంబులైన నిజగభస్తులం గ్రోలు. వాయువేగోత్థంబైన వహ్నియు సంకర్షణముఖోద్గతంబయి భూవివరంబులను శూన్యంబులుగాదహించు. ఉపర్యథోభాగంబులనంతట భాను

కృశానుకీలాకీర్ణంబై యండంబు దగ్ధగోమయపిండంబువలెఁ దోఁచు. అనంతరంబు విలయప్రచండప్రభంజనంబు శతాధికసంవత్సరంబులు రజోవృతంబు ధూమ్రాంబరంబునై వీచు. పదంపడి నానావిధచిత్రవర్ణంబులగు మేఘపటలంబులు సరభస ఘోషంబుల శతసంవత్సరంబులు వర్షించు. అంత బ్రహ్మాండ వివరాంతరంబగు విశ్వంబు జలమయంబగు. అప్పుడు జగం బుదకప్లావితంబగుడు జలంబులు భూమిగత గంధగుణంబును గ్రసించు. గంధరహితమైన భూమి లయంబుం బొందు. తేజస్సు జలంబుల రసంబు హరియించు. నీరసంబులగు జలంబులు తేజంబునం బ్రళయంబు నొందు. తేజోరూపంబును వాయువు గ్రసించు. రూపరహితమైన జ్యోతి పవనమున నణఁగు. వాయుగుణంబగు స్పర్శంబును నభంబుహరియించు. స్పర్శరహితమైన పవనంబు నభంబున లీనంబగు. ఆకాశగుణంబగుశబ్దంబును గుణవృత్తిసహిత తామసాహంకారంబు హరించు. శబ్దరహిత నభంబు భూతాదియందు లయించు. తైజసంబులగు నింద్రియంబులను గుణంబులతోడ వైకారిక దేవతలను బ్రధానంబు హరియించు. ఆ ప్రధానంబును సత్త్వాదిగుణంబులు హరించు. కాలచోదితంబగు నవ్యాకృతంబు గుణంబుల గ్రసించు. ఆ యవ్యాకృతంబునకుఁ గాలావయవంబులచేఁ బరిణామాదిగుణంబులులేవు. అది యనాదియు ననంతంబును నవ్యక్తంబును నిత్యంబును గారణరూపంబును నవ్యయంబునై యుండు. అందు వాక్కులు మనస్సు సత్త్వరజస్తమోగుణంబులు మహదాదులు ప్రాణబుద్ధీంద్రియదేవతలు లోకరూపంబగు రచనావిశేషంబును లేవు. సుషుప్తి స్వప్నజాగ్రదవస్థలుఁ బృథివ్యప్తేజోవాయ్వాకాశంబులు నందులేవు. సుషుప్తంబు శూన్యమట్ల యప్రతర్క్యాత్మబగు మూలభూతంబుగ దానిఁ జెప్పుదురు. ఎప్పుడు ప్రకృతిపురుషశక్తులు కాలోపద్రుతంబులై వివశంబులై యణఁగు నప్పుడది ప్రాకృతికలయం బని చెప్పంబడు. దృశ్యత్వకారణావ్యతిరేకంబుల నాద్యంతంబులుకలదియు నవస్తువునగు జ్ఞానంబున బుద్ధీంద్రియార్థవిషయంబునఁ దదాశ్రయంబైన జ్ఞానంబుకలుగు. దీపము, నేత్రము, రూపము జ్యోతికంటె భిన్నములుకావు. ఇట్లే బుద్ధియుఁ గరణంబులు మాత్రలు నొకదానికంటె నొకటివేరుఁగావు. బుద్ధికి జాగరణము, స్వప్నము, సుషుప్తియను మూఁడవస్థలుకలవు. ప్రత్యగాత్మయందు నానాత్వము మాయామాత్రమని యెఱుఁగుము. 80

గీ. అంబుదంబులు వ్యోమంబునందునెట్లు, ప్రభవముఁ జెందు నాశంబునడయు నట్లు
సావయవమై చెలంగు విశ్వంబు బ్రహ్మ, మందు సృష్టి వినాశంబులందుచుండు.

గీ. అవనినాథోత్తమా! యవయవుల కెల్ల, నవయవముగఁ జెప్పఁబడు సత్యంబుదలఁపఁ
బటమునందుఁదోఁచెడు తంతుపటలమట్లు, నర్థమది లేక యే తోఁచు నవయవముల.

వ. అన్యోన్యాశ్రయంబువలనఁ గార్యకారణములచే నే సత్యం బుపలబ్ధంబగు నది బ్రహ్మంబయగు. ఆద్యంతవంతమగు సర్వంబు వాస్తవంబుకాదు. ప్రత్యగాత్మ తక్క ప్రపంచంబు ప్రతీయమానంబగుచున్నను నణుమాత్రంబు నిరూపింపఁదగినదికాదు. కలదేని నాత్మభంగిఁ జిత్స్వమంబగు. సత్యంబునకు నానాత్వంబులేదు. కలదని యజ్ఞుండు తలఁచినచో ఘటాకాశమహాకాశములకు నాకాశజలస్థసూర్యులకు బాహ్యశరీరస్థవాయువులకు నెట్లట్లయగు. 83

చ. అరయ హిరణ్యమెట్లు వ్యవహారపథంబుల మర్త్యకోటిచే
విరచితమై తలంపఁబడుఁ బెక్కు విధంబుల వాడఁగాఁ బడున్
బరముఁ డధోక్షజుండు భగవంతుఁడు విష్ణువుకూడ నట్లె త
త్పరతవచింపఁగాఁ బడునువై దిక లౌకికులౌ జనాళిచేన్. 84

చ. అహిమకరప్రభూతము నహర్పతిదీధితిదర్శితంబునై
యహిమకరాంశభూత మగునక్షికిఁ జీఁకటిఁ గూర్చు మేఘ మ
ట్లహముఁ దలంప బ్రహ్మగుణమాచుఁ దదీక్షితుఁడుం దదంశుఁడై
రహినిఁ జెలంగు జీవునకుఁ గన్నఁ గూర్చును బంధము న్నృపా! 85

ఉ. భానుసముద్భవంబయిన వారిదమెట్లు తొలంగిపోవునో
తోన స్వరూపమైపరఁగుఁ దోయజబాంధవుఁ గాంచు నేత్ర మా
ర్యా! నరపాలసత్తమ! యహంకృతియున్ విచికిత్సచేఁ జెడన్
నేన పరాత్మనంచు దృఢనిశ్చయమున్ బురుషుండుఁ బొందెడున్. 86

వ. పురుషుఁడెప్పుడు వివేకాసిచేత మాయామయాహంకారకృతమగు నాత్మబంధనంబు ఛేదించి యచ్యుతాత్మానుభవుండగు నదియ యాత్యంతిక ప్రళయమనంబడు. నిత్యము సర్వభూతములకు బ్రహ్మాదులకును నుత్పత్తిప్రళయంబులు జరుగునని సూక్ష్మజ్ఞులు చెప్పుదురు. కాలప్రవాహవేగంబున హరింపంబడు దేహాదులకుఁ బరిణామవంతంబులగు నదీప్రవాహవేగ ప్రదీపజ్వాలాదులకుం బోలె జన్మప్రళయహేతువులగు నవస్థలు కలుగు. నిత్యము, నైమిత్తికము, ప్రాకృతికము, నాత్యంతికము నని ప్రళయంబులు నాల్గువిధంబులుగాఁ బరిగణింపఁబడు. రాజా! కాలంబుగతి యిట్టిది. 87

శా. బ్రహ్మనాథా! త్రిజగద్విధాతయును శంభత్సత్త్వధాముండునౌ
శ్రీనారాయణు దివ్యలీలలను సంక్షేపంబుగాఁ దెల్పితిన్
నే నీరీతిని నీకు నిక్కమునుగ వాణీవల్లభుం డేనియున్
వానిన్ గార్త్స్న్యముగాఁగఁ దాను బలుకన్ శక్తుండుగాఁ డెన్నఁడున్. 88

మ. తత నానావిధ దుఃఖదావదహనోత్తప్తాత్ముఁడౌ ఘోర సం
సృతిపాథోధి తితీర్షు పూరుషునకున్ శ్రీవిష్ణులీలాకథా
మృతపానంబది యొంటుదక్క యితరంబే దేనియున్ దెప్ప యీ
క్షితిలోకంబునఁ గానరాదుగ పరీక్షిత్ క్షోణిపాలాగ్రణీ! 89

గీ. ఈపురాణసంహితను ఋషీశ్వరుండు, ఘనుఁడు నారాయణుఁడు నారదునకుఁ దెల్పెఁ
దొల్లి యానారదుడును సంతుష్టుఁడగుచుఁ, బ్రణుతవైఖరిఁ జెప్పె ద్వైపాయనునకు.

గీ. రాజ! భగవంతుఁడగు బాదరాయణుఁడును, సంప్రహృష్టాత్ముఁడై వేదసమ్మితమగు
భాగవతసంహితన్ దీని భద్రకలిత, నేర్పడ న్నాకునై వచియించె వింటె. 91

గీ. నైమిశారణ్యమునఁ గురునాథ దీర్ఘ, సత్రమందు నాసీనులౌ శౌనకాది
మునులచేత సంపృష్టుఁడై జననుతుండు, సూతుఁ డెఱిఁగించు నాఋషివ్రాతములకు.

---

## అధ్యాయము 5.

### శుకమహర్షికృతపరీక్షిత్ప్రబోధము

శ్రీశుకుఁడు:—

గీ. ఎవ్వనిప్రసాదమున నుదయించె బ్రహ్మ, యెవనిక్రోధమునం బ్రభవించె రుద్రుఁ
డట్టి భగవంతుఁడైన విశ్వాత్ముఁడు హరి, వర్ణితుండయ్యె నీభాగవతమున నృప!

చ. ఇఁక మరణింతు నే ననెడునీ పశుబుద్ధిని నుజ్జగింపు జం
కకు మది నీవు జాతుఁడవు కావు నృపాలకులాగ్రగణ్యా! యిం
తకు మునుగా వభూతుఁడ వెదం దలపోయఁ గళేబరంబు పో
లిక నశియింపఁబోవు మఱిలేవెట నేనియు భీతిహేతువుల్. 94

గీ. బీజమున నంకురము నోజరాజ! నీవు, పొడమి పుత్రపౌత్రాది రూపుఁడవు కావు
ఇంధనంబునఁ బావకంబెట్టు లట్లు, కనుఁగొన వ్యతిరిక్తుండవు తనువు కంటె. 95

గీ. తనశిరశ్ఛేదమున్ స్వప్నమునను జాగ, రమున మరణాదులున్ శరీరమునకగుటఁ
గాంచుఁగాన నాత్మకునిది కలుగఁ బోదు, ఆత్మ వాస్తవికంబుగ నజుఁడమరుఁడు.

గీ. ఘటము భిన్నమగుడుఁ దదాకాశమెట్లు, మొగి మహాకాశమగు యథాపూర్వముగను
నట్లె దేహంబు మడియ బ్రహ్మంబయగును, మగుడ జీవుండు కౌరవక్ష్మాకళత్ర! 97

క. మనము సృజియించు నాత్మకుఁ, దనువుల గుణములను గర్మతతులను గ్రమతన్
మనమును మాయ సృజించును, జనవర! జీవునకు దాన సంసృతి కలుఁగున్. 98

వ. తైలాధిష్ఠానవర్తివహ్నిసంయోగంబునం జేసి జ్యోతికి జ్వాలారూపపరిణామం
బెట్లగు నట్ల దేహకృత్తగు మనస్సునకు సంసారంబు కలిగి రజస్సత్త్వతమోవృత్తుల

నుత్పత్తి స్థితినాశంబులఁ బొందు. స్థూలసూక్ష్మదేహంబులకంటెఁ బరంబును,
స్వయంజ్యోతియు ధ్రువంబును ననంతంబు ననుపమంబు వ్యాపకంబునగు నాత్మ
యాకాశంబువలె సర్వాధారంబై యుండు. ఇట్టులాత్మచేతన దేహాద్యుపాధిస్థంబగు
నాత్మను వాసుదేవస్మరణచేతను, ద్రష్టృదృశ్యాద్యన్వయ వ్యతిరేకయుక్తయగు
బుద్ధిచేతను విచారింపుము. 99

గీ. మృత్యువుల కన్నిటికిఁ బెద్దమిత్తివైన, యీశు నిన్ను విప్రవాక్యేరితుఁడగు
తక్షకుండు దహింపఁడు ధరణినాథ!, కడఁగి మృత్యువుల్ నిను జెనకంగలేవు. 100

గీ. పరమపదమై చెలంగెడు బ్రహ్మమేను, పరమధాముఁడనగు నేనె బ్రహ్మమనని
కడఁక నిట్టులు నిరుపాధికమగు నాత్మ,యందు నాత్మను జొన్పుమీ యవనినాథ!

గీ. ధృతి యెసఁగ నీపగిదిని వర్తింతువేని, మొనసి విషవక్త్రమునఁ బాదమునఁ గఱచెడు
తక్షకాహినిఁ దనువు నేతజ్జగమ్ము, నాత్మకంటె భిన్నంబుగ నరయఁ బోవు. 102

క. నీ వేయది యడిగితివో, యా విశ్వాత్ముఁడగు నట్టి హరి చేష్టితమున్
నే వచియించితి నే దిఁక,పై వినఁ గోరుదువొ తెల్పు పార్థివ ముఖ్యా! 103

---

## అధ్యాయము 6.

### పరీక్షిద్రాజర్షి దేహత్యాగము—వేదవ్యాసశాఖాప్రణయనము

సూతుఁడు:—

చ. సముఁ డఖిలాత్మదర్శియుఁ బ్రశాంతుఁడు వ్యాససుతుండునైన సం
యమివృషభుండు శ్రీశుకమహర్షి వచించిన యట్టి దీని నో
రిమి విని విష్ణురాతుఁడు పరీక్షితుఁ డల్లఁ దదీయ పాదమూ
లముకడఁ జేరి పల్కె నిటులన్ దలవంచియు మోడ్పుఁ గేలుతోన్. 104

రాజు:—

ఉ. మానికులోత్తమా! నిరుపమానకృపారసమూర్తివైన నీ
చే నిఖిలాత్ముఁడున్ విబుధసేవ్యుఁ డనాది యనంతుఁడైన శ్రీ
జాని జగన్నియామకుఁడు శ్రావితుఁడయ్యెను నాకుఁ గావునన్
దీన ననుగ్రహింపఁబడితిం జరితార్థుఁడనైతి నెంతయున్. 105

గీ. విష్ణుపరులకు మీ కనభిజ్ఞములును, దాపతప్తంబులునగు భూతంబులందు
నిటులు సదనుగ్రహంబు కల్గుటయనునది, తలఁచిచూడంగ నత్యద్భుతంబుఁ గాదు.

గీ. సారిది భగవంతుఁ డుత్తమశ్లోకుఁడు హరి, పెంపు దీపింప నెందు వర్ణింపఁబడియె
ననఘ! నీవలనన్ వింటిమా పురాణ, సంహితన్ దీని మేము నిస్సంశయముగ.

గీ. యోగివర! తక్షకాది మృత్యువులవలన, డెందమున నింతయున్ భీతిఁజెందనేను
బ్రహ్మనిర్వాణ లాభంబుఁబడసినాఁడ,హితుఁడవై యభయంబుఁ జూపితివినాకు.

గీ. వాఙ్నియమముఁగావించి శ్రీవాసుదేవు,నందుముక్తికామాశయమగు మనమును
జొనిపి నేనింకఁ బ్రాణంబులను ద్యజింతు, నా కనుజ్ఞ నొసంగుముయివిచార!109

సూతుఁడు:—

క. అనివేఁడ నతని కను, జ్ఞనొసంగి నృపాలమౌళిసంపూజితుఁడై
తనతోఁగూడి భిక్షులరుదే, ర నచటనుండి ముని బాదరాయణి చనియెన్. 110

క. రాజర్షియగు పరీక్షిత్, త్వాత్మజానియు బుద్ధిచేతమనమునను నాత్మన్
యోజనముఁ జేసి భూజము, నోజం బరమాత్మ ధ్యానమొనరించెఁ దగన్.111

ఆ. ప్రాఙ్ముఖంబులైన బర్హిస్సులం గాంగ, తటమునందు తేఁ దుదఙ్ముఖుఁడయి
కూరుచుండి సంగదూరుఁ డసంశయుఁ, డై తనర్చె బ్రహ్మభూతుఁడగుచు.112

క. యతివరులారా! యతికో, పితుఁడగు ద్విజసుతునిచేతఁబ్రేరితుఁడై భూ
పతిని గెడపఁ దక్షకుఁ డు, ద్ధతిఁ జనుచుం గాశ్యపుం బథంబునఁ గనియెన్. 113

గీ. విషనివారకుఁడైన యవ్విప్రుఁ బ్రచుర, ధనములందన్ని మఱలించితక్షకుండు
కామరూపుఁడు కావునఁగడఁక విప్ర, రూపమున మాటువడి వడిభూపుఁగఱచె.

ఆ. బ్రహ్మభూతుఁడైన రాజర్షి దేహం బు,దగ్ర గరళవహ్నిఁదప్త మగుచుఁ
బరఁగఁ దత్క్షణంబభస్మసాత్కృతమయ్యెఁ, గల జనంబు లెల్లఁగాంచుచుండ.115

గీ. ఇలను నభమున దిక్కులనెల్లయెడల, నొదవెఁ బ్రబల హాహాకారమొక్కమొగిని
దేవదానవ మానవాదికగణంబు, లానమయమున నతి విస్మితాత్ములైరి. 116

ఆ. మొఱసె దేవదుందుభుల్ పాడిరంత గం, ధర్వులచ్చరలు ముదంబెనంగ
సాధు వాదులగుచుసర్వసుపర్వులుఁ, గుసుమవర్షములనుగురిసి రపుడు. 117

సీ. జనమేజయుఁడు నిజజనకుఁ దక్షకభక్షి, తునిఁగా నెఱింగి క్రుద్ధుఁడయి ద్విజుల
తోఁగూడి సత్రమందున్ సర్పములను నా, హుతులంజేసె మహాగ్రముగను
ఆ సర్ప సత్రమునందు సమిద్ధాగ్ని, దహ్యమానోర గోత్కరముఁ గాంచి
యుద్విగ్నుఁడగుచు బిడౌజుఁ దక్షకుఁడు దా, శరణంబు నొందె ద్విజన్ములార!

గీ. తక్షకుఁడు రామిఁజూచి పారీక్షితుండు, ద్విజవరేణ్యులతో నీగతిన్ వచించెఁ
దక్షకుం డురగాధముఁ డీక్షణమున, నేల దగ్ధుండుఁగాఁ డెఱిగింపుఁడనుచు. 118

గీ. ద్విజులనిరి శరణాగతు దేవవిభుఁడు, గోపనముఁ జేయుచుండె నోభూపవర్య!
తక్షకుం డింద్రుచేత సంస్తంభితుఁడయి,తాను బడఁడయ్యె నీ సమిద్ధాగ్నియందు.

క. అని తెలుప విని పరీక్షి, త్తనయుఁడు జనమేజయుండు దా ఋత్విజులన్
గని యేల సేంద్రుఁ దక్షకు, ఘనతరహోమాగ్నిఁ గూలఁగాఁ ద్రోయ రనెన్. 120

ఉ. ఆ నరలోకపాలుని క్రుధాన్వితవాక్యము లాలకించి మే
ధానిధులైన ఋత్విజులు తక్షక! తత్క్షణమే సురాధిపుం
డైన మహేంద్రుతోడఁ బడుమా యిటనంచు సహేంద్రతక్షకున్
మానక పిల్చి రా క్రతువునన్ ద్విజసత్తములార! వింటిరే? 121

మ. సవిమానుండు సతక్షకుండునగుచున్ సంభ్రాంతచేతస్కుఁడై
దివిషన్నాయకుఁ డింద్రుఁ డత్తఱిని ఋత్విక్ప్రోదితోగ్రోక్తులన్
జవమొప్పం గదలింపఁగాఁబడియె స్వస్థానంబునందుండి య
ద్ది విలోకించి వచించె గీష్పతి ధరిత్రీజానితో నీగతిన్. 122

గీ. సర్పరాజైన యితఁడు రాజన్యధన్య!, చూడ నీచే వధార్హుఁడు కాఁడు వాఁడు
పాన మొనరించె నమృతంబుఁ గాన దాన, నజరుఁ డమృతుండు నగును ద
ధ్యమ్ముసుమ్ము. 123

ఆ. స్వకృతకర్మముననె జంతువునకును జీవితము మరణ మవలగతియుఁ గల్గుఁ
బుడమి ఱేఁడ! తదితరుఁడు సుఖదుఃఖంబు, ల నిడువాఁడు జంతువునకు లేఁడు. 124

మ. కురునాథా! ఫణి చోరవహ్ని సలిలక్షుత్తృడ్రుజాదివ్యథన్
మరణంబొందును జంతు విత్తెఱఁగునన్ బ్రారబ్ధకర్మంబులన్
బొరయుంగావున నాభిచారిక మఘంబున్ దీనిఁ జాలింపుమా
యురగుల్ నేరముఁ జేయఁబో రనుభవింత్రోజన్ జనుల్ గర్మమున్. 125

మ. అని తెల్పంబడి వల్లె యంచునియె దేవాచార్య వాక్యంబు ల
త్యనఘుండా జనమేజయక్షితిపుఁ డత్యంతంబు మన్నించుచున్
వినయంబొప్పఁ దదర్హణంబుల భజించెన్ సర్పసత్రంబునుం
డి నివృత్తుండయి యా బృహస్పతి గురున్ విద్యావివేకాఢ్యునిన్. 126

గీ. అది మహావిష్ణుమాయ యాత్మాంశభూతు, లయ్యుగుణవృత్తులన్ మోహమంది బాధ్య
బాధకతఁ జెందుచుందు రపారమైన, యిమ్మహామాయచేతన యెల్లప్రొద్దు. 127

వ. దంభీభూతయు నేవంరూపయునైన మాయ యాత్మవాదుల యాత్మవాదమునఁ బరాజితయై ప్రకాశింపకుండు. అందు మాయాశ్రయమైన వివిధవాదంబును లేకుండు. మఱియు సంకల్పవికల్ప వృత్తిమంతంబగు మనంబును నణంగు. సృజ్యంబగు కర్మ సృజించు కరణవర్గంబుతోఁగూడ నుభయసాధ్యంబగు శ్రేయః

ఫలంబును సృజ్య(సష్ట్ర)ఫలాన్వితుండై యహంకారాత్మకుండైన జీవుండును నెందుఁగల్గరో యయ్యాత్మస్వరూపంబు నిరస్తబాధ్యబాధకంబుఁ గావున ముని యహంకారాద్యాత్మలం బ్రతిషేధించి క్రీడింపవలయును. ఆత్మవ్యతిరిక్తంబును నేతినేతివాక్యంబులం ద్యజింపఁగోరుచు మును లనన్యసౌహృదులై దౌరాత్మ్యంబు నుజ్జగించి హృదయమ్మున ధ్యానాదులఁ బరిరంభించి సమాధినిశ్చితమగు వైష్ణవమైన పరమపదంబును బొందుదురు. 128

చ. అమలత దేహగేహభవమైన యహంమమరూపమర్జన
త్వ మది సమూలమై చెడును దాపసవర్యులకున్ మఱిన్ దమం
త మహితమైన వైష్ణవపదంబును వారు ద్విజన్మలార! వై
శమ పడయంగలారు సకలభ్రమముల్ మది డుల్లిపోవఁగన్. 129

క. అతివాదములందుం గడుఁ, దితిక్షఁగొనవలయు నెవనిఁ దెగడంజన డు
ద్ధతి నీ తనువున్కై పం, డితుఁ డెవ్వనినేని నురవడిం బగఁగొనునే. 130

క. ప్రవిమలమగు నీ సంహిత, యెవని శుభపదాంబుజద్వయీధ్యానమునన్
వివరముగఁగొంటి నట్టి భ, గవంతు నురుమేధు వ్యాసు ఘను నర్చింతున్. 131

శౌనకుఁడు :—

క. నిగమగురువులు మహాత్ములు, నగు పైలప్రభృతులైన వ్యాసుని శిష్యుల్
నిగమముల నెన్ని భాగము, లుగఁ దగ విభజించిరో తెలుపుమా సూతా! 132

సూతుఁడు:—

గీ. అవనిసురులార! సుసమాహితాత్ముఁడైన, యట్టి బ్రహ్మ హృదాకాశమందునుండి
నాద మొక్కటి పొడమెఁ గర్ణపుటముల ని,రోధమున ద్యోతకంబగురూఢినదియు.

గీ. సంయములు తదుపాసనాశక్తిఁ జేసి, యరసి ద్రవ్యక్రియాకార కాత్మమైన
యాత్మమలమును ద్యజియించి యనుపమీఱు మోక్షసామ్రాజ్యలక్ష్మిని
బొందుచుంద్రు. 134

వ. ఆ నాదంబునుండి త్రిమాత్రంబు నవ్యక్తజన్మంబు స్వయంప్రకాశమానంబగు నోంకారంబయ్యె. అది భగవంతుండును, బరమాత్ముండు నగు పరబ్రహ్మ చిహ్నంబు. ఈ యవ్యక్తంబగు నాదంబును శూన్యదృక్కగు జీవుండు శ్రోత్రపుట నిరోధంబున వినుచుండు. స్వధాముఁడును బరమాత్ముఁడు నగు బ్రహ్మమున కది సాక్షాద్వాచకంబు. అది సనాతనంబగు సర్వమంత్రోపనిషద్వేదబీజంబు. భృగువరా! అది యకారాది త్రివర్ణయుక్తంబగు సత్త్వాదిగుణత్రయ సామాది వేదత్రయ భూరాదిలోకత్రయంబుల వ్యాప్తంబగు. ఆ నాదంబువలన సంతస్థోష్మ

స్వరస్పర్శ హ్రస్వదీర్ఘాదిలక్షణంబగు నక్షరసమామ్నాయంబును భగవంతుండగు నజుండు సృజించె. పిదప విభుండును వేదగర్భుండు నగు నాబ్రహ్మ చాతుర్హోత్ర వివిక్షు సవ్యాహృతికంబులు, సోంకారంబులునగు చతుర్వేదంబులను జతుర్వదనంబులం దాల్చె. ఋషియగు బ్రహ్మ యీ చతుర్వేదంబులను బ్రహ్మవిదులగు మరీచ్యాదుల నభ్యసింపంజేసె. వారును ధర్మోపదేష్టలై స్వపుత్రికులకు నుపదేశించిరి. పారంపర్యంబునఁ దత్తచ్ఛిష్యులగు మహాత్ములచేఁ జతుర్యుగంబులందుఁ బొందంబడి చతుర్వేదంబులు ద్వాపరప్రారంభంబున విభక్తంబులయ్యె. కాలవశంబున నల్పాయుష్కులును, క్షీణసత్త్వులును, దుర్బుద్ధులు నగు జనులను వీక్షించి హృదయస్థ హరిప్రేరితులై బ్రహ్మర్షులు వేదంబుల విభజించిరి. 135

మ. ధృతి నీయంతరమంద యచ్యుతుఁడు బ్రహ్మేశాది లోకేశ యా
చితుఁడై తాను పరాశరర్షి వలనన్ శ్రీ ధర్మగుప్త్యర్థ మ
ద్భుతశక్తిన్ బ్రభవించె సత్యవతియందున్ వ్యాసుఁడై యప్డు నా
ల్గుతెఱంగుల్ వెలయంగ నన్నిగమముల్ గోలన్ విభాగించెఁ దాన్. 136

క. ఋగథర్వ యజుస్సామా, ఖ్యగణంబులు వర్గములుగఁ గైకొని ముని నా
లుగు సంహితలుగఁ జేసె మ, ణిగణమ్ముల సూత్రమందుఁ గనినిచిన భంగిన్. 137

క. చతురులగు శిష్యులను నా, యతివర్యుఁడు చీరి సుమతిఁ గ్రమమై యొక్కొక సం
హిత నొక్కొక్కనికిన్ సం, స్కృతమతులకు నొసఁగె వింటిరే ద్విజులారా! 138

గీ. బహ్వృచాఖ్యాద్య సంహితం బైలునకు వ, చించె నిగదాఖ్యమైన సంహితను బిదప
నలఘుఫణితి వైశంపాయనాఖ్యుఁడైన, శిష్యునకుఁ జెప్పె యాజుషాంచితమును దగ.

గీ. సామగణమగు ఛందోగసంహితం బ్ర, మోదమునఁ జెప్పె జైమినిమునికి నట్లు
మఱియుఁ దనశిష్యుఁడైన సుమంతువునకుఁ, దగ నథర్వాంగిరస సంహితన్ వచించె.

గీ. పైలుఁడు స్వసంహితన్ ద్వివిభాగములుగఁ, బరపి యింద్రప్రమతికిని బాష్కలునకుఁ
జెప్పె బాష్కలుఁడు వచించె శిష్యులకును, దనదు సంహితను జతుర్విధములు సేసి.

వ. బోధ్యుఁడు యాజ్ఞవల్క్యుఁడు పరాశరుఁడునని బాష్కలునిశిష్యుల నామంబులు చెలంగు. 142

గీ. ధీవిశాలుఁ డింద్రప్రమతియు స్వకీయ, సంహితన్ గవియును ఋషీశ్వరుఁడు నైన
నిజ తనూజు మాండూకేయునిఁ జదివించె, సాధువైఖరితోడ ద్విజన్మలార! 143

వ. తచ్ఛిష్యుండైన దేవమిత్రుండు సౌభరిప్రభృతులకు నద్దానినొసంగె. అతని కొమరుఁడైన శాకల్యుండు స్వసంహితం బంచవిధములుచేసి వాత్స్య, మౌద్గల్య, శాలీయ గోబిల్య శిశిరులయం దునిచె. తచ్ఛిష్యుండగు జాతుకర్ణుండను ముని నిరుక్త

యుక్తంబగు స్వసంహితను బలాకపైంగవైతాళవిరజులకు నొసంగె. బాష్కల పుత్రుండుప్రతిశాఖలనుండి వాలఖిల్యాఖ్య సంహితను రచించె. దానిబాలాయనియు, గార్గియుఁ, గాసారుండును ధరించిరి. బ్రహ్వృచంబగు నీ సంహిత బ్రహ్మర్షులచే ధరింపఁబడియె. ఏతద్విభాగంబున జనుండు సర్వపాపంబులనుండి విముక్తుండగు. వైశంపాయనశిష్యులు చరకులు, నధ్వర్యులునైరి. బ్రహ్మహత్యానివారకమగు స్వగురువ్రతంబునఁ జరించుటంజేసి వారు చరకులనఁబరఁగిరి. వైశంపాయన శిష్యుండగు యాజ్ఞవల్క్యుఁడు గురునింజూచి 'భగవత్స్వరూపా! వీరిచరితంబు లల్ప సారంబులు. ఇవి యెంతపాటివి? నేను సుదుశ్చరంబగు తపంబునఁ జరింతు'ననిపల్కె.

క. అనవుడు గురుఁడాతని కి, ట్లను శిష్యుఁడవై యిటుల్ ద్విజావమతిన్ స
ల్పి నను గనలించి తటుఁగా, వున మదధీతముఁ ద్యజింపుము రయమున ననన్. 145

గీ. ద్విజవతంసములార! యాదేవరాత, సుతుఁడు వెడలంగఁ గ్రక్కె యజుర్గణముల
నాకుఅంగటనాసీనులైనమునులు, చూచి రుద్వాంతతద్యజుస్స్తోమములను.

గీ. అంతఁ దిత్తిరిపక్షులైయా యజుర్గ, ణములఁ గొనిరి తల్లోలుపత్వమునవాను
లతి మనోజ్ఞ యజుశ్శాఖలంతనుండి, తైత్తిరీయములని ప్రసిద్ధంబులయ్యె. 147

గీ. తన గురువగు వైశంపాయనునకు లేని, యధికములగు ఛందస్సులనరసికొనుచు
నంతటం బూనిక దలిర్పయాజ్ఞవల్క్యుఁ, డీశ్వరుఁడగు నాదిత్యు స్తుతించె నిట్లు.

యాజ్ఞవల్క్యుఁడు:—

వ. దేవా! యఖిలజగదాత్మ స్వరూపుఁడవు, కాలస్వరూపుఁడవు, బ్రహ్మాదిస్తంబ పర్యంతంబులగు చతుర్విధభూతసంఘాతంబుల హృదయంబుల నంతర్బహిర్భాగంబుల నాకాశంబుపోలె నుపాధులచే ననాచ్ఛాద్యమానుండవై నీవొక్కండవ క్షణలవనిమేషాద్యవయవోపచిత సంవత్సరగణంబుచేఁ దోయాదానవిసర్గంబుల మూలంబున లోకయాత్రను సాగంజేయుదు వట్టి నీకు నా నమోవాకంబులు. దైవతవతంసమా! ఓ సవితృభగవానుఁడా! ప్రత్యహంబు ననుసవనంబు నామ్నాయోక్తవిధి స్తుతించువారి దురితదుఃఖంబులఁ దొలఁగించు ప్రకాశమానమైన నీజ్యోతిర్వలయము నాభిముఖ్యంబున ధ్యానింతును. ఏభగవంతుండిందు నిజాశ్రయంబులగు స్థావరజంగమంబులఁ బ్రాణేంద్రియమనోగణంబులను జడంబులను దనంత యంతర్యామియై ప్రేరేచుచుండు, ఎవ్వండొక్కండై యతికరాళ వదనాంధకార సంజ్ఞాజగర గ్రహగ్రస్తంబై మృతకంబువలె నిశ్చేతనంబైన యీ లోకంబుఁగాంచి యనుకంపపెంపున నతికృపాళుండై వీక్షణంబుచేతన లేపి యహరహం బనువేలంబును స్వధర్మాఖ్యావస్థానంబగు శ్రేయంబునఁ బ్రవర్తింపఁజేయు

నవనిపతియుంబోలె నసాధులకు భయంబుఁగొల్పుచు నటనటనంతట దిక్పాలురచేఁ గమలకోశాంజలులచే సమర్పితార్ఘ్యుండై యుండు నట్టి యోభగవత్స్వరూపా! త్రిలోకపాలాభివందితమగు త్వత్పాదారవిందయుగ్మంబును ననితరజ్ఞాత యజుర్గణం బుం గోరి చేరితిని. 149

సూతుఁడు:—

క. అనిపొగడ వాజితనుఁడౌ, చును భగవంతుండు రవియ్యజుస్సు లొరులు గై
కొననివి యనుగ్రహించెన్, మునికిం దద్దీనయధీ ప్రక్రముదితాత్ముండై. 150

క. ఏనూఱుయజుస్సులచేఁ, జానుగఁజేసెను బదేను శాఖల విభుఁడ
వ్వానిన్ వాజికృతమ్ములఁ, బూనిరి కాణ్వాదులై నఘమునులు మునీంద్రా! 151

వ. సామగుండైన జైమినికి సుమంతుండు తనయుండయ్యె. సుమంతుతనయుండు సుకర్ముండు. జైమిని స్వపుత్రపౌత్రులగు వారిరువురకుఁ గ్రమంబున నొక్కొక్క సంహితంజెప్పె. పదంపడి తచ్ఛిష్యుండగు సుకర్ముఁడు సామవేదధరుండై యతి మేధావియై సంహితాభేదసహస్రంబునుగావించె. సుకర్మునిశిష్యులు కౌసల్యుండగు హిరణ్యనాభుండును, పౌష్యింజియుఁ దదన్యుండగు బ్రహ్మవిత్తముఁ డావంత్యుం డును నతనివలన నాభాగంబుల గ్రహించిరి. వారికి నుదీచ్యులు సామగులునగు నేనూఱుగురు శిష్యులైరి. వారలాశాఖల యథాతథంబుగ గ్రహియించిరి. వారి నుదీచ్యులని చెప్పుదురు. లోకాక్షియు గాంగలుండును గుల్యుఁడు గుసీదుఁడుఁ గుక్షియునను పౌష్యింజిశిష్యులొక్కొక్క రొక్కొక్క నూఱుసంహితలను గైకొ నిరి. హిరణ్యనాభుని శిష్యుఁడు స్వశిష్యుల కిరువది నాలుగు సంహితలంజెప్పె. ఇతరములగు ప్రసిద్ధశాఖలను నావంత్యుండు తన శిష్యున కెఱింగించె. 152

---

## అ ధ్యా య ము 7.

### పురాణ దశవిధలక్షణంబులు

సూతుఁడు:—

వ. అథర్వజ్ఞుండగు సుమంతుండు స్వకీయసంహితను దనశిష్యునిఁ జదివించె. అతం డుపథ్యునకు వేదదర్శునకుంజెప్పె. శౌల్కాయనియు బ్రహ్మబలియు నిర్దోషుం డును బిప్పలాయనుండును వేదదర్శునిశిష్యులు. కుముదుండును, శునకుండును, జాబాలియుననఁబడువా రుపథ్యుని శిష్యులు. ఆంగిరసుని శిష్యుండు బభ్రుండు సైంధవాయనుండును రెండుసంహితల నధ్యయనముఁ గావింతురు. అన్యులగు సావర్ణ్యాదులు సైంధవాయనుని శిష్యులు.నక్షత్రకల్పుఁడు శాంతియుఁ గార్శ్యపాంగి

రసాదులు. వీరల నధర్వణ వేదంబుల కాచార్యులుగ నెఱుంగుము. ఇంకఁ బౌరా ణికాచార్యులవినుము. త్రయ్యారుణియుఁ, గశ్యపుఁడును, సావర్ణియు, నకృతవర్ణుం డును వైశంపాయనుండును, హారీతుండునను నీ యార్వురు పౌరాణికాచార్యు లనంబరఁగిరి. వ్యాసశిష్యులగువీరు మత్పితృముఖంబునుండి యాపురాణసంహితల నధ్యయనంబుఁజేసిరి. నేను వీరలకు శిష్యుండనై యొక్కొకరివలన నొక్కొక్క సంహితను బడసితి. కాశ్యపుఁడును, నేనును, సావర్ణియు, రామశిష్యుండగు నకృ తవ్రణుండును వ్యాసపుత్రుండగు శుకునివలన మూలసంశ్రితంబులగు నాలుగు సంహితలను నేర్చితిమి. బ్రహ్మర్షులచే వేదశాస్త్రానుసారంబుగ బుద్ధినాశ్రయించి పురాణలక్షణంబు నిరూపితంబయ్యె. ఈవిశ్వంబునకగుసర్గము, విసర్గము, వృత్తియు, రక్షయు, నంతరంబులును, వంశము, వంశానుచరితము, సంస్థయు, హేతువు, నపాయము నను దశలక్షణములతోఁగూడినది పురాణమని తద్విదులుచెప్పుదురు. మహదల్పవ్యవస్థచేఁ బురాణంబు పంచలక్షణంబని కొన్నియెడలఁ జెప్పంబడు. అవ్యక్తగుణక్షోభంబువలన మహత్తువలన గుణత్రయంబువలన నహంకారంబు వలన భూతసూక్ష్మేంద్రియంబుల సంభవంబు సర్గంబనంబడు. పురుషానుగృహీతం బులగు మహదాదుల వాసనామయంబగు సమాహారంబునఁ జరాచరంబైన బీజం బునుండి బీజోత్పత్తి విసర్గ మనంబడు. కామంబునంగాని, ప్రేరణంగాని చరంబు లగు భూతంబులకు నచరంబులగు భూతంబులును, జరంబులగుభూతంబులును జీవిక గాఁజేయంబడె. అది వృత్తియనంబడు. విశ్వమ్మునఁ బ్రతియుగమ్మునఁ దిర్యఙ్మ ర్త్యర్షి దేవతలయందైన యే యవతారంబులచేత వేదశత్రువులైన రాక్షసులు నిహతులగుదురో యాభగవదవతారలీల రక్షయనంబడు. మనువు, దేవతలు, మనుపుత్రులు, నింద్రుఁడు, ఋషులు, విష్ణ్వంశావతారమునని షడ్విధంబైనది యంతరంబనంబడు. బ్రహ్మప్రసూతులగు రాజుల త్రైకాలికంబగు నన్వయంబు వంశంబనంబడు. ఆ రాజుల యుదంతముఁ దద్వంశధరుల త్రంబు వంశాను చరితంబనంబడు. నిత్యము, నైమిత్తికము, ప్రాకృతికము, నాత్యంతికమునను చతు ర్విధంబగు లయంబు సంస్థయని కవులచేఁ జెప్పంబడు. ఈ జగంబునకు సర్గాదినిమి త్తభూతుఁడై యనుశాయి యని నుడువంబడు జీవుండు హేతువని చెప్పంబడు. ఈ జీవుండే యవ్యాకృతుండనియుఁ గొందఱందురు. మాయామయంబులు జీవ వృత్తులగు జాగ్రత్స్వప్నసుషుప్తులయందెద్దానికి వ్యతిరేకాన్వయబు లగు నాబ్రహ్మం బపాశ్రయంబనంబడుడు. లేక పదార్థంబులయందు ద్రవ్యంబువలె రూపనామమ్ము లయందు సత్తామాత్రంబువలె బీజాదిపంచత్వాంతంబులగు నవస్థలయందుఁగూడి యుఁగూడకనట్లుండు బ్రహ్మం బపాశ్రయంబనంబడు. వృత్తిత్రయంబును

విసర్జించి స్వాయంబుఁగాఁగాని యోగంబునంగాని యెప్పుడు చిత్తంబు విరమించు
నప్పుడు పురుషుండాత్మనెఱుంగు. అప్పుడ సంసారరూపేహానివృత్తుండగు. ఇట్టి
లక్షణలక్ష్యంబులగు పురాణంబుల నల్పంబులనధికంబులఁగలిపి మునులుపదునెన్మిది
యని చెప్పుదురు. బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, లైంగము,
గారుడము, నారదీయము, భాగవతము, నాగ్నేయము, స్కాందము, భవిష్యత్తు,
బ్రహ్మకైవర్తము, మార్కండేయము, వామనము, వారాహము, మాత్స్యము,
కౌర్మము, బ్రహ్మాండము నని పురాణంబు లష్టాదశసంఖ్యాకంబులు. వేదవ్యాస
తచ్ఛిష్య ప్రశిష్య విభక్తంబును, శ్రోతృజనబ్రహ్మతేజోవివర్ధకంబునగు నీశాఖా
విభాగంబు వక్కాణింపఁబడియె. 153

---

## అధ్యాయము 8.

### మార్కండేయ తపోనిష్ఠ

శౌనకుఁడు:—

గీ. సుచిరకాలంబు జీవింపు సూత! సాధు, వర్య! వాగ్మివరేణ్య! యపారమైన
తమమున భ్రమించు మానవతతికిఁ బార, దర్శకుఁడవాదు చెప్పు మే తద్విషయము.

గీ. జనులు ఋషిని మృకండు నందనుఁ జిరాయు, రభ్యుపేతునిగాఁగ నిత్యమువచింత్రు
గ్రస్తమైపోయె నేతజ్జగంబు దేన, నట్టి విలయమం దవశిష్టుఁడయ్యె నతఁడు. 155

క. ఈ కల్పమునంద పొడమె, మాకులమున భార్గవకులమందనుఁ డతఁడీ
లోకములకు విలయము సూ, తా! కలుగదు కాదె నేటిదనుకఁ దలంపన్. 156

గీ. ఉరుతరార్ణవమందాతఁ డొకఁడె వేగ, మున భ్రమించుచు వటపత్రపుటమునందుఁ
బవ్వళించినయద్భుతావహుని బాలు, నొకనిఁ బురుషునిఁ బొడఁగాంచె మున్నటండ్రు.

క. కౌతూహలమయ్యెన్ మా, చేతములం బరవశములఁ జేసెను ఘనమై
యేతత్సంశయ ముడుపుము, సూత! పురాణాభ్యుపేత! సూరిజననుతా! 158

సూతుఁడు:—

క. తాపసవర్యా! లోకభ, యాపహమగు ప్రశ్న మిద్ది యడుగం బడె మేల్
దీపించుఁగా యిటఁ గలిమ, లాపహములు విష్ణుగాథ లభయం బిడుచున్. 159

సీ. తండ్రివలన మార్కండేయుఁ డాప్తద్విజ, జన్మ సంస్కారుఁడై ఛందములను
నధ్యయనముఁ జేసి యల తపస్స్వాధ్యాయ, తత్పరుఁడై బృహద్వ్రత విధులఁ జె
లఁగుచు శాంతుండు వల్కలధారియుం జటి, లుండునై దండకమండలువులు
యజ్ఞోపవీతంబు నక్షసూత్రిముఁ గుశ, మ్ములను గృష్ణాజినమును ధరించి

గీ. సన్నియమ వృద్ధికై యగ్నిసవితృ విప్ర,గురువులందాత్మయందు ముకుందు హరిని
సంధ్యలందు నర్చించుచున్ గురునకిడు, భైక్షమును రేపుమాపును వాగ్యతుఁడయి.
క. నిరతంబిట్లు సలుపుచున్, గురుపాదులచేతఁ దా నను జ్ఞాతుండై
తిరిపెముఁ దిను గాదేనిన్, వరగుణయుతుఁడగు నతఁ డుపవాసముఁ జేయున్.
క. ఈ భంగిఁ దపస్స్వాధ్యా, యాభిరతుం డగుచు నయుత హాయనములు ల
క్ష్మీభర్త హృషీకేశు న, దా భజియించుచు జయించె దాఁ బెను మిత్తిన్. 162
సీ. పద్మసంభవుఁడును భవుఁడును భృగువును, దక్షుండు బ్రహ్మపుత్రకు లనఁదగు
నితరులు నరదేవపితృభూత గణములు, నతి విస్మితాత్ములై రతని కతన
నిట్లు బ్రహ్మవ్రతం బెలమిఁ దాలిచి తప, స్స్వాధ్యాయ సంయమ సంయుతుఁడయి
యోగవిధ్వస్త బహుక్లేశుఁడగు నంత, రాత్మ నధోక్షజున్ హారిని గురుని
గీ. ధ్యానమొనరించె నీగతిన్ దనదుచిత్త
మును మహాయోగమున లగ్నముగ నొనర్చి
యా మృకండు సుతుండుండునంతఁ గాల
మమర మన్వంతర షడాత్మకము గతించె. 163
క. అంతట నీ సప్తమ మ, న్వంతరమున నిందుఁ డెఱిఁగి యత్నించె దదు
ద్దాంత తపంబునకును ని, శ్శాంతుండై తత్తపో విఘాతము సలుపన్. 164
గీ. అపుడు పనిచె గంధర్వుల నప్సరసలఁ,గంతుని వసంతుని మలయ గంధవహునిఁ
గ్రిమత రాజసములగు లోభమదములను, నమ్మృకండుతనూజు నమ్మహర్షునకు.
మ. సురరాట్ప్రేషితులౌచు వారుఁ దుహినక్ష్మాధరంబందు ను
త్తరపార్శ్వంబునఁ బుష్పభద్ర నదిఁ జిత్రాఖ్యోపలంబెచ్చటన్
గరిమం బొప్పఁగ నొప్పుచుండునొ యగణ్యంబైన యయ్యోగివి
ద్వరు పుణ్యాశ్రమభూమి కేగిరి సముత్సాహంబు దీపింపఁగన్. 166
క. పుణ్యద్రుమ మండితమును, బుణ్యద్విజకుల విరావముఖరిత నభమున్
బుణ్యతర జలాశయమున్, బుణ్యమునై యాశ్రమమది పొదలు ననిశమున్. 167
క. మత్తమధుప సంగీతము, మత్తపికారవ విరాజమానము మఱియున్
మత్తశిఖి నటాటోపము, మత్తవిహగనాద మాశ్రమమది తనరెడున్. 168
క. సుమనఃపరిరబ్ధుండై, హిమనిర్ఝరశీకరముల నెలమిం గొని చొ
చ్చె మలయసమీరుం డయ్యా, శ్రమభూమిన్ సొబగుమిగుల స్మరజనకుండై. 169
క. ఉదయోన్ముఖచంద్రనిశా, వదనుండగుచున్ నవపత్రవాళ గుళుచ్ఛా
స్పదుఁడై రమ్యతరు లతా, సదనుండై యుల్లసిలె వసంతుఁడందున్. 170

గీ. గీతవాదిత్రయాధికోపేత దీప, రీతి గంధర్వగణ సమన్వితుఁడగుచు
స్మరుఁ డధిజ్యచాపేషువై స్వర్యువతుల, గములతోఁగూడి యచ్చోటఁ గానఁబడియె. 171

గీ. అగ్ని వేల్చి యుపాసీనుఁడైనవాని, మూర్తిఁ దాల్చిన యనలంబుఁ బోలువాని
చూడఁగా రాకమాలితాత్ముఁడగువాని, మౌనిఁ గని రింద్రభటులాశ్రమంబునందు.

క. ఆడిరి యచ్చర లెదుటం, బాడిరి గాయకులు లలితవాద్యధ్వనులన్
బోడిమి జేసిరి యెదఁ గద, లాడ మృదంగముల వీణలం బణవములన్. 172

క. ఇంచువిలుకాఁడు ధనువునఁ, బంచముఖాస్త్రంబు చలముపైఁ గొనఁగా సం
ధించె నపు డతనిమనముఁ గ, లంచెను మదలోభములు బలారి బలగముల్. 173

చ. వినుత తదాశ్రమస్థలిని వింతగఁ గందుక కేళి సల్పుచున్
స్తన పృథుగౌరవంబునను సన్నని కౌ నసియాడుచుండఁ బె
ల్చనఁ గచసంహతిన్ విరులు జారఁగ హేలగఁ జెండుపోఁకడన్
గనుచును బుంజికస్థలి గఁ నంబఱచెన్ దన మేల్విలాసముల్. 174

చ. వలపులఁ గుమ్మరించు చిటు బంతిని సొంపుగ నాడు పుంజక
స్థలి రశనాగుణంబు త్రుటితంబగుడుం గడు సూక్ష్మమైన దు
వ్వలువను మారుతుండు పయిపై హరియించెను దక్షిణంబ పూ
విలుతుఁడు వీడె బాణమును వీఁడు జితుండె యటంచు మౌనిపై. 175

శా. వమ్మయ్యెన్ సకలమ్ము సమ్మునియెడన్ భావింప నిర్భాగ్యు య
త్నమ్ముంబోలెను బూనియిట్టు లపరాధంబుల్ గడుంజేసి వా
రవమౌనీంద్రుని భూరితేజమున నత్యాయస్తులై తోన స
ర్వమ్మున్ రేపిన బాలురుంబలె మునీంద్రా! పోయిర ప్పెల్లరున్. 176

గీ. ఇంద్రభృత్యులచే మథియింపఁబడియు, నమ్మహామునితిలకుఁ డహంకరణము
లేశమేనియుఁ బొందంగ లేదనుటది, యరయఁ జిత్రము కాదు మహాత్ములందు.

క. సగణుండయి నిస్తేజుం, డగు కామునిఁ జూచి యనిమిషాధీశుండా
భగవంతుఁ డింద్రుఁ డాముని, దగునను భావమున కాత్మ నద్భుతమందెన్. 178

గీ. శ్లాఘ్యతర తపస్స్వాధ్యాయ సంయమములఁ
జిత్తమును యోగయుక్తంబుఁ జేసినట్టి
యాతని ననుగ్రహింపఁ బ్రత్యక్షమయ్యె
బ్రోలను నరనారాయణరూపుఁడు హరి. 179

వ. అంత మార్కండేయుండు శుక్లకృష్ణులు, నవపద్మలోచనులు, చతుర్భుజులు, రౌరవవల్కలాంబరధరులు, పవిత్రపాణులునై కమండలువును, ఋజువైన వేణుదండంబును, బద్ధాక్షమాలను, వేదంబును ధరించి కేవల తపోరూపులై తటిద్వర్ణపిశంగకాంతుల నత్యున్నతులై దేవగణార్చితులగు నరనారాయణులం గనియె. 180

క. వరదుల భగవద్రూపుల, నరనారాయణుల మౌనినాథులఁ గని యా
దరమునను లేచి దండము, కరణిన్ నతుఁడయ్యె మౌని కాయముతోడన్. 181

క. ముని తత్సందర్శన సం, జనితానందమున మానసము నింద్రియముల్
దనియన్ బ్రహృష్టరోముఁడు, ఘనాశ్రుపూర్ణాక్షుఁడునయి కనలేకుండెన్. 182

గీ. లేచి యాత్సుక్యమునఁ గౌఁగలించు వాని, యట్లయి వినమ్రుఁడగుచునుఁ బ్రాంజలియయి
భువనపతులకు మీకు "నమో నమ"యని పలికె నుద్గద్గదాక్షరములగు నుడుల. 183

గీ. వారి కాసనముం గొనివచ్చి యుంచి, పాదములను బ్రక్షాళించియాదృతి మెయి
ధూపమాల్యమ్ములను ననులేపమునను, నర్హణమున యథావిధి నర్చఁ జేసె. 184

గీ. శ్రేష్ఠతములున్ సుఖాసనాసీనులు నతి, సుప్రసన్నాననులగు ఋషులకు మరల
నంఘ్రులన్ వంగి ప్రణతుల నాచరించి, యనియె నిట్లు మార్కండేయ మునీవరుండు. 185

మార్కండేయుఁడు:—

చ. పొగడుదు నెట్లు నిన్నును బ్రభూ! త్వదుదీరితమౌచుఁ బ్రాణముల్
మిగులఁ జలించుఁ దోడన భ్రమించెడు వాఙ్మన ఇంద్రియంబులున్
వగవఁగ దేహభృత్తులగు ప్రాకృతకోటికె కాదిదిట్టులే
యగుఁ బరమేష్ఠి శర్వులకునైనను స్వాశ్రితకోటిబాంధవా! 186

శా. ఈమూర్తుల్ భగవత్స్వరూప! తగఁగల్గించున్ జగచ్ఛ్రేణికిన్
క్షేమంబున్ బృథుతాపశాంతి విధినిన్ మృత్యుంజయత్వంబు నో
స్వామీ! యన్యములైన మూర్తులను విశ్వం బోమఁ దా త్రీజగం
బామెఁ గూర్చియు నూర్ణనాభిగతి నొయ్యన్నాచికొం దాత్మలోన్. 187

చ. జగములకెల్ల క్షేమము నొసంగెడు దేని భజింపఁ గాల క
ర్మ గుణ మలంబు లంటవొ చరాచరనాయక! భద్రదాయకా!
నిగమవిదుల్ మునీశ్వరులు నిత్యము దేని ననన్యభక్తిమై
పొగడుదురో భవచ్చరణమూలము దాని భజింతు నామదిన్. 188

మ. అపవర్గాకృతివైన నీ విమలపాదాబ్జంబు దక్కబ్జనా
భ! పరంబెద్దియు క్షేమదంబని తలంపంబోము కాలాత్మకా!
ద్విపరార్ధాయువు బ్రహ్మయు న్మిగుల భీతిల్లున్ భవచ్ఛక్తి కా
ర్త్యపహా! తత్కృతభూతజాలముల వాక్యంబేల వ్రువ్వఁగన్. 189

మ. మలినంబున్ విఫలంబు నశ్వరము నాత్మచ్ఛాదకంబున్ భయా
విలమౌ దేహమువీడి యాత్మగురువున్ విజ్ఞుండవౌ నీదు ని
ర్మల పాదాంబురుహద్వయంబు మది నారాధింతు నిత్యంబు ని
న్గొలువన్ సర్వమనీషితార్థమును బొందున్ భక్తుఁ డూహింపఁగన్. 190

చ. స్థితి జని నాశహేతుతనుజెందెడు సత్త్వరజస్తమంబు లా
శ్రిత భవదీయ మాయను గృతంబులెకా జగదీశ! లీలచే
ధృతములై యయ్యు సత్వసమధిష్ఠితమూర్తియ ముక్తినిచ్చు న
న్యతనువు లిచ్చుచుండు వ్యసనంబు భయంబును మోహ మొక్కచోన్. 191

ఉ. కోవిదులైన సాధువులు కొల్తురు నీదగు సత్త్వరూపమున్
దావక భక్తసత్వకలితంబగు రూపము నెల్లవేళలన్
శ్రీవరు పూరుషాకృతి విశిష్టము సత్త్వమునన్ గ్రహింత్రు స
ద్భావులు నిర్భయంబు విను తాత్మ సుఖంబు వికుంఠధామమున్. 192

మ. పరముండున్ బురుషుండు విశ్వమయుఁడున్ బ్రహ్మాత్మకుండున్ జగ
ద్గురుఁడున్ దైవతభూషణుండుఁ బరమాత్ముండైన నారాయణున్
నరునిన్ సంయతవాక్కు నీశ్వరుఁ ద్రయీనాథున్ నరోత్తంసునిన్
గరుణాసాంద్రుని మ్రొక్కెదన్ మది సమగ్రంబైన భక్త్యున్నతిన్. 193

సీ. వితథేంద్రియపథాంతి విక్షిప్తబుద్ధియై, పురుషుండు స్వీయాసువుల మనమున
దృక్పథంబులను వర్తించు నెవ్వనిఁ దెలి, యంజాలఁడో తదీయమగు మాయ
నావృతమతియయ్యు నాతండ యఖిల వి, శ్వగురుండవైన నీవలన వేద
మునుబొంది తాను నిన్నునెఱుంగఁజాలు నా, త్మరహఃప్రకాశకత్వమునఁబొదలు
గీ. నిగమమున నీదు దర్శనంబగును బ్రహ్మ, ముఖ్యులగు కవులందునుముగ్ధులగుదు
రట్టి నినుబూరుషుం బరమాత్ము నఖిల, వాదవిషయానురూపస్వభావుఁ గొల్తు.

## అధ్యాయము 9.

### —కల్పాంతస్థిత మార్కండేయావస్థితి—

సూతుఁడు:—

క. ధీయుతుఁడగు నమ్మార్కం, డేయుఁడు తన్నీగతిం బొగడిన విని విబుధ
ధ్యేయుఁడు నరసఖుఁడగు నా, రాయణుఁడు వచించెఁ బ్రీతుఁడై యా మునికిన్.

శ్రీభగవానుఁడు:—

క. స్థితమతి! బ్రహ్మర్షివరే, ణ్యా! తపస్స్వాధ్యాయ సంయమాదులచే మ
ద్గతవిమలభక్తిచే భ, వ్యతరాత్మ సమాధిచేతఁ బడసితి సిద్ధిన్. 196

క. యతిసత్తమ! త్వద్బ్రహ్మ, వ్రతచర్యన్ మేము నీకుఁ బరితుష్టుల మీ
ప్సితతమము భద్రదము స, మ్మతంబునగు వరముఁ బడయుమా వలనఁ దగన్. 197

మార్కండేయుఁడు:—

మ. జయమా నీకును దేవ! యార్తజన రక్షాదక్ష! పద్మాక్ష! య
వ్యయరూపాఢ్యుఁడ వీవు నాకు నిట దృక్సత్త్వంబునుం బొంది తిం
తియచాలున్ వరయోగపక్వమతి వాణీశాదులున్ యత్పద
ద్వయిఁ గాంచన్ గమకింత్రు యట్టి నిను నే దర్శింపఁగంటిన్ బ్రభూ! 198

గీ. అయిననుం బుండరీకాక్ష! యమలచరిత!, లోకపాలసమన్విత లోకమేది
తెలియఁజాలక మిగుల భ్రాంతిన్ మునుంగు,నట్టి నీమాయఁజూడ నే నభిలషింతు.

సూతుఁడు:—

క. అని మునిచేఁ గడునన్నుతుఁడును బూజితుఁడగుచు విభుఁడట్టులె యని మునితో
నని సస్మితుఁడగుచును జ, య్యనఁ జనియెన్ దాను బదరికాశ్రమమునకున్. 200

మ. అనఘుండైన మృకండుసూనుఁ డెద నాయర్థంబె చింతించుచున్
దన పుణ్యాశ్రమసీమనుండుచు నె మార్తాండాగ్ని సోమాంబుభూ
మ్యనిలాభ్రాత్మములందు నంతట హరిన్ ధ్యానించుచున్ మానసం
బున నర్చించె నిరూఢభక్తి మఱచెం బూజాక్రమం బొక్కెడన్. 201

గీ. పుష్పభద్రానదీతటంబున నొకప్డు, ధీరుఁడగు నమ్మునీంద్రుఁడు గూరుచుండ
యతివరేణ్యా! సంధ్యాసమయంబునందు, నతిమహత్తరమైన మారుతమువీచె.

చ. విడువక చండశబ్దమయి వీచుచునున్న సమీరణంబుతోఁ
బొడమి కరాళమేఘగణముల్ చపలాసహితంబులై కడుం
గడు వడియైన ఘోషముల గర్జిలుచున్ ఘనచక్రరాజమ
ట్లుడుగక వర్షధారల మహాోగ్రముగాఁ గురిసెన్ ధరాస్థలిన్. 203

ఉ. అంతఁ జతుస్సముద్రములు ♦ నాశుగవేగమహోర్ములన్ సమా
క్రాంతముతోడ భీకరదురంతముతోడ వసుంధరాస్థలం
బంత గ్రసించుచున్నవయి ♦ యత్యురునక్రచయంబులున్ సుదు
ర్దాంతములైన సుళ్ళు భయదధ్వనులున్ జెలఁగంగఁ బేరిచెన్. 204

మ. తనతోఁగూడఁ జతుర్విధప్రథితభూతంబైనలోకంబు క్ర
న్నన మిన్నంటు జలంబులన్ మెఱుములన్ ♦ భానుప్రచండాంశులన్
ఘనవాయూర్ములఁ దాపితంబగుచు మగ్నంగన్ జలాకీర్ణ కుం
భిని నీక్షించి మహర్షి దా విమనుఁడై ♦ భీతాత్ముఁడయ్యెం గడున్. 205

ఉ. ఆతఁడు కాంచుచుండఁగనె ♦ యబ్ధి ప్రభంజనఘూర్ణితాంబు సం
పాతము నూర్మిభీషణము ♦ వర్షదుదంబుదపూరితంబునై
యాతటి ద్వీపవర్షయుతమై తనరారు వసుంధరాస్థలిన్
భీతి జనింపఁజేయుచును ♦ వేగము ముంచె సముజ్జ్వలార్భటిన్. 206

వ. అంత భూమ్యాకాశ స్వర్గలోక సమేతంబును, జ్యోతిర్వలయపరీతంబునగు త్రైలోక్యంబును నాకస్మికంబుగ జలంబులచే సంప్లావితంబయ్యె. అమ్మార్కండేయ మహామునియొక్కరుండ జడలు విరియఁబార జడాంధులవలెఁ బ్రవాహజలంబులఁ బరిభ్రమింపందొడంగె. 207

చ. మకరతిమింగిలోత్కర విమర్దితుండౌచుఁ దరంగమారుత
ప్రకరసమాహతుండయి యపార తమంబున మ్రగ్గుచున్ మృకం
డు కొడుకు క్షుత్పిపాసలఁ గడున్ వెతనొందుచు డస్సి కుస్సి భీ
తి కతన దిక్కులన్ వసుమతిన్ గగనంబు నెఱుంగఁ డయ్యెడన్. 208

క. ఒకచో శోకము మోహం, బొకచో నొకచోట భయము ♦ నొకచో దుఃఖం
బొకచోట మరణవేదన, మృకండుతనయుఁ డిట్లుపొందె ♦ మిగులన్ వెతలన్. 209

గీ. అట్లు శ్రీవిష్ణుమాయావృతాత్ముఁడగుచు
నందు భ్రమియించెడి మృకండుసనందనునకు
శతసహస్రాయుతాయుతసంఖ్యములగు
హాయనంబులు గడచె ద్విజావతంస! 210

గీ. ఆపగిది నందుఁ దిరుగుచుసనా ద్విజన్ముఁ, డొక్కనాఁడు వసుంధరసమున్నత ప్రదేశమున ఫలపల్లవదీపితమయి, తనరుచున్న న్యగ్రోధపోతంబుఁ గనియె. 211

గీ. అంత నందుఁ బ్రాగుత్తరశయమగు తదీయ, శాఖను నిజప్రభం దమస్ఛటల నెల్లఁ బాపుచుం బర్ణపుటమునఁబవ్వళించి, యున్న సుకుమారశాబకునొకనిఁ గాంచె.

సీ. మరకతశ్యాము శ్రీమద్వదనాంభోజు, జలజదళాక్షు విశాలవక్షు
సుందరభ్రూయుక్తసురుచిరనాసు స, ముజ్జ్వలదాడిమయుక్త కర్ణు
పద్మగర్భారుణాపాంగు శ్వాసోచ్ఛ్వల, దలకు న్మనోజ్ఞ హాసావలోకు
శ్వాసచలద్వళిసంవిగ్ననిమ్ననా, భిఁ దలోదరున్ లసద్విదుమోష్ఠు
గీ. భాసురాంగుళియుత కరాబ్జములచేతఁ, బట్టి చరణాబ్జమున్ ముఖాబ్జంబునందు
జొనిపి పానంబుఁ జేయు శిశువునుగాంచి, యద్భుతానందపరవశుఁడయ్యెమౌని.

ఉ. ఆతని దర్శనంబున సమస్త తనూశ్రమముల్ తొలంగ మో
దాతిశయంబునన్ స్వహృదయాంబుజమున్ నయనారవిందముల్
ప్రీతి వికాసమొంద నతివిస్మితుఁడౌచుఁ బ్రహృష్ట రోముఁడై
యాతఁడు. పృచ్ఛసేయుటకునై శిశుసన్నిధికేగె శంకతోన్. 214

శా. ప్రాంతస్థుండగు భార్గవుండు శిశు నిశ్వాసంబుతోడన్ దదీ
యాంతర్దేహముఁ జొచ్చె వీఁకమెయి నండంబుం గడున్ విస్మిత
స్వాంతుండై కనె నీసమస్తమగు విశ్వంబెప్పటట్లు మనో
భ్రాంతిన్ గూర్పఁగఁ జెందె నత్తటిని విప్రశ్రేష్ఠ! వ్యామోహమున్. 215

చ. విలయపయోధిఁ గాంచెఁ బృథివీవలయోన్నత దేశమందటుల్
మొలచిన రమ్యమైన వటభూజముఁ దద్విటపంబునందుఁ గ్రొ
న్నెలవగు నాకుదొన్నె శయనించిన యర్భకుఁ దత్కృపా సుధో
జ్జ్వలమధురస్మితంబగు నపాంగములం బరివీక్ష్య మాణుఁడై. 216

ఆ. అంతబాలు నతనినయనములఁగాంచి హృ, త్కహారమందుఁ బాదుకొల్పుకొని పరి
హృష్టుఁడై హరిం బరిష్వంగ మొనరింపఁ, బ్రాంతమునకుఁ జనియె భార్గవుండు.

క. భగవంతుండు గుహాశయుఁ, డగు నా యోగేశుఁడు హరియంతర్హితుఁడ
య్యెఁ గనుంగొన దురదృష్టుం, డగు జనుని విచేష్టితము కరియన్ ద్విజులారా!

క. అంతర్హితుఁడగు నా భగ, వంతు ననుసరించి జలముపవటము లయము న
ద్దంతర్హితమయ్యె ద్విజుం, డంత నిలిచెఁ దొల్లిటివలెనాశ్రమభూమిన్. 219

---

## అధ్యాయము 10.

—శివదత్తమార్కండేయ వరాదానము—

సూతుఁడు:—

క. శ్రీనారాయణనిర్మిత, మైన మహాయోగమాయయతివై భవమున్
దానిట్టు లనుభవించి ద, యానిధి నా హరినె శరణమందె ద్విజుఁడిటుల్. 220

ఋషి:—

ఆ. శరణుఁ జొత్తు దేవ! శరణార్థి జనులకు, శరణమిడు త్వదంఘ్రి జలజములను
జ్ఞానవత్ప్రకాశమానభవన్మాయ, మోహమందుచుందు రబుధవరులును. 221

సూతుఁడు:—

గీ. ఈగతిసమాహితాత్ముఁడై యెసఁగుమునిని, స్వగణసముపేతుఁడై వృషభంబునెక్కి
దివి భవానీ ద్వితీయుఁడై తిరుగుచున్న, భక్తసులభుఁడు రుద్రుఁడు పరఁగఁగాంచె.

ఉ. అంత మృకండుపుత్రుఁడగు నమ్ముని చంద్రునిఁగాంచి యయ్యుమా
కాంత గిరీశుతో ననియెఁ గామితదాయివి విప్రుఁ డీతఁ డ
త్యంతసునిశ్చలేంద్రియచయాశయుఁడై నిభృతోర్మినక్రమై
శాంతిలువార్ధి యట్లెసఁగు స్వామి! తపఃఫలమిమ్ము మౌనికిన్. 223

శ్రీభగవానుఁడు:—

మ. విను బ్రహ్మర్షికులోత్తముం డితఁడు దేవీ! కోర్కులెవ్వేని నె
వ్వానిఁ గోరం డపవర్గమేనిఁ దుదకున్ వాంఛింపఁ బోఁ డవ్యయుం
డును సర్వేశ్వరుఁడుం బురాణపురుషుండున్ యోగిగమ్యుండు స
ర్వనిదానుండగు దేవునందును సమగ్రంబైన భక్తిం గొనెన్. 224

క. ఐనను సంవాదంబు భ, వానీ! కావింత మీ తపస్వివరునితోన్
మానవతీ! యతిలాభం, బౌనుగదా సాధుసంగమాత్మఁ దలంపన్. 225

ఆ. సర్వ విద్యలకును సర్వదేవులకును, నీశ్వరుండగును రమేశ్వరుండ
యనిపలికి మృకండుతనయునిఁ జేరంగ, నేగె పార్వతీ సమేతుఁడగుచు. 226

క. జగదాత్మకులు నధీశులు, నగువారల యోగమనము నటుపై తన్నుం
జగము నెఱుంగం డమ్ముని, తగు యోగమునన్ సమాహితమనస్కుండై. 227

సీ. త్రిణయనునిం దటిత్పింగజటాధరు, నుద్యద్గభస్తి మాల్యుపముఁ బ్రాంశు
వ్యాఘ్రచర్మాంబరు నష్టభుజున్ శూల, కార్ముకబాణాసిచర్మములను
పరశుకపాల డమరు కాక్షమాలలన్, గరిమమైఁ దాల్చి యాకస్మికముగఁ
దన హృదయమ్మునందును దోఁచిన శివుని, వీక్షించి యతఁడతివిస్మితుఁడయి

గీ. యహహా! యేమిదియంచు సమాధ్యుపరతుఁ
డగుచుఁ గన్నులఁ దెఱచియు సగణుఁ డగుచు
సోముఁడగుచును గనన్నైన శూలధరుని
శిరమునన్ మ్రొక్కె లోకైకగురుని హరుని. 228

గీ. ఆమృకండుతనూభవుఁ డంబికాస, మభ్యుపేతుఁడు సగణుండునగు శివునకు
స్వాగతాసన పాద్యార్ఘ్యస్రక్సుగంధ, ధూపదీపాది పూజా విధుల నొనర్చె.

గీ. పలికె నా ద్విజుఁడిట్టు లెఁకవ్వానివలన, నీ జగంబెల్ల నిర్వృతిఁ నెనయు స్వాను
భూతి పూర్ణకాముఁడవౌచుఁ బొదలునట్టి,నీకు నేనేమి చేయుదుంఁ దెలుపుమయ్య?

వ. శివుండవు, శాంతుండవు, సత్త్వుండవు, మృడుండవునగు నీకు నమోవాకంబులు. రజోయుతుండవు, ఘోరుండవు, తమోయుతుండవు నగు నీకు నమస్కారములు.

సూతుఁడు:—

గీ. ఇట్లు ప్రస్తుతుఁడై జగదీశ్వరుండు, సాధుజన వశంకరుఁడగుఁ శంకరుండు
హర్ష సంయుతుఁడుం బ్రసన్నాత్ముఁడునయి, మునికిఁదాఁ బ్రహసించుచుఁ ననియెనిట్లు.

శ్రీభగవానుఁడు:—

క. వరదేశ్వరులము మేము ము, గురమును నీకు నభిమతమగు వరము మానీ
శ్వర! కోరు మమోఘము మా, దరిసెన మది నరులకు నమృతప్రదము సుమీ.

సీ. బ్రాహ్మణుల్ సాధువుల్ పరమశాంతులును ని, స్సంగులు భూతవత్సలులు మదిని
నరయ మాయందు నేకాంతభక్తులు సమ, దర్శులున్ నిర్వైరతాముహితులు
లోకపాలకయుతలోకముల్ వారి స్తు, తించు నర్చించు భజించుచుండు
నేనును బ్రహ్మయునిఖిలేశుఁడగు హరి, స్వయముగఁ గొల్తుము వారి నట్ల

గీ. యనఘ!నాయందు నచ్యుతునందు నజుని,యందు నణుమాత్రమేనియు నెందు లేద
యాత్మపరభేద మట్టి మేమనుదినంబుఁ,బూజసేయుదు మిట్టి మిమ్మున్మనీంద్ర!

ఆ. అమ్మయమ్ములగుచు నలరు తీర్థమ్ములు, భావగమ్యులైన దేవతలును
బెద్దకాలమునఁ బవిత్రులఁ గావింత్రు, తత్ఫలమగు మీదు దర్శనమున. 235

క. యతివర! యాత్మసమాధా, న తపస్స్వాధ్యాయ నియమనంబులచేతన్
శ్రుతిమయమగు మారూపము, ధృతిఁదాల్తురు కాన మీకివే వందనముల్. 236

గీ. మానివర! మహాపాతకులైన శ్వపచు, లైనఁ బరిశుద్ధులగుచుండు రాఁకుణంబ
స్తవ్యమగు మీ శ్రవణమున దర్శనమున, నింక సంభాషణాదుల నేలచెప్ప.

సూతుఁడు:—

మ. అని యిట్లర్ధశశాంకచూడు నతిగుహ్యానూహ్యవాక్యామృతం
బును గర్ణంబుల గ్రోలి సుంత తనివింబొందం డతండున్ జనా
ర్దను మాయాగతిభ్రామితుండగుచుఁ గాఠిన్యంబందియున్ వామదే
వుని వాక్యామృతధారలన్ దన వెతల్ వో మౌని తా నిట్లనున్. 238

మార్కండేయుఁడు:—

మ. అవితర్క్యంబగు దేహధారుల కహో! యత్యద్భుతంబైన యీ
భవు లీలాగతి లోకపాలురును సంభావించి యగ్గింత్రు భూ
తవితానంబును నెల్ల దేహులను దద్ధర్మమ్ముల న్నిల్పఁగా
భువనేశుల్ పచరింత్రు కర్మముల నామోదింతు రగ్గింత్రిటుల్. 239

ఉ. స్వామికి నీకు నాశ్రితవశంకర! శంకర! యీదృశ స్వమా
యామయవృత్తి రూప నమస్కనాదుల దుష్టముకాదుగాదె దే
వా! మహితప్రభావ మహాత్మహా! జగమున్ సృజియించి చొచ్చి యం
దీమెయి విశ్వరూపమున నీవట నొప్పుదు స్వప్నదృక్కులుల్. 240

క. త్రిగుణుఁడవు మహాత్ముండవు, భగవంతుండవు గురుఁడవు బ్రహ్మనిధివి స
త్సుగముఁడవు కేవలుండవు, నగు జగదీశునకు నీకు నభివందనముల్. 241

క. అకలంక భవద్దర్శన, ముకంటె నిఁకితరమగు వరము దేనిం గో
రికొనుదు? నీదర్శనమున, సకలములగు వాంఛితములు సమకూరుఁగదే. 242

గీ. ఐనఁ బూర్ణకామంబుల నవిరళముగఁ, గురియు నిన్నొక వరముగోరుకొందు
నచ్యుతునియందుఁ దద్భక్తులైనవారి, యందు నీయందు భక్తినిబొందుపఱుపు.

సూతుఁడు:—

క. అని మునివరుచే సూక్తవ, చనముల స్తుతియింపఁగఁబడి సతి యామోదిం
ప నతని కిట్టులు పలికెన్, పినాకపాణి హృదియందుఁ బ్రీతుండగుచున్. 244

శ్రీభగవానుఁడు:—

క. ద్విజ! నీకోరినటు లధో, క్షజునందు ననన్యభక్తికలితుఁడవగు ద
క్కుజమగు యశంబు వడయుచు, వజరామరుఁడవయియుందు వాకల్పంబున్. 245

క. గరిమం త్రైకాలికములు, విరక్తియుతములగు జ్ఞాన విజ్ఞానంబుల్
వరలున్ బ్రహ్మనిధికి నీ, కు రహిం జేకురుఁ బురాణ గురుతామహిమల్. 246

సూతుఁడు:—

క. అని యిట్లు వరము లమ్ముని, కి నొసఁగి త్రిణయనుఁడు దేవికిన్ మునిచే ము
న్ననుభూతంబగు కర్మం, బును దెల్పుచు నాత్మధామమునకుం జనియెన్. 247

ఆ. ఆ భృగూత్తముఁడు నవాప్తమహాయోగ, మహిముఁడగుచు నిపుడు మహానులార!
యెన్న విష్ణునందు నేకాంతభక్తుఁడై, ధరణితలమునందుఁ దిరుగుచుండు. 248

క. ధీయుతుఁడగు నీ మార్కం, డేయుని చరితమిది యుగ్గడింపంబడియెన్
ఆ యనఘుఁ డనుభవించిన, శ్రీయువతీవిభునిమాయ చెప్పంబడియెన్. 249

వ. కొంద అపండితు లిది భగవదిచ్ఛచే మార్కండేయునకుమాత్రంబ యగు మాయా
సంసృతి యని చెప్పుదురు. 250

శా. శ్రీమచ్ఛార్ఙ్గధరప్రభావవిభవ శ్రీభావితంబై బుధ
గ్రామాహ్లాదదమౌ భృగుప్రవరమార్కండేయ చారిత్రమున్
నేమంబొప్పఁగ మానవుండెవఁడు విన్పించున్ వినున్ భక్తిమై
నేమర్త్యుం డల వారలిర్వురు తరింత్రీ సంసృతిక్లేశమున్. 251

# అధ్యాయము 11.

## మహాపురుష వర్ణనము - ద్వాదశాదిత్య వ్యూహము

శౌనకుఁడు:—

గీ. ప్రమద మెసఁగంగ బ్రహ్మవిత్తముఁడవైన, నిన్ను నీయర్థమడిగెద సమన్న! చెపుమ
అఖిలతంత్రరాద్ధాంతములందు నీవు, తత్త్వవిదుఁడవు భాగవతప్రశస్త! 252

క. కేవలుఁడగు శ్రీశు సప, ర్యావిధియుం దంగముల నుపాంగమ్ములఁ దా
రేవిధి యేతత్త్వంబుల, నేవడువునఁ దాంత్రికులు వచింతురొ చెపుమా! 253

గీ. మదిఁ గ్రియాయోగ మనుభవింపంగఁగోరు,మాకు నిది తెల్పుమానీకు మంగళమగు
నేక్రియానైపుణంబు వహించి తాను, మర్త్యుఁడు పడయఁగల్గు నమర్త్యగతిని.

సూతుఁడు:—

క. అకలుషమతిఁ జెప్పెద గురు, లకు శ్రీవైష్ణవవిభూతులకు భక్తిన్ మ్రొ
క్కి కమలజాద్యాచార్యులు, సుకరముగ నుడివిరి వీని శ్రుతితంత్రములన్. 255

గీ. వికృతిమయమగు నవ్విరాడ్విగ్రహంబు, తలఁప మాయాది నవతత్త్వముల వినిర్మి
తంబగుం జేతనాధిష్ఠితమగు దాని,యందుఁ దోఁచు నీభువనత్రయంబుఁ గ్రమత.

వ. ఇది విరాట్పురుష రూపంబు. ఈ వైరాజపురుషునకు భూమి పాదంబులు, స్వర్గంబు శిరంబు, నభంబు నాభి, సూర్యుండు నయనంబులు, వాయువు నాసిక, దిశలు కర్ణంబులు, ప్రజాపతి మేఢ్రంబు, మృత్యు వపానంబు, లోకపాలురు బాహువులు, చంద్రుండు మనంబు, యముండు భ్రూస్థానంబు, లజ్జ యూర్ధ్వోష్ఠంబు, లోభం బధరోష్ఠంబు, జ్యోత్స్న దంతంబులు, స్మయంబు భ్రమంబు, భూరుహంబులు రోమంబులు, మేఘంబులు మూర్ధజంబులునగు. వ్యష్టిపురుషుండు స్వసంస్థచే యావన్మాత్రుండగు సమష్టిపురుషుండును లోకసంస్థచేఁ దావన్మాత్రుండగు. ఈ పురుషుండు కౌస్తుభవ్యపదేశంబున స్వాత్మజ్యోతినిఁ దాల్చు. తత్ప్రభా వ్యాజమ్మున నురమ్మున శ్రీవత్సంబు ధరియించు. నానాగుణమయి యగు స్వమాయను వనమాలాఖ్య ధరించు. ఛందోమయంబగు పీతాంబరంబును, ప్రణవ రూపంబగు బ్రహ్మసూత్రంబును, సాంఖ్యయోగంబులనెడు మకరకుండలంబులను, సర్వలోకనమస్కృతంబగు పారమేష్ఠ్యపదంబును నీదేవుండు ధరించు. ప్రధానం బనెడు ననంతాఖ్యతల్పంబును ధర్మజ్ఞానాదియుక్తంబగు సత్త్వంబనెడి పద్మాసనంబునుం బూను. ఓజస్సహోబలయుతముఖ్యతత్త్వంబనెడు గదను, జలతత్త్వం బను శంఖరాజంబును, తేజస్తత్త్వమను సుదర్శనచక్రంబును, నభస్తత్త్వమను నసిని, తమోమయంబగు చర్మంబును, కాలరూపంబగు శార్ఙ్గధనువును, కర్మ

మయంబగు తూణీరంబును, నింద్రియంబులనెడు శరంబులను, నాకూతియను రథం
బును, దన్మాత్రలనెడు సర్థక్రియాత్మతను ధరించు. మఱియు సూర్యమండలంబను
దేవయజనంబును, దీక్షాసంస్కారంబను నాత్మపరిచర్యను, భగశబ్దార్థలీలాకమలం
బును, దాల్చు. ధర్మయశంబులనెడు చామరవ్యజనంబులను, నకుతోభయమగు
వైకుంఠధామమనెడు నాతపత్రంబును, త్రివిధవేదంబనెడు సుపర్ణుని, శ్రీయనెడి
యనపాయినియగు శక్తిని వహించు. ఈ విరాట్పురుషునకుఁ బార్షదాధిపుఁడగు
విష్వక్సేనుండు తంత్రమూర్తిగను, నందసునందాదు లెనమండ్రును నణిమాద్యష్ట
సిద్ధులుగను, వాసుదేవుఁడు సంకర్షణుఁడు ప్రద్యుమ్నుఁడు ననిరుద్ధుఁడు చతు
ర్మూర్తివ్యూహంబుగను జెప్పంబడుదురు. విశ్వుఁడు, తైజసుఁడు, ప్రాజ్ఞుఁడు, తురీ
యుఁడునని యర్థేంద్రియాశయజ్ఞానవృత్తుల భగవంతుఁడు చతుర్విధంబులఁ జెప్పం
బడు. అంగోపాంగాయుధకల్పంబులచే భగవంతుండు విశ్వాది చతుష్టయంబుం
దాల్చు. ఆభగవంతుండు వేదకారణభూతుండు స్వయందర్శి మహిమాపూర్ణుండు
నయ్యు స్వమాయచే ననాచ్ఛిన్నజ్ఞానుండై సృష్టిస్థితిలయంబులు కావించు
పాంచేంద్రిమూర్తిధరుండై భిన్నుండువోలె నుండుంగాని తత్పరులచే నాత్మ
త్వంబున లభ్యుండగుటం జేసి భిన్నుండుమాత్రము కాకుండు. 257

శా. శ్రీకృష్ణా! యఖిలాత్మ! పార్థసఖ! వృష్ణిశ్రేష్ఠ! సర్వేశ్వరా!
శ్రీకైవల్యపదప్రదాయక! ధరిత్రీ ద్రోహి భూపాలకా
నీకప్రోద్ధత వంశదావదహనా! నిష్కించనాధీన! సు
శ్లోకా! గోపవధూవ్రజవ్రజరిరంసూ! కావుమీ భృత్యులన్. 258

గీ. తగ నుషఃకాలమునలేచి తత్పరుఁడయి, పొసఁగ వినియతుఁడై మహాపురుషలక్ష
ణాఢ్యమగు దీని జపియించి యల జనుండు, హృత్స్థమగు పరబ్రహ్మంబు
నెఱుఁగఁగలఁడు. 259

శౌనకుఁడు:—

వ. సూతా! మున్నుఁ దన్నడిగిన విష్ణురాతునకు శుకుండు చెప్పిన ప్రతి మాసగత
నానావసతి సప్తకంబగు నా సౌరగణంబు నెఱింగింపుము. అధీశ్వర నియుక్తంబు
లగు వారి నామకర్మంబులను సూర్యాత్మకుండగు నాహరి వ్యూహంబును శ్రద్ధ
ధానులమగు మాకుఁ దెలియఁబల్కు మనిన— 260

సూతుఁడు:—

సర్వదేవులకు నాత్మభూతుఁడగు విష్ణుదేవుని మాయాశక్తిచే నిర్మింపఁబడిన
లోకతంత్రంబున లోకంబు పరివర్తించు. లోకాత్మకుండు నాదికర్తయు సర్వ
వేదక్రియామూలభూతుండు నగు సూర్యుండొక్కండ ఋషులచేఁ బెక్కువిధంబులఁ

జెప్పంబడె. హరి స్వమాయంజేసి కాలంబు, దేశంబు, క్రియ, కర్త, కరణంబు, కార్యంబు, నాగమంబు, ద్రవ్యంబు, ఫలంబు నని నవసంజ్ఞుండై తోఁచు. కాలరూపధరుండగు నాదేవుండు చైత్రాది ద్వాదశమాసంబుల ద్వాదశగుణంబులఁ బృథగ్రూపంబున లోకయాత్రానిర్వహణంబునకై చరించు. ధాతయుఁ, గృతస్థలి, హేతి, వాసుకి, రథకారుండు, పులస్త్యుండు, తుంబురుఁడు నను నీ యేడ్వురు మధుమాసంబును నడుపుదురు. అర్యముఁడు, పులహుఁడు, నథౌజుఁడు, ప్రహేతి, పుంజకస్థలి, నారదుఁడు, కంజనీరుఁడు నను నీయేడ్వురు వైశాఖ మాసంబును నడుపుదురు. మిత్రుఁడు, నత్రియు, పౌరుషేయుండు, తక్షకుఁడు, మేనక, 'హాహా' యను గంధర్వుఁడు, రథస్వనుఁడు నను నీయేడ్వురును జ్యేష్ఠ మాసంబు నడుపుదురు. వరుణుఁడు, వసిష్ఠుఁడు, రంభ, సహజన్యుఁడు, 'హూహూ' యను గంధర్వుఁడు, శుక్రుఁడు, చిత్రుఁడు, స్వనుఁడు నను నీయేడ్వురు నాషాఢ మాసంబు నడుపుదురు. ఇంద్రుఁడు, విశ్వావసువు, శ్రోత, పులస్త్యుఁడు, నేలాపుత్రుఁడు, నంగిరుఁడు, ప్రమ్లోచ, రాక్షసుఁడు, చర్యుఁడు నను నీయేడ్వురు శ్రావణమాసంబు నడుపుదురు. వివస్వంతుఁడు, నుగ్రసేనుఁడు, వ్యాఘుఁడు, నాసారణుఁడు, భృగుఁడు, ననుమ్లోచ, శంఖపాలుఁడు నను నీయేడ్వురు భాద్రపదమాసంబు నడుపుదురు. పూషుఁడు, ధనంజయుఁడు, వాతుఁడు, సుషేణుఁడు, సురుచి, ఘృతాచి, గౌతముఁడు నను నీయేడ్వురు మాఘమాసంబు నడుపుదురు. క్రతువు, వర్చు, భరద్వాజుఁడు, పర్జన్యుఁడు, సేనజిత్తు, విశ్వుఁడు, నైరావతుఁడు ననువారేడ్వురును ఫాల్గుణమాసంబు నడుపుదురు. అంశువు, కశ్యపుఁడు, తార్క్ష్యుఁడు, ఋతసేనుఁడు, ఊర్వశి, విద్యుచ్ఛత్రువు, మహాశంఖుఁడు ననువారేడ్వురు మార్గశీర్షమాసంబు నడుపుదురు. భగుఁడు, స్ఫూర్జుఁడు, నరిష్టనేమి, యూర్ణుఁడు, నాయువు, కర్కోటకుఁడు, పూర్వచిత్తి యను నీయేడ్వురు పుష్యమాసంబు నడుపుదురు. త్వష్ట, ఋచీకతనయుండగు జమదగ్ని, కంబళాశ్వుఁడు, తిలోత్తమ, బ్రహ్మాపేతుండు, శతజిత్తు, ధృతరాష్ట్రుఁడు ననువారేడ్వురు నాశ్వయుజమాసంబు నడుపుదురు. విష్ణువు, నశ్వతరుండు, రంభ, సూర్యవర్చుఁడు, సత్యజిత్తు, విశ్వామిత్రుఁడు, మఖాపేతుఁడు కార్తికమాసంబు నడుపుదురు. వీరు భగవంతుఁడు విష్ణురూపుఁడు నగు నాదిత్యుని విభూతులు. ప్రతి దినంబున సంధ్యాకాలంబులఁ దమ్ము స్మరించు నరుల పాతకంబుల హరింతురు. ద్వాదశమాసంబులయందును నీయాదిత్యదేవుండు గంధర్వాదిషట్కంబుతో నంతట సంచరించుచు నీజనంబుల కిహపరంబుల శుభమతిని విస్తరింపఁజేయు. దత్తల్లక్షణప్రకాశకంబులగు ఋక్సామయజుర్వేదంబుల ఋషులీయాదిత్యుని

స్తుతించుచుందురు. గంధర్వులు గానంబుఁ గావింతురు. అచ్చర లగ్రభాగంబున నృత్యంబు లొనర్తురు. నాగులు రథంబు సన్నద్ధంబుఁ గావింతురు. యక్షులు రథంబుఁ బూన్తురు. బలశాలులగు నైరృతులు రథచోదనంబుఁ గావింతురు. వాలఖిల్యాదులగు షష్టి సహస్ర బ్రహ్మర్షులు విభునియెదుట నభిముఖంబుగా స్తుతించుచుఁ జనుచుందురు. ఇట్లనాది నిధనుండును, నీశ్వరుండును, భగవంతుండు నగు హరి ప్రతికల్పంబునఁ దన యాత్మను విభజించి లోకంబు నడుపుచుండు. 261

---

## అధ్యాయము 12.

### భాగవత ప్రతిపాదిత విషయానుక్రమణిక

సూతుఁడు:—

గీ. మహిత లక్షణమైన ధర్మమ్మునకును, గేవలాత్మకుఁడైన శ్రీకృష్ణునకును
మాన్యులగు బ్రాహ్మణులకు నమస్కరించి, స్థిరతరములగు ధర్మముల్ చెప్పవాఁడ. 262

క. మీ రేది యడిగితిరొ యది, పూరుషులకు నుచితమైన పుణ్యశ్లోకో
దారుండగు శ్రీకృష్ణుని, చారిత్రము నుడివితిన్ ద్విజాగ్రణులారా! 263

క. ఆది నిధన రహితుండును, శ్రీదుఁడు నారాయణుఁడు హృషీకేశుఁడు ల
క్ష్మీదయితుఁడునగు హరి సా, క్షాదభిహితుఁడయ్యె నిందు సక్రమ ఫణితిన్. 264

సీ. ఉచితరీతిని భక్తియోగంబును దదాశ్ర, యమగు వైరాగ్య మాఖ్యాతమయ్యె
పారీక్షితమగు నుపాఖ్యానమున్నార, దాఖ్యాన మభిహితమయ్యె మఱియు
బ్రహ్మర్షిసత్తమ బాదరాయణి పరీ, క్షితుల సంవాదంబుఁ జెప్పఁ బడియె
యోగధారణచేత నుత్క్రాంతివిధమును, బ్రహ్మనారదుల సంవాద మహిమ

గీ. కృష్ణలీలావతార సంకీర్తనంబు, మొదటినుండి సృష్టిక్రమముల్ మహోజ్జ్వ
ల విదురోద్ధవ సంవాదమువలనైన, విదురమైత్రేయ సంవాదము దెలుపఁబడె.

వ. అనంతరంబు పురాణసంహితావిషయికంబగు ప్రశ్నంబును మహాపురుషసంస్థితియుఁ బిదపఁ బ్రాకృతికసర్గము, సప్తవైకృతికంబులు, బ్రహ్మాండోత్పత్తియు, విరాట్పురుషుండును, కాలస్థూల సూక్ష్మగతులు, పద్మసంభవము, సముద్రాంతర్గతభూమ్యుద్ధరణము, హిరణ్యాక్షువధంబు, ఊర్ధ్వతిర్యగవాక్సర్గములు, రుద్రసర్గము, అర్ధనారీనరసర్గము, స్వాయంభువమనుసంభవము, స్త్రీల కాద్యయు నుత్తమప్రకృతియు నగు శతరూపయుత్పత్తియు, ధర్మపత్నీసంతానము, కర్దమప్రజాపతి సంతానమగు ధర్మపత్నులయుత్పత్తియు, భగవత్కపిలావతారము, కపిలదేవహూతిసంవాదము,

నవబ్రహ్మసముత్పత్తి, దక్షాధ్వరధ్వంసము, ధ్రువోపాఖ్యానము, పృథుచరిత్ర, ప్రాచీనబర్హిర్నారద సంవాదము, ప్రియవ్రతోపాఖ్యానము, నాభిభరతర్షభుల చరిత్రములు, ద్వీప వర్ష సముద్ర గిరి నద్యభివర్ణనము, జ్యోతిశ్చక్ర సంస్థానము, పాతాళనరక సంస్థితి, ప్రచేతులవలన దక్షజన్మము, దేవమానవతిర్యఙ్నగఖగాదికంబగు దక్షదుహితలసంతతి, గరుత్మంతుని జననంబు, దితిపుత్రనిధనము, మహాత్ముఁడు దైత్యేశ్వరుఁడు నగు ప్రహ్లాదుచరితము, మన్వంతరానుచరితము, గజేంద్రమోక్షము, మన్వంతరావతారములు, హయగ్రీవావతారము, కూర్మ మత్స్య నరసింహ వామనావతారవర్ణనము, అమృతార్థంబు క్షీరసాగరమథనము, దేవాసురమహాయుద్ధము, రాజవంశానుకీర్తనము, ఇక్ష్వాకుజననము, తద్వంశంబున సుద్యుమ్న జననము, ఇళోపాఖ్యానము, తారోపాఖ్యానము, శశాదాది జననహేతుభూత సూర్యవంశానుచరితము, సౌకన్యోపాఖ్యానము, శర్యాతి కకుత్స్థ ఖట్వాంగ మాంధాతృ సౌబరి సగరచరిత్రంబులు, కోసలేంద్రుండగు శ్రీరాముని కిల్బిషాపహారంబగు చరిత్రంబు, నిమి తనూత్యాగంబు, జనకసంభవంబు, భార్గవప్రవరుండగు పరశురాముఁడు భూమిని నిఃక్షత్రముఁగాఁ జేయుట, సోమవంశోద్భవుండగు నైళచరిత్రము, యయాతిచరిత్రము, నహుషచరిత్రము, దౌష్యంతియగు భరతునిచరిత్ర,శంతను తత్సుతుల చరిత్రము, యయాతిజ్యేష్ఠపుత్ర యదువంశాభివర్ణనము, నందు వసుదేవగృహంబున భగవంతుండగు శ్రీకృష్ణు జన్మంబు, గోకులంబునఁ దద్వృద్ధి, కీర్తితంబులగు నా కృష్ణభగవానుని యుదార కర్మంబులు, పూతనాప్రాణపయఃపానంబు, శకటోచ్చాటనంబు, తృణావర్త నిష్పేషణము, బక వత్సాఘాసుర సంహారంబు, బ్రహ్మకు మాయాప్రదర్శనంబు, భ్రాతృయుత ధేనుకవధ,ప్రలంబసంక్షయము,దావాగ్నిగ్రస్తగోగోపపరిత్రాణము, కాళియాహి దమనము,మహాహిగ్రస్త నందమోక్షణము, అచ్యుతప్రీతికరకన్యకా వ్రతచర్య, విప్రపత్నీప్రసాదస్వీకరణము, విప్రానుతాపనము, గోవర్ధనోద్ధరణము, యజ్ఞాభిషేకము, శరద్రాత్రులయందు గోపికలతోఁ గృష్ణుని రాసక్రీడ, శంఖచూడవధ, అరిష్టవధము, కేశివధము, అక్రూరాగమనము, రామకృష్ణుల ప్రస్థానము, వ్రజస్త్రీవిలాపము, మధురాలోకనము, గజ ముష్టిక చాణూర సంహారము, కంసవధ, సాందీపనమృతపుత్రానయనము, ఉద్ధవరామసమేతుఁడై మధురాపురంబున నివసించుశ్రీకృష్ణునిచే యదుకులంబునకుఁ గావింపఁబడిన ప్రియంబు, జరాసంధసమానీతసైన్యవధ, యవనేంద్రసంహారము, కుశస్థలీప్రవేశము, పారిజాతాపహారణము, సురాలయమునుండి సుధర్మాహరణము, శత్రువులనోడించి హరివిజృంభణము,రుక్మిణీహరణము,యుద్ధమున బాణభుజకృంతనము, ప్రాగ్జ్యోతిష

పతియగు నరకాసురవధ, కన్యాహరణము, చైద్య పౌండ్రక ద్వివిద సాల్వ
దంతవక్త్ర శంబర ముర పంచజనుల ప్రభావము, తద్వధంబు, వారణాసీదాహ
నము, పాండవులనిమిత్తంబుగ భూభారావతరణము, విప్రశాపవ్యాజంబున యదు
కులసంహారము, వసుదేవనారదసంవాదము, ఉద్ధవకృష్ణసంవాదము, అందాత్మ
విద్యారహస్యబోధనము, ధర్మనిర్ణయము, ఆత్మయోగానుభావంబున నాత్మమా
నుషదేహపరిత్యాగము, యుగలక్షణ విస్తారము, కలియందు నరోపప్లవము, చతు
ర్విధప్రళయము, త్రివిధోత్పత్తి, పరీక్షిద్రాజర్షి దేహత్యాగము, వేదవ్యాసశాఖా
ప్రణయనము, మార్కండేయకథ, మహాపురుష విన్యాసము, జగదాత్ముండగు
సూర్యుని విన్యాసముఁ జెప్పంబడియె. 266

క. ఏయది యడిగితిరో న, న్నాయది నుడివితిని విడువక కథనము మీకున్
వేయేల కీర్తితంబులె, కా యుట లీలావతారకర్మము లెల్లన్. 267

గీ. పతితుఁడై కాని స్ఖలితవశతఁ గాని, యార్తుఁడై కాని తుమ్మినయపుడు కాని
'కృష్ణ'యనుచు బిగ్గఱ వచియించెనేని, నఖిలపాపవినిర్ముక్తుఁడగు జనుండు. 268

ఉ. మానక స్వీయమైన మహిమల్ గొనియాడిన నాలకించినన్
మానవుచిత్తసీమ గరిమంబునఁ జొచ్చి రమాకళత్రుఁ డా
భానుఁడు ధ్వాంతముంబలెఁ బ్రభంజనుఁ డభ్రగణంబుఁ జాడ్పునన్
దానయి రూపుమాపుఁ జుఁడి తద్వ్యసనంబుల నెల్ల ప్రేల్మిడిన్. 269

చ. వరదుఁ డధోక్షజుండు భగవంతుఁ డెటన్ గథితుండు గాఁడొ లో
నరయ నసత్యవాక్కులగు నవ్వియె సత్కథలౌను శ్రీరమా
వరు గుణవర్ణనం బెటఁ బ్రవర్తిలు నయ్యది యొక్కఁడే శుభం
కరమదె సత్య మద్దియె సుఖప్రదమా నదియే ప్రియం బగున్. 270

మ. అదియే రమ్యము నూతనంబు నదియే యద్దే మనస్సౌఖ్యదం
బదియే శోకసముద్ర శోషణకరం బౌ నాత్మ నెంచంగ నా
యదునాథోజ్జ్వల కీర్తిసౌరభము నాశాంతంబులన్ జిమ్మునో
పదిలంబైన సువాక్యమది త్రిజగద్భద్ర ప్రదం బద్దియే. 271

చ. అమలిన మానసుల్ పరమహంస లెటన్ విహరింపకుందురో లో
కముల సదా పునీతములుగా నొనరించెడు వాసుదేవు స
ద్విమలయశం బెటం బరిఢవిల్లక యుండునో యట్టి వ్యర్థవా
క్య మది యుదాత్తచిత్ర పదమయ్యును వాయసతీర్థతుల్యమా. 272

శా. ఏకాగ్రంబగు బుద్ధి సాధువులు తారెవ్వానినిన్ సంతతం
బాకర్ణింత్రు వచింత్రు పాడుదురు నెయ్యం బార నయ్యుత్తము

శ్లోకోదార పవిత్రనామము లెటన్ సొంపారునో యద్దియే
లోకాఘాపహవాక్ప్రయోగమగు నాలోకింప యోగీశ్వరా! 273

మ. నిరవద్యంబు నిరంజనంబు ఘనమున్ నిష్కర్మతారూపమున్
బరమోత్కృష్టమునయ్యు శోభిలదు జ్ఞానం బంతగా నల్ల శ్రీ
హరి భావోదయ వర్జితంబయి యకామ్యంబయ్యునుం గర్మ మీ
శ్వరు నం దర్పణ సేయకున్న నదియున్ వైఫల్యముం బొందెడున్. 274

శా. భారంబౌ పెనుకీర్తి సంపదకె యాభావింప వర్ణాశ్రమా
చారోదారతపశ్శ్రుతాదులఁ బరిశ్రాంత్యాదు లో విప్రులా
రా! రసోజ్జ్వలకృష్ణపాదకమలార్చాకీర్తనాకర్ణనా
కారంబైన యనన్యభక్తి యొసఁగున్ గైవల్యసామ్రాజ్యమున్. 275

మ. హరిపాదాబ్జయుగంబు నేమఱక యభ్యర్చించుచో నయ్య వి
స్మరణం బెల్లయమంగళంబులణఁచున్ శాంతిం బ్రసాదించుచున్
వరభక్తిం గలిగించు జ్ఞానమును విజ్ఞానంబు వైరాగ్యమున్
గరిమం బుట్టఁగఁజేయు మానసమునన్ గల్యాణముం గూరుచున్. 276

శా. సారాసారవిచారకోవిదులు విజ్ఞానుల్ మహాభాగులౌ
మీరల్ విప్రవరేణ్యులార! కడు నెమ్మిం గూడి లోకత్రయా
ధారున్ దేవు నదేవు నీశు నజు నాత్మారాము నారాయణున్
హ్రీరమ్యంబగుభక్తితో ననిశ మర్చింపం గడంగుం డెదన్. 277

మ. విమలాత్ముండగు నాపరీక్షిదవనీభృన్మౌళి ప్రాయోపవే
శమునన్ మౌనిసభన్ మహాత్ములు వినన్ సంస్మారితుండై తిఁ బూ
ర్వము విన్నట్టి పరాత్మతత్త్వమును నే బ్రహ్మర్షియై యొప్పు వ్యా
సమహాయోగితనూజుఁడైన శుకుచే సమ్యగ్గతిన్ వింటిరే. 278

గీ. కీర్తనీయోరుకర్ముఁడా కృష్ణదేవు, నఖిల దురిత వినాశకమైన మహిమ
దీని వచియించినాఁడను నేను మీకు, ద్విజవతంసములార! సందియము దీర. 279

మ. నరుఁ డెవ్వాఁడిది ధీరుఁడై స్థితమతిన్ యామక్షణం బేన్ సుధీ
వర! శ్లోకంబొకటో తదర్ధమొ యొకన్ బాదంబొ పాదార్ధమో
హరువొప్పన్ వినిపించునో యెవఁడు శ్రద్ధాసక్తి నాలించునో
పురుషుం డాతఁడు చేయు నాత్మమును సంపూతంబుఁగాఁ బేరిమిన్. 280

క. ద్వాదశి నేని నరుం డే,కాదశి యందేని దీనిఁ గడు శ్రద్ధ వినం
గాఁ దా నాయుష్మంతుం, డౌ దీక్షానిరతిఁ జదువ ననఘుము క్తుఁడగున్. 281

క. వినియతమతియై పుష్కర, మున మధురన్ ద్వారవతి నుపోషితుఁడై యీ
ఘన సంహితఁ జదివి భయం, బుననుండి విముక్తుఁడగును బురుషుం డెలమిన్. 282

సీ. అనిమిషుల్ సిద్ధులు మునులును మనువులు, పితరులు నృపులుఁ గీర్తితులయి యిటఁ
గొనియాడువారికి విని యెడువారికి, నిత్తురు తత్తదభీప్సితముల
సామర్గ్యజుస్సులఁ జదివి ద్విజన్ముఁ డే, ఫలమును బొందుఁ దత్ఫలముఁ బురుషుఁ
డీ సంహితన్ వినియే పడయును ఋగా, ద్యధ్యయనమ్మున ననువుమీఱఁ
గీ. గోరి మధుకుల్యలం బయఃకుల్యల ఘృత, కుల్యలం బొందు ఫలమును గోవిదుఁడగు
ద్విజవరేణ్యుఁ డీ సంహితన్ వినియతమతి, నధ్యయనముఁ జేసియ పడయంగఁ
గలఁడు. 283

గీ. విప్రుఁ డధ్యయనంబుఁ గావించి దీనిఁ, బరమపద మొందు రాజన్యవర్యుఁ డొందు
వనధిమేఖలన్ వసుమతిన్ వైశ్యుఁ డొందు, నర్థసిద్ధి శూద్రుఁడు వొందు
నఘవిముక్తి. 284

చ. ఉరుమహిమాఢ్యుఁడుం గలిమలోచ్చయ నాశకుఁడై నయట్టి శ్రీ
హరి పెఱలైన శాస్త్రములనంతగఁ దా నభివర్ణితుండుగాఁ
డరయఁ గథాప్రసంగములనాయ ఘట్టములందు నిందు సుం
దరతరమూర్తియైన యదునాథుఁడు వర్ణితుఁడయ్యె సారెకున్. 285

చ. అజశతమన్యుశంకరముఖాఖిలదైవతకోటి యే యధో
క్షజుఁ దగఁ బ్రస్తుతించుటకు శక్తులు గారో యెవండు సత్త్వమున్
రజముఁ దమంబు నాఁగఁ దనరారు స్వశక్తులఁ దాల్చి విశ్వమున్
సృజన మొనర్చి పెంచియు హరించునొ యావిభుఁ గృష్ణుఁ గొల్చెదన్. 286

చ. ఉపచితనూత్నశక్తినివహోజ్జ్వలుఁడై యనువొప్ప స్వాత్మయం
దుపరచితస్థిరాస్థిరమయుండయి ప్రత్యుపలబ్ధధాముఁడై
యపరిమితానుభావుఁడు ననంతుఁ డనాది సనాతనుండు దే
వపతియునైన విష్ణునకుఁ బ్రాంజలినొచు జొహార్లొనర్చెదన్. 287

చ. క్రమమున మానసంబు స్వసుఖంబునఁ బూర్ణముగాఁగ దాన న
న్యములగు భావముల్ దొలఁగ నచ్యుతలీలల మేనఁ బారవ
శ్యము ఘటియిల్ల నాహరిదయన్ సరణిం బరమాత్మతత్త్వదీ
పమగు పురాణముం దెలియఁ బల్కిన వ్యాససుతున్ స్మరించెదన్. 288

# అధ్యాయము 13.

## పురాణగ్రంథ ప్రతిపాదనము-భాగవత మాహాత్మ్యము

సూతుఁడు:—

సీ. ద్రుహిణుండు వరుణేంద్రరుద్రమరుత్తులు, దివ్యస్తవముల నుతింతు రెవని
సామగు లెవ్వానిసాంగపదక్రమో, పనిషన్నిగమములఁ బాడుచుండ్రొ
ధ్యానసునిశ్చలతద్గతమనముచే, ఘనయోగు లెవ్వానిఁ గనఁగలేరొ
సకలసురాసురసంఘంబులేనియు, నెవ్వాని యంతంబు నెఱుఁగరైరొ
గీ. యట్టిలోకైకవిభుఁడు నారాయణుండు, పరమపురుషుండు సద్భక్తవత్సలుండు
లోకకల్యాణకరుఁడతిలోకమహిముఁ, డైన దేవునకు న్నే జోహార్లొనర్తు. 289

మ. ఘనపృష్ఠభ్రమమాణమందరగిరిగ్రావాగ్రకండూయనం
బున నిద్రించెడు కూర్మరూపుఁడగు నాభూతాత్ముఁడౌ విష్ణుదే
వుని శ్వాసానిలముల్ సదామనుచు మమ్ముం దొంటితత్సంస్కృతిన్
గాని వేలామిష రాకపోకలు వొనంగున్ నేడు మున్నిటికిన్. 290

వ. పురాణసంఖ్యాసమాహారంబును, శ్రీభాగవతవిషయప్రయోజనంబును, దానం బును, దానమాహాత్మ్యంబును, బఠనాదులవలని మాహాత్మ్యంబును దెలిపెద వినుండు. బ్రాహ్మపురాణంబు దశసహస్రగ్రంథంబులు, పద్మపురాణంబు పంచోన షష్ఠిసహస్రంబులు, విష్ణుపురాణంబు త్రయోవింశత్సహస్రంబులు, శివపురా ణంబు చతుర్వింశతిసహస్రంబులు, భాగవతపురాణం బష్టాదశసహస్రంబులు,నారద పురాణంబు పంచవింశతిసహస్రంబులు, మార్కండేయంబు నవసహస్రంబులు, ఆగ్నేయంబు చతుర్దశోత్తర పంచదశసహస్రంబులు, భవిష్యత్పురాణంబు పంచశతోత్తర చతుర్దశసహస్రంబులు, బ్రహ్మకైవర్తం బష్టాదశసహస్రంబులు, లింగపురాణం బేకాదశసహస్రంబులు, వరాహపురాణము చతుర్వింశతి సహస్రం బులు, స్కాందపురాణము శతాధికైకాశీతిసహస్రంబులు, వామనంబు దశసహ స్రంబులు, కౌర్మము సప్తదశసహస్రంబులు, మత్స్యపురాణము చతుర్దశ సహ స్రంబులు, సౌపర్ణపురాణము ఏకోనవింశతిసహస్రంబులు, బ్రహ్మాండంబు ద్వాదశ సహస్రంబులుగల్గియుండు. ఇట్లు పురాణసమవాయంబు చతుర్లక్ష శ్లోక పరిమి తంబగు.అందు శ్రీభాగవతపురాణ మష్టాదశసహస్రశ్లోక పరిమాణముకలది.291

చ. ఇది భవభీతుఁడైన పరమేష్ఠికి మున్ను స్వనాభి పద్మమం
దుదయముఁ జెందియున్న యపుడొప్పుఁ దలిర్పఁగ నాద్యుతాత్ముఁడున్
సదయ మనస్కుఁడౌచు జలజాత విలోచనుఁ డచ్యుతుండు తా
విదితముఁగాఁగఁ దెల్పెఁ దగ విప్రవతంసములార! వింటిరే. 292

సీ. ఆదిమధ్యాంతములందు వైరాగ్య భా, గ్యప్రదాఖ్యాన సమన్వితంబు
శ్రీవిష్ణులీలాకథా విశేషామృత, శ్రోత్రాతిహృష్ట సత్సురగణంబు
అమలవేదాంత సారమును కైవల్యైక, సత్ప్రయోజనమును శాశ్వతంబు
సత్త్వాద్వితీయ వస్తుప్రతిపాది మూ,లంబు బ్రహ్మాత్మైక్యలక్షణంబు
గీ. నైన యీభాగవతము నెయ్యమునఁ బ్రోష్ఠ,పదినిఁ బౌర్ణమాసినిఁ గానిపరమభక్తి
హేమసింహాసనయుతంబు నెవ్వఁడొసఁగుఁ, బడయునాతఁడు ద్విజులారపరమగతిని.
గీ. నదులలోనఁ బ్రపుణ్య జాహ్నవియుఁ బోలె, దైవతంబులలో జనార్దనుఁడుఁ బోలె
వైష్ణవజనంబులం దుమావరుఁడుఁ బోలె, భాసిలుఁ బురాణములను నీభాగవతము.
గీ. నిఖిలవేదాంత సారసన్నిష్ఠితముగ, నీ మహాభాగవతము వర్ణింపఁబడియెఁ
దద్రసామృతపానతృప్తాత్ముఁడైన, వాని కితరంబుసన్ రక్తియగునె యెందు.
క. స్తవనీయమైన యీ భా, గవతపురాణంబు సాధుగణములయం దెం
తవఱకుఁ గనరాదో యం,తవఱకె పరశాస్త్రములటఁ గదనరుచు నుండున్. 296
మ. ప్రవచింపంబడె నెందు యోగులకుఁ బ్రాప్యంబైన జ్ఞానంబు జ్ఞా
నవిరాగోజ్జ్వల భక్తిసంకలితనైష్కర్మ్య మెందొప్పు వై
ష్ణవహృద్యంబగు నట్టి యీ ఘనపురాణంబున్ బఠింపన్ వినన్
సువిచారం బొనరింప మానవుఁడు గాంచున్ ముక్తి సౌభాగ్యమున్. 297
వ. భగవంతుండగు శ్రీమన్నారాయణుండు నిరుపమానంబగు నీ జ్ఞానప్రదీపంబుఁ దొల్లి బ్రహ్మకుఁ బ్రకాశితంబుఁ గావించె. తదనంతరంబు బ్రహ్మరూపుఁడై నారదునకును నారదరూపుఁడై కృష్ణద్వైపాయనునకును దద్రూపుఁడై బ్రహ్మరాతుండగు శుకయోగీంద్రునకును శుకరూపుండై విష్ణురాతుండగు పరీక్షన్నరేంద్రునకును గారుణ్యావిశేషంబునఁ బ్రకటంబుఁ గావించె. పరిశుద్ధంబును, విమలంబును, విశోకంబును, అమృతంబును, సత్యంబునునగు నీ మహాభాగవతపురాణంబునకు నాయభివందనములు. 298
క. ఎవఁడు కృపాళుతను ముముక్షువై భజించిన చతుర్ముఖునకీ శ్రీభా
గవతమ్మునుడివె సాక్షి భ, గవంతుఁ డగునట్టి హరికిఁ గావింతు నతుల్. 299
గీ. సుబహుసంసార సర్పదష్టుఁడగువిష్ణు,రాతునకు మోక్షమునొసఁగెఁ బ్రౌఢినెవఁడు
బ్రహ్మరాతుఁడు యోగివర్యుఁడు నగు,నా శుకమహర్షికిన్ జోహారు లాచరింతు.

గద్యము.

శతావధానులు, ఉభయభాషాప్రవీణులు, 'శ్రీరామనృసింహమూర్తి
కవులు' అను గంధం శ్రీరామమూర్తి, ఇట్టింకి నరసింహమూర్తు
లచే రచింపఁబడిన శ్రీమదాంధ్రభాగవతమున
ద్వాదశ స్కంధము సంపూర్ణము.

---

రాయలముద్రణాలయము, తణుకు—మే, 1955.